భారత కమ్యూనిస్టు ఉద్యమ చారిత్రిక ఘటనలు సైద్ధాంతిక సమస్యలు

కమ్యూనిస్టుల

# ఐ క్య సం ఘ ట న

అన్వేషణ

(తృతీయ సంపుటి-బి)

# చీలికల పర్వం

డి. వి. సుబ్బారావు

కాంతిరేఖ, ప్రచురణలు చిలువూరు 522332.

కమ్యూనిస్టుల
ఐక్యసంఘటన
అన్వేషణ
ప్రచురణ సం. 4.



వెల : రు. 50. 00

ప్రతులకు. 1. అన్ని విశాలాంధ్ర బుక్ షాపులలోను – విజయవాడ
హైదరాబాద్ వగైరా
2. అన్ని ప్రజాశక్తి బుక్‌షాపులలోను విజయవాడ, హైదరాబాద్ వగైరా
3. స్పందన బుక్‌షాప్ విజయవాడ, మ్యూజియంరోడ్డు.
4. మైత్రిబుక్‌షాపు విజయవాడ, మసీదురోడ్డు.
6. డి. వి సుబ్బారావు, చిలువూరు (P. o) దుగ్గిరాల మండలం,
గుంటూరు జిల్లా.

ముద్రణ :-
శ్రీరామ ప్రింటర్స్
విజయవాడ-4

# 11

# చీలికలపర్వం

## విషయసూచిక

i. కమ్యూనిస్టుపార్టీలో సంక్షోభం ;

కాంగ్రెసులో అంతర్గత సంఘర్షణలు (5) కమ్యూనిస్టుపార్టీలో భిన్నాభిప్రాయాలు (6) చీలికల సోపానాల క్రమం (7) అతివాద మైనారిటీపోటీ కేంద్రం (8) బెంగాల్‌లో "కౌటిల్యుని కరపత్రము (10) జాతీయసమితి పశ్చిమ బెంగాల్‌లో రాష్ట్ర ఆర్గనైజింగు కమిటీని యేర్పాటు చేయుట (11) అతివాదుల డెమోక్రటిక్ కన్వెన్షన్ (12) పార్టీ నిర్మాణ సమస్యలు కొన్ని నిర్ణయాలు (13)

ii. ఆరోపణలు ప్రత్యారోపణలు : 17

కంట్రోల్ కమిషన్ నివేదిక (18) ఆరోపణలు ప్రత్యారోపణలు (23) ఆంధ్రప్రదేశ్‌లో విచ్ఛిన్నకర చర్యలు (29) అతివాదుల తాజా చర్యలు (34) జాతీయసమితి 15 ఏప్రిల్ 1964 సమావేశం, సంక్షోభం (35) ఐక్యతకు అతివాదుల ప్రతిపాదనలు (38) జాతీయసమితి అవగాహన, నిర్ణయాలు (39) అతివాద వర్గపు అవగాహన, అభిప్రాయాలు (45) మితవాదుల నాయకత్వంలో జాతీయసమితి నిర్మాణ పంథా (47) పార్టీ ఐక్యతకై అతివాదుల ప్రతిపాదనలు (48) డాంగే లేఖల సమస్య (50)

iii ఐక్యతా సంభాషణల వైఫల్యము : 56

అఖిల భారత అతివాద కమ్యూనిస్టుల తెనాలి కన్వెన్షన్ 64

v ప్రపంచ కమూనిస్టు ఉద్యమంలోని సిద్ధాంత పోరాట ప్రేరితమే భారతకమ్యూనిస్టుపార్టీలోని అంతర్గతపోరాటంచీలిక 67
1950 దశకంలో (68) సోవియట్‌పార్టీ 20వ, కాంగ్రెసు (76) టిబెట్ తిరుగుబాటు భిన్న అభిప్రాయాలు (77) "లెనినిజం చిరస్థాయిఅగుకాక" చైనా సిద్ధాంత పత్రం (82) సరిహద్దు సమస్య కమ్యూనిస్టులు (94)

vi. కమ్యూనిస్టుపార్టీ చీలుట, రెండు పార్టీల కాంగ్రెసులు: 101
రాజకీయ స్వాతంత్ర్య సమస్య (102) భారత ప్రభుత్వ వర్గ పొందిక (110) పెట్టుబడిదారి మార్గంలో అభివృద్ధి (117) భారత విదేశాంగ విధానం, సామ్రాజ్యవాదుల తంత్రాలు (123) జాతీయ ప్రజాస్వామ్యం, జనతా ప్రజాస్వామ్యం (127) పెట్టుబడిదారేతర పంథా, సైద్ధాంతిక సమస్య (139) పెట్టుబడిదారి విధానాభివృద్ధి మధ్యస్థాయికి చేరిన దేశాలలో పెట్టుబడిదారేతర ఆర్థికాభివృద్ధి అవకాశాలు (142) సంయుక్త నాయకత్వంపై సైద్ధాంతిక విమర్శ ప్రతి విమర్శన (152)

vii. చీలికల సిద్ధాంతం రూపొందుట : 157
చీలికలసిద్ధాంతం(158) కృశ్చేవ్ నాయకత్వంలోని సి పి.యస్ యు. అతిపెద్ద చీలికదారులు (160) సౌహార్థపార్టీలలోని కమ్యూనిస్టు వ్యతిరేక గ్రూపులను బలపరుస్తున్నారనే నేరారోపణను తిరస్కరించుట (161) చీలికల సిద్ధాంతం మైనారిటీ, మెజారిటీ (166) నిర్మాణ వైఫల్యాలు (169) మరో చీలిక, చీలిక సిద్ధాంత ఫలితం (174)

viii. చీలికలపై '90 దశకంలో వాదనలు. ప్రతివాదనలు; 176

ix. సమీక్ష కొన్ని ముఖ్యాంశాలు : 183
జాతీయ ప్రజాస్వామ్యం, జనతా ప్రజాస్వామ్యం (211)

# రచయిత తొలిపలుకులు

"కమ్యూనిస్టుల ఐక్య సంఘటన అన్వేషణ" తృతీయ సంపుటిలో "చీలికల పర్వం" రెండవభాగం, భారత కమ్యూనిస్టుపార్టి చారిత్రిక ఘటనలలోని చీలికల కథ నాన్ని ఆవిష్కరిస్తుంది ఈ కథనానికి ద్వితీయ సంపుటిలోని "భిన్నదృక్పధాల సంఘర్షణపర్వం "బృహద్వివాదపర్వాల"లోని సైద్ధాంతిక, ఆలోచనా విధానం, అవ గాహన నేపధ్యంగా అర్థం చేసుకొనాలి.

జాతీయ కాంగ్రెసు, సంయుక్త సోషలిస్టుపార్టి, కమ్యూనిస్టుపార్టీలలో అంత ర్గత సంఘర్షణలు, బహిరంగ సంఘర్షణలు, పరిణామాలు చీలికలకు దారితీసాయి. కమ్యూనిస్టులతో సహకారం సమస్యపై సంయుక్త సోషలిస్టుపార్టీ రెండుగా చీలింది. నెహ్రూ మరణానంతరం కాంగ్రెసులోని గ్రూపుల సంఘర్షణలను అదుపులో పెట్ట గల సమర్థవంతమైన నాయకత్వం లేనందున ముఠాకక్షలు తీవ్రమై సంక్షోభం యేర్పడింది. భారత కమ్యూనిస్టుపార్టీలో సైద్ధాంతిక పోరాటం సుదీర్ఘకాలంసాగి పార్టి పరిమితులనతిక్రమించి, బహిరంగ పోరాటమై వెనుతిరగజాలనంత దూరం పయనించుట యీ పర్వంలో వివరంగా అధ్యయనం చేయబడింది.

జాతీయసమితి 1 నవంబరు 1962న ఆమోదించిన తీర్మానంతో సి.పి.ఐ. చీలికల సోపానాలక్రమం, అతివాదమైనారిటి వర్గం వెన్వెంటనే ఢిల్లీలో విడిగా సమా వేశమై సి.పి.ఐ. నాయకత్వాన్ని తొలగించుటకై "చావుబ్రతుకుల" పోరాటం నిర్ణ యించారు. బహిరంగ, రహస్య, సెమీ రహస్య నిర్మాణ సమస్యలన్నిటిని చేబట్టారు బెంగాల్‌లో "కౌటిల్యుని" కరపత్రం" ప్రకటించి, దేశమంతటా పంపకం చేసారు బెంగాల్ రాష్ట్రకమిటీ సభ్యులు కొందరు అరెస్టు అగుట, మరికొందరు సెమీ రహ స్యంగా పనిచేయుటతో కేంద్ర సమితి విధానాలు అమలుచేయుటకై రాష్ట్ర కమిటిని రద్దుచేసి, నూతనంగా ఆర్గనైజింగు కమిటిని నామినేటు చేసింది. ప్రతిస్పందించిన అతివాద నాయకులు 25మంది, అందులో 14మంది ప్రముఖ రాష్ట్రనాయకులు డెమో క్రటిక్ కన్వెన్షన్ జరిపి రాజకీయ విధానాన్ని, ఆచరణ నిర్మాణ సంబంధమైన తీర్మానాలు ఆమోదించారు.

సి.పి.ఐ. జాతీయసమితి ఫిబ్రవరి 1963, జులై 1963 సమావేశాలలో పార్టి నిర్మాణసమస్యలపై తీసుకొన్న నిర్ణయాలు వాస్తవానికి పార్టీ చరిత్రను మరో

మార్గం పట్టించాయి. ఈ తీర్మానాల ఆచరణ, అమలు పార్టీ చీలిక మార్గాన్ని పక్కా చేసాయి.

జూలై 1963న సి.పి.ఐ. జాతీయ సమితి, 5గురుకల కంట్రోల్ కమిషన్‌ను నియమించి, అతివాదులపైగల ఫిర్యాదుల పట్టీకను యిచ్చి, విచారించి నివేదిక సమర్పించమని కోరింది. అనేక ఫిర్యాదులు, ఆరోపణలు, ప్రత్యారోపణలు విచారించి నివేదిక సమర్పించుటతోపాటు, కమిషన్ కా. సుందరయ్య కొటూరుజనరత్‌బాడీలో పార్టీని చీల్చుతానని బెదరించాడనే ఆరోపణకూడ పరిశీలించి, నిరాధారమైన ఆరోపణగా నిర్దిష్టంగా ప్రకటించింది. ఇవి వివరంగానే యివ్వబడినవి. కంట్రోల్ కమిషన్ సభ్యులు అయిదుగురులో, యిద్దరు అరెస్టుకాబడి జైలులో వున్నారు, మిగిలిన ముగ్గురు డాంగే మితవాద గ్రూపుకు చెందినవారు. ఏకపక్ష నివేదిక ఉన్నది నిర్దిష్టంగా స్పష్టం. అట్టి నివేదికపై ఆధారపడి క్రమశిక్షణాచర్యలను చేబట్టుట, పార్టీని కావాలని విచ్ఛిన్నం చేయుట తప్ప మరొకటికాదు.

పార్టీ దృష్టికి, 3 మార్చి 1964న కరెంటు ఇంగ్లీషు వారపత్రికలో ఫోటో స్టాట్ కాపీలతో "డాంగే ఉత్తరాల" కథనం పెద్ద దుమారాన్ని లేపింది. సి.పి.ఐ సెక్రటేరియట్, నేషనల్ ఆర్కైవ్స్‌కు వెళ్ళి డాంగే లేఖలను పరిశీలించకుండానే అవి "ఫోర్జరీలవని పత్రికాప్రకటన"చేసింది. కా. ఉమానాథ్, యం.పి. 20మార్చి 1964న ఆ లేఖలను సి పి ఐ. సెక్రటేరియట్, ఎగ్జిక్యూటివ్‌ల దృష్టికి, "ఒకనోటు" ద్వారా తెచ్చారు కా. బసవపున్నయ్య 25 మార్చి 1964న డాంగే లేఖలను, తన అభిప్రాయాలను లేఖద్వారా జాతీయసమితి దృష్టికి తెచ్చారు. ఆ మరుసటిరోజు 26న బసవపున్నయ్య, రామమూర్తులు పత్రికా విలేఖరుల సమావేశం జరిపి, లేఖల విషయంలో పార్టీ సెక్రటేరియట్ అనుసరించిన విధానాన్ని ఆమోదించ జాలమన్నారు. జాతీయ సమితి పరిశీలించాలన్నారు. నంబూద్రిపాద్ 29 మార్చి 64 సెక్రటేరియట్‌కు లేఖ వ్రాస్తూ, అతివాదనాయకులు సహిరంగ ప్రకటనతో "పార్టీకి లెక్కకట్టలేనంత నష్టాన్ని కలుగజేసారని, మొత్తంగా "ఆరోపణ అత్యంత తీవ్రమైనదని, అనుసరించిన విధానాన్ని తీవ్రంగా విమర్శించి, వారు వాస్తవాలను కేంద్ర ఎగ్జిక్యూటివ్‌కమిటి జాతీయ సమితి ముందుంచి, పరిశీలించి, తగుచర్య తీసుకొనవలసినదిగా కోరవలసినది పార్టీ నిర్మాణ సూత్రాలను అతిక్రమించవలసింది కాదు" అని నంబూద్రిపాద్ విమర్శించారు. పార్టీలో ఐక్యతను రక్షించే లక్ష్యం ప్రాధాన్యత వహించి, డాంగే

లేఖలపై పరిశీలన, ఇరుపక్షాల విశ్వాసం పొందిన యంత్రాంగం, వారికి మద్దతుగా సాంకేతిక నిపుణుల సహాయకమిటీతో సంప్రదించి అన్ని కోణాలనుండి జరిపిన ఫలితంగా సమగ్ర నివేదిక లభించేది. ఆచరణలో విచారణ కమిషన్ ఏకపక్షపు దైనందున పార్టీ శ్రేణులందరి విశ్వాసాన్ని పొంది, పార్టీ ఐక్యత పరిరక్షించే కర్తవ్య ప్రాధాన్యతకంటే పాక్షికధోరణులకు, క్రమశిక్షణాచర్యలకు ప్రాధాన్యత పరోక్షంగా నిచ్చుట కన్పడుతుంది.

అతివాదులు ఐక్యతా ప్రతిపాదనలలో యేకపక్షంగా తీసుకొన్న క్రమ శిక్షణాచర్యలను రద్దు చేయాలని, విజయవాడ పార్టీ కాంగ్రెసు నాటి పార్టీ సభ్యత్వ ప్రాతిపధికపై పార్టీ కాంగ్రెసు జరపాలని, పార్టీ కాంగ్రెసే అన్ని విషయాల అంత్య నిర్ణయం చేయాలని ప్రతిపాదించారు పార్టీ ఐక్యతకు చారిత్రాత్మక ప్రాము ఖ్యతనిచ్చి, మారేవ ర్తమాన రాజకీయాలకు పరిమిత ప్రాముఖ్యతనిచ్చి యుండిన పార్టీ చరిత్ర మరోవిధంగా వుండేది.

అట్టి పరిస్థితులలో సెక్రటేరియట్, కేంద్రకార్యవర్గ సమితిని, జాతీయ సమితిని అత్యవసర సమావేశం పిలుచుట తప్ప మరోమార్గం లేదు. అతివాదుల నిందించుతు వార్తాసంస్థల వద్దకు పరుగెత్తుటతో పరిస్థితి మరింత దిగజారిపోయింది.

ఇట్టి కలుషిత వాతావరణంలో కేంద్రకార్యవర్గ సమితి ఏప్రిల్ 9, 1964న సమావేశమై, పార్టీలో విచ్ఛిన్నకర శక్తులపై క్రమశిక్షణాచర్య ఏజెండాలో ప్రథమ అంశంగా, డాంగే లేఖలు రెండవ అంశంగా పెట్టారు. అతివాదులు డాంగే లేఖలను ప్రథమాంశంగా ఏజెండాలో చేర్చాలని, చర్చల కాలంలో డాంగే అధ్యక్ష స్థానంలో వుండరాదని పట్టుబట్టారు. భూపేష్‌గుప్తా పార్టీప్రయోజనాల దృష్ట్యా రెండు అంశాలు ఒకే అంశంగా చేబట్టాలని జ్యోతిబసు సమావేశాన్ని తాత్కాలికంగా వాయిదావేసి సాధారణ వొప్పందానికి ప్రయత్నించి పార్టీ ఐక్యతను కాపాడవలసిందిగా కోరారు. డాంగేవర్గం దీనిని తిరస్కరించింది. పార్టీ ఐక్యతకు ఇరు పక్షాలు ప్రాధాన్యత నివ్వవలసింది, యిచ్చివుంటే వొప్పందం కుదిరేది, ఐక్యత కాపాడబడేది. దేశీయ కమ్యూనిస్టు మితవాద, అతివాద వర్గాలు వారికి నైతిక బలాన్నిచ్చే అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ మితవాద, అతివాద వర్గాలు "ఇప్పుడు చీలితేనే మంచిది" అనే అభిప్రాయానికి వచ్చి యున్నందున హృదయ పూర్వకంగా వొప్పం దానికి ప్రయత్నించలేరు. అందుకే అతివాదులు సమావేశంనుండి నిష్క్రమించుట

మితవాద మెజారిటీ పార్టీ విచ్ఛిన్నకారులని 7 గురు సభ్యులను బహిష్కరించు తీర్మానం, చేసి జాతీయసమితి, పార్టీ కాంగ్రెసులలో ఆమోదం పొందక ముందే పత్రికలకు సాంప్రదాయాన్ని వదలి విడుదల చేయుట జరిగింది.

పార్టీనిర్మాణ సూత్రాలు మెజారిటీ నిరంకుశత్వానికిగాని, పార్టీ మైనారిటీకి "వీటో" అవకాశమిచ్చి ప్రతిస్తంభన, సంక్షోభం సృష్టించుటకుగానికాక పార్టీ ఐక్యతను, ప్రయోజనాలను పెంపొందించుటకు వుపయోగపడాలి. కాని గ్రూపుల ముఠాల ప్రయోజనాలకు రక్షణ కవచాలు కారాదు. సవివరంగావీటిని వివరించే ప్రయత్నమే యీ పర్వంలో జరిగింది.

పార్టీ జాతీయసమితిలో బహిష్కరణ తీర్మానం ఆమోదం నిమిత్తం ప్రతిపాదించుటకు ముందు శెక్రటేరియట్ నంబూద్రిపాద్, జ్యోతిబసు, భూపేష్‌గుప్తాలను సంప్రదించాలనే ప్రతిపాదనచేయబడింది. డాంగే తాను లేకుండా శెక్రటేరియట్ సంప్రదింపులు జరుపు ప్రశ్నయేలేదన్నారు. అంచేత శెక్రటేరియట్ ఆ ముగ్గురును కలవాలని నిర్ణయించబడింది. అజయ్‌ఘోష్ మరణంతో పార్టీ ఐక్యత పురోగమనానికై మితవాద, అతివాద శక్తులతోద్విముఖపోరాటం జరుపుతున్న మధ్యేమార్గవాద శక్తులు బలహీనపడినవి. భూపేష్‌గుప్తా చొరవతో అతని నివాసంలో మితవాద, అతివాద అగ్రనాయకులు 4 జూలై 1964న సుదీర్ఘ ఐక్యతా సంప్రదింపులు జరిపారు. ఆ సంభాషణలు వివరింగానే యివ్వటం జరిగింది. అవి యే ముఖ్యాంశాలపై జరిగాయో తెలుసుకొన అందరు కోరుతారు.

ఐక్యతా సంభాషణల తీరు, సంప్రదింపులలో వారు చేబట్టినఅంశాలు రాజకీయ సైద్ధాంతికాంశాలుగాక పార్టీ నిర్మాణ ఆధిక్యతాంశాలే అత్యంత ప్రాముఖ్యతాంశాలుగ ముందుకొచ్చాయి. కా. అధికారి, రాజేశ్వరరావులు కేంద్ర శెక్రటేరియట్, కేంద్ర ఎగ్జిక్యూటివ్ కమిటీలు రద్దుచేయబడవు, వునర్నించవచ్చును, ఇది అంగీకారమైతే కొన్ని గాయితీలను యివ్వగలమన్నారు. అతివాదులనుండి డాంగే చైర్మెన్‌గా వుండుటకు తాము అంగీకరిస్తే, పాత శెక్రటేరియట్‌ను పునరుద్ధరించు తారాయనే ప్రశ్న రాగా, మితవాదులు జాతీయసమితిలోని మెజారిటియే శెక్రటేరియట్‌లో ప్రతిబింబించాలని, సుర్జీత్ 1961లో యేర్పరచిన "భట్టిప్రోలు పొప్పందం" భగ్నమైనదన్నారు సోవియట్ యూనియన్ సి.పి.ఐ పార్టీ కాంగ్రెసు జరిగితే అతివాదులకు మెజారిటీ వచ్చే అవకాశమున్నందున, తాడోపేడో తేల్చుకొనమని సి పి ఐ కి పరోక్షంగా

సలహా యిచ్చుట అదే విధంగా చైనా, ఇండోనేషియా కమ్యూనిస్టుపార్టీ సెక్రటరీల ద్వారా సి.పి.ఐ లోని అతివాదులకు యిట్టి అవగాహన చేరినట్లు అనధికార వార్తలు విన వచ్చాయి. ఐక్యతా సంప్రదింపులలో "మీరు మమ్మునమ్మరు. మేము మిమ్ము నమ్మము" అనేమాటలు దొర్లాయి, యిది వారి పరస్పర విశ్వాసానికి అద్దం పట్టుతుంది.

ఈ ఐక్యతా సంప్రదింపుల లక్ష్యం, మితవాద శక్తులు పార్టీలో తమ ఆధిక్యతను నాయకత్వాన్ని నిలబెట్టుకొనుటకు అతివాదశక్తులు కోల్పోయిన గత స్థానాలను పునరుద్ధరించుకొనుటకు, అజయ్‌ఘోష్ మరణానంతరం "మధ్యేమార్గవాదం" కోల్పోయిన బలాన్ని తిరిగి పొందుటకు పార్టీ ఐక్యతను కాపాడుకొనుట తలపెట్టారు. అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ మితవాదవర్గాలనుండి సి.పి.ఐ.కు, అతివాద వర్గాల నుండి సి పి ఐ లోని అతివాద వర్గాలకు పరోక్షంగా మద్దతు లభించుట, సి.పి ఐ. మధ్యేమార్గవాదులకు ఎట్టి మద్దతు ఎటునుండి రాకపోగా, కుడి-ఎడమల దాడులకు గురై బలహీనపడిపోయారు. మితవాద, అతివాద వేర్పాటు వాదులు అంచేతనే విజయం పొందారు.

సి పి ఐ. నుండి నిష్క్రమణ, బహిష్కరణ జరుగుటతో అతివాదులు తెనాలిలో కన్వెన్షన్ తరువాత 1964 డిశెంబరులో 7వ పార్టీ కాంగ్రెసు జరుపుకొని, కార్యక్రమాన్ని, ఎత్తుగడలను, రాజకీయ విధానాన్ని రూపొందించుకొని సి.పి.ఐ (యం)గ యేర్పడ్డారు. అదే విధంగా సి.పి ఐ. 1964 నవంబరులో 7వ పార్టీ కాంగ్రెసు జరుపుకొని కార్యక్రమాన్ని, ఎత్తుగడలు, రాజకీయ విధానాన్ని రూపొందించుకొని. మాతృసంస్థ సి.పి.ఐ.గా కొనసాగింది. కమ్యూనిస్టు క్రింది శ్రేణుల అభిమానుల ఆశలు నిరాశచేసి, కార్మిక, కర్షక, వ్యవసాయకూలి, మధ్యతరగతుల పోరాట ఐక్యతను విచ్ఛిన్నం చేసారు.

అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలోని సి.పి.సి. అతివాద వర్గాలు ఐక్యత—పోరాటం లేక చీలికలు, విభజనలు, నూతన ప్రాతిపదికపై నూతన ఐక్యత అంతర్జాతీయ కార్మికోద్యమాభివృద్ధికి తాత్విక సూత్రంగా" వివరించారు. అంతర్జాతీయంగా, జాతీయంగా నిజమైన ఐక్యత మార్క్సిజం—లెనినిజం ప్రాతిపదికపైనే సాధ్యం. ఐక్యత-పోరాటం—చీలికలు-నూతన ఐక్యత అన్న తాత్విక పురోగమన సిద్ధాంతం, దురదృష్టకరంగా చీలికల ప్రాధాన్యతనే ఆచరణలో పొంది మరిన్ని చీలికలకు మార్గమైంది పునరైక్యత మరుగునపడిపోయింది. మూడుపదులు దాటినా సిద్ధాంత ఐక్యత, నిర్మాణ ఐక్యత, కనీసం బలమైన ఐక్యకార్యాచరణ సంస్థ అఖిల భారత స్థాయిలోగాని, రాష్ట్రాలస్థాయిలలోగాని కానరాదు. కమ్యూనిస్టు ఉద్యమం కొంతవరకైనా బలంగావున్న పశ్చిమ బెంగాలు, కేరళలలో అప్పుడు ఆర్థిక సమస్య

లపై ఐక్యకార్యాచరణలు తాత్కాలికంగా యేర్పడి, కనుమరుగు అగుతున్నా, రాజకీయ సమస్యలపై ఐక్యకార్యాచరణ బీజప్రాయంగానైనా కానరాదు.

కమ్యూనిస్టుపార్టీ నాడు చీలుట అనివార్యం, చారిత్రిక అవసరం, అదే కమ్యూనిస్టు ఉద్యమ పురోభివృద్ధికి మార్గమన్నారు. నాడు ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ ప్రపంచ పెట్టుబడిదారి వ్యవస్థకు దీటుగా, నూతన వలస విధానానికి వ్యతిరేకంగా ప్రతిద్వంద్విగా నిలబడి, అండదండలనిచ్చే శక్తివుండి, మితవాదంలో మునిగిపోయిన సోవియట్ యూనియన్ తూర్పు యూరపు దేశాలలోని సోషలిజం కుప్పకూలి పోయింది రష్యా తన మనుగడకే అమెరికా, ప్రపంచ బ్యాంకీలపై ఆధారపడుతున్నది.

ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమ అతివాద చైనా నాయకత్వ ప్రభావంలోని ఇండోనేషియ కమ్యూనిస్టు పార్టీ 1965లో విప్లవ అతివాద పంధా చేబట్టి తిరుగుబాటు లేవదేసి "ఊచకోతకు" లక్షలమందిని కోల్పోయింది. ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికాలలోని అనేక దేశాల చైనా అతివాద ప్రేరితులై సాయుధ గెరిల్లా పోరాటాలు సాగిచుతున్నారు. మూడున్నర దశాబ్దాలైనా కమ్యూనిస్టు సాయుధ ఉద్యమాల పోరాటశక్తి, ఐక్యత, బలం పెరుగకపోగా క్షీణించసాగింది. పోరాటాలలో ఎత్తుగడలమార్పు అవసరాన్ని యిది తెలియచేస్తున్నది. పిడి సూత్రంగా సాయుధ పోరాటాన్ని సాగించుట మార్క్సిజం, లెనినిజం మావోయిజం మరే శాస్త్రీయ యిజం కాదు. అంతర్జాతీయంగా సోషలిజం కూలిపోవుట భారతదేశ కమ్యూనిస్టు ఉద్యమంపై పెద్ద దుష్ప్రభావాన్నే కలుగజేసినా, స్వయంకృతాపరాధమే ప్రధానాంశంగా విస్తారణ అయింది.

సి.పి.ఐ.లోని మితవాద మెజారిటి వర్గం అతివాదమైనారిటివర్గం, అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలోని మితవాద సంస్కరణవాద మెజారిటీ, అతివాద సంస్కరణవాద మైనారిటీ వర్గాలు భారత కమ్యూనిస్టుపార్టీ చీలికకు గురియగుట దేశ, విదేశాలలోని వర్గాలు సమాన భాగస్వాములుగ గుర్తించుటలో పూర్తి సత్య స్వరూపము వున్నది. మిగతావన్ని పాక్షిక సత్యాలు చీలికకు కారకు లెవరైంది భవిష్యత్తు పరిశోధకులు వెలుగులోనికి తెస్తారని ఆశిద్దాము.

మార్క్సిస్టు—లెనినిస్టు మౌలిక సూత్రాలను మన పరిస్థితులకు అన్వయించుకొని, మన మార్గదర్శిక సూత్రాలను మనమే రూపొందించుకొనాలి. శాస్త్రీయ మార్క్సిస్టు—లెనినిస్టు దృక్పధం వెలుగులో ఆత్మ విమర్శనా పధంలో ఆత్మశోధనతో, దిగుమతి చేసుకొన్న పిడి సూత్రాల ఫలితంగా "హిమాలయంగా పెరిగిన శిరోభారాన్ని" దించివేసుకొనిననాడే, భారతకమ్యూనిస్టు వుద్యమం పురోగమించగలదు. ఈ నూతన శతాబ్ద ప్రారంభంలోనే భారత కమ్యూనిస్టు నాయకత్వాలు యీ కర్తవ్య నిర్వహణ చేస్తారని ఆశిద్దాము

—— డి.వి. సుబ్బారావు

# పరిచయం

శ్రీ డి వి సుబ్బారావుగారు రచించుతూన్న "కమ్యూనిస్టుల ఐక్య సంఘటన అన్వేషణ" అనే గ్రంథం వారు దశాబ్దానికి పైగా అకుంఠిత దీక్షతో, భారత కమ్యూనిస్టు ఉద్యమానికి సంబంధించిన వందలాది పత్రాలను, ప్రచురణలను పరీక్షించి విశ్లేషించి, ఆధారంగా తీసుకొని చేసిన విశిష్టమైన రాజకీయ పరిశోధనా ప్రయత్నం. ఈ గ్రంథం యొక్క ప్రథమ, ద్వితీయ సంపుటాలు ఇదివరకే విడుదలయ్యాయి. ఇది మూడవ సంపుటి, రెండవ భాగం. గ్రంథకర్త దీనికి "చీలికలపర్వం" అని నామకరణం చేశారు మహోన్నతమైన ఆశయం, శాస్త్రీయమైన సిద్ధాంతం అనమానమైన క్రమశిక్షణ, కార్యదీక్ష చిత్తశుద్ధి, నియమ నిబద్ధతలుగలవారని పేరొందిన కమ్యూనిస్టు నాయకుల మధ్య అభిప్రాయ భేదాలు ఎంత తీవ్రమైనవైనా అవి కలహాలకు చీలికలకు, పరస్పర నిందారోపణలకు దూషణలకు విశ్వాసరాహిత్యానికి శత్రుత్వానికి ఎందుకు దారి తీస్తాయనేది పార్టీ సభ్యులు, అభిమానులు, శ్రేయోభిలాషులకేగాక కమ్యూనిస్టు వ్యతిరేకులకు, శత్రువులకు గూడ ఆశ్చర్యం కలిగిస్తుంది. నిజానికి, సరిగా పై చెప్పిన ఆ పార్టీల ప్రత్యేక లక్షణాలే వారి మధ్య వచ్చే విభేదాలు, కలహాలు, చీలికలకు దారితీస్తూ వచ్చినవంటే నమ్మబుద్ధికాదు. కాని అది చారిత్రిక సత్యం. 1919లో కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ స్థాపించడంతో, అంతకు ముందు అంతర్జాతీయస్థాయిలో వేదికగా పనిచేసినరెండవ ఇంటర్నేషనల్‌లో ప్రాతినిధ్యంవున్న కాపిటలిస్టు దేశాలలోని 41 కార్మికవర్గ పార్టీలు ఇంచుమించు నిలువుగా చీలిపోయాయి అది ప్రపంచవ్యాప్తంగా కార్మిక శ్రేణులలో వచ్చిన ప్రథమ చీలిక ముఖ్యంగా యూరపులోని కార్మిక శ్రేణుల మధ్య, కార్మికవర్గ పార్టీల మధ్య శాశ్వతమైన అఘాతాన్ని సృష్టించింది.

కార్మిక విప్లవం ద్వారా కమ్యూనిస్టు సమాజ స్థాపనే గమ్యంగా పెట్టుకొని, ఆ సమాజ స్థాపనకు మార్క్సిస్టు సిద్ధాంతాన్ని మార్గదర్శకంగా నిర్దేశించుకొని ఆ సిద్ధాంతానికి బద్ధులై, దాని సాధనకై కఠినమైన నియమ నిబంధనలు పాటిస్తూ జీవితాన్ని పూర్తిగా విప్లవానికే అంకితం చేసినవారు మాత్రమే సభ్యులుగా వుంటూ ప్రపంచ వ్యాప్తంగా ఒకే కేంద్రీకృత నాయకత్వం క్రింద పనిచేసే కమ్యూనిస్టు పార్టీలను తయారుచేయాలనేది లెనిన్ నిర్దేశించిన కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ లక్ష్యం.

పపంచ సోషలిస్టు విప్లవానికి కావలసిన విశ్లేషణ స్థూలంగా ఆయన చేశానను కున్నాడు. అయితే విప్లవావకాశాలు తరువాత కాలంలో తగ్గిపోవడం, మారిన పరిస్థితు లను విశ్లేషించవలసి రావడం జరిగింది. నిరంతరం మారుతున్న సామాజిక వాస్తవా లను విశ్లేషించే క్రమంలో తీవ్రమైన అభిప్రాయ భేదాలు రావడం సహజం. భేదాలను కట్టుబాటులో పెట్టుటకు పార్టీ నియమాలున్నా, వారు ప్రగాఢంగా విశ్వసించే లక్ష్యసాధనకు భంగం కలిగించేవిగాను, గమ్యాన్ని దూరం చేసేవిగాను తప్పుదారిపట్టించేవిగాను వున్నవని గట్టిగా భావించినప్పుడు కలహాలు చీలికలు తప్పవని చాల దేశాల కమ్యూనిస్టుపార్టీల చరిత్ర చెపుతూంది ఈ సందర్భంగా కమ్యూనిస్టులు సామాజిక వాస్తవాలను విశ్లేషించవలసిన పద్ధతి ఆక్రమంలో వున్న సంక్లిష్టతను గూర్చి కూడ తెలుసుకోవడం అవసరం. కమ్యూనిస్టుపార్టీల కర్తవ్యం ప్రపంచ సోషలిస్టు విప్లవం తీసుకురావడం కమ్యూనిస్టు సమాజం స్థాపించడం అనుకున్నాం. ఆ కర్తవ్యాన్ని నిర్దేశించిన పరిస్థితులేవో కూడ లెనిన్ విశ్లేషించాడు. ఆయన కాపిట లిజాన్ని గూర్చి, విప్లవస్థితిని గూర్చి చెప్పిన విషయాలను గూడ తరువాత వచ్చిన పరిణామాలు దృష్ట్యా క్లుప్తంగా చెప్పుకోవలసి వస్తుంది.

2. ఏదేశమైనా సమాజ పరిణామక్రమంలో అది ఏదశలోవున్నా దానిఅంతిమ గమ్యం కమ్యూనిస్టు వ్యవస్థేననీ, చరిత్రను వేగిరపరచి, ఆ గమ్యాన్ని చేరడానికి కృషి చేయడమే వారి కర్తవ్యంగా భావిస్తారు. కమ్యూనిస్టులు. అది సాధించడానికి ఆదేశ సమాజం ఉత్పత్తి విధానం దృష్ట్యా ఏ దశలో వుంది. ఏ దిశగా పోతూంది, అక్కడ పాలక, పాలిత వర్గాలేవి, వాటిమధ్య సంబంధాలు. వైరుధ్యాలు బలాబలాలు ఎలా వున్నవి, ఏ వర్గాలు వర్గ సంబంధాలు ఉత్పత్తి శక్తులను ఏ విధంగా పెంపొం దిస్తూ సమాజ పురోగతికి తోడ్పడుతున్నవి, రాజ్యవ్యవస్థ ఏఏ వర్గాల చేతిలో వున్నది, ఏ విధానాల ననుసరిస్తూన్నది, ఆ విధానాలు సమాజంలో ఏ వర్గ ప్రయోజ నాలకు అనుకూలంగా వున్నవి, ఆయా వర్గాల గ్రూపుల ప్రయోజనాలను ప్రతిబిం బించే, పరిరక్షించే రాజకీయ పార్టీలు గ్రూపులు ఏవి ఆయా వర్గాల పార్టీల మధ్య సంబంధాలు సూటిగా ప్రత్యక్షంగా వున్నావా లేక వేరుగా వున్నావా, ఆయా పార్టీల ప్రజాబలం ఎక్కడ నుంచి వస్తూనదీ, ఇంకా ఇంకా ఎన్నో సామాజిక వాస్తవాలకు సంబంధించిన అంశాలపై మార్క్సిస్టు సిద్ధాంత దృక్కోణం నుంచి పరిశీలించి విశ్లే షించి అవగాహన కుదుర్చుకోవాలి. ఆ అవగాహన ఆధారంగా విధానాలు, వాటిని సాధించడానికి అవసరమైన వ్యూహాలు ఎత్తుగడలు, కూటములు, ఏర్పరుచుకోవాలి-

3. అంతేకాదు. వారి వారి దేశ పరిస్థితులను మాత్రమే పై చెప్పిన రీతిగా అర్థం చేసుకుంటే సరిపోదు. అంతర్జాతీయ పరిస్థితులను గూర్చి కూడ సరియైన అవగాహన ఉండుట వారికి చాల ముఖ్యము. గత రెండు శతాబ్దాలుగా కాపిటలిజన అద్భుతమైన శాస్త్రీయ, సాంకేతిక ప్రగతి సాధించి ఉత్పత్తి శక్తులను అపూర్వమైన విధంగా పెంచి, తనకు ముందున్న ఆర్థికవ్యవస్థలను లోబర్చుకొని. ప్రపంచాన్నంతా ఆర్థికంగా రాజకీయంగా తన ఆధీనంలోకి రాబట్టుకొని ప్రపంచీకరణ సాధించి చరిత్రను నిర్దేశిస్తూన్నది. అందువలన అంతర్జాతీయ స్థాయిలో కాపిటలిస్టు-ఇంపీరియలిస్టు వ్యవస్థను వివిధ దేశాల పెట్టుబడిదారీ వర్గాలు వాటి కూటమిల సంబంధాలను విధానాలను వైరుధ్యాలను వాటిని ఎదుర్కొనే వివిధ వర్గాలను, శక్తులను వాటి బలాబలాలను కూడ బేరీజువేసి, ప్రపంచ వ్యాప్తంగా పెట్టుబడిదారీ, సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటంలో భాగంగా, ప్రతి దేశ కమ్యూనిస్టులు వారి వారి విధానాలు మార్గాలు నిర్ణయించుకోవాలి. ఇవన్నీ మార్క్సిస్టు సిద్ధాంత రీత్యా విశ్లేషించాలి.

4. విశ్లేషణ చేయబడే జాతీయ అంతర్జాతీయ సామాజిక వాస్తవాలు, అంశాలు నిరంతరం మార్పు చెందుతుంటాయనే విషయం ఇక్కడ విస్మరించ కూడదు. ఈ సందర్భంగా సామాజిక విశ్లేషణా పద్ధతిని గూర్చి లెనిన్ ఏమి చెప్పాడంటే, ప్రతి విషయాన్ని ప్రతిపాదనను సమస్యను చారిత్రకంగా అంటే అది ఎలా ఉత్పన్నమయిందీ, ఇతర విషయాలు, సమస్యలతో దాని కెలాంటి సంబంధాలున్నవీ, చారిత్రకంగా ఆ విషయాన్ని గూర్చిన వాస్తవ అనుభవాలెలాంటివి అని ఆలోచించడం మార్క్సిస్టు పద్ధతి అనిఅన్నారు.

ఇంత సంక్లిష్టమయిన కర్తవ్యాన్ని కమ్యూనిస్టు నాయకత్వం నిర్వర్తించడానికి కావలసినవి రెండు అంశాలు. ఒకటి, మార్క్సిస్టు సిద్ధాంత పరిజ్ఞానం, దాన్ని తమ తమ సామాజిక వాస్తవాల విశ్లేషణకు వర్తింపచేసే పద్ధతిలో నైపుణ్యం, రెండు ఇలాంటి విశ్లేషణ ప్రపంచ స్థాయిలో జరగాలంటే, అందుకు అన్నిదేశాల కమ్యూనిస్టులు కలిసి ఆలోచించడానికి, అవగాహన పెంచుకోవడానికి, విధానాలు నిర్ణయించుకోడానికి ఒక అంతర్జాతీయ వేదిక. ఈ రెండు విషయాలలో కూడ కమ్యూనిస్టులు క్లిష్ట సమస్యల నెదుర్కోవలసి వస్తూంది.

5. సిద్ధాంతరీత్యా మార్క్స్ రాసిన పాఠాలకు ఎన్నో రకాల భాష్యాలు తయారయ్యాయి. అవిగాక మార్క్స్ సిద్ధాంతాన్ని పరిపుష్టి చేస్తూన్నామని, సమకాలీనం చేస్తూన్నామని, దేశకాల పరిస్థితులకు అనుగుణంగా సవరించుతున్నామని చేసిన ప్రయత్నాల ఫలంగా అనేక రకాల మార్క్సిజంలు ప్రచారంలోకి వచ్చాయి. మార్క్స్ తన చారిత్రక భౌతికవాదానికిగాని సామాజిక విశ్లేషణా పద్ధతినిగాని ఒక

సమగ్రమైన, పరిపూర్ణమైన, ఉత్తరోత్తరా సంభవమయ్యే అన్ని పరిస్థితులకు, ఉత్పన్నమయ్యే అన్ని పరిస్థితులకు ఉత్పన్నమయ్యే ప్రతి సమస్యకూ పరిష్కార మార్గాలు సమాధానాలు దొరికే సిద్ధాంతంగా రూపొందించి ఆవిష్కరించలేదు. అది సాధ్యమూకాదు. ఆయన సిద్ధాంతం ప్రకారం అలాంటిది శాస్త్రీయమూకాదు. సామాజిక పరిణామ విశ్లేషణకు, చరిత్రగతి విశ్లేషణకు అవసరమైన కొన్ని మౌలికమైన సూత్రాలను, భావాలను, ఆలోచనా పద్ధతులను మాత్రమే ఆయనలో వివరించాడు. వీటిని సమకాలీన పెట్టుబడిదారీ సమాజ విశ్లేషణకు వర్తింపచేసి, అది ఏ రీతిగా మారుతుందో చూపించాడు ఆయన చిరకాల సహచరుడు, ఆ సిద్ధాంత సృష్టిలోనూ, వ్యాప్తిలోనూ గణనీయపాత్ర వహించిన ఏంగెల్స్ ఆ సిద్ధాంత కర్తృత్వం ప్రధానంగా కారల్ మార్క్సుదేనని చెప్పి ఆ గౌరవం మార్క్సుకే చెందేలా చూశాడు. ఆ భావాలు, సూత్రాలు, పద్ధతులు "మార్క్సిజం" అని వ్యవహరింపబడసాగాయి. తరువాత వచ్చిన లెనిన్, మారుతూన్న పెట్టుబడిదారీ సమాజ ధోరణులను విశ్లేషించి, ఆ వ్యవస్థ మార్క్సు చెప్పిన విధంగా మొనాపలీ సామ్రాజ్యవాద దశకు చేరిందని అదే దాని అంతిమ దశయని, ఆ దశతో సోషలిస్టు విప్లవ దశ ప్రారంభమైనదని అప్పుడున్న యుద్ధకాల పరిస్థితులలో ప్రపంచమంతా వ్యాపించిన సామ్రాజ్యవాద గొలుసులో జారిస్టు రష్యా అతి బలహీనమైన లింకనీ, అక్కడ కార్మిక, రైతుసంఘటన ద్వారా యుద్ధకాలంలో తీవ్రంగా బలహీనపడిన రష్యన్ ప్రభుత్వాన్ని కూలద్రోసి కార్మిక నియంతృత్వం స్థాపించవచ్చునని సిద్ధాంతీకరించి రష్యాలోప్రసిద్ధి చెందిన అక్టోబరు సోషలిస్టు విప్లవాన్ని తీసుకువచ్చాడు. సామ్రాజ్యవాద దేశాలలోని కార్మికులు, వలసదేశాలలోని బూర్జువా, జాతీయప్రజాస్వామ్యవాద, కార్మిక, కర్షక శక్తులు కూటమిగా ఏర్పడి సామ్రాజ్యవాదాన్ని కూలద్రోయవచ్చని అలావలసవాద దేశాలలో జాతీయ విప్లవ విజయానికి కావలసిన పరిస్థితులను వివరించాడు. లెనిన్, మార్క్సు సిద్ధాంతాలను సామ్రాజ్యవాద దశకు అనువర్తింపచేసి, సోషలిస్టు విప్లవమార్గ దర్శకుడైనందువల్ల ఆయన మరణానంతరం ఆయన సిద్ధాంతాన్ని స్టాలిన్ మార్క్సు సిద్ధాంతంతో కలిపి "మార్క్సిజమ్-లెనినిజమ్" అని నామకరణం చేశాడు తరువాత చైనా పరిస్థితులకు మార్క్సిజం-లెనినిజం—మావ్ సెటుంగ్ ఆలోచన" అని పేరుపెట్టి అదే వారి పార్టీకి సైద్ధాంతిక పునాది అని చెప్పుకున్నారు. ఈమధ్య సుదీర్ఘమైన ఆపద బంధానికి "డెంగ్ హిసియోపింగ్ థీరీ" అనే మాటలుకూడా జతచేర్చి మావ్ ఆలోచనను ప్రాథమిక దశలోనున్న చైనా సోషలిజానికి డెంగ్ అనువర్తింప చేశాడని

చెపుతూ మావ్ విధానాలను ప్రక్కకు నెట్టారు. వియత్నాం కమ్యూనిస్టుపార్టీ కూడ తమ పార్టీ సిద్ధాంతం "మార్క్సిజం-లెనినిజం-హోచిమిన్-ఆలోచన" అని పేర్కొన్నారు. ఈ రకంగా మార్క్సు సిద్ధాంతం వివిధ భాష్యాలతో, శాఖోపశాఖలతో బహుముఖంగా వ్యాప్తి చెందుతూండుట సమంజసమే అనుకున్నా ప్రతి దేశంలోనూ ఆ అభిప్రాయాల ప్రాభవం కొద్దో గొప్పో ఉండుటవల్ల వీటన్నిటినీ అర్థం చేసుకోవడంలోవున్న ఇబ్బందులే కాకుండా అవితమ సమాజపరిస్థితులకు అనుగుణమైనవి అని నిర్ధారించుకోవడం, అనుసరించుకోవడం కమ్యూనిస్టుల పనిని మరింతజటిలంచేస్తుంది.

6. రెండో సమస్య ప్రపంచ స్థాయిలో అంతర్జాతీయ సంబంధాలు, వైరుధ్యాలు బలాబలాలు అంచనా వేయుట. పెట్టుబడిదారీ వ్యవస్థ ప్రపంచవ్యవహారాలను నిర్దేశిస్తూన్నది గనుక, ప్రపంచస్థాయిలో కార్మికోద్యమాన్ని,కమ్యూనిస్టుఉద్యమాన్ని నిర్వహించడం అవసరమని గ్రహించి మార్క్సు, ఏంగెల్సులు 1864 లో "ఇంటర్నేషనల్ వర్కింగ్ మెన్స్ అసోసియేషన్ అనే సంస్థను ఏర్పాటుచేసి తద్వారా పెట్టుబడిదారీవ్యవస్థను అంతర్జాతీయంగా ఎదుర్కొనడానికి కార్మికవర్గాన్ని సంఘటిత పరచి సైద్ధాంతిక స్థాయిని పెంచి చైతన్యవంతంచేయ ప్రయత్నించారు. ఈ సంస్థ తర్వాత కాలంలో "మొదటి ఇంటర్నేషనల్" అనే పేరుతో మొదటి కార్మికవర్గ అంతర్జాతీయ వేదికగా ప్రఖ్యాతి చెందింది. పారిస్ కమ్యూన్ (1871) పడిపోయిన తరువాత ప్రథమ ఇంటర్నేషనల్ నామమాత్రంగా వుండి 1876 లో అంతరించింది. 1889 లో పారిస్‌లో "కాంగ్రెస్ అఫ్ యునైటెడ్ సోషలిస్టు" అనే సమావేశంలో 20 దేశాలనుంచి వచ్చిన కార్మిక, సోషలిస్టు సంస్థలు తరువాత కాలంలో రెండవ ఇంటర్నేషనల్" అని వాడుక [illegible] వేదికను ఏర్పాటు చేశారు ఆ ఇంటర్నేషనల్‌లో "అరాచకవాదులు" తప్ప, కార్మికవర్గం ఆ కాలంలోవున్న వివిధ రాజకీయ, సిద్ధాంత ధోరణులకు స్థానముండేది. అయినా ముఖ్యంగా జర్మనీ, ఆస్ట్రియా, హంగరీ, రష్యా కొంతవరకు ఫ్రాన్సు ఇంకా ఇతర చిన్న చిన్న దేశాల పార్టీలలో మార్క్సిస్టు ధోరణి బలంగా వుండేది. కాని మార్క్సిస్టు ప్రాతిపదికపై స్థాపించిన పార్టీలలో కూడ వారివారి దేశ ఆర్థిక, రాజకీయ పరిస్థితులనుబట్టి సిద్ధాంత అవగాహలోనూ, విధానాలలోనూ భేదాభిప్రాయాలుండుటచే రెండవ ఇంటర్నేషనల్ తీర్మానాలకు కట్టుబడి వుండడానికి అన్ని పార్టీలు సిద్ధంగా లేవు ఉన్నా ఆ తీర్మానాలకు వారి వారి భాష్యా లిచ్చుకోడానికి స్వాతంత్ర్యం కావాలనేవారు. 1914 లో ప్రథమ ప్రపంచ యుద్ధం ప్రకటించగానే అంతకుముందు యుద్ధం వస్తే కార్మికవర్గ కర్తవ్యా

లను గూర్చిచేసిన తీర్మానాలను ప్రక్కకుపెట్టి జర్మనీ, ఆస్ట్రియా, హంగరీ, ఫ్రాన్సు బ్రిటన్, ఇంకా ఇతర దేశాల కార్మికపార్టీలు "మాతృ దేశ రక్షణ" అనే నినాదానికి లొంగిపోయి, వారి వారి ప్రభుత్వాలపై యుద్ధ ప్రయత్నాలకు మద్దతు నిచ్చాయి. రష్యాలో బోల్షివిక్కులు, ఇతర దేశాల్లో కొన్ని చిన్న చిన్న లెఫ్టు సోషలిస్టులు మాత్రం యుద్ధ వ్యతిరేక ఉద్యమాన్ని కొనసాగించారు. ఎవరిదారినవారు పోవడంతో రెండవ ఇంటర్నేషనల్ 1914 లో కూలిపోయింది.

7. ప్రథమ ప్రపంచ యుద్ధం ప్రారంభం కాగానే లెనిన్ దాన్ని విశ్లేషించి అది సామ్రాజ్యవాద యుద్ధమని చెప్పాడు. సామ్రాజ్యవాద దేశాలలో వచ్చిన ఆర్థికాభివృద్ధి తేడాలవలన వారి బలా బలాలలో మార్పులు వచ్చినవని, ఆ మార్పుల కనుగుణంగా ప్రపంచంలోని వలస, అర్ధవలస రాజ్యాలను తిరిగి పంచుకోవడానికి జరిగే యుద్ధమని, అందువలన కార్మికవర్గం ఆ సామ్రాజ్యవాద యుద్ధాన్ని అన్ని దేశాలలోను అంతర్యుద్ధంగా మార్చి, తమ తమ దేశ ప్రభుత్వాలను కూలద్రోసి కార్మికులు అధికారం చేజిక్కించుకోవాలని పిలుపు నిచ్చాడు. రష్యాలోని పరిస్థితులు అనుకూలించుట వల్ల, లెనిన్ నాయకత్వాన బోల్షివిక్కులు యుద్ధ వ్యతిరేక నినాదాలతో అధికారం హస్తగతం చేసుకోగలిగారు. యుద్ధానికి మద్దతు నిచ్చిన రెండవ ఇంటర్నేషనల్ పార్టీ నాయకులు కార్మికవర్గ శత్రువులని వర్ణించాడు. రెండవ ఇంటర్నేషనల్ అంతరించినందున కొత్త ఇంటర్నేషనల్‌ను స్థాపించ నిర్ణయించి యుద్ధ కాలంలోనే వివిధ దేశాల లెఫ్టు సోషలిస్టుపార్టీలు, గ్రూపులతో సంప్రదింపులు ప్రారంభించారు. రష్యాలో అక్టోబరు విప్లవం విజయవంతమయి, యుద్ధానంతరం అంతర్జాతీయ కార్మిక వర్గాలలో లెనిన్ ఖ్యాతి ఇనుమడించడంవల్ల ఆయన తలపెట్టిన ఈ ప్రయత్నం ఊపందుకొని 1919 లో మూడవ ఇంటర్నేషనల్ స్థాపనతో సఫలీకృతమయినది. కమ్యూనిస్టు సమాజం స్థాపించడం లక్ష్యంగా పెట్టుకున్నందున, సోషలిస్టుపార్టీ అనే పేరును రెండవ ఇంటర్నేషనల్ పార్టీలు భ్రష్టు పట్టించినందున తాను పెట్టిన ఇంటర్నేషనల్‌కు "కమ్యూనిస్టు ఇంటర్నేషనల్" అని పేరు పెట్టాడు.

మొదటి రెండవ ఇంటర్నేషనల్స్‌లోని మంచినంతా కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ తీసుకుంటుందని, కాని వాటిలోని బలహీనతలను దూరంగా నుంచుతుందన్నాడు. కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ స్వతంత్ర ప్రతిపత్తి కలిగిన జాతీయ పార్టీల సమాఖ్యగాను కేవలం లెటర్‌బాక్సుగానూ వుండదని అది ఒకే కేంద్రంనుండి నడుపబడే ఒకే

నియమ నిబంధాలతో ఏక రూపం కలిగిన "ప్రపంచ పార్టీ"గా పని చేస్తుందన్నాడు. ప్రపంచ కార్మికులు విప్లవ సైన్యంగా, ప్రపంచ విప్లవ సైన్యానికి కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ జనరల్ స్టాఫ్‌గా వుంటుందని, వివిధ దేశాల కమ్యూనిస్టు పార్టీలు కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ విభాగాలుగా ప్రజాస్వామ్య కేంద్రీకృత సూత్రంపై నడుస్తూ దాని క్రమశిక్షణకు లోబడి వుంటాయన్నాడు సంస్కరణవాదులు, అవకాశ వాదులు, మధ్యస్తవాదులు, జాతీయ అహంకారులు, కాపిటలిస్టు సామ్రాజ్యవాద ఏజెంట్లు లాంటి తప్పు-తాలును జల్లించి వేయడానికి 21 షరతులను రూపొందించి. కమ్యూనిస్టు ఇంటర్నేషనల్‌లో చేరాలనుకున్న పార్టీలు గ్రూపులు ఆ షరతుల ప్రకారం పై చెప్పిన అనర్హులను తొలగించినపుడే దానిలో చేర్చుకోబడతాయన్నాడు. ఈ షరతులవల్ల దాని నిర్మాణ సూత్రాలతో విభేదించటంవల్ల చాల పార్టీలు గ్రూపులు దూరంగా వుండిపోయాయి. కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ స్థాపించిన సమయంలో, లెనిన్ దృష్టిలో ప్రపంచమంతా విప్లవ జ్వాలలు రాజుకుంటున్నవని, కొద్ది కాలంలో చెలరేగి సామ్రాజ్యవాదాన్ని భస్మీపటలం చేస్తాయని, ప్రపంచ సోషలిస్టు వ్యవస్థను ఆవిష్కరించే సమయమాసన్నమయిందని ప్రగాఢంగావిశ్వసించాడు. నియమబద్ధమైన క్రమశిక్షణగల సైద్ధాంతిక నిబద్ధతగల కార్మికవర్గ పార్టీలు లేకపోవుటవలన రష్యాలో బోల్షివిక్కులు సాధించిన విప్లవం విస్తరింపబడలేదని భావించాడు. కమ్యూనిస్టు ఇంటర్నేషనల్‌ను ఒక విప్లవకర ఆయుధంగా నిర్మించదలచి పై చెప్పిన కఠినమైన షరతులు, నియమాలు విధిపచాడు. "ఈ సామాజిక విప్లవ దశలో కార్మికవర్గ ఐక్యత ఒక అత్యంత విప్లవాత్మకమైన మార్క్సిజానికి కట్టుబడిన పార్టీ ద్వారా, అదీ అన్ని ఇతర పార్టీలకు వ్యతిరేకంగా సడలింపులేని కఠినమైన పోరాటం ద్వారానే సాధ్యమౌతుంది" అని ఉద్ఘాటించాడు లెనిన్.

ఈ విధంగా కమ్యూనిస్టు ఇంటర్నేషనల్‌ను స్థాపించి యూరపులోని బలమైన మార్క్సిస్టు సిద్ధాంతానికి కట్టుబడి వున్నామని చెప్పుకుంటున్న కార్మికవర్గ పార్టీలను చీల్చడానికి కారణం ముఖ్యంగా ఇంపీరియలిజాన్ని గూర్చి, 1914 లో వచ్చిన యుద్ధాన్నిగూర్చి ఆయనచేసిన విశ్లేషణే సరైనదని ఆయనకున్న దృఢవిశ్వాసం. వివరాల లోకి వెళ్ళకుండానే చెప్పాలంటే ఇంపీరియలిజం కాపిటలిస్టు మొనాపలీ దశయని, అది కాపిటలిజం చరమ దశయని, వెనుకబడిన దేశాలకు పెట్టుబడిని ఎగుమతి చేసి,

ఆ దేశాలను దోచుకుంటూ సూపర్-ప్రాఫిట్స్, వడ్డీలు, కమిషన్‌లు మొదలగు కష్టార్జితం కాని ఆదాయాలతో పరాన్నభుక్కులుగా మారిన, క్షీణ దశలలో నున్న కాపిటలిజం అని నిర్వచించాడు. అయితే కాపిటలిజం అభివృద్ధి రేటు అన్నిదేశాలలో ఒకే రీతిగా లేకపోవడంవల్ల, అసమానతలు తలఎత్తడం సామాన్యమని, కాపిటలిజం అంతర్లీనమైన ఈ అభివృద్ధి అసమానత సామ్రాజ్యవాద దేశాలమధ్య నున్న శక్తి సంబంధాలను నిరంతరం తలక్రిందులు చేస్తుందని, మారినబలాలు కనుగుణంగా ప్రపంచంలో వారికున్న కాలనీలను, ఇతర ప్రయోజనాలను శాంతియుతంగా పదేపదే పంచుకోవడం అసంభవమని, అది బలప్రయోగం ద్వారానే సాధ్యమనీ, అందువల్ల ప్రపంచాన్ని తిరిగి పంచుకోవడానికి యుద్ధాలు తప్పవని, వీటిని అవకాశవాదంగా తీసుకుని కార్మికవర్గం కాపిటలిస్టు వ్యవస్థను కూలదోసి అధికారం హస్తగతం చేసుకోవాలని, అందువల్ల ఇది సోషలిస్టు విప్లవారంభ దశ అన్నాడు. ఈ విషయమై ఆ రోజుల్లో మార్క్సిస్టుల మధ్య అభిప్రాయ భేదాలున్నా ఇంపీరియలిజంపై లెనిన్ చేసిన ఆర్థిక-రాజకీయ విశ్లేషణ యుద్ధంలో జరిగిన విధ్వంసం, లెనిన్ రష్యాలో విప్లవాన్ని విజయవంతంగా తీసుకురావడం కారణాలుగా ఇతరుల అభిప్రాయంకంటే ప్రాచుర్యం పొందింది. మొదటి ప్రపంచ యుద్ధానంతరం కొంత కాలం కాపిటలిజం నిలదొక్కుకున్నా, 1929 లో వచ్చిన ఆర్థిక సంక్షోభం నుంచి పూర్తిగా కోలుకోకుండానే 1939లో రెండవసారి మానవ జాతిని భీకర మారణహోమంలోకి త్రోసి వేయడం, ఆ క్రమంలో యుద్ధాంతం కనుచూపు మేరలో వుందనుకునే సమయంలో అణుబాంబు పేల్చి దాని విధ్వంసానికి విశ్వ రూపం ప్రదర్శించడం, అంతేకాక ఆర్థికమాంద్య కాలంలో సోవియట్ యూనియన్ సాధించిన సమాన ఆర్థిక ప్రగతి రెండవ ప్రపంచ యుద్ధ విజయంలో అది నిర్వహించిన వీరోచిత పాత్ర, సామాజిక రంగంలో ముఖ్యంగా ఆ దేశంలోని వెనుకబడిన జాతుల అభివృద్ధికై చేసిన కృషి లెనిన్ ఇంపీరియలిజాన్ని గూర్చి చేసిన ఆర్థిక, రాజకీయ విశ్లేషణకు ప్రపంచంలో విశేష ఆదరణ లభించింది.

12. సోవియట్ యూనియన్, దానితోపాటు తూర్పు యూరపు దేశాల కమ్యూనిస్టు ప్రభుత్వాలు కూలిపోవడం, చైనా, వియత్నాం సోషలిస్టుదశగా పోతున్నవనుకున్న దేశాల తిరోగమన విధానాలను మార్క్సిస్టులు తీవ్రంగా ఆలోచిస్తున్నారు. దానిలో భాగంగా లెనిన్ సామ్రాజ్యవాదాన్ని గూర్చి చేసిన విశ్లేషణ కూడ గత 80 సంవత్సరముల పరిణామాల దృష్ట్యా మార్క్సిస్టు దృక్పథం నుంచి విమర్శకు

గురి అవుతూన్నది. ముఖ్యంగా కాపిటలిజం చరమ దశకు చేరిందని, ఇక సోషలిస్టు విప్లవ దశ వచ్చిందని, సోషలిజాన్ని పరివర్తనా దశలో వున్నామని విశ్లేషించుట కాపిటలిజంలో తరువాత వచ్చిన పరిణామాలు కాని, పై చెప్పిన కమ్యూనిస్టుపార్టీలు పాలించిన దేశాలలోవచ్చిన పరిణామాలు కాని సమర్థించక పోవడమేగాక ఆవిశ్లేషణ మార్క్సు చారిత్రిక భౌతికవాద ముఖ్య సూత్రాలనుంచి పెడత్రోవ తొక్కిందనే వాదన బలపడుతూన్నది.

యుద్ధానంతరం కాపిటలిజం సాధించిన ఆర్థిక ప్రగతి, ఆ వ్యవస్థ చరమ దశలో లేదని, కాపిటలిస్టు ఉత్పత్తి సంబంధాలు ఉత్పత్తి శక్తులను పెంచగల సామర్థ్యం కోల్పోలేదని, రుజువైంది కమ్యూనిస్టుపార్టీలు ఇంకా అధికారంలో వున్న చైనా, వియత్నాంలు అవలంభిస్తూన్న తిరోగమన విధానాలు తక్కువ స్థాయిలో వున్న ఉత్పత్తి శక్తులను పెంచడానికి కాపిటలిస్టు పద్ధతులు అవసరమని, కాపిటలిజాన్ని దాటవేసి సోషలిజానికి తిన్నగా బాట వేయడం అసాధ్యమని సోషలిస్టు సమాజ నిర్మాణం ఉత్పత్తి శక్తులు మార్క్సు చెప్పినట్లు ఉన్నత స్థాయికి చేరినపుడే సాధ్యమని అనడానికి ఎక్కువ ఆధారాలు కనబడుతున్నాయి. ఇక్కడ ఈవిషయమై మార్క్సు తన సమాజ అధ్యయనంలో మార్గదర్శకంగా పనిచేసిన సూత్రం నుంచి కొన్ని మాటలు ఉటంకించడం అవసరం. ఉత్పత్తి శక్తులు ఒకస్థాయివరకు అభివృద్ధి చెందాక. అంతవరకువున్న ఉత్పత్తి సంబంధాల వైరుధ్యం వస్తుందనీ, ఎందుకంటే ఆ సంబంధాలు ఉత్పత్తి శక్తులు పెరగకుండా ప్రతిబంధకాలవుతాయనీ, అప్పుడు సామాజిక విప్లవం ఆరంభమవుతుందనీ చెబుతూ ఇలా అన్నారు. "ఏ సాముజిక వ్యవస్థ అయినా దానిలో ఉత్పత్తి శక్తులు పెరగడానికివున్న అవకాశాలను పూర్తిగా వినియోగించుకొనక ముందు కూలిపోదు. అంతేకాదు నూతనఉన్నత స్థాయి ఉత్పత్తి సంబంధాలు, వాటి అస్థిత్వానికి కావలసిన భౌతిక పరిస్థితులు పాత సమాజ గర్భంలో పరిపక్వం కానిదే మొలకెత్తవు. అందుచేత మానవజాతి అది పరిష్కరించగల కర్తవ్యాలనే చేపడుతుంది ఈ విషయాన్ని మరింత జాగ్రత్తగా పరిశీలిస్తే అసలు కర్తవ్యం అనేది దాని పరిష్కారానికి తగిన భౌతిక పరిస్థితులున్నపుడు గాని కనీసం ఆ పరిస్థితులు రూపొందే క్రమంలో వున్నపుడు గాని మాత్రమే ఉత్పన్న మవుతుందన తెలుస్తుంది,"

13. కాపిటలిస్టు అభివృద్ధి కనీసం మధ్య స్థాయిలో నున్న దేశాలలోకూడా వైరుధ్య తీవ్రత తగినంత కార్మిక చైతన్యం, సంఘటన మార్క్సిస్టు నాయకత్వం

అంటే సోషలిస్టు విప్లవం తీసుకురావచ్చునని లెనిన్ అన్నట్లు పైన చెప్పాం. (అయితే సోషలిజం నిర్మించడానికి కాస్త ఎక్కువకాలం పడుతుందనికూడ అన్నాడు) అంటే కాపిటలిస్టు వ్యవస్థను కూల్చ్రోయుటలో ఆ వ్యవస్థ ఉత్పత్తి శక్తుల పెరుగుదల స్థాయికంటే దానిలోని వర్గాల మధ్యనున్న వైరుధ్య తీవ్రతపైన లెనిన్ ఎక్కువగా కేంద్రీకరించినట్లు మనం తెలుసుకోవచ్చును. వైరుధ్య తీవ్రత కార్మికవర్గ చైతన్యం, సంఘటన, మార్క్సిస్టు సిద్ధాంతానికి కట్టుబడిన పార్టీ నాయకత్వంపై ఆధార పడుతుందని కూడ ఆయన ఆలోచన. అంటే లెనిన్ విస్తృత వాస్తవిక (ఆబ్జెక్టివ్) పరిస్థితుల మీదకంటే, మానవేచ్ఛా నియంత్రితమైన కర్తృత్వం(వాలంటరిజం) నకు ఎక్కువ ప్రాధాన్యత ఇచ్చినట్లు తెలుస్తుంది. వస్తుగత ప్రమాణాల ప్రాధాన్యత తగ్గించి, ఆత్మాశ్రయ, ఇచ్ఛానియంత్రణ దృక్పథంపై ఆధారపడి సామాజిక వాస్తవాలను విశ్లేషించి కర్తవ్య నిర్ధారణచేసేపద్ధతి విభిన్న అభిప్రాయాలకువిధానాలకు కలహాలకుచీలికలకుదోవతీస్తుందని వేరేచెప్పనవసరంలేదు. ఇటీవలకమ్యూనిస్టు ఉద్యమ చరిత్రే దీనికి సాక్ష్యం. ప్రపంచంలో ఈనాడు ఎన్ని కమ్యూనిస్టు పార్టీలు గ్రూపులు వున్నవో లెక్క పెట్టడం కష్టం.

14. ఇదంతా చూస్తే, పాఠకులకు చాల సందేహాలు రావచ్చు. కమ్యూనిస్టు విధాన నిర్ణయం ప్రక్రియ ఇంత సంక్లిష్టమై, ఇన్ని అంశాలు పరిగణనలోకి తీసుకోవలసి వస్తే, విధాన నిర్ణయాలకు రావడం సాధ్యమా? సాధ్యమైనా, అవి సముచితమైనవని విశ్వసించగలమా? కాకపోతే ఏమిజరుగుతుంది? కమ్యూనిస్టుపార్టీలు లేకపోతే చరిత్రగతి వేరుగా వుంటుందా? ఇలాంటి సందేహాలు కూడ రావచ్చు. ఈ సందేహాలకు సమాధానాలు చరిత్రలో వెతుక్కోవాలి. చరిత్రను నిర్దేశించే వాస్తవ శక్తులేవి అనే విషయంలోకి వెళ్ళాలి. మార్క్స్, ఏంగెల్స్‌లు చరిత్ర పరిణామం వెనుక ఏదో అదృశ్య శక్తి వుందనే భావనను తిరస్కరించారు. మానవజాతి, దానిలోని వ్యక్తులకు, వర్గాలకు, స్త్రీ, పురుషులకు, జాతులకు సంబంధించిన భౌతిక, మానసిక, సాంస్కృతిక అవసరాలను తీర్చుకోడానికి ప్రకృతిని వినియోగించుకొనుచూ చేసే ఎడతెగని కృషిద్వారా చరిత్ర సృష్టి చేస్తూంది. ఆ కృషి ప్రక్రియలో సామాజిక సంబంధాలు ఏర్పడతాయని, ఉత్పత్తి శక్తులు పెరుగుతూంటాయని, ఆ శక్తులను వినియోగించుకొనే క్రమంలో వివిధ వర్గాలు ఏర్పడుతాయని ఆ వర్గాల లక్షణాలు ఉత్పత్తి శక్తుల అభివృద్ధి స్థాయినిబట్టి వుంటాయని మార్క్స్, ఏంగెల్స్‌లుసిద్ధాంతీకరించారు. ఉత్పత్తి శక్తుల అభివృద్ధిని ఆటంకపరచే సామాజిక సంబంధాలను, వాటి

వలన ప్రయోజనం పొందే సామాజిక వర్గాలు రక్షించుకోడానికి యత్నిస్తే, మిగతా వర్గాలు ఆ సంబంధాలను మార్చడానికి విశ్వ ప్రయత్నాలు చేస్తాయని, వీటి మధ్య సంఘర్షణ తీవ్రస్థాయి చేరుతుందనీ, ఈ సంఘర్షణ ఫలితంగా చివరకు ఉత్పాదికతను పెంచే వర్గాలే విజయాన్ని సాధించి నూతన సామాజిక సంబంధాలను ఏర్పరచు కుంటాయని మార్క్స్, ఏంగెల్స్‌లు అభిప్రాయ పడ్డారు. వేలాది సంవత్సరాలుగా మానవ జాతి చరిత్ర ఇలా జరుగుతూ, మార్పు చెందుతూ వస్తూంది. 155 సంవత్స రాల క్రితం మార్క్స్, ఏంగెల్స్‌లు ఆ మానవజాతి చరిత్రను గూర్చి, దాని గతిని నిర్దేశించే, నిర్ణయించే శక్తులను గూర్చి దాన్ని అధ్యయనంచేసే పద్ధతులను గూర్చి పై చెప్పిన సిద్ధాంతాలను మానవాళికి అందజేశారు. అంతవరకు చరిత్ర కర్త మానవ జాతియే అయినా ఆ చరిత్ర ఏ దిశగా, ఏ విధంగా ఎందుకు పోతూన్నదో గ్రహిం చక అది ఎదుర్కొంటున్న తక్షణ సమస్యల పరిష్కారానికి ప్రాధాన్యత యిస్తూ, చరిత్రలో గడించిన అనుభవంపై ఆధారపడి ఆ సమస్యలను పరిష్కరించుకుంటూ ముందుకుపోతూ వచ్చింది మార్క్స్, ఏంగెల్స్ సిద్ధాంతం, సమాజం ఏ దిశలో వుంది, ఏ దిశగా పోతుందీ, ఏ శక్తులు సామాజిక ప్రగతికి తోడ్పడుతాయి, ఏవి అడ్డుపడతాయి అనే అంశాలపై అవగాహన ఏర్పరచుకోడానికి తోడ్పడి, సమాజ ప్రగతికి అడ్డుపడే శక్తులను ఎదుర్కొంటూ, కట్టడిచేస్తూ చరిత్రను అంతకు పూర్వం కంటే వేగిర పరచడానికి సహాయం చేస్తుంది. కమ్యూనిస్టులకు పూర్వం ప్రజలు వారి సమస్యలను వారు పరిష్కరించుకున్నారు. పోరాటాలు నడిపారు. విప్లవాలు తీసుకొచ్చారు. చరిత్రను సృష్టించారు. అంతా మాకే తెలుసు. మేమే రైతు అనుకునే పార్టీలు ఏ అన్వేషణనైనా ఎలా చేస్తాయి ?

చలసాని రాధాకృష్ణదాసు

# II

# చీలికల పర్వం

## (i)

## కమ్యూనిస్టు పార్టీలో సంక్షోభం

దేశంలో 1962 సాధారణ ఎన్నికల కాలంలో ప్రారంభమైన సామాజిక, రాజకీయ పరిణామాలు ప్రధానంగా జాతీయ కాంగ్రెసులో తీవ్రతరం కాజొచ్చాయి. భారతకమ్యూనిస్టుపార్టీ కూడ అంతర్గత పోరాటాల సంక్షోభంలో పడిపోయింది. పండిట్ నెహ్రూ మరణంతో దేశ రాజకీయాలలో అస్థిరత్వం చోటుచేసుకొంది. సామాజిక, రాజకీయ సంఘర్షణలదశ ప్రారంభమైంది.

### కాంగ్రెసులో అంతర్గత సంఘర్షణలు

కాంగ్రెసులో అంతర్గత ముఠాల సంఘర్షణలకు, నెహ్రూ ఆనకట్టగా వుండుట లేకుండా పోయింది. నూతన ప్రధాని లాల్ బహదూర్ శాస్త్రి గతంలో వివిధ ముఠాల మధ్య సమతూకాన్ని దేశ అగ్రనాయకత్వంలో, రాష్ట్రాల నాయకత్వాలలో కొనసాగించినా, యిప్పుడు బలమైన వర్గంవైపు మొగ్గకతప్పలేదు. రాష్ట్రాలలో బలమైన గ్రూపులు సంస్థ, రాష్ట్ర ప్రభుత్వాలకు నాయకత్వంవహించుతున్న వర్గాలు, కేంద్రంలోను తమవర్గం వారినే బలపరచుటతో, కాంగ్రెసులోని వివిధ సంస్థలలో రాష్ట్ర నాయకత్వాలే, కేంద్రంపై బలమైన ప్రభావాన్ని కలుగజేయగల స్థితికి ఎదిగాయి. అతుల్యఘోష్, సి. బి. గుప్తా, బిజు పట్నాయక్‌లు నూతనంగా దేశ రాజకీయాలలో వహించుచున్న ప్రధానపాత్ర దీనినే తెలియజేస్తుంది. అదే విధంగా మితవాద నాయకులు మురార్జీ దేశాయ్, యెస్. కె. పాటిల్‌లు తమ రాష్ట్రాలలోనేగాక కేంద్రంలో బలాన్ని సంపాదించగలిగారు. ఈ పరిణామాలన్నిటి ఫలితంగా రాష్ట్రాలలో రెండుగ్రూపుల సంఘర్షణలు, పోరాటాలు సాగిస్తున్నా ముఖ్యమంత్రులను రెండుగ్రూపులు మద్దతునిచ్చేపరిస్థితి యేర్పడింది. కేంద్రంలోను యిదే పరిస్థితి

రూపొంద నారంభించింది. ఈ విధంగానే కాంగ్రెసు అధ్యక్షుడు కామరాజ్‌నాడార్ ఒకవైపు జాతీయ కాంగ్రెసు విధానాలను, మరోవైపు ప్రభుత్వవిధానాలను రూపొందించుటలో, నెహ్రూ మరణానంతరం ముఖ్యపాత్ర వహించాడు. కాంగ్రెసులో మితవాద శక్తులు స్థిరంగా బలపడి, ప్రభుత్వవిధానాలపై బలమైన వొత్తిడి చేయనారంభించాయి. పాలకపార్టీలోని బలమైన ఐక్యత క్షీణించుటతో, మితవాద, అతివాద శక్తుల ఎత్తుగడల వొత్తిడిలు ఎక్కువయ్యాయి.

సంయుక్త సోషలిస్టు పార్టీలో కూడ, నాయకత్వాలలో సంఘర్షణలకు, మితవాద, అతివాద నాయకత్వాలు, ముఖ్యంగా కమ్యూనిస్టులతో సహకారం సమస్యపై, మితవాద నాయకులైన మాజీప్రజాసోష్టపార్టీవారు సోవియట్, కమ్యూనిస్టు వ్యతిరేకతను కొనసాగించగా, మాజీ సోషలిస్టు పార్టీనాయకులు యన్. యం. జోషీ, మధు లిమాయి, రాంమనోహర్‌లోహియాలు కమ్యూనిస్టులతో పరిమిత సహకారం నెరప కోరుతున్నారు. ఈ పార్టీలోని కొందరు కాంగ్రెసులో చేరుటతో సంయుక్త సోషలిస్టు పార్టీ బలహీనపడి చీలికలకు లోనయ్యారు. చీలిక అనంతరం, వీరి వెనుక వున్న కార్మికవర్గ సంఘాలలో కూడ చీలికయేర్పడింది.

## కమ్యూనిస్టుపార్టీలో భిన్నాభిప్రాయాలు

కమ్యూనిస్టు పార్టీలో వచ్చిన సిద్ధాంత భిన్నాభిప్రాయాలు ఆయా సందర్భాలలో ముచ్చటించుకొన్నా, క్లుప్తంగా మననం చేసుకొందాము.

భారతకమ్యూనిస్టు పార్టీ ఐక్యంగా వున్నపుడు 1925లో పుట్టిందని చెప్పుతు వచ్చి, చీలిక అనంతరం, మార్క్సిస్టు కమ్యూనిస్టుపార్టి 1920గ చెప్పుతున్నది. పార్టి కాంగ్రెసులో ఆమోదించబడిన కార్యక్రమం లేకుండా ఐక్యపార్టీలో అన్నివర్గాలు 60 దశకం ప్రథమార్థభాగం వరకు 40 సంవత్సరాలు, ఎప్పటికప్పుడు రాజకీయ తీర్మానాలు, ప్రణాళికలు, ప్రకటనలు, సవరణల ప్రాతిపదికలతో పనిచేయుట ఆశ్చర్యకరమే అగుతుంది. అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమనాయకుల సహకారంతో 1951లో వొక తాత్కాలిక కార్యక్రమము రూపొందించినా, 3,4,5 పార్టి కాంగ్రెసులలోను చివరకు 1962లో 6వ పార్టి కాంగ్రెసులో కూడ తీవ్రభేదాభిప్రాయాలతో ఒక అంగీకృత కార్యక్రమాన్ని రూపొందించజాలక, చీలిపోయేపరిస్థితి యేర్పడగా, సౌహార్ద ప్రతినిధుల సలహాపై కార్యక్రమాన్ని ఆమోదించుట, భవిష్యత్తుకు వాయిదావేసి, వొక రాజకీయ తీర్మానాన్ని కార్యదర్శి అజయ్‌ఘోష్ ఉపన్యాసం ప్రాతిపదికగా రూపొందించి, వొక తక్షణ కార్యక్రమాన్ని కాంగ్రెసు ఆమోదించింది. ఆ రాజకీయ తీర్మానం, వొక రాజీ తీర్మానం, వివిధ దృక్పథాల వారు వారి వైఖరి ననుసరించి వ్యాఖ్యానించుటకు వీలుగా వుంది. వివాదాంశాలను పరిష్కరించబడకపోగా తీవ్రమై సంక్షోభానికి దారితీసాయి.

భారత కమ్యూనిస్టుపార్టీలోని భేదాభిప్రాయాలకు ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమంలో చెలరేగిన సిద్ధాంత విభేదాలు,అగ్నికి ఆజ్యంలా తోడ్పడినవి. దీనితోపాటు భారత-చైనా సరిహద్దు వివాదం జాతీయ సమితిలో అత్యధికులు ఆమోదించిన విధానాన్ని మైనారిటీ తీవ్రంగా వ్యతిరేకించుటతో పార్టీలో అంతర్గత సంక్షోభం తీవ్రతరమైంది ఈ విధంగా పార్టీలోని భేదాభిప్రాయాలకు అగ్ని, ఆజ్యంతోపాటు వాయువు కూడ తోడగుటతో చీలికకు మార్గం యేర్పడింది. ఈ క్రమాన్ని కమ్యూనిస్టులు, సానుభూతిపరులు, శ్రేయోభిలాషులు తెలుసుకొనవలసివుంది. ఇందుకు ముందుపర్వాలలో పార్టీలోని రెండు దృక్పథాల సంఘర్షణ, అంతర్జాతీయ కమ్యూనిస్టు వుద్యమంలో చెలరేగిన సిద్ధాంత బృహత్చర్చను గురించి తెలుసుకొన్నాము. అనేపథ్యంలోనే భారత కమ్యూనిస్టు ఉద్యమ చీలికలక్రమాన్ని అధ్యయనం చేయవలసివుంది.

## చీలికల సోపానాల క్రమం

భారత కమ్యూనిస్టుపార్టీ జాతీయసమితి 2 నవంబరు 1962న "చైనా దురాక్రమణకు వ్యతిరేకంగా మాతృభూమి రక్షణకై అందరూ ఐక్యం కండి" అని పిలుపునిస్తూ చేసిన తీర్మాన వివరాలను అంతకుముందు ఆగస్టులో జాతీయసమితి హైదరాబాద్‌లో సమావేశమై, చైనా-భారత సంఘర్షణలపై తీర్మానం అమోదించబడుట పాఠకులకు గుర్తుంటుంది. పార్టీవిధానం యీ రెండు తీర్మానాలలో స్పష్టం చేయబడింది. నవంబరు తీర్మానం అత్యంత తీవ్రచర్చల అనంతరం అత్యధిక మెజారిటీతో ఆమోదించబడిందని తెలుసుకొన్నాము.

అదే నవంబరు సమావేశంలో అతివాదుల అభిప్రాయాలను ప్రతిబింబే వొక ప్రత్యామ్నాయ చిత్తు తీర్మానం పృధ్వీరాజ్‌చే ప్రతిపాదించబడి వీగిపోయింది. ఈ సందర్భరంలో అందులోని ముఖ్యాంశాలు తెలుసుకొనవలసివుంది. అందులో భారత-చైనా సరిహద్దు సంఘర్షణలకు, భారతప్రభుత్వ నైజాన్ని యీ క్రింది విధంగా వివరించుట జరిగింది.

"భారత కమ్యూనిస్టుపార్టి జాతీయ సమితిలో మెజారిటీ సభ్యులు డాంగేనాయకత్వం తీవ్రజాతీయ తత్వానికి లొంగిపోయి, ప్రభుత్వం చేబట్టిన అన్నిటిని బలపరస్తున్నారు. వర్గ దృక్పదాన్నుండి సరియైన పంథాను అన్వేషించక, "గుత్తపెట్టుబడిదారి నాయకత్వం నుండి వేరువిధంగా వుండే ప్రయత్నం యేమాత్రం చేయలేదు." "గుత్తపెట్టుబడిదారి లక్షణమే, సామ్రాజ్యవాదంతో దేశీయాభివృద్ధి నిరోధకులతో సహకారము, "చైనా దురాక్రమణ" "కార్యకారణాలను గజిబిజిచేస్తున్నది."

"భారత ప్రభుత్వవిధానం నెహ్రూవర్గ నైజపు ప్రతిబింబము నేటిప్రభుత్వాన్ని మొత్తం బూర్జువా వర్గానికి ప్రాతినిధ్యం వహిస్తుందని పరిగణించరాదు." భారత

ప్రభుత్వం బడాబూర్జువా, భూస్వామ్యవర్గాల నియంతృత్వం, గుత్తపెట్టుబడిదారుల, రాజుల, మహారాజుల ప్రయోజనాలను మాత్రమే పరిపూర్తి చేస్తుంది. చిన్న, మధ్య తరగతి పెట్టుబడిదారి వర్గాల ప్రయోజనాలను త్యాగం చేస్తుంది. గుత్తపెట్టుబడిదారుల పెరుగుదలే స్వాతంత్ర్యానంతర కాలంలో ప్రధానాంశము. ప్రజల కనుకూలంగా ప్రభుత్వరంగాన్ని, గుత్తపెట్టుబడి వర్గాలను అదుపులో వుంచుటకు బదులు, ప్రభుత్వం ప్రజలకు వారి ప్రయోజనాలకు వ్యతిరేకంగా వుపయోగించబడుతున్నది".

భవిష్యత్ కర్తవ్యాలను "నేటి పోరాటం, సామ్రాజ్యవాద, ఫ్యూడలు వ్యతిరేకమైనదైనా ప్రధాన ప్రతిఘటన, అధికారం చేతులలో వున్నందున గుత్తపెట్టుబడిదారి వర్గం నుండే వస్తున్నది. ఈ ప్రభుత్వంతో సామ్రాజ్యవాద, ఫ్యూడలు వ్యతిరేక పోరాటం అసాధ్యము ఈ కర్తవ్యం జనతంత్ర ప్రజాస్వామిక ప్రభుత్వంతోనే పూర్తి అగుతుంది. బడా బూర్జువా, భూస్వామ్య వర్గాల ప్రభుత్వాన్ని తొలగించి, కార్మిక వర్గనాయకత్వంలో అధికారాన్ని సాధించగలిగితేనే జరుగుతుంది. సామ్రాజ్యవాద వ్యతిరేక సంఘటనలో గుత్తపెట్టుబడిదారి వర్గమే గాక పూర్తి జాతీయ బూర్జువా వర్గమంతా వుండదు[1]" అని చిత్తు ప్రత్యామ్నాయ తీర్మానం సూచించింది.

## అతివాద మైనారిటి పోటీ కేంద్రం

జాతీయ సమితి నవంబరు 1 న, తీర్మానం మెజారిటిచే ఆమోదించబడిన వెంటనే, కేంద్రకార్యవర్గంలోని మైనారిటి అతివాద వర్గం, అట్టి అభిప్రాయాలు ముఖ్యంగా రాజకీయ, సైద్ధాంతిక వైఖరి గల మరికొంతమంది సభ్యులు వేరుగ ఢిల్లీలో కలుసుకొని, జాతీయ సమితి నిర్ణయాలకు భిన్నంగా, రాజకీయ నిర్మాణ పంధాని నిర్ణయించుకొన్నారు. వారు జాతీయసమితిని "పూర్తిగ మితవాద, సంస్కరణవాది, తీవ్రమైన చైనా వ్యతిరేకిగా, భారతప్రభుత్వ ఆమోద ముద్రలేని యే చొరవను తీసుకొనజాలని నైజం కలవాని"గా నిర్వచించారు. "ఈ ఎత్తుగడలను బహిరంగపరచి నాయకత్వాన్ని తొలగించివేయుట, చావుబ్రతుకుల పోరాటంగా" పరిగణించారు. "అంతర్గత పోరాటాన్ని పార్టీలో కొనసాగించుటకు యింకెట్టి అవకాశాలు లేవని" నిర్ణయించారు.

"సామ్రాజ్యవాదంపై ఆర్థికంగా, సైనికంగా ఆధారపడుట యెక్కువగుతుందని, మితవాదంవైపు తిరోగమనం త్వరితమౌతుందని, ఆలీననిధానాన్ని నెహ్రూ ప్రభుత్వం విడనాడుతుందని, ప్రజాస్వామ్యం మృగ్యమై అర్ధఫాశిసు, ఫాశిస్టు పరిస్థితులు యేర్పడి కాంగ్రెసు ప్రభుత్వం సామ్రాజ్యవాదపు తొత్తుగా

1. భారత కమ్యూనిస్టుపార్టీ జాతీయ సమితి పత్రాలు. (ఆంగ్లంలో) న్యూఢిల్లీ ఏప్రిల్ 10-15, 1964. కమ్యూనిస్టుపార్టీ పబ్లికేషన్. పే. 77, 8.

స్పష్టమౌతుందని" అతివాదవర్గం అంచెనా వేసింది అట్టి పరిస్థితులలో చట్టబద్ధంగా పార్టీపనిచేయుట అసాధ్యమనే దృక్పథంతో "అర్ధరహస్య, రహస్య పని విధానాలను, ఆయా రాష్ట్రపరిస్థితులను బట్టి నిర్మాణాన్ని అనుసరించవలసి వుంటుందనే నొక్కి చెప్పి పునాదిని వేసారు." ఇది జాతీయ సమితి నిర్ణయించిన విధానానికి పూర్తి విరుద్ధమైనది.

"రాజకీయ, నిర్మాణ విధానాలను రూపొందించి, అమలుజరుపుటకు మార్గదర్శకత్వాన్ని యిచ్చుటకు అఖిలభారత కేంద్రాన్ని యేర్పాటు చేసారు. కా. గోపాలన్, రామదాస్‌లు ఆ కేంద్రపు ఆధిపత్యాన్నివహించారు కా. సూర్జిత్ రామమూర్తి సుందరయ్య రాష్ట్రాలకు అవసరమైన యంత్రాంగాన్ని యేర్పాటు చేయుటకు అర్జెన్సుగా వెళ్ళారు. కేంద్ర నిర్ణయాలను అమలు చేయుట అవసరము- భారత కమ్యూనిస్టు పార్టీలో యీ అఖిల భారత పార్టీపోటీ కేంద్రం, 1962 నవంబరు మొదటివారం నుండి పనిచేస్తున్నది. కొన్ని రాష్ట్రాలలో దీనిఅనుబంధ రాష్ట్ర కేంద్రాలు పనిచేస్తున్నవి. ఈ కేంద్రాలనుండి విడుదల చేయబడిన సర్క్యులర్స్, సమీక్షలు, రిపోర్టులు వారి చర్యలు పోటీ పార్టీ నైజాన్ని స్పష్టం చేస్తున్నది."[1]

"అఖిలభారత పోటీ కేంద్రపు సూచనలను వెంటనే పశ్చిమ బెంగాల్‌లో కా ప్రమోద్‌దాస్‌గుప్తా ఎన్నుకొన్న కొంతమంది కామ్రేడ్స్ కలిసి కొన్ని సూచనలు చేసారు. రాష్ట్రసమితి ఆఫీసునుండి కాగితాలు, రికార్డులు, టైపురైటర్లు, యితర ఆఫీసు పరికరాలను, సామానులను తొలగించి వేసారు. కమ్యూనిస్టుపార్టీ జాతీయ సమితి నిర్ణయాలను పార్టీ సభ్యులకు సానుభూతిపరులకు యితర శ్రేయోభిలాషులకు ప్రజలకు వివరించే పనిని చేబట్టలేదు. జాతీయ సమితి విధానాన్ని వివరించుటకు కొందరు ప్రయత్నించినపుడు ప్రతిఘటన యెదురైంది. పశ్చిమ బెంగాల్ రాష్ట్ర సమితి నవంబరు 13న సమావేశమైనపుడు చర్చలు లేకుండా జాతీయ సమితి తీర్మానాన్ని అమలు చేయ నిర్ణయం జరిగింది. పార్టీ దినపత్రికయైన స్వాధీనత జాతీయసమితి తీర్మాన పూర్తిపాఠాన్ని ప్రకటించలేదు. దానికి విరుద్ధంగా రామమూర్తి ప్రత్యామ్నాయ చిత్తు తీర్మానం జాతీయ సమితి మెజారిటిచే నిరాకరించబడినా విస్తృతంగా పంచబడింది. ప్రచారమూ పొందింది. కా. రామమూర్తి కలకత్తాలో అప్పుడు వున్నారు.

పంజాబ్‌లోను యిదే పని జరిగింది. రాష్ట్ర కమ్యూనిస్టుపార్టి ఆఫీసు నుండి కాగితాలు, రికార్డులు తొలగించబడినవి. కా. సూర్జిత్‌తో సహా సీనియర్ కామ్రేడ్స్

---

1. భారత కమ్యూనిస్టుపార్టీ సెంట్రల్ కమిషన్ రిపోర్ట్‌లు ది నేషనల్ కమిటి రిజల్యూషన్స్ ఆన్ స్ప్లిట్టర్స్ (ఆంగ్లంలో) పి.పి. హౌస్. పే. 35-36,

అందరూ అర్ధరహస్యంగా-సెమీలీగల్‌గా- తిరుగుతు రహస్య పార్టి యంత్రాంగాన్ని నిర్మించసాగారు. నవంబరు 1962 రెండవ వారంలో రాష్ట్రకార్యవర్గం సమావేశ మైనపుడు, జాతీయసమితి తీర్మానాన్ని ఆమోదించలేదు. కాని మామూలుగ అమలు చేయమని నిర్ణయించింది. పార్టీ కాడర్లకు, ప్రజలకు జాతీయ సమితి తీర్మానాన్ని వివరింపుటకు ఎట్టి ప్రయత్నం చేయలేదు.

బెంగాల్‌లో "కౌటిల్యుని" కరపత్రము

భారత కమ్యూనిస్టుపార్టీ కేంద్రనాయకత్వంగా చెప్పబడే మెజారిటి నేడు పాలకవర్గ ప్రకటనలు కార్యక్రమము "చైనా కమ్యూనిస్టుపార్టీ, ప్రభుత్వం, "దురాక్రమణ", "విస్తరణవాదం" "మార్క్సిజం నుండి వైదొలగిన పార్టి" అనేది "వారి బూర్జువా జాతీయతా ప్రధాన నినాదం" అదే వారు ప్రజలకిచ్చు పిలుపు. కమ్యూనిస్టు అధికార నాయకత్వం యీ విజ్ఞప్తినే బలపరుస్తున్నది. ఇదీ కరపత్రం భారత-చైనా సరిహద్దు వివాదంపై చేసిన వ్యాఖ్య.

భారత ఆర్థిక విధానంపై వ్యాఖ్యానిస్తూ "ఈ ప్రభుత్వం బడా బూర్జువా నాయకత్వంలో ప్రభుత్వరంగం అనే పేరుతో దోపిడిదారులకు ప్రయోజనం కలుగ జేసే తెలివైన యెత్తుగడ. జాతీయత పెట్టుబడిదారుల సేవిక అయింది. చరిత్రలో బూర్జువా ప్రభుత్వాలు యేదోవొక దశలో ప్రజల విప్లవ పోరాటశక్తిని నీరుగార్చుటకు జాతీయతత్వాన్ని దురభిమాన దశకు తీసుకొని వెళ్ళుట అవలంభించాయి" అని కరపత్రం పేర్కొంది.

అంతేగాక పార్టి ప్రభుత్వ ఆర్థిక రాజకీయ విధానాలను బలపరుస్తుందని కేరళ మార్గంలో ఎన్నికలద్వారా అధికారంలోనికి అనే మార్గాన్ని చేబట్టిందని, వర్గపోరాటాన్ని వదలి, ఎన్నికల పోరాటాలకు వీలుగా పార్టి నిర్మాణాన్ని మార్చి వేసిందని, వాస్తవానికి కమ్యూనిస్టుపార్టి పార్లమెంటరీపార్టిగ మారిందని పేర్కొంది. అమృతసర్‌లో సోషల్ డెమాక్రటిక్ విధానాలను చేబట్టిందని విజయవాడ పార్టి కాంగ్రెసులో బ్రిటన్ నుండి తెచ్చుకొన్న జాతీయ ప్రభుత్వ నినాదాన్ని చేబట్టిందని విమర్శించింది. ఆ విధంగా బూర్జువా తోకపార్టీగ అయిందని నిందించింది. జాతీయ సమితి ఫిబ్రవరి 1963 తీర్మానం అక్టోబరు విప్లవకాలంలోని మెన్షివిక్కుల తీర్మానాన్ని గుర్తు చేస్తున్నదన్నది. విజయవాడ కాంగ్రెసుతో చురుకైన జాతీయతను చేబట్టి, కమ్యూనిస్టుపార్టీ జాతీయతాపార్టి అయిందన్నది. పార్టీని కార్మికవర్గం నుండి వేరుచేయుటలో విజయం పొందిందన్నది. పార్టీలోనికి అన్ని బూర్జువా సిద్ధాంతాలు ప్రవేశించాయి. పార్టి మధురై కాంగ్రెసు నుండి క్రమేణా మితవాద అవకాశవాదం వైపు పయనించి విజయవాడలో అంతర్జాతీయతను వదలి జాతీయ దురహంకారాన్ని

పార్టీ చేబట్టిందని విమర్శించింది. జాతీయ సమితి తీర్మానం మార్క్సిజాన్ని వదలి వేసిందన్నది. ఉద్యమ వర్గ ప్రాతిపదికను రూపుమాపి అన్ని ఆందోళనలు అసెంబ్లీలకు మార్చిలతో అంతం చేస్తున్నది. కార్మికపోరాట పంథాను వదలి, పెట్టుబడి దారులతో వారి ప్రభుత్వంతో అధికోత్పత్తికి సహకారాన్ని అందించింది" అని విమర్శించింది.

అదే కరపత్రం భవిష్యత్ కార్యక్రమాన్ని యీ క్రింది విధంగా వివరించింది. "పార్టి ప్రధానాధ్యేయం ప్రజాస్వామ్య సంఘటన నిర్మాణం. దీనికి ప్రాతిపదిక 1951 కార్యక్రమంగా స్పష్టం చేయబడింది. కార్మిక కర్షక మధ్యతరగతుల బుద్ధ జీవుల తదితర శ్రామిక జీవుల సంయుక్త సంఘటనయే ప్రజాస్వామిక సంఘటన. పార్టీ నిర్మాణాన్ని సరిదిద్దుటకు పార్టీలో మితవాదులకు నాయకత్వ బాధ్యతలను యివ్వరాదు. మితవాదాన్ననుసరించు నాయకత్వాలను తొలగించాలి. పత్రిక సంపాదక వర్గాన్ని మార్చుటగాని లేక మరో పార్టీ పేపరును ప్రారంభించుటగాని చేయాలి. వార లేక పక్షపత్రికలను ప్రారంభించి సిద్ధాంత పోరాటానికి శ్రీకారం చుట్టాలి. మితవాదాన్ని నిర్మూలించి పార్టీని పునర్మించుట యే ముఖ్యావసరము. పాత రాజకీయ విధానాన్ని పూర్తిగ మార్పుచేసి స్పష్టమైన రాజకీయ విధాన ప్రాతిపధికగా పార్టీని నిర్మించాలి. పార్టీలో మధ్య మార్గమనే ముసుగుతో రాజకీయ అవకాశవాదాన్ని చేబట్టి నెహ్రూని ప్రభుత్వాన్ని ప్రజాశికలను బలపరచే డాంగే వర్గాన్ని బలపరచేది, లేక దగ్గరి దగ్గరిగా బలపరచుట జరుగుచున్నది. కాని నిర్మాణరీత్యా డాంగేని వ్యతిరేకించుచున్నారు. వారు మార్పు ప్రతిఘటించుతు భ్రమలను కలుగజేస్తున్నారు. రాజకీయ సమస్యలను అతుకులతో గ్రూపుల వైఖరులతో లేక గ్రూపుల మధ్య అవకాశ వాద ఐక్యతతో సరిచేయ జాలమని స్పష్టంగా అర్థం చేసుకొనాలి. నూతన సంస్థను నిర్మాణం చేయవలసిన కాలమాసన్నమైంది. విప్లవ మార్క్సిజం ఆదర్శంగా బోల్షివిక్ దృక్పథంతో నూతన నాయకత్వాన్ని నిర్మించాలి"[1] అని కరపత్రం మరోపార్టిని నాయకత్వాన్ని నిర్మించుటకు పిలుపు నిచ్చింది.

పార్టి జాతీయసమితి పశ్చిమబెంగాల్‌లో రాష్ట్ర ఆర్గనైజింగ్ కమిటీని యేర్పాటు చేయుట.

ప్రభుత్వం కమ్యూనిస్టుపార్టిలో భేదాభిప్రాయాలను, కలతలను యెక్కువ చేయుటకుగాను పార్టిలో అతివాదులుగ ముద్రపడివున్న వారందరినీ, వారితోపాటు

---

1. చీలిక వాదులపై తీర్మానములు తదితర భారత కమ్యూనిస్టుపార్టీ జాతీయ సమితి పత్రాలు (అంగ్లంలో) 1964 న్యూఢిల్లీ ఏప్రిల్ 10-15, 1964. కమ్యూనిస్టుపార్టీ పబ్లికేషన్ పే. 75-77.

మరికొంతమందిని 700లు పైగా అరెస్టుచేసింది. అత్యవసర పరిస్థితిని ప్రకటించింది. పార్టీ యీ చర్యలను ఖండించుట యింతకుముందే తెలుసుకొన్నాము. అనేక రాష్ట్రాలలో అగ్రశ్రేణి నాయకత్వం అరెస్టు అగుటతో, రాష్ట్రాలలో పార్టీ కార్యక్రమం లేకుండా పోయింది. అంచేత పార్టీ జాతీయ సమితి ఫిబ్రవరి 12, 1963న పశ్చిమ బెంగాల్ పార్టీ అధికారాన్ని స్వీకరించుటకు తీర్మానించింది, తనకు సహాయకారిగా రాష్ట్ర ఆర్గనైజింగు కమిటీని యేర్పాటు చేసింది. పశ్చిమబెంగాల్ రాష్ట్ర పార్టీ సెంటరుగా అది పని చేయ ప్రారంభించింది. ఈ యేర్పాటు రాష్ట్ర సమితిలోని అత్యధిక మెజారిటి సభ్యులు అరెస్టు కావటంతో రాష్ట్ర ఆర్గనైజింగు కమిటీని యేర్పాటు చేయవలసి వచ్చిందని తీర్మానం వివరించింది. అప్పుడే జాతీయ సమితి ఆమోదించిన తీర్మానంలో జాతీయ సమితి తీర్మానాలను ఆచరణలో పెట్టుటకు కొంత మంది సహాయ నిరాకరణ చేయుటయేగాక, రాష్ట్ర సెక్రటేరియట్ పనిచేయుటకు ఆటంకపడుతూ, కొంతమంది రౌడీదౌర్జన్యచర్యలకు పాల్పడుతున్నారని, ముస్లిం ఇన్స్టిట్యూట్ హాలులో పార్టీ అధ్యక్షుడు జనరల్ సెక్రటరీ జనరల్ బాడీలో వుపన్యసించునపుడు కలకత్తాలో దుర్భాషలతో కూడిన అల్లరి ప్రదర్శనలను వుదహరించుతు పార్టి క్రమశిక్షణా రాహిత్యాన్ని పార్టి నిర్మాణసూత్రాల అతిక్రమణను తీర్మానం పేర్కొని గర్హించింది.

## అతివాదుల డెమోక్రటిక్ కన్వెన్షన్

జాతీయసమితి బెంగాల్‌లో రాష్ట్ర కమ్యూనిస్టు ఆర్గనైజింగు కమిటీని యేర్పాటుచేసి, పార్టీ విధానాన్ని అమలచేయుటకు ప్రతిగా. కమ్యూనిస్టుపార్టీలోని అతివాదులు 25 మంది అందులో 14 మంది పార్టీలో ప్రముఖ సభ్యుల పేరుతో పశ్చిమబెంగాల్ డెమోక్రటిక్ కన్వెన్షనుతో పాల్గొనమని కోరుతు పిలుపునిచ్చారు. కరపత్రంపై సంతకం చేసిన వారిలో రాష్ట్రమంతటా వ్యాపించిన వివిధ శాఖలకు చెందిన పార్టినాయకులు, రాష్ట్ర ఆర్గనైజింగు కమిటీకి వ్యతిరేకంగా యీ రాష్ట్ర కన్వెన్షన్‌కు పిలుపునిచ్చారు[1].

అత్యవసర పరిస్థితులలో ఆహారసంక్షోభం, పెరిగిన ధరల పరిస్థితులలో "ప్రజల నేటి కర్తవ్యం" విషయమై "చర్చలు జరుపుట, ధ్యేయంగా" కరపత్రంలో ప్రకటించారు రాష్ట్ర ఆర్గనైజింగు కమిటికి యీ ప్రకటన తెలిపిన వెంటనే సెక్రటరీ పార్టీ పత్రికలో కన్వెన్షన్ యేర్పాటులనుండి విరమించాలని ప్రకటించారు. అయినా సంతకాలు చేసిన వారిలో మెజారిటి, రాష్ట్ర ఆర్గనైజింగుకమిటి ఆదేశాలను తిరస్కరించారు. కొద్ది మంది మాత్రమే విరమించుకొన్నారు. ఈ కన్వెన్షన్ పిలుపు

1. భారతకమ్యూనిస్టుపార్టీ కేంద్రకార్యవర్గ సమితి, సెప్టెంబరు 1963 తీర్మానం (ఆంగ్లంలో) పే. 11-13.

రాష్ట్ర ఆర్గనైజింగు కమిటి "మహా విజ్ఞప్తి" ఢిల్లీకి "విస్తృత ప్రజానీకపుయాత్ర"కై నిర్మాణ కార్యక్రమాలలో మునిగియున్నపుడు యివ్వబడింది. సన్నాహకులలో అత్యధికులు "మహావిజ్ఞప్తి" "విస్తృత ప్రజానీకపు ఢిల్లీయాత్రకు" దూరంగా వున్నారు. అతివాదపార్టీలు, కమ్యూనిస్టుపార్టీ ఆర్గనైజింగు కమిటీ, ఐక్యప్రజావుద్యమాన్ని, పోరాటాన్ని నిర్మించుటకై మార్గాన్వేషణలోనే వున్నారు. ఇంకా నొక స్వరూపాన్ని మార్గానికి చేరువలో లేరు.

కన్వెన్షన్ రాజకీయ ఖైదీల విడుదలకు వుద్యమాన్ని నిర్మించుటకై వొక సన్నాహ కమిటీని ఎన్నుకొంది. అన్ని జిల్లాలలో కన్వెన్షనల్‌ను ప్రదర్శలను చేయుటకు నిర్ణయించింది.

భారత కమ్యూనిస్టుపార్టీ కేంద్ర కార్యవర్గంపై వాస్తవాలనుబట్టి డెమోక్రటిక్ కన్వెన్ష ప్రత్యామ్నాయ కేంద్రాన్ని యేర్పాటు చేయు ప్రయత్నంగా నిర్ణయించింది. శాశ్వత నిర్మాణంగా పనిచేయుటకు వొక కమిటీని ఎన్నుకొనుట అది ప్రజా వుద్యమాన్ని స్వతంత్రంగా నాయకత్వం వహించుట, వున్న ప్రజా సంస్థలకు భిన్నంగా పనిచేయుట ప్రత్యామ్నాయ పోటీ కేంద్రాన్ని నిర్మించుట తప్ప మరేమి కాదు. ప్రధాన ప్రజా సంస్థలను కన్వెన్షన్‌కు దూరంగా వుంచుట అది విస్తృత ఐక్య సంఘటనా నిర్మాణ ప్రయత్నంగా యెంచ జాలము. పార్టీ సభ్యులు, ప్రజా సంస్థల లోని సభ్యులు ప్రజా వుద్యమాన్ని నిర్మించునపుడు పార్టీ కమిటీలను ప్రజా సంస్థలను తప్పనిసరిగా సంప్రదించవలసి వున్నది. అట్టి ప్రయత్నం చేయకుండుట పార్టీ క్రమశిక్షణకు భిన్నము, వ్యతిరేకము. కన్వెన్షన్ "మహావిజ్ఞప్తి"ని విస్తృత యాత్రను పేర్కొనక పోవుటను కేంద్రకార్యవర్గం ఉపేక్షించి, తేలికగా చూడజాలదు.

వీటన్నిటి కారణంగా కేంద్రకార్యవర్గం కన్వెన్షన్ యేర్పాటు చేసిన సన్నాహ కమిటీలకు కార్యక్రమాలకు దూరంగా వుండాలని వెన్వెంటనే ఆజ్ఞాపిస్తున్నదని తీర్మానించింది. కన్వెన్షన్ సన్నాహకులు ఫిర్యాదులకు తమ సమాధానాలను రాష్ట్ర ఆర్గనైజింగు కమిటీకి పంపదలచుకొన్నచో పార్టీ యెట్టి చర్యలకు ఉపక్రమించక ముందే పంపకోరింది.

పార్టీ నిర్మాణ సమస్యలపై కొన్ని నిర్ణయాలు

జాతీయ సమితి ఫిబ్రవరి 1963 సమావేశంలో తదుపరి జూలై 1963 సమావేశంలో పార్టీ నిర్మాణ సమస్యలపై తీసుకొన్న నిర్ణయాలు పార్టీ చరిత్రను పూర్తిగ మరో మార్గం పట్టించాయి.

2)

జాతీయ సమితి ఫిబ్రవరి సమావేశంలో పార్టి సభ్యులలో పెరుగుతున్న క్రమశిక్షణా రాహిత్యాన్ని, విచ్ఛిన్నకర చర్యలను తీవ్రంగా పరిగణించుచున్నది పశ్చిమ బెంగాలులో అనేక మంది సభ్యులలో ప్రముఖ నాయకులలో యిది వ్యాపించింది. అనేక మంది సభ్యులు సానుభూతిపరులు అత్యవసర పరిస్థితుల కాలంలో అనేక ప్రాంతాలలో గణనీయంగా కర్తవ్య నిర్వహణ చేసినా, కొద్దిమంది రాష్ట్ర కేంద్ర నాయకత్వాలతో సహకరించలేదు. పార్టి అధ్యక్షుడు కలకత్తా ముస్లిం ఇన్‌స్టిట్యూట్‌లో జనరల్‌బాడి సమావేశంలో ఉపన్యసించినపుడు, కొద్దిమంది చేసిన అల్లరి గూండా చర్యలను మరపించుచున్నది.

భాధ్యత కలిగిన పార్టి సభ్యులు జరిపిన విచ్ఛిన్నకర చర్యలు పార్టీకి నష్ట దాయకమేగాక శతృవులకు సహాయకారియగుటతో సమితి విచారిస్తున్నది. ప్రతి పార్టి సభ్యుడు తమ చర్యలను ఫలితాలను తీవ్రంగా పరిగణించాలని పిలుపునిస్తున్నది. జాతీయ సమితి నిర్ణయాలను అమలు చేయమని విజ్ఞప్తి చేస్తున్నదని తీర్మానం స్పష్టం చేసింది.

జాతీయ సమితి జూలై 1963 తీర్మానంలో ఫిబ్రవరి సమావేశానంతరం రాజకీయాలను పరిణామాలను చర్చించింది. పార్టి నిర్మాణ సమస్యల యెడల ప్రత్యేక శ్రద్ధ వహించాలని కోరుతు, పార్టీ నిర్మాణ సూత్రాలను తప్పని సరిగా పాటించాలని ఆ విధంగా పార్టీని బలపరచాలని కోరింది. పార్టీ కాంగ్రెసు 1963లో జరుపుట సాధ్యం కాదని, సన్నాహాలు సాధ్యం కావని నిర్ణయించింది. సమితి జనరల్ సెక్రటరీ ఇ.యం. యస్. నంబూద్రిపాద్ సమర్పించిన రాజీనామాను అమోదించింది. అధ్యక్షుడే కార్యదర్శి బాధ్యతలను తాత్కాలికంగా నిర్వహించాలని నిర్ణయించింది. సెక్రటేరియట్‌లో యేర్పడిన ఖాళీలను భర్తీ చేయుట జరుగదని ప్రకటించింది.

జాతీయ సమితి జూలై 1963 తీర్మానంలో కంట్రోల్ కమీషన్‌ను యీక్రింది ఫిర్యాదులను విచారించ వలసినదిగా కోరింది.

i) "ప్రత్యామ్నాయ కేంద్రం "పార్టీలో పని చేయుటను విచారించి అవి పని చేయుటకు బాధ్యులైన సభ్యులు శాఖలపై తీసుకొనవలసిన క్రమశిక్షణా చర్యలను సూచించుట

ii) జూన్–జూలై 1963లో జాతీయ సమితి పేపరులో వచ్చిన ఫిర్యాదులు ప్రతి ఫిర్యాదులను విచారించి నివేదిక సమర్పించుట.

వీటికితోడు అక్టోబరులో జరిగిన జాతీయ సమితి యితర ఫిర్యాదులను గూడ విచారించ వలసినదిగా తీర్మానించింది.

iii) కాటూరు సర్వసభ్య సమావేశంలో, తదితర చోట్ల కామ్రేడ్ సుంద

రయ్య యిచ్చిన వుపన్యాసాలను పరిశీలించి, నివేదించవలయును. ఆ విషయమై కా. సుందరయ్య కా. రాజశేఖర్ రెడ్డి యివ్వదలచిన రిపోర్టులను రికార్డు చేయుట.

ఈ జాతీయ సమితి నిర్ణయాలు పార్టీలో యేర్పడిన సంక్షోభ పరిస్థితులకు ప్రతిబింబాలు. ఈ సంక్షోభాన్ని జనవరి 1964 జాతీయ సమితి తీర్మానాలలోను స్పష్టం కాగలదు.

జాతీయ సమితి జూన్, జూలై 1963లో "పశ్చిమ బెంగాల్ పార్టీ ఐక్యత" అనే తీర్మానాన్ని ఆమోదించింది. అందులో "రాష్ట ఆర్గనైజింగ్ కమిటికి వ్యతిరేకంగా కొంతమంది పోటీపార్టీ కేంద్రాన్ని యేర్పాటు చేయు దశకు వెళ్ళారని ఆ కేంద్రం 9 మార్చి 1963న జాతీయ సమితిని వ్యతిరేకించమని, రాష్ట్రి ఆర్గనైజింగ్ కమిటితో సహకరించక, పోటీ కేంద్రంతోనే సహకరించమని పార్టీశాఖలకు, సభ్యులకు సర్క్యులర్‌లో తెలియజేసిందని పేర్కొంది." జాతీయ సమితి పోటీ కేంద్రం పార్టీని చీల్చి, ప్రత్యామ్నాయ రాజకీయ తీర్మానాన్ని నిర్మాణ విధానాన్ని పశ్చిమ బెంగాల్ పార్టీకి వ్యతిరేకంగా యేర్పాటు చేయు ప్రాథమిక చర్య యని పేర్కొంది అంతేగాక అట్టి విచ్ఛిన్నకర చర్యలనుండి పార్టీశాఖ లన్నీ వైదొలగి పోటీపార్టీ కేంద్ర సర్క్యులర్, దాని సలహాలను వ్యతిరేకించమన తీర్మానం కోరింది దీని ననుసరించే పార్టీకేంద్ర సెక్రటేరియట్ 25 జూలై, 1963న పశ్చిమ బెంగాల్ శాఖలు సభ్యులనుద్దేశించిన లేఖలో ఫిబ్రవరి జాతీయసమితి సమావేశానంతరం కొంతమంది జాతీయ సమితిని వ్యతిరేకించుట, పార్టీ రూపాలను వ్యతిరేకించుతు విచ్ఛిన్నకర చర్యలను కొనసాగించుతునే వున్నారు. అంతేగాక వారు మరో మెట్టు ముందుకువెళ్ళి పోటీపార్టీ నిర్మాణం ప్రారంభించి సర్క్యులర్‌ను విడుదల చేయ ప్రారంభించారని" పేర్కొన్నారు. పార్టీ రూపాలను పునః ప్రతిష్ఠించి, ఐక్యతను పునరుద్ధరించే యీ ప్రయత్నాలన్నిటి ఫలితాలను జాతీయ సమితి అక్టోబరు 1963 సమావేశం "పశ్చిమ బెంగాల్‌లోని అనేక జిల్లా కమిటీలు, రాష్ట్రి కమిటీలోని మెజారిటీ సభ్యులు జైలునుండి వచ్చినవారు, పోటీపార్టీ కేంద్రాన్నిగాని స్త్రీ పార్టీ సభ్యుల యెడల అసహ్యంగా, రౌడీ ప్రవర్తనలను గర్హించుటగాని చేయకుండుటయేగాక గణనీయమైన పార్టీ ముఖ్యులు కేంద్రకార్యవర్గం సరిగా పోటీ పార్టీ కేంద్రాన్ని స్వతంత్ర ప్రజోద్యమాన్ని పార్టీనుండి వేరుగా నిర్మించే ప్రయత్నంగా నిర్వచించిన డెమోక్రటిక్ కన్వెన్షను యేర్పాటు చేయుటలో చురుకుగా పాల్గొన్నారు." అయినా జాతీయ సమితి పరిస్థితి మరింత విషమించే చర్య తొందరపడి చేయవద్దని పశ్చిమ బెంగాల్ పార్టీశాఖలకు సభ్యులకు హామీనిచ్చింది. అత్యవసర పరిస్థితితో యేర్పడిన తాత్కాలిక ఆర్గనైజింగు కమిటి నిరవధికంగా కొనసాగదని వారు స్వేచ్ఛగా ఎన్నుకొనే రాష్ట్రి కమిటి త్వరలో యేర్పడుతుందని హామీ

నిచ్చింది. "పశ్చిమ బెంగాల్‌లో అరెస్టు అయిన నాయకులందరూ విడుదల అయిన వెంటనే పూర్వ రాష్ట్ర కమిటి పునరుద్ధరించబడుతుందని అట్టి అధికారాన్ని జాతీయ సమితి కేంద్రకార్యవర్గానికి యిస్తూ" తీర్మానించింది.

"గత కొద్దికాలంలో జరిగిన వాటినన్నిటి దృష్టితో, పార్టీలో మెరుగైన పరిస్థితిని నెలకొల్పుటకు పశ్చిమ బెంగాలులో పార్టీ నడిపే అన్ని ప్రజోద్యమాలలో పార్టీలో ఐక్యతను రూపొందింపుటకు కేంద్రకార్యవర్గం రాష్ట్ర కమిటి సమావేశానికి తగిన చర్యలు గైకొనాలని పిలుపు నిచ్చింది. జాతీయ సమితి తీర్మానాల అమలుకు గాను పశ్చిమ బెంగాల్‌లో పోటీ పార్టీకేంద్రపు సర్క్యులర్‌ను, డెమోక్రటిక్ కన్వెన్షన్ గర్హించాలని" తీర్మానం కోరింది. కేంద్ర కార్యవర్గం రాష్ట్ర కమిటి పునరుద్ధరణానంతరం పార్టీ నిర్మాణ సూత్రాలలోని అన్ని అధికారాలను పొందగలుగుతుందని హామీ నిచ్చింది. జాతీయసమితి ఫిబ్రవరిలో చేబట్టిన బాధ్యతలను మాత్రము నిర్వహించు అవకాశాలను కలిగి వుంటుంది. రాష్ట్ర కమిటి అనుమతితోనే క్రమశిక్షణాచర్యలును పునః పరిశీలించగలదు"[1] అని తీర్మానించింది.

జాతీయసమితి జూలై 1963 సమావేశంలో నిర్మాణ సమస్యలతోపాటు ఫిబ్రవరి సమావేశానంతర రాజకీయ పరిణామాలను చర్చించి, కొలంబో ప్రతిపాదనలు నిరాకరింపబడుటతో యేర్పడిన ప్రతిష్ఠంబన, ఫలితంగా ప్రమాదభరిత పరిస్థితిని తీవ్రంగా పరిగణించింది. దీనిని బ్రిటిష్, అమెరికన్ సామ్రాజ్యవాదశక్తులు, దేశీయ మితవాద అభివృద్ధి నిరోధకశక్తులు తమ చర్యలను వుధృత పరచుటకు వినియోగించుకొన్నారు. సామ్రాజ్యవాద, దేశీయ అభివృద్ధి నిరోధకశక్తులు జాతీయ విధానాలను మితవాదంవైపు మళ్ళించుటకు, చివరకు అలీన, ప్రణాళికాబద్ధ అభివృద్ధి విధానాలను వెనుకకు కొట్టుటకు వినియోగించుతున్నారు. అంచేత, కొలంబో ప్రతిపాదనలను ఆమోదించక పోవుటతో యేర్పడిన ప్రతిష్టంబనను తొలగించుటకు, ఆరు కొలంబో రాజ్యాలు భారతదేశం-చైనాలు కొలంబో ప్రతిపాదనల వివరాలను వారి నుండి పొంది, సమావేశమై, సంప్రదింపులద్వారా వివాదాల పరిష్కారానికి రాయబారాలు ప్రారంభించాలని జూలై తీర్మానం కోరింది.

అధిక ధరలు, పెరిగిన పన్నులు, అవినీతి, లంచగొండితనమునకు వ్యతిరేకంగా, విదేశవ్యాపారం, ఆయిల్ పరిశ్రమ, బ్యాంకులను జాతీయం చేయాలని కోరుతు, "మహావిజ్ఞప్తి"పై సంతకాల వుద్యమాన్ని ముమ్మరంగా సాగించి, పార్లమెంటు యెదుట "మహాప్రదర్శన"ను జయప్రదం చేయాలని కోరుతు తీర్మానించింది.

1. జాతీయ సమితి కేంద్ర కార్యవర్గ తీర్మానములు జనవరి 1964 (ఆంగ్లంలో) సి.పి.ఐ. న్యూఢిల్లీ పే. 19-22,

జాతీయసమితి పార్టి చరిత్రకు ప్రాతిపదికగా వుండే సంక్షిప్తచరిత్ర రచనకు ఏడుగురు సభ్యులు గల వొక కమిషన్‌ను యేర్పాటు చేస్తు తీర్మానించింది.

జాతీయ సమితి నిర్ణయాలు కమ్యూనిస్టు పార్టిలో యేర్పడిన సంక్షోభ పరిస్థితులకు ప్రతిబింబాలు.

[సాధారణ పరిస్థితులను నెలకొల్పు దృష్టితో కేంద్రం విజ్ఞతతోనే జరుగనున్న శాశ్వతప్రమాదాన్ని, దాని తీవ్రతను గుర్తించి "దింపుడు కల్లాం" ప్రయత్నం పార్టీ చేసింది. కాని అప్పటికే కాలాతీతమై, ఎదిరిపక్షంలోని సుముఖ విజ్ఞుల చేతులనుండి పరిస్థితిజారిపోయిందని తదనంతర చరిత్ర స్పష్టం చేసింది. స్వీయమానసిక, వుద్రేక పరిస్థితులలో హిమాలయ మంతటి చెరపరాని హాని జరిగిపోయింది. రాజకీయ చర్చలు, సంప్రదింపులు, యిచ్చి పుచ్చుకొనే ధోరణిలో రాజీలతో పరిష్కరించవలసిన విషయాలను స్వీయమానసిక వుద్రేకాలకు లోనుగాక దూరదృష్టితో శాస్త్రీయమార్క్సిస్టులుగ వ్యవహరించజాలక పోవుటలోని వైఫల్యమే చారిత్రిక పొరపాటుకు కారణమై, చరిత్ర సరిచేయజాలని పరిస్థితి యేర్పడింది. చరిత్రనుండి వుద్భవించే పరిస్థితులు, రాజకీయ. శాస్త్రీయ భవిష్యత్ విజ్ఞులు దీనిని యెంతవరకు సరిచేయగలరో చరిత్ర నిర్ణయిస్తుంది.]

# (ii)

## ఆరోపణలు ప్రత్యారోపణలు

జాతీయ సమితి జూలై 1963 లో పార్టిలో విచ్ఛిన్నకర చర్యలను పరిశోధించి, పరిశీలించి నివేదిక సమర్పించవలసిందిగా కంట్రోల్ కమిషన్ కోరింది. కమిషన్ అధ్యక్షులు యస్ వి. ఘాటే, హజారి బేగం, పి. నారాయణ నాయర్‌లు సభ్యులుగా గలరు. కమిషన్ నివేదికను 8 ఏప్రిల్ 1964న సమర్పించగా, జాతీయ సమితి ఆ నివేదికను పరిశీలించి 9 ఏప్రిల్ 1964న ఆమోదించింది. కమ్యూనిస్టు పార్టికి యిట్టి పరిశీలనా, విచారణ అనుభవాలు గతంలో లేనందున, ఆగస్టు 1962 నిర్మాణ తీర్మానంలో పునరుద్ఘాటించబడిన, నిర్మాణసూత్రాల దృక్పథమే దీనికి మార్గదర్శకమైంది. ఢిల్లీలో 26 జూలై 1963లో జరిగిన ప్రథమ సమావేశంలో విచ్ఛిన్నకర చర్యలు జరుగుచున్నవని చెప్పబడిన రాష్ట్రాలలోని ప్రాంతాలను సందర్శించి సమాచారం సేకరించ నిర్ణయించారు. రాజకీయ, సిద్ధాంతభేదాభిప్రాయాలు పరిగణించక వివిధ కామ్రేడ్స్‌ను ఆహ్వానించి నేరుగ సమాచారాన్ని సేకరించారు. నింద

ప్రతినిందలను, వాదన ప్రతివాదనలను తదుపరిదశలో సెక్రటేరియట్, కేంద్ర కార్యవర్గ సభ్యులనుండి సేకరించాము, విచారణ సాగించాము. ఆగస్టు సెప్టెంబరు డిశెంబరు 1963ల మధ్యభాగంలో మద్రాసు, కేరళ, ఆంధ్ర, బొంబాయి, పశ్చిమ బెంగాల్, బీహార్, ఉత్తరప్రదేశ్ రాష్ట్రాలలో పర్యటించి పలువురను కలుసుకొని విషయసేకరణ చేసాము. పంజాబ్ యితర ప్రాంతాలవారిని ఢిల్లీలోనే కలుసుకొన్నాము. మొత్తం మీద 450 మందిని ఇంటర్వ్యూ చేసాము. అనేకమంది యితరులు తమ స్టేటుమెంటులను పంపారు. మా యీ విచారణలో తమ సిద్ధాంత అభిప్రాయాలను పాటించక అందరూ సహకరించారు. కాని కొద్దిమంది కార్యవర్గసభ్యులతో సహా సహకరించ నిరాకరించారు.

విచారణ సమయంలో రెండు పక్షాల ప్రేక్షక ప్రతినిధులను అనుమతించి, వారు క్రాసు పరీక్షచేయుటకు అంగీకరించాలన్న దానిని కమిషన్ నిరాకరించింది. కమిషన్ విచారణ సందర్భంలో పార్టి పని విధానంలోని అనేక తప్పులను కూడ మా ముందుంచారు. వాటి నన్నిటిని నివేదికలో చేర్చుటసాధ్యము కాదని కంట్రోల్ తెలిపింది.

## కంట్రోల్ కమిషన్ నివేదిక

కమిషన్ తన నివేదికను, వివిధ కాలాలలో పార్టిలోని విచ్ఛిన్నకర చర్యలు, ఫిర్యాదులు ప్రతి ఫిర్యాదుల పరిశీలన, ముగింపు వ్యాఖ్యలు అనే మూడు విభాగాలుగ అధ్యయన సౌకర్యం కొరకై చూడవలసి వుంది. పార్టిలో పోటీ కేంద్రం పనిచేయుటపై, ముందే కొంత తెలుసుకొన్నా నూతనాంశాలను చూడవలసి వుంది.

i) కమ్యూనిస్టుపార్టిలోని అతివాదుల 'పార్టి పోటీ కేంద్రం' డిశెంబరు 1962 నుండి ఏప్రిల్ 1963 వరకు ప్రధానంగా రహస్యంగా పనిచేసింది. వారి నవ ఢిల్లీ సమావేశంలో రూపొందించిన రాజకీయ, నిర్మాణ విధానాలను ఆచరణలో వారి స్థానాలను బలపరచుకొనుట జరిగింది. జాతీయ సమితిపై దాడిచేస్తు, దాని అధికారాన్ని తిరస్కరించాలని పార్టీ సభ్యులకు సర్క్యులర్‌ను జారీ చేసింది. హిందీ సర్క్యులర్ నం. [1] "సంస్కరణవాద ముఠా అంతర్జాతీయ కార్మికపంథాను విడనాడి గుడ్డి జాతీయవాదాన్ని చేబట్టి, ద్రోహం చేసిందని[1]" వుదాహరణకు "జాతీయసమితి నవంబరు 1, తీర్మానం" అని ప్రచారం చేసింది.

పార్టీ పోటీకేంద్రం భారత-చైనా సరిహద్దు సమస్యపై "నెహ్రూ సిద్ధాంతంపై మరి కొంత వివరణ", "సంస్కరణవాదపు ప్రతిబింబం", "ఆఫ్రో-ఏసియన్

---

1. సెంట్రల్ కంట్రోల్ కమిషన్ రిపోర్టు టు నేషనల్ కౌన్సిల్. రిజల్యూషన్స్ ఆన్ స్ప్లిటర్స్-1961 సి. పి ఐ పబ్లికేషన్. హిందీకరపత్రం నుండి 37 పేజీలోని ఉదహరింపు.

రాజ్యాల అధినేతలకు చౌయెన్‌లై వ్రాసిన లేఖ" అనే చైనావార్తా సంస్థ ప్రకటించిన వాటిని పంపిణీచేసింది. వీటినేగాక చాలా సాహిత్యాన్ని విస్తృతంగా పంపిణి చేసింది. ఈ కాలంలో పోటీ కేంద్రపు చర్యలు ప్రధానంగా బెంగాలులో కేంద్రీకరించబడినవి.

బెంగాల్ పార్టీ దినపత్రికలోని పెక్కురచయితలు మూకుమ్మడిగా రాజీనామాచేసి, జాతీయ సమితి విధానాన్ని అమలు చేయ నిరాకరించారు. అరెస్టులు కారణంగా పునర్మించబడిన రాష్ట్రి సెక్రటేరియట్ అధికారాన్ని గుర్తించ నిరాకరించి, సహాయ నిరాకరణ చేసారు. జాతీయ సమితి విధానాన్ని వివరించే అన్ని ప్రయత్నాలను ప్రతిఘటించారు. 'స్వాధీనత'ను ఆపివేయ ప్రయత్నించారు.

బెంగాల్ పార్టీలో సంక్షోభం తీవ్రస్థాయికి చేరగా, జాతీయ సమితి తన అధ్వర్యంలోనికి తీసుకొని, తాత్కాలిక అర్గనైజింగు కమిటిని, కేంద్రం నుండి భూపేష్ గుప్తా, గోవిందన్ నాయర్‌లను సలహాదారులుగ నియమించి, పార్టీ కార్యక్రమాలను కొనసాగించింది. పోటీపార్టీ రహస్యకేంద్రం, జాతీయసమితి, కేంద్ర సెక్రటేరియట్ రాష్ట్రిఅర్గనైజింగు కమిటిని గుర్తించ నిరాకరించండని, నూతన సర్క్యూలర్‌లో సూచనల నిచ్చింది. తదనంతర పరిణామాలు, ఆచరణలో యిది స్పష్టమైనవి.

ఆంధ్రప్రదేశ్‌లో పార్టీ దినపత్రిక సభ్యులు మూకుమ్మడిగా రాజీనామాలు యిచ్చుట, బెంగాల్ పరిస్థితి పునరావృతం కాకుండా, రాష్ట్రికమిటి చర్యలుగైకొని విచ్ఛిన్నాన్ని అరికట్టింది. అతివాదవర్గాలు నాయకత్వంలో వున్న జిల్లాలలో నవంబరు తీర్మానానికి వ్యతిరేకంగా వున్నందున, ఆ తీర్మాన వివరణ ప్రయత్నాలు జరుగలేదు.

ఢిల్లీలో పార్టీ పోటీ కేంద్రం పనిచేస్తూ వురుదులో జాతీయసమితి, రాష్ట్రి సమితులపై దాడిచేస్తూ పార్టీ యేర్పాటుచేయు సమావేశాన్ని వమ్ముచేయమని కోరుతు సర్క్యూలర్ విడుదల చేసింది. సైద్ధాంతిక సమాచారమంటూ పార్టీ వ్యతిరేక సాహిత్యాన్ని పంపిణి చేసింది.

జాతీయ సమితి నవంబరు తీర్మానం 'లక్ష్మణరేఖగానై' జైళ్ళలోవున్న కమ్యూనిస్టు నాయకుల, సభ్యుల ఒకే జనరల్‌బాడి సమావేశాలు జరుగుటలేదు. రెండు వర్గాలు విడివిడిగా వుంటూ, సమావేశాలు జరుపుకొనుట జరుగుతున్నది.

ii) పోటీపార్టీకేంద్రం, అత్యవసర పరిస్థితుల తీవ్రత తగ్గి మామూలు పరిస్థితులు యేర్పడుటతో ఏప్రిల్ నుండి ఆగస్టు 1963 కాలంలో కొంత వరకు బహిరంగంగానే పని చేయ మొదలు పెట్టింది. భారతకమ్యూనిస్టు పార్టీ కేంద్ర కార్యవర్గపు ఏప్రిల్ 16. 1963 సమావేశానంతరం, వెంటనే పోటీకేంద్రం పరిస్థితిని సమీక్షించి, కొలంబో ప్రతిపాదనలు, బై ఎలక్షన్ సమస్యలపై పార్టీ కేంద్రకార్యవర్గం తీసుకొన్నవైఖరిని, ఆ సమావేశంలో నంబూద్రిపాద్, గోపాలన్‌లు తీవ్రంగా

విమర్శించి, తీసుకొన్న వైఖరిని మినహాయింపులు లేకుండా బలపరచింది. సమీక్షలోటి కార్యాచరణ భాగంలో "మనవైపు పార్టీవర్గాలను మనవైపుకు ఆకర్షించుటకు, నేటి నాయకత్వాన్ని వొంటరిగా చేయుటకు మనం చురుకుగా పనిచేయాలి[1]" అని పేర్కొన్నారు

పై సూచన ననుసరించి కా. గోపాలన్ బెంగాల్, ఆంధ్రప్రదేశ్, కేరళలలో విస్తృతంగా పర్యటించి, ఆయా రాష్ట్ర, జిల్లా కమిటీలకు సంబంధం లేకుండా అనేక ప్రత్యేక అహ్వానితుల జనరల్‌బాడి సమావేశాలలో పార్టీ అంతర్గత భేదాభిప్రాయాలపై వుపన్యసించుతు, పోటీ నిర్మాణాలకు ప్రాతిపదికలను యేర్పరచారు. జాతీయ, సమితి రాజకీయ విధానాన్ని గురించి చెప్పలేదు. ఈ కాలంలోనే జనశక్తి, తగ్గీర్ చింత, దేశ హితైషి వారపత్రికలను తెలుగు తమిళం, మళయాళం, బెంగాలీ భాషలలో పోటీ కేంద్రాల అధ్వర్యంలో ప్రారంభించబడినవి గోపాలన్ ఈ పత్రికలతో దగ్గిర సంబంధాలు పెట్టుకొని, వీటి మధ్య సమన్వయానికి కృషిచేసారు. జాతీయ సమితి గోపాలన్‌ను బెంగాల్ డెమోక్రటిక్ కన్వెన్షన్‌లో పాల్గొనవలదని స్పష్టంగా సూచనను యిచ్చినా పార్టీకి వ్యతిరేకంగా పాల్గొన్నారు. ఈ సమస్యను అక్టోబరు జాతీయసమితి సమావేశం చర్చించింది.

రెడ్‌ఫ్లాగ్ సంపాదకీయం "అందరిశత్రువు వ్యతిరేకంగా అంతర్జాతీయకార్మిక వర్గ ఐక్యత"ను "అభిప్రాయభేదాభిప్రాయాలు ఎప్పటినుండి?" ఘోరెజ్‌కు సమాధానం "టోగ్లియాటికి మాకు గల అభిప్రాయభేదాల గురించి మరికొంత సమాచారం", "సోషలిస్టు పక్షంలో చీలిక" తదితర సాహిత్యాన్ని వివిధ భాషలలో పోటీకేంద్రం అనుచరులతో పంపిణీ చేయబడినది.

"నేటి పరిస్థితి కమ్యూనిస్టుపార్టీ రాజకీయ విధానం" అనే బెంగాలీ 64 పేజీల సిద్ధాంతపత్రం, ప్రత్యామ్నాయ వేదిక సిద్ధాంత రాజకీయపంథాను వివరించుతు "కౌటిల్యరచయిత ఎత్తుగడలపంథా, దాని అములకై వివిధ దశలలో అనుసరించవలసిన నిర్మాణాంశాలు వివరించబడినది. మరో 36 పేజీల బెంగాలీ కరపత్రం, పృధ్వీ రాజ్‌చే రచింపబడినది చిత్తు రాజకీయ తీర్మానం, మే 1963లో, ప్రత్యామ్నాయ పంథా అనుసరించు వారి చర్యల నిమిత్తం ప్రచురించబడింది.

కామ్రేడ్ డాంగే నాయకత్వంపై చైనా ప్రెస్, రేడియో తీవ్రవాదిని తిరిగి తిరిగి చేస్తూ "నిజమైన మార్క్సిస్టులు" నాయకత్వంపై తిరుగుబాటుకు పిలుపునిచ్చుట, పార్టీలోని అంతర్గత పరిస్థితిని మరింత అధ్వాన్నం చేసింది. ఈ బహిరంగ విజ్ఞప్తుల నుండి, సూచనలను పొంది తప్పుడు నినాదాలను పార్టీ నిర్మాణ విష

1. రిజల్యూషన్ ఆన్ స్ప్లిటర్స్ (ఆంగ్లంలో) 1964 సి. పి. ఐ. పబ్లికేషన్ కంట్రోల్ కమిషన్ రిపోర్టులో పే. 41లోని ఉదహరింపు.

యాలలో క్రమశిక్షణ చేబట్టి పార్టీ వర్గాలలో విస్తృతంగా ప్రచారం చేయుట జరిగింది. అట్టి నినాదాలలో కొన్ని: పార్టీ కమిటీల క్రమశిక్షణను ప్రజావుద్యమాలలో పాటించాలి కాని సిద్ధాంత, రాజకీయ సమస్యల విషయాలలో కాదు: నేటి మైనారిటియే రేపటి మెజారిటీ, కాన మెజారిటి నిర్ణయాలను లెక్కచేయరాదు, ఆదర్శం ధ్యేయం, ఐక్యత, విధానం లేక పద్ధతి, ధ్యేయం సాధించలేనపుడు విధానాల మంచి యేమిటి? ఒకే వొక పార్టీ లేదు. రెండు ప్రాక్షనులు మాత్రం వున్నాయి, కాన పార్టీ చందా లేదు, ఆమోదించుట అనే ప్రశ్నయేలేదు పార్టీ సభ్యులంచరిని యీ విచ్ఛిన్న కర నినాదాల నుండి హెచ్చరించవలసిన అవసరముంది.

iii) ఈ, సెప్టెంబరు 1963 తదనంతర కాలంలో పోటీ కేంద్రపు కార్యకలాపాలు మరింత బహిరంగంగా జరిగాయి. నవంబరు 1962 ఢిల్లీ జాతీయ సమితి మీటింగుకు హాజరైన ఆంధ్రప్రదేశ్,మద్రాసు, డిటెన్యూలు కొందరు ఆగస్టు 1963లో విడుదల చేయబడ్డారు. పోటీ పార్టీ కేంద్రం వీరిలో కొంతమందితో బలాన్ని చేకూర్చు కొంది.

ఈ పార్టీ పోటీకేంద్రం, పరిస్థితిని సమీక్షించి, తమ అంచెనాలు అనేకం తప్పు అయినవని గుర్తించి, "సామ్రాజ్యవాదంపై భారతదేశం ఆర్థిక సైనికంగా ఆధారపడినా, దాని తొత్తుగా నిర్వచించుట తప్పిదమని", "మితవాదం వైపు పయనించినా, ప్రజాస్వామ్యాన్ని త్రోసిపుచ్చలేదని, పాశిస్టు లేక అర్ధ పాశిస్టుగా పేర్కొనుట అవాస్తవం" అని తిరిగి అంచెనా వేసింది.

ఈ పార్టీలో ఎట్టి అంతర్గత చర్చలు కొనసాగించుటకు అవకాశం లేదని పూర్వసూత్రీకరణలకు మార్పులు చేర్చారు. ఇప్పటి అవగాహన "బహిరంగ చట్టబద్ధకార్యకలాపాలకు, అంతర్గత చర్చలకు అవకాశముందని" మార్చుకొన్నారు. పార్టీ సభ్యులు సభ్యత్వాన్ని పునరుద్ధరించుకొననక్కరలేదనే పూర్వనిర్ణయాన్ని తిరగతోడి సభ్యత్వాన్ని పునరుద్దరించుకొమ్మని, కొత్తమెంబర్లను చేర్పించమని సూచించారు.

మారిన పరిస్థితుల వెలుగులో "రహస్య" "సెమీరహస్య" పనివిధానాన్నుండి "చట్టబద్ద", "సెమీచట్టబద్ద" కార్యాచరణను చేబట్టారు. కాని జాతీయసమితి పూర్తి సంస్కరణవాదంలో వుందనే అంచెనాలో" మార్పులేదు.

పశ్చిమబెంగాల్‌లోని జైళ్ళలో, బయటవున్న అతివాదులలోని అభిప్రాయ భేదాలు సమీక్షసలను తీవ్రంగా కలవరపరచాయి. అయితే మితవాదాన్ని శక్తివంతంగా పోరాడుట అవసరమన్నారు.

ఈ నూతన అవగాహనలతో, సైద్ధాంతిక, కార్యక్రమ, ఎత్తుగడల సమస్యలపై అంతర్గత చర్చల నిమిత్తం తమ ప్రతిపాదనలను రూపొందించారు. వీటిని మార్చు

చేసి 17మంది పేరుతో అక్టోబరు 1963 జాతీయ సమితి సమావేశంలో ప్రతిపాదించారు," అతివాద శక్తులను సమీకరించి బలపరచు కార్యక్రమాన్ని కొనసాగిస్తామంటూ తమ లక్ష్యాన్ని స్పష్టం" చేసారు. పోటీ కేంద్రపు కార్యకలాపాలు వివిధ స్థాయిలలో కొనసాగాయి. ఇది బహిరంగంగా బెంగాల్ 24 పరగణాలలోను, ఆంధ్రలో నెల్లూరులో పోటీ కమిటీలను యేర్పాటు చేయుటలో స్పష్టం అయింది.

జాతీయసమితి బెంగాలులో డెమోక్రటిక్ కన్వెన్షనలలో పాల్గొనరాదని, వాటిని యేర్పరచరాదని సూచించినప్పటి సెప్టెంబరు 1963లో కలకత్తాలో రెండవది డిశంబరులో జరిగినదానిలో కేంద్రకార్యవర్గసభ్యులు యిద్దరు చురుకుగా పాల్గొన్నారు. విడుదల అయిన వెంటనే కా. సుందరయ్య సెప్టెంబరు 1963లో ఆంధ్ర ప్రదేశ్‌లో రాష్ట్ర సమితి అనుమతి వ్రాత నివేదిక ప్రాతిపదిక లేకుండా పార్టీలోని భేదాభిప్రాయాలను అనేక జనరలుబాడీ సమావేశాలలో వివరించుట జరిగింది. అదే విధంగా బొంబాయిలో కా. గోపాలన్ అనేక జనరల్‌బాడీ సమావేశాలలో ప్రత్యామ్నాయ రాజకీయ నిర్మాణ విధానాలను ప్రచారం చేసారు.

"కంట్రోల్ కమిషన్" పోటీ కేంద్రపు" కామ్రేడ్స్ వారి కార్యాచరణ ద్వారా జాతీయసమితి పార్టీ క్రమశిక్షణను పార్టీ అంతర్గత చర్చల సూత్రాలను, ప్రాథమిక పర్యవేక్షణ సూత్రాలను అతిక్రమించారని మేము నమ్ముతున్నా"మని నివేదించాడు. సంగ్రహంగా కొన్నిటిని యిలా పేర్కొన్నారు.

1. పార్టీ నిర్మాణ సూత్రాలలోని 17 అధికరణాన్ని అతిక్రమించారు. రెండు అఖిల భారత కాంగ్రెసుల మధ్య జాతీయ సమితికి సర్వ అధికారాలు కలిగియుండుటను అదే పార్టీ క్రమశిక్షణను, రాజకీయ విధానాన్ని అమలు చేయు బాధ్యత వహిస్తుందని స్పష్టంగా చెప్పబడింది. పార్టీ కార్యాచరణ ను నిర్ణయించు అధికారాన్ని కలిగి వుంది.

2. హైదరాబాద్ జాతీయ సమితి సమావేశంలో నిర్ణయాలనంతరం మైనారిటీ మెజారిటీ ఆమోదించిన విధానానికి కట్టుబడి వుండాలనే తీర్మానాన్ని తదితర నిర్మాణ తీర్మానాలను అతిక్రమించారు.

3 పార్టీ నిర్మాణ సూత్రాలలోని 31 అధికరణము పార్టీ అంతర్గత చర్చలు జరుపు విధానాన్ని సూత్రాలను స్పష్టంచేసియున్నవాటిని వ్యతిరేకించారు.

ఈ ప్రధాన పార్టీ సూత్రాల అతిక్రమణతోపాటు, యితర అతిక్రమణలను కంట్రోల్ కమిషన్ నివేదిక పేర్కొన్నది.

ఆరోపణలు ప్రత్యారోపణలు

జాతీయ సమితికి వచ్చిన ఫిర్యాదులు లేక ఆరోపణలు, సమాధానాలు, ప్రతి

ఫిర్యాదులు లేక ప్రత్యారోపణలు, సమాధానాలు పరిశీలన గావించి కంట్రోల్ కమీషన్ చేసిన వ్యాఖ్యలను సంగ్రహంగా తెలిసికొనవలసియున్నది.

1. కమ్యూనిస్టుపార్టీ పోటీ కేంద్రంపై కా. గోవిందన్ నాయర్, యోగీంద్ర శర్మలు "అఖిలభారత కిసాన్‌సభ కేంద్రాన్ని దాని అధ్యక్షుడుగా వున్న కా. గోపాలన్ ప్రాక్షన్ పార్టీ కేంద్రంగా చేసారనుటకు గట్టికారణాలు కన్పడుతున్నవి. అ. భా. కిసాన్‌సభ కేంద్రం వాస్తవానికి మూసివేయబడినది. దాని కాడర్లు, వనరులు పోటీ కేంద్రపు కార్యకలాపాలకు వినియోగపడుతున్నవి. కిసాన్‌సభ అధ్యక్షుడుగా కా. గోపాలన్ వివిధ రాష్ట్రాలలో పర్యటించుచు జాతీయ సమితిపై నిందా ప్రచారం సాగించుచున్న వర్గాల కామ్రేడ్స్‌ను రహస్యంగా కలుసుకొంటున్నారు.

ఈ ఆరోపణకు కా. గోపాలన్ సమాధానమిస్తూ "పోటీకేంద్రంగా చెప్పబడేది కొంతమంది నాయకత్వ కామ్రేడ్స్ "ఊహలలోనే వుందని, నారాష్ట్రంలోని అనేక మందికి డాక్యుమెంట్సు పోస్టులో అందినవని తనకు తెలుసునని, వాటితో నాకేమి సంబంధం?" అని ప్రశ్నించారు. అది పోటీ పార్టీ కేంద్రం పనిచేస్తుండుటకు రుజువు ఎలా అగుతుంది. కొంతమంది కామ్రేడ్స్ మాప్రతిష్టను భంగపరచుటకు, ఆ సర్క్యులర్సును లేఖలను వుత్పత్తిచేసి వుంటారని తాను అనుకొంటున్నానన్నారు. పార్టీ పోటీ కేంద్రం అనే దుష్ప్రచారం పార్టీ కాంగ్రెసు నిర్ణయాలను అనుసరించు వారిని పార్టీ వర్గాలను భయపెట్టుటకు వుద్దేశించిందని వ్రాసారు.

కమిషన్ నివేదికలో అనేక సర్క్యులర్స్ డాక్యుమెంట్సు టైపు, సైక్లోస్టైలువి అచ్చువేసినవి వివిధ భాషలలోని కరపత్రాలను సాహిత్యాన్నీ ఒకేరకపు అభిప్రాయాలు కలవారికి పంపకంచేయుటను ప్రస్తావించాం. అవన్నీ పార్టీలో పోటీ కేంద్రం పని చేయుటను రుజువు చేస్తున్నవి. వీటి సమక్షంలో కా. గోపాలన్ "కొంతమంది కామ్రేడ్స్ వూహాగానం లోనే పోటీకేంద్రం పనిచేస్తుందనుట ఆధార రహితమేగాక అసంగతము.

బెంగాలులో "స్వాధీనత" పత్రికనుండి రాజీనామాచేసి పోటి "దేశహితైషి" పత్రిక స్థాపించినవారితోను కా. నిరేన్‌ఘోష్, మెహిత్‌మైత్రాలతోను ఆంధ్ర ప్రదేశ్‌లో విశాలాంధ్రనుండి రాజీనామాచేసి "జనశక్తి"నిప్రారంభించిన డి.వి సుబ్బారావు తదితరులతోను, తమిళనాడు కేరళలలో "తక్కీర్" "చింతన" పోటీ పత్రికలు పెట్టినవారితో కా. గోపాలన్ దగ్గరి సంబంధాలను పెట్టుకొన్నారు ఈ పత్రికలన్నీ ప్రత్యామ్నాయ వేదిక పత్రికలు.

ii) కా. పి.సి. జోషి తన స్వంతపేరున మార్క్సిస్టు మాసపత్రిక "ఇండియన్‌పాత్‌ను" ప్రారంభించుటను కా. గోవిందన్ నాయర్, యోగీంద్రశర్మలు ప్రస్తా

వించారు. ఆ పత్రిక ప్రారంభింపబడనందున ఆ విషయం అంత ముఖ్యమైనది కాదు అని కమిషను త్రోసిబుచ్చింది. కేంద్ర కార్యవర్గపు అనుమతి లేకుండా పత్రిక ప్రారంభించుట సహకారాన్ని అభ్యర్థించుట పార్టీ ఆమోదించజాలదు.

iii) ఆంధ్రరాష్ట్ర కమ్యూనిస్టుపార్టీ సెక్రటేరియట్ కా. గోపాలన్ రాష్ట్ర కమిటీని చీకటిలో వుంచి, యం. పి ద్వారా తన పర్యటనా కార్యక్రమం సాగించి, ఫ్రాక్షన్ చర్యలను సాగించి ముఠాలను యేర్పాటు చేయుట కుపక్రమించారు. పోటీ కేంద్రాలను నడుపుతున్నవారిని కలుసుకొన్నారు. పార్టీ బహిష్కృతులను కలుసు కొన్నారు.

iv) తమిళనాడులో "కా. గోపాలన్ తన పర్యటనలను ముఠా ఫ్రాక్షన్ కార్యక్రమాలకు యినుమడింపజేయుటకు వినియోగించారని, రహస్య జనరల్ బాడీ సమావేశాలలో జాతీయ సమితి తీర్మానాన్ని వ్యతిరేకించి మాట్లాడాడని కా. మనవి కందస్వామి, యస్.కె. కృష్ణనులు ఆరోపణల నోటు సమర్పించారు.

v) కా. గోవిందన్ నాయర్, యోగీంద్రశర్మలు నోటులో "మిర్రర్ ఫర్ రివిజనిస్టు్స" రివిజనిజం అండ్ డాగ్మాటిజం ఇన్ ది కమ్యూనిస్టు పార్టీ ఆఫ్ ఇండియా అను రెండు పత్రాలు పోటీ కేంద్రపు వేదిక సైద్ధాంతిక, నిర్మాణ పత్రాల య్యాయి. పోటి పార్టీ కేంద్రం విడుదల చేసిన పోల్చి పరిశీలించిన పైనిర్ణయానికి వచ్చుట తథ్యము.

కా. నంబూద్రిపాద్ యీ విషయాన్ని తనపై ఆరోపణగా తీసుకొన్నారు. కాని అందులో అట్టిదేమీలేదు. దాని పంపకానికి నంబూద్రిపాద్ బాధ్యుడని పేర్కొ నుట గాని, సూచించుట గాని జరుగలేదు. అందులోని పేజీలను, వివరణలతో పోటీ కేంద్రం పర్యవేటు చేయుట మాత్రం వాస్తవం. అది డిల్లీ కేంద్రం నుండి లేఖతో పాటు వివిధ రాష్ట్రాలకు పంపబడింది జాతీయ సమితి నంబూద్రిపాద్ డాక్యుమెంటు లోని అంశాలను ప్రత్యేక తీర్మానంలో ఖండించి, త్రోసిబుచ్చుటను యెక్కడా పేర్కొనబడలేదు.

కంట్రోల్ కమిషన్ కా. గోపాలన్‌ను తనపై ఆరోపణలకు హాజరై సమా ధానాలను యివ్వవలసినదిగా కోరినా "మీరు కోరిన విధంగా మిమ్ములను కలుసుకొ నుట వలన యెట్టి ప్రయోజనములేదని, నేను చెప్పదలచుకొన్నది జాతీయసమితికి, కార్యవర్గానికి వివిధ సందర్భాలలో నా నోటులలో తెలియపరచానని, 31 డిశెంబరు 1963 న తెలియజేసారు. ఆరోపణలపై కా. గోపాలన్ యిచ్చిన సమాధానాలతోపాటు చేయబడిన ప్రత్యారోపణలను, వివరములతో నిరూపించవలసినదిగా కోరినపుడు నిరాకరించారు అని కమిషన్ తెలిపి, స్పష్టంగా చేసాడనుకొన్న ఆరోపణలను మాత్రం ప్రస్తావించింది.

i) కా. గోవిందన్ నాయర్, యోగీందర్ శర్మల ఆరోపణలనోటు 22 జూన్ 1963 అమృత్ బజార్ పత్రికలో వచ్చింది. ఆ నోటు కేంద్ర కార్యవర్గ సభ్యులకు కూడ సర్క్యులేటు చేయలేదు.

శెక్రటేరియట్ సు॥ యీ విషయమై ప్రశ్నించగా వారు యే పత్రికా విలేఖరి తోను ఆ నోటు విషయం ప్రస్తావించలేదన్నారు. కేంద్ర కార్యవర్గ సమావేశానికి ముందు ఢిల్లీలో సోమనాథ లాహిరితో మామూలుగ పేర్కొనుట జరిగిందని కా. యోగీందర్ శర్మ అన్నారు. కా. లాహిరి యే పత్రికా విలేఖరితో గాని, మరెవ్వరితో గాని అనలేదని ఖండించారు. స్పష్టంగా యీ లీకేజి యెక్కడ నుండి, యెలా వచ్చింది తెలియకుండా వున్నదని కంట్రోల్ కమిషన్ వ్యాఖ్యానించింది.

కా. గోపాలన్, "ఈ ప్రశ్నను శెక్రటేరియట్‌లో సభ్యులిద్దరూ లేవనెత్తినచో నా సమక్షంలో చర్చించి, నేనేమి చెప్పేది విని, అవసరమైన నిర్ణయాలను చేసివుండ వలసింది." అని అన్నారు.

కమిషన్ "శెక్రటేరియట్, వ్యక్తి బాధ్యతలతో సమష్టిటీమ్‌గా పనిచేస్తుంది. అన్న నివేదికలు, ప్రతిపాదనలు కార్యవర్గానికి తప్పనిసరిగా శెక్రటేరియట్ నుండి రావలసి వున్నది, కాని వ్యక్తులైన సభ్యుల నుండి నేరుగా కాదు

కార్యాచరణ రూపంలో పనిచేయుటకు యేమాత్రం శ్రద్ధచూపలేదు. ఈ తీవ్రలోపాన్ని యెంతత్వరగా సరిచేసుకొంటే పార్టీ నిర్మాణానికి, పార్టీకి అంత మంచిది.

కా. గోవిందన్ నాయర్, యోగీందర్ శర్మల నోటు కొన్ని ప్రధానసమస్యను లేవనెత్తింది. వారి యూనిట్ అయిన కేంద్రకార్యవర్గ సభ్యులు వొకరి కంటే యెక్కువమందిపై వ్యాఖ్యలు చేసింది. కేంద్రకార్యవర్గంలోనే దానిని ముందుగా చర్చించి వుండవలసింది. కాని మొదట నోటు కేంద్ర కార్యవర్గానికి సర్క్యులేటు చేయబడింది. మీటింగుకు ముందు ఎజెండాలో చర్చనీయాంశంగా చేర్చబడింది. కేంద్ర కార్యవర్గం, జాతీయ సమితి మొత్తంగా పరిశీలించాలని నిర్ణయించింది. కేంద్ర కార్య వర్గంలో, తన సమక్షంలో యిద్దరు సభ్యులు చర్చించి వుండవలసిందని ఆరోపించుట, ప్రధానంగా కేంద్ర కార్యవర్గం దానిని చర్చించినపుడు అనుట సమర్థనీయంకాదని కమిషన్ అభిప్రాయము.

ii) అక్టోబరు మధ్యలో జరిగిన శెక్రటేరియట్ సమావేశపు అనంతరం జనరల్ శెక్రటరీ నంబూద్రిపాద్ విలేఖరులకు సంక్షిప్త సమాచారాన్ని యిస్తున్నపుడు అధ్యక్షులు డాంగే మధ్యలో వచ్చి ఖండించుట, రెండురోజుల తరువాత జనరల్ శెక్రటరీ కేంద్రంలోనే వున్నపుడు, జనరల్ శెక్రటరీని సంప్రదించకుండా, సుదీర్ఘ వివరణలతో ప్రకటన చేయుటను, కా. గోపాలన్ జవాబునోటులో ప్రత్యారోపణ గావించారు.

కంట్రోల్ కమిషన్ పైనుదహరించిన ఘటనలపై, యీ క్రింది వాస్తవ పరిణామాలను సేకరించి వివరించింది.

కేంద్ర కార్యవర్గం 1962 అక్టోబరు మూడవ వారంలో సమావేశమై, చైనా పరిహద్దులపై దాడి చేసిన పరిస్థితిని చర్చించి 17 అక్టోబరు 1962 తీర్మానాన్ని ఆమోదించింది. సమావేశం ముగిసిన వెంటనే కా. నంబూద్రిపాద్ బయటవున్న విలేఖరులను కలసి. తీర్మానాన్ని వారికి వివరించారు, వారి ప్రశ్నలకు సమాధానాలు యిచ్చారు. ఆ రూములోనికి చైర్మెన్ డాంగే వెళ్ళుట తటస్థించింది. విలేఖరులు ప్రశ్నలువేసి వొత్తిడి చేయగా జవాబులు చెప్పవలసి వచ్చింది. చైనావారు మన సరిహద్దులను వాస్తవంగా అతిక్రమించారా అని వారడిగిన ప్రశ్నలకు యిచ్చిన సమాధానాల, వొక్కాణింపులలో వ్యాఖ్యానించుటలో భారత ప్రభుత్వం సరిహద్దు అతిక్రమణ జరిగిందనగా, చైనా వారు అది జరుగలేదనుట, దేనిని స్వీకరించాలనుటలో వొక్కాణింపులలో తేడారాగా, మరుసటి రోజు వార్తా సంస్థలు వివిధ వ్యాఖ్యలు కసరత్తులు చేసాయి.

కేంద్రకార్యవర్గంలోని జడ్.ఎ. అహమ్మద్, యోగింద్రశర్మ, గోవిందన్ నాయర్ ముగ్గురు తీర్మానాలకు పత్రికల రిపోర్టులు, వ్యాఖ్యలపై తీవ్ర ఆందోళన చెందారు. వారు జనరల్ శెక్రటరీని కలసి వివరణ యివ్వమని కోరారు. శెక్రటరీ అందుకు అంగీకరించలేదు వారు సమావేశమై వొక ప్రకటనను తయారుచేసి దానిని శెక్రటరీ ప్రకటనకు వివరణగా యివ్వమని శెక్రటరని కోరారు. జనరల్ శెక్రటరీ పూర్తి శెక్రటేరియట్ సమావేశం జరుపకుండా అట్టి ప్రకటననుచేయ నిరాకరించారు. ఢిలీలోవున్న మరో శెక్రటేరియట్ సభ్యుడు భూపేష్‌గుప్తా, జనరల్ శెక్రటరీతో యేకీభవించి వివరణ అవసరంలేదన్నారు.

బొంబాయికి 17 తేదీన వెళ్ళిన పార్టి అధ్యక్షుడు డాంగే తిరిగి ఢిల్లీకి 19న వచ్చారు. ప్రకటనకు వివరణ కోరిన కొంతమంది అధ్యక్షుని కలిసారు. అధ్యక్షుడు ప్రకటనకు వివరణను ఢిల్లీలో వున్న జనరల్ శెక్రటరీని సంప్రదించకుండా యిచ్చారు.

దేశంలో సంక్షోభ ఉద్రేక పరిస్థితులు పార్టీలోను అంతటి తీవ్ర అభిప్రాయ భేదాలను సృష్టించాయి పరిస్థితులు ఘటనాక్రమం అత్యంత వేగంగా పరిణామం చెందుతున్నవి. పూర్తి శెక్రటేరియట్ సమావేశమై నిర్ణయం తీసుకొనాలనే జనరల్ శెక్రటరీ వైఖరిలో అసమంజసం యేమీ లేదు. పైగా శెక్రటరియట్ మరో మెంబరైన భూపేష్‌గుప్తా అదే అభిప్రాయాన్ని వ్యక్తం చేసారు అధ్యక్షుడు బొంబే నుండి వచ్చిన వెంటనే అతని వర్గానికి చెందిన ముగ్గురు శెక్రటేరియట్ సభ్యులు జనరల్

సెక్రటరీ వైఖరిని వివరించి, తాము రూపొందించిన సెక్రటరీ ప్రకటన వివరణను" పత్రికా ప్రకటనను చేయవలసింది కోరారు. భేదాభిప్రాయాలున్నపుడు, అధ్యక్షులు, జనరల్ సెక్రటరీ సంప్రదించుకొని వ్యవహరించాలని, వారు యేకగ్రీవాభిప్రాయానికి రాజాలనిచో సెక్రటేరియట్‌లో మెజారిటి అభిప్రాయం అనుసరించాలనేది జాతీయ సమితి నిర్ణయం స్పష్టం అధ్యక్షుడు తప్పనిసరిగా ఢిల్లీలోనేవున్న జనరల్ సెక్రటరీని సంప్రదించి వుండవలసింది, అట్టి ప్రయత్నం జరుగులేదు సెక్రటేరియట్ సభ్యు అందరు ఢిల్లీలో వున్నట్లయితే వెంటనే సమావేశానికి ప్రయత్నించి అది అసాధ్య మగు పరిస్థితులలో స్వంత బాధ్యతపై వివరణ ప్రకటన యిచ్చి వుండవలసింది, స్పష్టంగా వున్న కార్యాచరణ విధానాన్ని అనుసరించకుండా తీసుకొన్నది వేగిర పాటు చర్య అగుతుంది.

అజయ్‌ఘోష్ మరణానంతరం పార్టీ జాతీయ సమావేశంలో సంక్షోభం యేర్పడి, పార్టీ చీలికను అధిగమించుటకు వివిధ వర్గాలు వొప్పందానికొచ్చాయి. ఫలితంగా పార్టీ నిబంధనలలో సవరణలు ఆమోదించబడి డాంగే అధ్యక్షుడుగా అదే వర్గానికి చెందిన జడ్. ఎ. అహమ్మద్, గోవిందన్ నాయర్, యోగీంద్రశర్మ, అతి వాదలైన సుందరయ్య, జ్యోతిబాసు, హరికిషన్‌సింగ్‌సూర్జిత్‌లు, తటస్థులు నంబూ ద్రిపాద్ భూపేష్‌గుప్తాగల సెక్రటేరియట్ యేర్పడింది. జనరల్ సెక్రటరీగా నం బూద్రిపాడ్ పార్టీ వారిగా వ్యవహరించాలని అధ్యక్షుడు సెక్రటేరియట్ పనిలో కలుగజేసుకొనరాదని ఆమోదించబడింది ఆ విధంగా అధ్యక్షుడు జాతీయ సమితికి వాగ్దానం చేసాడు. మిశ్రమ సెక్రటేరియట్‌లో యేకగ్రీవామోదంలేనపుడు అధ్యక్షుడు జనరల్ సెక్రటరీ సంప్రదించుకొని వ్యవహరించాలని యిద్దరి మధ్య యేకాభిప్రా యం లేనపుడు మెజారిటి నిర్మాణాభిప్రాయంపై వ్యవహరించాలనే వొప్పందం, జాతీయ సమితి ఆమోదించింది. కొన్ని మాసాలు మిశ్రమ సెక్రటేరియట్ సైద్ధాం తిక, నిర్మాణ సమస్యలపు సమిష్టి అంతర్గత చర్చల ద్వారా ఐక్యతను సాధించుతు పురోగమించగలదనే ఆశను కలుగజేసింది. చైనా దురాక్రమణతో పార్టీలో యేర్ప డిన సంక్షోభంతో యీ వొప్పందాలు నిలువజాలకపోయాయి.

iii) అదే నోటులో కా. గోపాలన్ "నాకు తెలిసినంతవరకు కా. నంబూద్రి పాద్‌ను జనరల్ సెక్రటరీగా నూయేజ్ సంపాదకునిగా పనిచేయుటకు అవకాశమివ్వ లేదు, పైగా అతని రాజీనామా అనంతరం అతనిపై దుష్ప్రచారం సాగింది" అని ఆరోపించారు.

జాతీయ సమితి 12 ఫిబ్రవరి 1963 సమావేశంలో నంబూద్రిపాద్ తాను జనరల్ సెక్రటరీగా, నూయేజ్ సంపాదకత్వానికి యెందుకు రాజీనామా చేసింది వివ రించారు. చర్చల అనంతరం జాతీయ సమితి రాజీనామాను ఆమోదించింది. వెంటనే

ద్రిపాద్, సిద్ధాంత పత్రం" రివిజనిజం అండ్ డాగ్మాటిజం ఇన్ ది సి.పి.ఐ" పరిశీలించి నివేదిక సమర్పించమని కోరుతు వొక కమిషన్‌ను యేర్పాటుకు తీర్మానించింది.

అక్టోబరు తీర్మానాన్ని ఆమోదించిన మెజారిటిని వ్యతిరేకించినవారిని ద్రోహులుగ ఆరోపించారని వారిపై ప్రభుత్వం కమ్యూనిస్టు వ్యతిరేకులు దాడి చేయుటకు సిద్ధాంత పత్రం అవకాశం కల్పించిందని ఖండించింది జాతీయ సమితి.

ప్రభుత్వం అనేక రాష్ట్రాలలో కార్యకర్తలను అనేకమందిని అరెస్టు చేసినా, ఎట్టి బలమైన నిరసనను తెలుపలేదని ఆరోపణను ఖండించింది.

జాతీయసమితి నంబూద్రిపాద్ వ్యాఖ్యలు జాతీయ సమితి మెజారిటి సభ్యులను "సెన్సారు" చేయుట తప్ప మరొకటి కాదని ముఖ్యంగా నవంబరు 1 తీర్మానాన్ని ఆమోదించిన వారిని అని తన అభిప్రాయమన్నది జాతీయ సమితి ఆరోపణ లన్నిటినీ ఆధారరహితాలు. అసంగతాలు అని త్రోసి బుచ్చింది

పార్టీ అధ్యక్షుడు విదేశపర్యటనానంతరం ఎట్టి నివేదికను, కార్యవర్గానికి సమర్పించలేదన్న ఆరోపణను, పరోక్షంగా ఆమోదించుతు, సభ్యులు అడిగి తెలుసుకొనవచ్చునని, అధ్యక్షుడు ఎట్టి సమాచారాన్ని దాచి వుంచలేదు.

iv) కా. గోపాలన్, తవాజెన్‌కిన్ అనే రచయిత్రి, "ఇండియా రిపోర్ట్ రిపోర్టర్ అనే పుస్తకంలో కా. గోవిందన్‌నాయర్ చెప్పినవని, కా. గోపాలన్‌ను గురించి కొన్ని అసంగత విషయాలు వ్రాయబడినవని" ఆరోపించగా, కమిషన్ అదే పుస్తకంలో ప్రొ. ముండెసరిని గురించి కా. గోపాలన్ చెప్పినట్లు కూడ కొన్నిటిని పేర్కొన్నది, కాన మేము ఆ రెండిటికి ఎటువంటి ప్రాముఖ్యత నివ్వదలచ లేదని త్రోసిపుచ్చింది.

v) కా. గోపాలన్ తన సమాధానంలో 'లింక్' పత్రికలో వస్తున్న రిపోర్టులను పేర్కొంటూ, పార్టి సెక్రటేరియట్‌లో, కేంద్ర కార్యవర్గంలో చర్చించిన విషయాలు వస్తున్నవని, అవి కావాలని చేస్తున్న "లీకేజీలని" ఆరోపించారు. అవి పార్టీలో విచ్ఛిన్నతను ప్రవేశపెట్టుతున్నవన్నారు. కమిషన్ తాను పర్యటించిన ప్రాంతాలలో మితవాద, అతివాద, మధ్యమార్గవాద అనే భేదం లేకుండా అందరూ యీ "లీకేజీ" విషయాన్ని పేర్కొన్నారు. ఈ లీకేజీలు పార్టిలోని విచ్ఛిన్నతకు కారణ భూతాలనుటలో సందేహంలేదు. అగ్రనాయకత్వం గూడ యీ బాధ్యతనుండి తప్పుకొనజాలదు, అని కమిషన్ అభిప్రాయపడింది.

vi) కా. గోపాలన్ కొందరు కామ్రేడ్స్, విజయవాడ 4వ కాంగ్రెసు ఆమోదించిన విధానాలను, దొడ్డిదారిన మార్చ ప్రయత్నిస్తున్నారని" ఆరోపించారు "నిర్మాణాత్మకంగా, నేటి నాయకత్వాన్ని వ్యతిరేకించుతు, ప్రత్యామ్నాయ వేదికను

యేర్పాటు చేస్తూ, తిరుగుబాటు చేయు ప్రయత్నాలలోనే ప్రధాన ప్రమాదం, పార్టీ ఐక్యతకు కలుగుతున్నది, విచ్ఛిన్నం చేస్తున్నది.

జాతీయ సమితి నవంబరు 1962 సమావేశానంతరం ఒకరి తరువాత ఒకరు నాయకత్వం పరిమితి లేని మద్దతును ప్రధానమంత్రి విధానాన్నికి ప్రకటించుతున్నారనే ప్రచారం మాత్రమే జరుగుచున్నది. రక్షణ పేరుతో కంపల్సరీ డిపాజిట్లు స్కీమును, అనేక పన్నులు విధించుటను, విదేశసైనిక కమిషన్‌లను, భారతరక్షణ చట్టాన్ని విచక్షణా రహితంగా అమలుచేయుటను పార్టీ స్పష్టంగా వ్యతిరేకించుటను దాటవేస్తున్నది.

పార్టీ కామ్రేడ్స్ అనేకమంది రాష్ట్రాలలో ముఖ్యంగా బెంగాల్, ఆంధ్ర, మద్రాస్‌లలో పార్టీ పత్రికలలో వచ్చిన సంపాదకీయాలు, శీర్షికలకు వ్యతిరేకతను తెలియబుచ్చారు. పార్టీ యీవిషయమై ఆంధ్ర,తమిళనాడు కమిటీలను హెచ్చరించింది అందుకు బాధ్యులైన వారందరిపైనా తగుచర్యలు తీసుకొన్నది. ఇతరులలో కూడ సరియైన పర్యవేక్షణ యేర్పాటు చేయబడిందని కమిషన్ తలచింది.

ఆంధ్రప్రదేశ్‌లో విచ్ఛిన్నకర చర్యలు :

ఆంధ్రప్రదేశ్ కమ్యూనిస్టుపార్టీ సెక్రటరీ కా. రాజశేఖర్ రెడ్డి పార్టీ కేంద్ర కార్యవర్గ సమితి 13 సెప్టెంబరు సమావేశంలో, కాటూరులో కా. సుందరయ్య ఉపన్యాసంలోని భాగాలను చదివి వినిపించి," సుందరయ్య i) పార్టీని చీల్చుతానని భయపెట్టారని ii) జాతీయ సమితి అధికారాన్ని తెగనాడి, పార్టీకి ప్రాతినిధ్యము వహించదని, దాని అధికారాన్ని ఆమోదించజాలనని అన్నారని iii) పార్టీ 6వ కాంగ్రెసు తీర్మాన పంథాను వ్యతిరేకించుతు, పార్టీ జాతీయ, అంతర్జాతీయ విధానాలను వ్యతిరేకించుతు మాట్లాడారు." అని ఆరోపించారు. కేంద్ర కార్యవర్గపు యీ సమావేశం సుందరయ్య హాజరు కాలేదు. తదుపరి 13 అక్టోబరులో జరిగిన సమావేశంలో సుందరయ్య, తన ప్రసంగపు రిపోర్టు సరియైనది కాదని తిరస్కరించారు. ఇంకా "నాడు 5 గంటలు యిచ్చిన ఉపన్యాసాన్ని పునశ్చరణ చేయుట కష్టమన్నారు. జాతీయ, అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో కొనసాగుతున్న భేధాభిప్రాయాలను వివరించానన్నారు. "నేను పార్టీని చీల్చుతాననుట కంపుగొట్టే అసత్యం" అన్నారు.

అక్టోబరు 10న జరిగిన జాతీయ సమితి సమావేశంలో సుందరయ్య చెప్పినది విని, చర్చించి యిద్దరు కేంద్ర కార్యవర్గ సభ్యులు రాజేశ్వరరావు, రాజశేఖరరెడ్డిలు, సుందరయ్యపార్టీని చీల్చుతానని చెప్పినాడని చెప్పుట, జాతీయ సమితి అధికారాన్ని ప్రశ్నించుట, దాని ప్రతిష్టను భంగపరచుటను, కా. సుందరయ్య అట్లు చేయలేదని

4)

నిరాకరించుటతో కేంద్ర సమితి కమిషన్ ఆంధ్ర పర్యటించి ప్రకటన-వుపన్యాసపు వాస్తవాన్ని తెలియపరచాలని జాతీయసమితి కోరింది.

కమిషన్ సుందరయ్య ఉపన్యాసాన్ని రికార్డు చేసిన, కృష్ణాజిల్లా పార్టీ శెక్రటరీని ప్రశ్నించగా, సుందరయ్య "మీరు నేను పార్టీ ఆమోదించిన తీర్మానాలను వ్యతిరేకించుట సరియైనదాయని ప్రశ్నించవచ్చు. మేము నవంబరు 1962 వరకు మెజారిటి ఆమోదించిన తీర్మానాలకు కట్టుబడి వున్నాము. నేడు ఆ మెజారిటి కమ్యూనిజాన్ని వదలివేసి ఆశయానికి ద్రోహం చేసినపుడు తిరుగుబాటు తప్ప మరో ప్రత్యామ్నాయంలేదు అంచేత నేను యీ పరిస్థితిని సహించక బహిరంగ తిరుగుబాటు చేస్తున్నాను. క్రమశిక్షణ చర్య తీసుకొని కమ్యూనిస్టుపార్టీ నుండి నన్ను బహిష్కరించమనండి, అప్పుడు మేము కొత్త పార్టిని పెట్టుతాము. ఏ పార్టీపై ప్రజలకు విశ్వాసం వున్నదీ ప్రజలే నిర్ణయిస్తారని" ఉపన్యసించినట్లు పునరుద్ఘాటించారు.

కాటూరు కామ్రేడ్స్ సుందరయ్య ఉపన్యాసం అట్టి అభిప్రాయాన్ని కలుగజేసినట్లు స్పష్టంగా చెప్పలేదు. మరోపార్టీని ప్రారంభించుతానని అనలేదని, అభిప్రాయ భేదాలను పార్టీ సభ్యులందరితో చర్చించబడాలని పార్టీ కాంగ్రెసుకు తీసుకెళ్ళాలని అన్నారని తెలిపారు. కాటూరు జనరల్ బాడీలో కా. సుందరయ్య వుపన్యశించినపుడు, ఉన్న జాతీయ సమితి సభ్యులొకరు హైదరాబాద్‌లో వుంటు కలుసుకొని విచారించగా, సుందరయ్య ఉపన్యాసం సరిగానే రికార్డు చేయబడిందని, కా. సుందరయ్య మరోపార్టీని పెట్టుతానని అన్నదీలేనిదీ గుర్తులేదన్నారు. "ఆంజనేయ శాస్త్రిని ప్రశ్నించగా, నివేదికలో విషయాలు వాస్తవంగా సుందరయ్య చెప్పినవని అన్నారు. కాని కాటూరు కామ్రేడ్స్ సుందరయ్య అట్టి ప్రకటన చేయలేదని గట్టిగా అన్నారు. కా. సుందరయ్య పార్టీని చీల్చుతానని అన్నట్లు చేయబడిన ఆరోపణ నిర్దిష్టంగా రుజువుకాలేదని మేము అనుకొన్నామని కమిషన్ స్పష్టం చేసింది. దీర్ఘకాలం 5-6 గంటలు సాగిన వుపన్యాసాన్ని జ్ఞాపకం పెట్టుకొని, ఒక విషయంపై వుపన్యాసకుడు వుపయోగించిన మాటలను అదే విధంగా రికార్డు చేయుట ఎవరికైనా కష్టమేనని కమిషన్ అభిప్రాయ పడింది.

"సుందరయ్య తాను యిచ్చానన్న వుపన్యాసాన్ని మేము ఆంధ్ర నుండి ఢిల్లీ వెళ్ళిన తరువాత 24 నవంబరు 1963న పంపించారు. దానిని పంపుతూ వ్రాసిన లేఖలో అది జనరల్‌బాడీలో యిచ్చిన వుపన్యాసపు స్థూలరూపమన్నారు. అందులో జాతీయ సమితిపై చేసిన వ్యాఖ్యబట్టి, దాని నిర్ణయాలను, అధికారాన్ని తనకు యిష్టం లేనపుడు గుర్తించుట లేదనుట స్పష్టం" అని కమిషన్ పేర్కొంది.

"పార్టీ నిర్మాణ సూత్రాలకు భిన్నంగా, తన వీలునుబట్టి సుందరయ్య జాతీయ సమితితో గల అభిప్రాయభేదాలను పార్టీ క్రిందివర్గాల వద్దకు తీసుకొని వెళ్ళారు.

రాజకీయ, సైద్ధాంతిక భేదాభిప్రాయాలు క్రింది కమిటీలచే నిర్ణయింపబడజాలవు అవి పార్టీ కాన్ఫరెన్సులు, జాతీయ సమితి, కాంగ్రెసులే నిర్ణయిస్తాయి. ప్రజా సమస్యలపై మెజారిటీ నిర్ణయాలను పాటించుట సాధ్యం, అదే సైద్ధాంతిక, మౌలిక, రాజకీయ సమస్యలకు వర్తించదన్నారు [1].

"ప్రజా సమస్యలు' రాజకీయ, సైద్ధాంతిక సమస్యలను యేవిధంగా వేరు చేయాలో స్పష్టం చేయలేదు. జాతీయ సమితిపై సుందరయ్య వెలిబుచ్చిన అభిప్రాయం, అంతర్గత పార్టీ అభిప్రాయ భేదాలను క్రింది పార్టీ వర్గాలలోనికి తీసుకొని వెళ్ళుటకు అవలంభించిన పద్ధతులు, పూర్తిగ పార్టీ నిర్మాణాన్ని విచ్ఛిన్నం చేసేవిగా వున్నవనుటలో మా కెట్టి సందేహంలేదని[2]" కమిషన్ స్పష్టం చేసింది.

మూడో అంశం, సుందరయ్య 6వ, పార్టీ కాంగ్రెసు, తదనంతరం జాతీయ సమితి తీర్మానాలరూపంలో అంతర్జాతీయ సమస్యలపై నిర్ణయించిన పంధాకు వ్యతిరేకంగా మాట్లాడారు, అన్న ఆరోపణ

కా. సుందరయ్య వుపన్యాసాన్ని, తదనంతరం వ్రాసియిచ్చిన దానిలో "మేమందరమూ 1951 1956, విజయవాడ పార్టీ కాంగ్రెసులలోను కాంగ్రెసు ప్రభుత్వం, బూర్జువా నాయకత్వంలోని, భూస్వాముల, బూర్జువాల, ప్రభుత్వమని ఆమోదించాము. బూర్జువా వర్గాలలో యేవర్గం ప్రభుత్వంలో నాయకత్వం వహించు చున్నదన్న ప్రశ్న వచ్చినపుడు అజయ్‌ఘోష్ పాల్ఘాట్‌లో, విజయవాడ కాంగ్రెసు ఉపన్యాసంలో పెట్టుబడిదారులలో బడా, మధ్య, జాతీయ వర్గాలలో యేదీ అభివృద్ధి నిరోధకం కాక, పెట్టుబడిదారీ వర్గం మొత్తంగా కాదని, అందులో సహజంగా ప్రభుత్వ విధానాలపై బడా బూర్జువావర్గ ప్రభావం వుందన్నారు.

విజయవాడలో ఆమోదించబడిన తీర్మానంలో "నెహ్రూ ప్రభుత్వ మౌలిక విధానాలు గతంలో వలెనె జాతీయ బూర్జువా విధానాలుగ వున్నవి. దేశ, విదేశీయ రెండూను" అని, కా. అజయ్‌ఘోష్ విజయవాడ వుపన్యాసంలో "ఉన్నత నూతన అవగాహనను పాల్ఘాట్ యిచ్చింది. జాతీయ బూర్జువా ద్వంద పాత్ర స్పష్టం చేయబడింది. వైరుధ్యం అదృశ్యమైందా? అది సమసి పోయిందా? ఈ ప్రశ్నకు మా సమాధానం కాదు, పోలేదని-అది తీవ్రమైంది. సామ్రాజ్యవాదం మొత్తం ప్రజా సామాన్యం, జాతీయ బూర్జువా వర్గంతో సహా వాటిమధ్య వైరుధ్యం తీవ్రమైన ఫలితంగా మన జాతీయ స్వాతంత్ర్యం నేడు మరింత బలమైన ఆర్థిక పునాదిపై ఆధారపడి వుంది" అన్నారు.

---

1. 2. రిజల్యూషన్స్ ఆన్ స్ప్లిట్టర్స్ (ఆంగ్లంలో)సి. పి. ఐ. పబ్లికేషన్. కంట్రోల్ కమీషన్ రిపోర్టు పే. 69-70.

సుందరయ్య తన ఉపన్యాస రిపోర్టులో ప్రభుత్వ "విదేశాంగ విధానం భారత పాలకవర్గ ప్రయోజనాలకు సరిపడు విధంగా మార్చబడిందనేది సరియైన నిర్వచనము, అంటే పెట్టుబడిదారి-భూస్వామ్య ప్రభుత్వం, రెండు పక్షాల మధ్య దోబూచులాటగాను" సామ్రాజ్యవాదంవైపు 1947-53 మధ్య మొగ్గింది, 1953-58 వరకు సోషలిస్టు పక్షానికి అనుకూలంగా వుంది. తిరిగి 1958 తరువాత సామ్రాజ్యవాదానికి అనుకూలంగా వుంది. ఆచరణలో నెహ్రూ ప్రభుత్వం వర్గప్రయోజనాలను దృష్టిలో వుంచుకొని విదేశాంగ విధానాన్ని ఒకప్పుడు సామ్రాజ్యవాదానికి అనుకూలంగాను, మరొకప్పుడు సోషలిస్టు పక్షానికి అనుకూలంగాను చేసింది. రెండు పక్షాలమధ్య ఆట ఆడింది" అని వ్రాసాడు.

విదేశాంగ విధాన సమస్యపై విజయవాడ రాజకీయ తీర్మానం సామ్రాజ్యవాదాలు మన విదేశాంగ విధానాన్ని మార్చుటకు సంవత్సరాల కొలది అనేక విధాల ప్రయత్నించారని "అయినా వొత్తిడులను ప్రతిఘటించారు. జాతి ప్రయోజనాలు నేటి విదేశాంగ విధానాన్ని కొనసాగించుచున్నది. ఈ విధాన ప్రధాన శిల్పి అయిన నెహ్రూ యీ విధానాన్ని వదలివేయు సూచనలు కన్పించుట లేదు. భారతదేశం యుద్ధానికి వ్యతిరేకంగా నిరాయుధీకరణకు, శాంతి, వలస సామ్రాజ్యవాద వ్యతిరేక పక్షంలో వుంది" అని పేర్కొంది.

కా. సుందరయ్య ఉపన్యాసంలోని యీ వ్యవహారిక సైద్ధాంతిక రాజకీయ ప్రత్యామ్నాయ పంధానైజాన్ని స్పష్టం చేస్తున్నవని, వివిధ జనరల్ బాడి సమావేశాలలో యీ పంధానే ప్రచారం చేస్తున్నారని స్పష్టం.

సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ 22వ కాంగ్రెసు, క్యూబాల్లో అణు ప్రయోగాల ఒప్పందాలపై సుందరయ్య అభిప్రాయాలు పార్టీ ఆమోదించిన తీర్మానాలకు విరుద్ధంగా వున్నవని కమిషన్ అభిప్రాయము.

కంట్రోల్ కమిషన్ సుదీర్ఘ 42 పేజీల నివేదికకు ముగింపు వ్యాఖ్యాసాలను యీ క్రింది విధంగా చేసింది.

"అఖిలభారత పోటీకేంద్రం, దాని వుపశాఖలు రాష్ట్రాలలో యేర్పడి అవి పనిచేస్తూ వుండుట కొంతమంది వాటిలో చురుకుగా పనిచేయుట వారి పేర్లను నివేదికలో వుదహరించుట నిస్సందేహంగా జరిగిన వాస్తవము.

"ఈ కామ్రేడ్స్ వుద్దేశ్యపూర్వకంగా జాతీయసమితి అధికారాన్ని అతిక్రమించారు, పార్టీ క్రమశిక్షణా రూపాలను పూర్తిగ అతిక్రమించారు. పార్టీలో, బయటా నిరాటంకంగా ధైర్యంగా ప్రత్యామ్నాయ రాజకీయవేదికను పార్టీలో నిర్మాణ సూత్రాల ననుసరించి పార్టీపర్యవేక్షణలో జరుగవలసిన అంతర్గత చర్చల సూత్రాలను వదలివేసి ప్రచారంగావించారు. వారిపై గట్టి క్రమశిక్షణాచర్యను గైకొనాలని సూచించుటకు

మాకెట్టి సందేహంలేదు. ్మా పరిశీలనాంతర కాలంలో విపరీత తీవ్ర పరిణామాల కారణంగా, యీ సమస్య విస్తృతి సందర్భంగా పరిగణించవలసి వుంటుంది.

"నేడు పార్టీ చరిత్రలో మున్నెన్నడు కని విని ఎరుగనివి జరుగుతున్నవి. కా. బసవపున్నయ్య, రామమూర్తి, సూర్జిత్‌లు పార్టీ చైర్మెన్ డాంగే 40 సంవత్స రాల క్రితం జైలునుండి వ్రాసాడని ఆరోపింపబడిన లేఖల గురించి చైర్మెన్ వ్యతి రేకంగా బూర్జువా పత్రికలలో ప్రకటనలు చేసారు. ఆ లేఖల నిజానిజాలను ధృవ పరచవలసి వున్నది. హైదరాబాద్‌నుండి కా. సుందరయ్య, నాగిరెడ్డిలు, కలకత్తా నుండి ముజఫర్ అహమ్మద్, ప్రమోదదాస్‌గుప్తా, కొనార్‌లు అదే సమస్యపై వెన్వెంటనే పత్రికలలో ప్రకటనలు చేసారు. కేంద్రకార్యవర్గ సమావేశాన్నిగాని జాతీయసమితి సమావేశాన్ని యేర్పరచాలని కూడ కోరకుండా, వేచి వుండక, అత్యం శక్తివంతమైన ప్రచారాన్ని చైర్మెన్ యితర నాయకుల వ్యక్తిత్వాలను చెండాడాడు పార్టీ విచ్ఛిన్నకర చర్యలను కొనసాగించారు. ఈ విధంగా చేయునపుడు అందరిచే ఆమోదించబడిన పార్టీ విధానాలను క్రమశిక్షణను నిర్మాణ సూత్రాలను అతిక్రమిం చారు.

"అంతేగాక గత అక్టోబరు సమావేశంలో జాతీయసమితి యీ సంవత్సరం అక్టోబరులో పార్టీ కాంగ్రెసు జరుపుటకు నిర్ణయించింది. నివేదికను సమర్పించుటకు కమిషన్‌ను యేర్పరచింది. నివేదిక ఆధారంగా నిర్మాణక్రమంలో సూత్రబద్ధంగా పార్టీలో అంతర్గత చర్చలు సాగించుటకు నిర్ణయించింది. పోటీ కేంద్రాలు నడుపు తున్న కామ్రేడ్స్ దీనికి కమిషన్‌తో సహకరించ నిరాకరించారు. అందుకు భిన్నంగా వారు వారి డాక్యుమెంట్సును నివేదికలను తయారుచేసి ప్రత్యేకంగా గ్రూపు చర్య లను దేశంలోని వివిధ ప్రాంతాలలో సాగించారు.

"వారు తయారు చేసిన నివేదిక కొన్ని వార్తా సంస్థలకు లీకు అయింది, తరువాతే పత్రికా విలేఖరులకు విడుదల చేయబడింది.

"ఆంధ్రప్రదేశ్‌లో రాజ్యసభ యెన్నికలలో భారత కమ్యూనిస్టు పార్టీ అభ్యర్ధికి వ్యతిరేకంగా మరో అభ్యర్థి రాష్ట్ర అసెంబ్లీలో కమ్యూనిస్టు ప్రతిపక్ష నాయకుని సుందరయ్య ప్రతిపాదించారు. ఈ కాలంలో పార్టీ రూపాలను క్రమశిక్ష ణను వుల్లంఘించిన యితర ఘటనలు వున్నవి

పార్టీ సభ్యుల అట్టి ప్రవర్తన సాధారణంగా వారి బహిష్కరణకు దారి తీస్తుంది. నేడు అట్టి కామ్రేడ్స్ పూర్తి నడతను పరిశీలించుటకు జాతీయ సమితి అత్యవసర ప్రత్యేక సమావేశాన్ని జరుపనున్నది. సమస్యను సమగ్రంగా పరిశీ లించి యెట్టి చర్యను తీసుకొనవలసింది జాతీయ సమితికి కంట్రోల్ కమిషన్ వదలి వేసింది. పార్టీ గౌరవానికి నిజాయితీకి క్రమశిక్షణకు అవసరమైన గట్టి చర్యలు

తీసుకోవాలి. నేడు వుద్భవించిన విస్తృత రాజకీయ, సైద్ధాంతిక సమస్యలకు పరిష్కారాన్ని అన్వేషించుటలో విజయం పొందితే, అవి పార్టీ ఐక్యతను, సౌభ్రాతృత్వాన్ని పునః ప్రతిష్టించగలవు" అని ఘోషే, హజారీబేగం, నారాయణ నాయర్‌లు సభ్యులుగా గల కంట్రోల్ కమిషన్ తన నివేదికను ముగించింది. కమిషన్ నివేదికను 4 ఏప్రిల్ 1964న సమర్పించగా జాతీయ సమితి ఏప్రిల్ 9న చర్చించి వొక తీర్మానాన్ని ఆమోదించింది.

'అతివాదుల' తాజా చర్యలు

కమ్యూనిస్టుపార్టీ సెక్రటేరియట్ 9 ఏప్రిల్ 1964న కేంద్రకార్యవర్గసమితికి కమ్యూనిస్టుపార్టీలో "చీలికవాదుల" తాజా చర్యలపై నివేదికను సమర్పించింది.

i) అతివాద కమ్యూనిస్టు ముఖ్యనాయకుల సమావేశం ఢిల్లీలో ఏప్రిల్ 2 నుండి జరిగింది. ఈ సమావేశానికి కా. బసవపున్నయ్య, గోపాలన్, రామమూర్తి, సుందరయ్య, సూర్జిత్, కొనార్, దాస్‌గుప్తా కన్వీనర్సుగా "బహిరంగంగా నిజాయితీ మార్క్సిస్టు-లెనినిస్టుల నూతన కమ్యూనిస్టుపార్టీని స్థాపించు లక్ష్యంతో యేర్పాటు చేయబడింది."

"పోటీపార్టీ కేంద్రం", "కేంద్రసమితి", "రాష్ట్రసమితులు" చీలికవాదుల కార్యకలాపాలకు యింక యేమాత్రం చాలవు బహిరంగంగా ప్రత్యేక పార్టీని పెట్టుట జరుగబోయే ప్రపంచ కమ్యూనిస్టుపార్టీల సమావేశంలో భారత కమ్యూనిస్టు పార్టీ గుర్తింపును ఛాలెంజి చేసి తమను గుర్తించ కోరుటకు, అవసరం అవే నిర్ణయానికి వచ్చినట్లు కన్పించుచున్నది. అనేక యితర దేశాలలో నూతన కమ్యూనిస్టుపార్టీలను యేర్పాటు చేయాలనే ప్రయత్నాలు జరుగుచున్నవి.

భారత కమ్యూనిస్టుపార్టీలో అభిప్రాయ భేదాలు గత దశాబ్దంనుండి వున్నా చైనా దురాక్రమణను ఖండించుతు నవంబరు 1962లో జాతీయ సమితి తీర్మానించినప్పటి నుండి పూర్తిగ నూతన మలుపు తిరిగి నూతన లక్షణాన్ని నంతరించుకొన్నవి. అప్పటినుండి అంతర్జాతీయ పిడివాదులు, భారత కమ్యూనిస్టు పార్టీనివారి దాడికి కేంద్రంగా చేసి, చీల్చి విచ్ఛిన్నం చేయు అన్ని చర్యలు సాగించారు.

కా. బసవపున్నయ్య తదితర అతివాదనాయకుల అధ్వర్యంలో జరుగుచున్న సమావేశం మరో పార్టీ రూపొందుటకు అవసరమైన ప్రత్యామ్నాయ కార్యక్రమాన్ని సైద్ధాంతిక నివేదిక నోట్సుని రాజకీయ, నిర్మాణ నివేదికలను రూపొందించుచున్నది. ఈ సమావేశానికి ముందు కా. సుందరయ్య, గదర్ పార్టీరజతోత్సవాల వుపన్యాసంలో వొప్పుకొన్నారు.

వాస్తవంగా "రివిజనిస్టులకు అద్దం"లో ప్రతిబింబం అను వ్యాసాన్ని మార్చి 1963లో చైనా నాయకత్వం ప్రపంచం అంతటా మిలియన్సుల ప్రతులను పంపిణీ

చేసింది. స్పష్టంగా "భారతదేశంలో చీలిక కమ్యూనిస్టుపార్టీని యేర్పాటు చేయాలని ప్రఖ్యాత "సి పి యస్. యు బహిరంగ లేఖపై 7వ కామెంటు"లో 4 ఫిబ్రవరి 1963న "మార్క్సిజం లెనినిజంకు డాంగే ద్రోహం", "నాయకత్వాన్ని ఆక్రమించాడని "నిజమైన కమ్యూనిస్టుల సమీకరణ జరుగుచున్నదని," మరోపార్టీ యేర్పాటుకు ప్రోద్బలమిచ్చింది. ఇండోనేషియా పార్టీ అధ్యక్షుడు ఐడిత్ "బహిరంగంగా చీలికకు పిలుపు", నిచ్చాడు. దీనిని భారత కమ్యూనిస్టుపార్టీ కేంద్ర కార్యవర్గం జనవరి సమావేశంలో విమర్శించింది.

ఈ అతివాదుల పునాది చీలిక కాన్ఫరెన్సును దానినేర్పాటు చేసిన నాయకుల అనేక యితర చర్యల నేపధ్యంలో చూడాలి. తీర్మానం ఆంధ్రలో , పశ్చిమబెంగాల్, కేరళ, తమిళనాడు, పంజాబులలోని అనేక చీలిక వేర్పాటు చర్యలను వుదహరించింది. వారికి పార్టీని "సరియైన మార్గంలో పెట్టాలని", "శుద్ధిచేయాలని" వున్నా— సెక్రటేరియట్ సమావేశంలో, కార్యవర్గ సమావేశ మేర్పాటుకోరి, చర్చించి, జాతీయసమితిలో చర్చించి వుండవలసివుంది. అటువంటిదేమీవారు చేయు అనుసరించ, ప్రయత్నించలేదు.

ప్రపంచ కమ్యూనిస్టుపార్టీలలో చైనా అవగాహనను ఆమోదించని కమ్యూనిస్టు పార్టీలపై,"మార్క్సిజం,లెనినిజం విడనాడారనే" ప్రచారాన్ని చైనా పురస్కరం చేసింది. "నిజమైన కమ్యూనిస్టులు పునర్నిర్మాణాన్ని చేబట్టారనే" ప్రచారం, అంతర్జాతీయంగా చైనా ప్రభావిత, చీలిక కమ్యూనిస్టు పార్టీలు యేర్పడుచున్న నేపధ్యంలోనే చూడాలిగాని, భారత ప్రత్యేక పరిస్థితిగా నెంచుట, అశాస్త్రీయమగుతుంది.

ఈ నివేదిక అధారంగా పార్టీ శెక్రటేరియట్ అదే రోజున కేంద్ర కార్యవర్గానికి, జాతీయసమితికి వొకచిత్తు తీర్మానాన్ని ఆమోదానికి సమర్పించింది.

## జాతీయసమితి 15 ఏప్రిల్ 1964 సమావేశం, సంక్షోభం

భారతకమ్యూనిస్టు పార్టీలో అంతర్గత వివాద సంక్షోభం శిఖరాగ్రానికి చేరింది. విజయవాడ కాంగ్రెసు తరువాత రాజకీయ, నిర్మాణ వొప్పందాలతో రెండు సంవత్సరాలు అంతర్గత వివాదంలో కొట్టుమిట్టాడుతూ, చివరి సమావేశం, జాతీయసమితి సమావేశం 1964 ఏప్రిల్ మూడోవారంలో జరిగింది. ప్రధానంగా పార్టీలో విచ్ఛిన్నకర చర్యలపై కంట్రోల్ కమిషన్ నివేదిక, ఒండొరుల ఆరోపణలు ప్రత్యారోపణలు, నివేదిక ఆధారంగా పార్టీ శెక్రటేరియట్ రూపొందించిన చిత్తు తీర్మానం, చీలికవాదులపై సమగ్ర తాజానివేదిక, కేంద్రకార్యవర్గం రూపొందించిన చిత్తు తీర్మానం, చీలికవాదులపై బహిష్కరణ క్రమశిక్షణా చర్యను జాతీయ సమితికి సిఫార్సు చేయు రిపోర్టులు సమావేశంలో చర్చనీయాంశాలు. వాగ్వివాదాలు తీవ్రస్థాయికిచేరి ఆరోపణలు ప్రత్యారోపణలతో మెజారిటీ మితవాదులది కాగా, అతివాదులైన 32

చేసింది. స్పష్టంగా "భారతదేశంలో చీలిక కమ్యూనిస్టుపార్టీని యేర్పాటు చేయాలని ప్రఖ్యాత "సి పి యస్. యు బహిరంగ లేఖపై 7వ కామెంటు"లో 4 ఫిబ్రవరి 1963న "మార్క్సిజం లెనిజంకు డాంగే ద్రోహం", "నాయకత్వాన్ని ఆక్రమించాడని "నిజమైన కమ్యూనిస్టుల ఏకీకరణ జరుగుచున్నదని," మరో పార్టీ యేర్పాటుకు ప్రోద్బలమిచ్చింది. ఇండోనేషియా పార్టీ అధ్యక్షుడు ఐడిత్ "బహిరంగంగా చీలికకు పిలుపు", నిచ్చాడు. దీనిని భారత కమ్యూనిస్టుపార్టి కేంద్ర కార్యవర్గం జనవరి సమావేశంలో విమర్శించింది.

ఈ అతివాదుల పునాది చీలిక కాన్ఫరెన్సును దానినేర్పాటు చేసిన నాయకుల అనేక యితర చర్యల నేపథ్యంలో చూడాలి. తీర్మానం ఆంధ్రలో, పశ్చిమబెంగాల్, కేరళ, తమిళనాడు, పంజాబులలోని అనేక చీలిక వేర్పాటు చర్యలను వుదహరించింది. వారికి పార్టిని "సరియైన మార్గంలో పెట్టాలని", "శుద్ధిచేయాలని" వున్నా— సెక్రటేరియట్ సమావేశంలో, కార్యవర్గ సమావేశ మేర్పాటుకోరి, చర్చించి, జాతీయసమితిలో చర్చించి వుండవలసివుంది. అటువంటిదేమీవారు చేయు అనుసరించ, ప్రయత్నించలేదు.

ప్రపంచ కమ్యూనిస్టుపార్టీలలో చైనా అవగాహనను ఆమోదించని కమ్యూనిస్టు పార్టీలపై,"మార్క్సిజం,లెనినిజం విడనాడారనే" ప్రచారాన్ని చైనా ముమ్మరం చేసింది. "నిజమైన కమ్యూనిస్టులు పునర్నిర్మాణాన్ని చేబట్టారనే" ప్రచారం, అంతర్జాతీయంగా చైనా ప్రభావిత, చీలిక కమ్యూనిస్టు పార్టీలు యేర్పడుచున్న నేపథ్యంలోనే చూడాలిగాని, భారత ప్రత్యేక పరిస్థితిగా నెంచుట, అశాస్త్రీయమగుతుంది.

ఈ నివేదిక ఆధారంగా పార్టి సెక్రటేరియట్ అదే రోజున కేంద్ర కార్యవర్గానికి, జాతీయసమితికి వొకచిత్తు తీర్మానాన్ని ఆమోదానికి సమర్పించింది.

## జాతీయసమితి 15 ఏప్రిల్ 1964 సమావేశం, సంక్షోభం

భారతకమ్యూనిస్టు పార్టిలో అంతర్గత వివాద సంక్షోభం శిఖరాగ్రానికి చేరింది. విజయవాడ కాంగ్రెసు తరువాత రాజకీయ, నిర్మాణ వొప్పందాలతో రెండు సంవత్సరాలు అంతర్గత వివాదంలో కొట్టుమిట్టాడుతూ, చివరి సమావేశం, జాతీయసమితి సమావేశం 1964 ఏప్రిల్ మూడోవారంలో జరిగింది. ప్రధానంగా పార్టిలో విచ్ఛిన్నకర చర్యలపై కంట్రోల్ కమిషన్ నివేదిక, ఒండోరుల ఆరోపణలు ప్రత్యారోపణలు, నివేదిక ఆధారంగా పార్టి సెక్రటేరియట్ రూపొందించిన చిత్తు తీర్మానం, చీలికవాదులపై సమగ్ర తాజానివేదిక, కేంద్రకార్యవర్గం దూపొందించిన చిత్తు తీర్మానం, చీలికవాదులపై బహిష్కరణ క్రమశిక్షణా చర్యను జాతీయ సమితికి సిఫార్సు చేయు రిపోర్టులు సమావేశంలో చర్చనీయాంశాలు. వాగ్వివాదాలు తీవ్రస్థాయికిచేరి ఆరోపణలు పత్యారోపణలతో మెజారిటి మితవాదులది కాగా, అతివాదులైన 32

మెజారిటి సభ్యులు తమ అభిప్రాయాన్ని వాస్తవంగా వెల్లడి చేయకుండా చేసింది. అంతేగాక పార్టీ సభ్యత్వాన్ని పరిశీలించుటకు ఆమోదయోగ్యమైన ఒక విధానాన్ని రూపొందించుటకు అంగీకరించలేదు. ఫలితంగా కాంగ్రెసు పూర్వచర్చలలో కాన్ఫరెన్సులలో బహుళ సంఖ్యాకులైన పార్టీసభ్యులు పాల్గొనజాలకపోయారు. అన్నిటికిమించి వారి పంథాను వ్యతిరేకించు సమర్థులపై క్రమశిక్షణా చర్యలను తీసుకొను విధానాన్ని కాంగ్రెసు పూర్వ చర్చలలో పాల్గొనకుండా చేయగలందులకు కాంగ్రెసు ప్రతినిధులుగ ఎన్నికకాకుండుటకు ప్రారంభించారు. కేంద్ర కార్యవర్గ సమితిలోని ఏడుగురును పార్టీ మండి బహిష్కరించనున్నట్టు జాతీయసమితి సమావేశం కాకముందు ప్రకటించారు. నిజమైన పార్టీ కాంగ్రెసును సమావేశం జరుగకుండా చేయుటకు యిది వొక వుదాహరణ.

"పూర్వరంగంగా పశ్చిమ బెంగాల్ రాష్ట్రసమితిని రద్దుచేసి, ఆర్గనైజింగు కమిటీని యేర్పాటు చేసారు. పంజాబ్‌లో రాష్ట్రనాయకత్వాన్ని తొలగించారు. అనేక పార్టీ సభ్యులపై క్రమశిక్షణా చర్యలు తీసుకొన్నారు. కేంద్రకార్యవర్గ సభ్యులను 7గురను తొలగించుటయేగాక సమావేశానంతరం అనేకమందిపై క్రమశిక్షణా చర్యలు తీసుకొనుటకు పార్టీ యంత్రాంగం సిద్ధం చేయబడింది.

"ఈ నేపథ్యంలోనే డాంగే, 1924లో వ్రాసిన అపఖ్యాతికరమైన లేఖలను కరెంటు పత్రిక ప్రకటించిన దానిని వారి విధానాలను వ్యతిరేకించే వారిపై దాడి చేయుటకుపయోగించ సిద్ధమగుచున్నది. శెక్రటేరియట్ సభ్యులు కనీసం "ఆర్చీవ్స్ వెళ్ళి చూడకుండానే ఉత్తరాలు ఫోర్జరీ అని ప్రకటించారు. అతివాద కమ్యూనిస్టులే ఆ వుత్తరాలు బయటపెట్టుటకు కారకులనే "కరెంటు" పత్రిక కథనానికి ప్రచారమిస్తున్నారు.

ఇట్టి పరిస్థితులలో డాంగేని కమ్యూనిస్టుపార్టీలోని అన్ని బాధ్యతల నుండి విచారణ జరుగు వరకు తాత్కాలికంగా తొలగించుట సాధారణంగా చేయాలి. పార్టీ అంతర్గత పరిస్థితిని బట్టి, పార్టీకేంద్ర కార్యవర్గం జాతీయసమితులు యీ సమస్యలను పరిశీలించి చర్చించునపుడు పార్టీ అధ్యక్షుడు తన స్థానాన్ని కాళీచేసి వుండవలసింది దీనినికూడ డాంగే, అతని అనుచరులు తమ ముఠా బలహీనపడుతుందని అన్ని పార్టీ సూత్రాలను త్రోసిపుచ్చారు. మేము సమావేశాన్ని బహిష్కరించి, బయటకు వెళ్ళి నిరసనను యీ కారణంగానే తెలిపాము.

"పరిస్థితిని రెండురోజులు సమీక్షించి డాంగే అనుచరులు ఫ్రాక్షన్ విధానాలకు వ్యతిరేకంగా జరుగు పోరాటంలో భాగమని యేకగ్రీ నిర్ణయానికి వచ్చాము.

అందేత, మేము డాంగే ముఠా చర్యలను ఖండించమని పార్టీ సభ్యులకు శాఖ

లకు యిచ్చిన పిలుపు రాజకీయ సంస్కరణవాదానికి కాంగ్రెసుతో సాధారణ ఐక్య సంఘటన పంథాను పార్టీ కాంగ్రెసుపై ప్రాక్షనులు చేయు ప్రయత్నాలకు అనుమానాస్పదమైన డాంగేలేఖలను అవి జాతీయ 'ఆర్చైవ్స్'లో వుండుటను "వైట్‌వాష్" చేయు ప్రయత్నించువారికి వ్యతిరేకంగా యిచ్చిన పిలుపు అగుతుంది.

"మనలోనూ భేదాభిప్రాయాలున్నవి. నంబూద్రిపాద్ రాజకీయ సైద్ధాంతిక సమస్యలపై తన అభిప్రాయాలను సిద్ధాంతపత్రంలో సమర్పించారు. అయినా రాజకీయ సంస్కరణవాదాన్ని వ్యతిరేకించుటలో పార్టీ వ్యతిరేక నిర్మాణ చర్యలను తీసుకొనుటను బ్రిటిష్ పాలకులకు తన సేవలను అర్పిస్తూ డాంగే వ్రాసిన లేఖలను పార్టీ నాయకత్వం త్రోసిబుచ్చుటను వ్యతిరేకించుటలో మేము యేకాభిప్రాయం కలిగి వున్నాం. ఈ ఐక్యత వొక్కటే ఆచరణకు తగినంత పునాదిగా చాలదని మాకు తెలుసు. మా అభిప్రాయ భేదాలు రాజకీయ సిద్ధాంతాభిప్రాయాలు, చర్చలు సంప్రదింపులను ప్రతిపాదించుతు మొత్తం పార్టీ సభ్యులను యీ అర్చలకు ఆహ్వానించుచున్నాము.

ఐక్యతకు అతివాదుల ప్రతిపాదనలు

"ఈ దశలోకూడ డాంగే గ్రూపు పార్టీ వ్యతిరేక నిర్మాణ పద్ధతులను విడనాడి మాతో సంప్రదించి, ఎట్టి బంధనాలు లేని పార్టీ అంతరంగిక చర్చలను కొనసాగించుటకు తగిన యంత్రాంగాన్ని వాస్తవంగా అందరికి ప్రాతినిధ్యం వహించేదానిని అంగీకరిస్తే మా మద్దతు సహకారాన్ని దాని విజయానికి యిచ్చుటకు సంసిద్ధులమై వున్నామని ప్రకటించదలచుకొన్నాము.

"పార్టి ఐక్యతను వారు నిజానికి వాంఛించుచున్నట్లయితే పార్టి క్రమశిక్షణ చర్యలను పార్టీ ఐక్యతకే చేబట్టుతున్నామని చెప్పి గైకొన్న చర్యలు పార్టీని పై నుండి క్రింది వరకు చీల్చుతున్నవని గుర్తించాలి. పార్టీ కాంగ్రెసు విజయం జాతీయ సమితిలోని వివిధవర్గాల మధ్య జరిగే వొప్పందంపై ఆధారపడియుంటుంది. ముఖ్యంగా యంత్రాంగంపై అదే పార్టి అంతర్గత సిద్ధాంత చర్చలు పార్టీకాంగ్రెసుకు ప్రయత్నాలు చేస్తుంది. న్యాయబద్ధమైన యీ ప్రతిపాదనలకు వారి వ్యతిరేకతయే పార్టీ సంక్షోభానికి దారితీసింది.

"పార్టీలోని యీ పరిస్థితిపై విచారాన్ని వ్యక్తం చేస్తూ, పార్టీ ఐక్యతను కోరే అందరికి పార్టీపై యీ క్రింది ప్రతిపాదనలపై వొత్తిడిని తీసుకొని రమ్మని కోరుతున్నాం.

i) డాంగే లేఖలపై పరిశీలన, విచారణ వారిచే మాచే వొప్పందం ద్వారా ఏర్పడిన యంత్రాంగంచే జరగాలి.

సాంకేతిక నిపుణులచే పరిశీలనకు మేము వ్యతిరేకులమనే డాంగే ఆరోపణను

మేము వ్యతిరేకించుచున్నాము. పరిశీలన సమగ్రంగా వొక కమిటీచే జరుపబడాలని నిపుణుల సహాయాన్ని అట్టి పరిశీలనలో సమర్ధులైనవారిని అన్ని పార్శ్వాలను పరిశీలించగల నిపుణులు కావాలి. డాంగే అనుచరవర్గంచే నిర్ణయించబడినవారుగాక జాతీయ సమితిలోని అన్ని వర్గాల ఆమోదం పొందినవారు కావాలి.

ii) విచ్ఛిన్నకర చీలిక కార్యకలాపాలను మరింత విస్తృతంగా సమగ్రంగా పరిశీలించబడాలి.

"డాంగే గ్రూపు వారు న్యాయబోనులో వున్నారని గుర్తించాలి. అంచేత పార్టీలో అంతర్గత చర్యలు శిఖరాగ్రంగా పార్టీ కాంగ్రెసు జరిగి నిర్ణయాలు జరుగు వరకు "విచ్ఛిన్నకర చీలిక కార్యకలాపాలను" క్రమశిక్షణా చర్యలను గైకొనకుండ వాయిదా వేయాలని గతసంవత్సరంగా తీసుకొన్న క్రమశిక్షణా చర్యలను తీసుకొన్న వాటిని రద్దు చేయాలి.

iii) పార్టీ సభ్యత్వం వివాదాస్పదమైన చోట్ల, తాజాగా పార్టీ సభ్యత్వాన్ని స్క్రూటినీ లేక పరిశీలించుటకు యేర్పాట్లు చేయాలి. విజయవాడ పార్టీ కాంగ్రెసు నాటికి సభ్యులైవారందరిని పార్టీ సభ్యత్వాన్ని పునరుద్ధరించుకొనుటకు ఆమోదించాలి.

iv) మాచే తయారుచేయబడిన డాక్యుమెంట్సును పరిశీలించుటకు, ఆమోదించబడిన సభ్యులు గల కమిషన్ ఏర్పరచాలి, అదే తదితర కామ్రేడ్స్ రూపొందించిన డాక్యుమెంట్సును పరిశీలించుతుంది. అదే ఆ సిద్ధాంతపత్రాలలో ఏదైనా పార్టీ అంతరంగిక చర్చలలో ఆధారభూతమౌతుందాయని నిర్ణయిస్తుంది. ఒకేవొక డాక్యుమెంటు లేక ఎక్కువ డాక్యుమెంట్సు అవసరమాయాని నిర్ణయిస్తుంది.

ఈ అంశాలను ఆచరణలో పెట్టాలంటే పార్టీ కేంద్రం పేపర్లు నడుపు విధానం, పద్ధతి, పార్టీపని విధానం సమీక్షించి అవసరమైన మార్పులు చేయవలసి వుంటుందనుట స్పష్టము

పై ప్రతిపాదనలు చేస్తున్నా సెక్రటేరియట్, దాని అనుచరులు వాటిని ఆమోదించుతారనే ఆశ మాకులేదు, గత సంవత్సరకాలంనుండి పార్టీలో ప్రజాస్వామ్య ఆచరణ పనివిధానాన్ని అనుసరించుట వారు చూపుతున్న ప్రతిఘటన, ప్రవర్తన దేనికైనా దిగజారుతారని తెలుస్తున్నది.

ఈ ప్రకటనపై 32 మంది కమ్యూనిస్టుపార్టీ జాతీయసమితి సభ్యులు తదితరులు, "అతివాదులు" సంతకాలు చేసిన దానిని పత్రికా వార్తాసంస్థలకు విడుదల చేసారు.

## జాతీయసమితి అవగాహన, నిర్ణయాలు

జాతీయసమితి ఏప్రిల్ 1964లో సమావేశమై కంట్రోల్ కమిషన్ నివేదికను దానిపై సెక్రటేరియట్ అభిప్రాయాలు, వాటి ఆధారంగా కేంద్రకార్యవర్గసమితి,

జాతీయ సమితికి సమర్పించుటకు రూపొందించిన చిత్తు తీర్మానాన్ని చర్చించి వాక్ తీర్మానాన్ని ఆమోదించారు, ముఖ్యాంశాలు యిలా వున్నవి.

i) జాతీయసమితి "అతివాదుల మైనారిటీ" నిష్క్రమించిన అనంతరం చేసిన ప్రకటన వారి మానిఫెస్టోగా కార్యక్రమవేదికగా పరిగణించి "అసత్యాలపట్టికగా, పార్టీ వ్యతిరేక వికృత అపవాదులుగ, వారి చీలిక ఎత్తుగడలను సమర్థించుకొనుటకు, దాని రచయితలు వుద్దేశించినదిగా" పేర్కొంది. జాతీయసమితినుండి నిష్క్రమించినవారి ప్రకటనలో వెల్లడైన విధానం, 32 మంది పార్టీ నుండి తమంతట తామే వేరుగా స్థానాన్ని యేర్పరచుకొనుటను, కమ్యూనిస్టుపార్టీ సభ్యత్వ హక్కులను కోల్పోవుటను తెలియజేస్తుంది.

జాతీయసమితి సమావేశం నుండి "బయటకు నడచిన, "వారు" డాంగే వారి అనుచరులు మరా కార్యాచరణకు వ్యతిరేకంగా జాతీయసమితి సెక్రటేరియట్‌లపై బహిరంగ యుద్ధ ప్రకటన చేసారు.

ఈ సందర్భంలో కొన్ని చేదునిజాలను మననం చేసుకొనవలసివుంది. మొట్ట మొదటిది. పార్టీ చరిత్రలో యిట్టి సంక్షోభం మొదటిది కాదు. ఈ అతివాద వర్గం పార్టీ వ్యతిరేక, వెనుకపాటు దుష్ప్రచార ఎత్తుగడలను బయటకెళ్ళి చీలికతెస్తానని బెదరించుట మొదటిసారి గాదు. ఉదాహరణకు 1961 విజయవాడ పార్టీ కాంగ్రెసులో మైనారిటీగ వున్నామని తెలుసుకొన్న "అతివాదులు" పార్టీ కాంగ్రెసు నుండి వెళ్ళి పోతామని బెదరించారు. న్యాయబద్ధంగా వచ్చే ప్రాతినిధ్యం కంటె నూతనజాతీయ సమితిలో యెక్కువ కావాలని కోరారు. విదేశ, సౌహార్ద ప్రతినిధుల సమక్షంలో పార్టీ కేంద్ర నాయకత్వ పదవుల విషయంగా సంక్షోభాన్ని సృష్టించారు.

రెండవది : నేటి అంతర్జాతీయ కమ్యూనిస్టు సైద్ధాంతిక పోరాట నేపథ్యంలో అతివాద, సెక్టేరియన్ గ్రూపు తాజా విచ్ఛిన్నకర చర్యలను జాతీయసమితి బహిరంగ పరచి, విమర్శించనిచో జాతీయసమితి తన వంతు కర్తవ్య నిర్వహణలో విఫలమౌతుంది. ఇది అంతర్జాతీయంగా సాధ్యమైనన్ని పార్టీలలో చీలికలు తీసుకొని రావాలన్న వారి ప్రణాళికలలో, దీనిని భాగంగా గుర్తించాలి. బెల్జియం, బ్రిటన్, ఆస్ట్రేలియా, సిలోన్, పెరూ తదితర దేశాలలో మైనారిటీ గ్రూపులు చీలికలు తెచ్చి వేరు పార్టీలను పెట్టిన నేపథ్యంలో, భారతదేశంలో కమ్యూనిస్టుచర్యలను అర్థం చేసుకొనాలి." అంతర్జాతీయ స్థాయిలో విచ్ఛిన్నకర చర్యలు, సోదర పార్టీలలో నగ్నంగా కలుగజేసుకొనుట, స్వచ్ఛందంగా ప్రకటించుకొన్ననాటి చైనా కమ్యూనిస్టుపార్టీ నాయకత్వపు ధ్యేయం" అని జాతీయ సమితి తీర్మానం, 16 మాసాలుగ చైనా కమ్యూనిస్టుపార్టీ మావోయిస్టు అతివాదుల చర్యలను యేకరువు పెట్టింది.

ii) జాతీయసమితి మెజారిటీ, ఆచరణలో "సాధారణ కాంగ్రెసు-కమ్యూనిస్టు రాజకీయ ఐక్యతా ఎత్తుగడల పంథాను" చేబట్టారని, అది పూర్తి సంస్కరణ వాద

మని" వారి ప్రకారం యీ విధానం" విజయవాడపార్టీ కాంగ్రెసులో పీగిపోయిందని, వారు చెప్పేది, ఘోరమైన వక్రీకరణ, సత్యాన్ని అపభ్రంశం పట్టించుట" తప్ప మరొకటి కాదని తీర్మానం స్పష్టం చేసింది.

అంతేగాక "విజయవాడలో కాంగ్రెసు-కమ్యూనిస్టు సాధారణ ఐక్యతగా చెప్పబడలేదు. పార్టీ 4వ, కాంగ్రెసులో అందరకు తెలిసినట్లుగ సరియైన పంథాకై పోరాటం జరిగింది, చివరకు అది ఆమోదించబడింది. కాంగ్రెసులోను, బయటవున్న ప్రజాస్వామ్యశక్తులతో ఐక్యత, అదే మితవాద శక్తులకు, కాంగ్రెసు ప్రజాస్వామ్య వ్యతిరేకవిధానాలకు వ్యతిరేకంగా పోరాడుతుంది.

"పార్టీ కాంగ్రెసు నిర్ణయాలను 1961 నుండి వ్యతిరేకించుచున్నది జాతీయ సమితిగాదు, అది తప్పుడు ఆరోపణ, విజయవాడలో తమ తప్పుడు అతివాద విధానం వోడిపోగా, దానిని అంటిపెట్టుకొని కూర్చున్నవారు, కాంగ్రెసును ఆమూలాగ్రంగా వ్యతిరేకించు పంథాను చేబట్టినవారు, వారి విధానం సూత్రరహిత కూటములకు, అభివృద్ధి నిరోధకుల, మతత్వవాదులతో విభజనవాదుల అవగాహనలకు ముస్లింలీగ్, డి. యం. కె: స్వతంత్రపార్టీ అకాలీలతో కాంగ్రెసు వ్యతిరేక పోరాటమనే పేరుతో కలియుటకు దారితీసే పంథా తప్ప మరొకటిగాదు[1].

"వేర్పాటువాదుల" ప్రకారం, 1962 అక్టోబరు-నవంబరు జాతిసంక్షోభంతో జాతీయసమితిలో అతివాదులకు వ్యతిరేకంగా మెజారిటి యేర్పడింది. అత్యవసర పరిస్థితి ప్రకటన, అనేకమంది కమ్యూనిస్టు కామ్రేడ్స్ అగుటతో మెజారిటి యేర్పడిందని చెప్పుట, సత్యాన్ని కాదనుట కంటే మరేమీకాదు.

ఇంతగా అతివాదులు చెప్పే సంక్షోభం, చైనా దండయాత్రతో యేర్పడింది. నవంబరు 1962లో జాతీయసమితి సమావేశమై, చైనా దురాక్రమణను నిర్దిష్టంగా దురాక్రమణగా పేర్కొనవలసి వచ్చినపుడు, జాతీయ రక్షణకై నిలబడవలసి వచ్చినపుడు, ఒక్కరుగూడ అరెస్టుకాబడలేదు. జాతీయసమితి తీర్మానం అత్యధిక మెజారిటితో ఆమోదించబడింది. చర్చలు తరువాత యీ వేర్పాటు వాదులు వున్నారు వారెవ్వరూ అరెస్టుకాబడలేదు. అటువంటిది మెజారిటి వాస్తవమైనది కాదని చెప్పి ఎట్లు వాదించగలుగుతున్నారు

ప్రకటనలోని మరో తప్పుడు వక్రీకరణ "అతివాదులు వారి ప్రతిపాదనైన "పార్టీ అంతర్గత చర్చలకు తగిన వాతావరణాన్ని సృష్టించి పార్టీ కాంగ్రెసును జరుపుటకు తగిన వాతావరణాన్ని రూపొందించాలనే" వారి ప్రతిపాదనను జాతీయ సమితి నిరాకరించిందనుట యిది వారి ప్రకటన ప్రకారం పార్టీ అంతర్గత సమన్య

1. రిజల్యూషన్స్ ఆన్ స్ప్లిట్టర్స్ (1964) సి. పి. ఐ. పబ్లికేషన్. (ఆంగ్లంలో) పే 3.

లను పరిష్కరించుటలో పాల్గొనుటకు సహకరించుట ప్రతిబంధకమైనదంటున్నారు.

"ఇది బహుశా అక్టోబరు 1663లో కా. బసవపున్నయ్య తదితర 16 మంది "పార్టీవిచ్ఛిన్నత, చీలిక ప్రమాదం-ఏ విధంగా యీ ఘోరప్రమాదాన్ని అరికట్టాలి" అన్న శీర్షికతో జాతీయసమితి సమావేశానికి సమర్పించిన పత్రాన్ని గురించి పేర్కొంటున్నదని తలంచుతున్నాము. జాతీయసమితికి బయట దీనిని రహస్యంగా పర్క్యులేటు చేయబడింది. దానిని కా.డాంగే శెక్రటేరియట్ తరపున సమాధాన మిచ్చారు శెక్రటేరియట్ యీ రెండు డాక్యుమెంట్లు ప్రచురించింది.

"ఆ సమావేశంలో జాతీయసమితి వివాదాంశ సమస్యలుపై చర్చలు ప్రారంభించుటకు పార్టీ కాంగ్రెసుకు సన్నాహాలు చేయుటకు, మైనారిటీ గ్రూపు నామినీలతో కలిసి పనిచేయుటకు అంగీకరించింది.

జాతీయసమితి జైలులోవున్న పార్టీ కామ్రేడ్స్ విడుదలవరకు పార్టీ కాంగ్రెసు జరుగవలసివుండినా వాయిదా వేసింది.

కేంద్రకార్యవర్గ సమితి పార్టీ కాంగ్రెసుకొరకు డాక్యుమెంట్సును తయారు చేయుటకు వొక కమీషన్‌ను ఎన్నుకొంది. అందులో కా.బసవపున్నయ్య ఇ. యం. యస్. నంబూద్రిపాద్, జ్యోతిబాసు, పి రామమూర్తిలు సభ్యులుగ వున్నారు. కమిషన్ సమావేశాలను యేర్పాటు చేసినపుడు వీరు బాయ్‌కాట్ చేసారు, తరువాత వారు పోటీ కాన్ఫరెన్సును యేర్పాటు చేసారు.

"అతివాదులు యీ ప్రతిపాదనలను యెందుకు తిరస్కరించారు. వారికి ఇంకా ఏమి కావాలి? పార్టీ ఐక్యతను కాంక్షించే వారిగా వేషం వేస్తున్నారు. మెజారిటీ అప్రజాస్వామ్య విధానాలు అవలంభించి బయటకు వెళ్ళునట్లు వొత్తిడి చేయబడిన వారిగ చెప్పుకొంటున్నారు వాస్తవమేమంటే గతమంతా పార్టీ నిర్మాణసూత్రాలను వ్యతిరేకించుటకే నిర్ధారణ చేసుకొన్నారు. జాతీయసమితిని పార్టీ అధికారాన్ని క్రమశిక్షణను ధిక్కరించుటకు పార్టీలో పోటీ పార్టీగ తమ కార్యకలాపాలను కొనసాగించనెంచారు ఎన్నికైన పార్టీలోని మెజారిటీ, మైనారిటీ స్థానాన్ని ఆమోదించుట మైనారిటీ అయినవారు మెజారిటీ అయినట్లుగా షరతులను డిక్టేటు చేయుట వొక్కటే వారిని సంతృప్తిపరచేది. జాతీయసమితి అట్టి అమానుష షరతులకు ఆమోదం తెల్పజాలదు

"అతివాదనాయకులు జాతీయసమితి, రాష్ట్రసమితులు వారి మెజారిటీ తమపై కోపంలో క్రమశిక్షణాచర్యలు తీసుకొనుటకు వినియోగించారని ఫిర్యాదు చేస్తున్నారు.

iii) వాస్తవానికి జాతీయసమితి, రాష్ట్రకమిటీలు పార్టీనిర్మాణ సూత్రాలకు విరుద్ధంగా పార్టీ సభ్యత్వ కార్డుల ఆచ్ఛాదనలో పార్టీ నాయకులు అనే గౌరవం ఛాటున, పార్టీలో వుండి క్రమబద్ధంగా పార్టీని విచ్ఛిన్నం చేస్తు, పార్టీ నిర్మాణం

క్రమశిక్షణ అన్ని రూపాలను గాలిలోవదలివేస్తూ ఢిల్లీనుండి తదితర రాష్ట్రాల నుండి పూర్తిపోటీ పార్టీ కేంద్రాలను నడుపుట చూసిచూడకుండా వున్నందులకు వాటిని నిందించవలసి వుంటుంది. ఇది కంట్రోల్ కమిషన్ చే నిస్సందేహంగా జాతీయసమితికి తాజాగా సమర్పించిన నివేదికలో నిర్ధారణ చేయబడింది [1]

"ఒక ప్రణాళిక ప్రకారం విస్తృత విచ్ఛిన్నకర చర్యలు చేసిన అతివాద గ్రూపుపై తీసుకొన్న క్రమశిక్షణాచర్య కా.ఎ కె. గోపాలన్ ను అక్టోబరులో "బహిరంగంగా గర్హించుట" తప్ప మరెవ్వరిపై యెట్టి చర్య గైకొనలేదు. జాతీయసమితి ఏదైనా పొరపాటు చేసివుంటే అది క్రమశిక్షణా చర్యలను తీసుకొనుటలో చేసిన అలక్ష్యం తప్ప మరొకటిలేదు.

"విచ్ఛిన్నకరవాదులు వారి సైద్ధాంతిక రాజకీయ నిర్మాణ పంథాలను సమర్థించుకొనజాలమని తెలిసి, సమస్యలను ప్రక్కదారులు పట్టించుటకు" డాంగేలేఖలు అనేవాటితో "చవకబారు గొప్పవదంతి కల్లోల ప్రచారంతో వారిపార్టీ వ్యతిరేక చర్యలకు ఆచ్ఛాదన ప్రచారంతో రెచ్చగొట్ట ప్రయత్నించారు."

"జాతీయసమితి సాక్షాధారాలన్నిటిని పరిశీలించి విచారణ చేబట్టుటకు ప్రాథమికాంశాలు లేవని తలచి డాంగేను బ్రిటిష్ ఏజంటుగా చిత్రించు దుష్ప్రచారాన్ని ఖండించింది. అయినా లేఖలను మరింత లోతుగా పరిశీలించుటకు జాతీయ సమితి సభ్యుల ఏడుగురను "విచారణ కమిటి"గా యేర్పరచింది.[2]

"డాంగేలేఖలు" నిజమైనవని విశ్వసించే "అతివాదుల" సాక్ష్యాధారాలను జాతీయసమితికి ఎందుకు సమర్పించలేదని ప్రశ్నించింది. సమావేశం యీ విషయం చర్చించునపుడు డాంగే అధ్యక్షస్థానాన్నుండి బయటకు వెళ్ళిపోయినా, సమావేశాన్ని బహిష్కరించి బయటకి వెళ్ళినవారు ఎందుకు తిరిగిరాలేదు? తిరిగి యిప్పుడు "ఆమోదించబడిన కమిటి" చేవిచారణ జరుగవలెననుట వారి ప్రతినిధులు ఆ లేఖలను నిస్సందేహంగా "నిజమైనవని" ప్రకటించిన తరువాత అది ఎలా సాధ్యం? వార్తా పత్రికల ప్రచారానికి వెళ్ళకముందే కేంద్రకార్యవర్గం జాతీయసమితులతో చర్చించుటకు ప్రయత్నించక అమెరికా అనుకూల "కరెంటు" పత్రికలతో కలసి కమ్యూనిస్టు వ్యతిరేకులవలె ప్రచారం సాగించారు.

"అతివాద నాయకులు" బహిరంగంగా, జాతీయసమితికి వ్యతిరేకంగా పార్టీ సభ్యుల శాఖల తిరుగుబాటును ఆమోదించే పంథాకు వ్యతిరేకంగా ప్రకటించి అఖిల భారత 7వ పార్టీ కాంగ్రెసుకు పిలుపునిచ్చి ప్రయత్నాలు ప్రారంభించారు. వారి

---

1. రిజల్యూషన్స్ ఆన్ స్ప్లిట్టర్స్, ఏప్రిల్, 1964 సి.పి.ఐ. పబ్లికేషన్. పే. 5.
2. రిజల్యూషన్స్ ఆన్ స్ప్లిట్టర్స్, (1964) కమ్యూనిస్టుపార్టీ జాతీయసమితి తీర్మానాలు (ఆంగ్లంలో) సి.పి.ఐ. పబ్లికేషన్. పే 5-6.

డాక్యుమెంట్లును సర్క్యులేటు చేయ నిర్ణయించి, అన్ని రాష్ట్రాల జిల్లాల తమ ప్రతినిధుల సమావేశాన్ని రెండు మాసముల తరువాత జరుపుటకు నిర్ణయించారు. వారి ఏప్రిల్ 2-9 ఢిల్లీ కాన్ఫరెన్సులో చిత్తుకార్యక్రమము,తదితర డాక్యుమెంట్సు ప్రత్యేక ఆహ్వానితులకు పంచబడినవని, చర్చించబడినవని, వారపత్రికలవారికి యిచ్చిన సమాచారాలలో స్పష్టంచేయబడింది.

"స్పష్టంగా పోటీపార్టీ ఒక్క బోర్డుతప్ప బహిరంగంగా ఏర్పడింది ఆ పార్టీ ఆర్గనైజర్సు, వారి సహకారానికి చెల్లించవలసిన మూల్యానికి ప్రతిపాదనం చేసారు. మెజారిటీకి, నిరాశతో తమ షరతులను డిక్టేటు చేయుట వారి చివరి ప్రయత్నము.

"పార్టీ ఐక్యత పునరుద్దరణకు గల అవకాశాలను పరిశీలించుటకు జాతీయ సమితి ఎప్పుడూ సంసిద్ధమే అయితే వేర్పాటు వాదులు షరతులు లేకుండా పోటీ పార్టీని కేంద్రానికి రద్దు చేయకుండా, జాతీయసమితి అధికారాన్ని గుర్తించకుండా, ఐక్యత ఎలా పునరుద్దరించబడుతుంది?

"అంచేత, పార్టీకి, కార్మికవర్గానికి, ప్రజాస్వామ్య ప్రజోద్యమాలకు విచ్ఛిన్నకర చర్యలు కలుగజేసిన నష్టాన్ని స్పష్టంగా ఖండించాలి. దేశ, విదేశ అభివృద్ధి విరోధకుల కమ్యూనిస్టు వ్యతిరేకుల ఆయుధాగారాలకు, అవి సరఫరా చేసిన ఆయుధాలను, విద్రోహాన్ని ఎవరూ మరువజాలరు.

iv) జాతీయసమితి కా. యం. బసవపున్నయ్య, పి. సుందరయ్య, పి. రామమూర్తి, ఎ. కె. గోపాలన్, హరికిషన్‌కొనార్, ప్రమోదదాస్‌గుప్తా, హరికిషన్ సింగ్, సూర్జిత్‌లు గతంలో ఎన్నడూ జరుగనంతటి పార్టీ విచ్ఛిన్నతను ఆర్గనైజు చేసినవారిగ, పోటీపార్టీని యేర్పాటు చేసినవారిగ నేరమాపాదించుచున్నది. సెక్రటేరియట్, కేంద్రకార్యవర్గసమితి విచ్ఛిన్నకర చర్యలపై నివేదికను జాతీయసమితికి సమర్పించాయి. సాక్ష్యాధారాలతో వివరించి, వారిని పార్టి నుండి బహిష్కరించవలసిందిగా జాతీయసమితి సిఫార్సుచేసింది వారిపై ఆపాదించబడిన నేరాలకు సమాధానాలు యివ్వ నిరాకరించుచు, సమితి సమావేశంనుండి నిష్క్రమించారు.

జాతీయసమితి అన్నిటిని పరిశీలించి, బహిష్కరించుట తగిన క్రమశిక్షణా చర్యగా తలచింది. జాతీయసమితి యీ చర్చలు జరుపుచున్నపుడు భూపేష్‌గుప్తా రాజీ ప్రతిపాదనలను చేస్తున్నారు. ఈ 7 గురు కామ్రేడ్స్ మరో 25 మంది జాతీయ సమితి సమావేశం నుండి నిరసనగా వెళ్ళిపోయారు. ఈ 32 మంది 14 ఏప్రిల్ 1964న వొక బహిరంగ ప్రకటన చేసారు.

"పోటీపార్టి" ఆచరణకార్యక్రమాన్ని ప్రకటించి, పార్టీ కాంగ్రెసు పిలుపు నిచ్చి, యీ 32 మంది కామ్రేడ్స్, యింకా ఐక్యతకొరకు, జాతీయసమితితో సంప్రదింపుల విషయం మాట్లాడారు.

"ఈ పరిస్థితులలో తాత్కాలికపార్టీ నుండి బహిష్కరణ క్రమశిక్షణాచర్యను కేంద్ర కార్యవర్గం శిఫార్స్ చేసినదానిని ఆచరణలో చేబట్టరు. ప్రత్యామ్నాయంగా ఈ యేడుగురును, తదితర 23 మంది కామ్రేడ్స్ పార్టీ సభ్యత్వాన్నుండి తక్షణం సస్పెండు చేయబడ్డారు. ఈ క్రమశిక్షణా చర్య, అర్టికల్ xxIx సెక్షన్ 5 ప్రకారం వారి గ్రూపు పార్టీ వ్యతిరేకచర్యలకు సస్పెండు చేయబడ్డారు. పార్టీలోని అన్ని స్థానాలనుండి వారు తొలగించబడ్డారు. జాతీయ సమితి వారిపై మరింత కఠినక్రమశిక్షణ చర్యను ఎందుకు తీసుకొనరాదో అని, వారి సంజాయిషీని కోరింది. జాతీయసమితి, వారు తమ విచ్ఛిన్నకరచర్యలనుండి బయటపడుటకు యింకా కాలంమించి పోలేదని, తమ చర్యలు అలాగా కొనసాగితే, మరింత కఠిన చర్యలను జాతీయసమితి తీసుకొనుటకు, తీసుకొనుటకు చేయు వొత్తిడి అగుతుంది అని స్పష్టమైంది. వారిఐక్యతతో నిలబడాలని విజ్ఞప్తి చేసింది.

అతివాద వర్గపు అవగాహన, అభిప్రాయాలు.

విజయవాడ పార్టీ కాంగ్రెసు అవగాహనలతో 1962 ఏప్రిల్‌లో యేర్పడిన "మిశ్రమ శెక్రటేరియట్" చాలవరకు సమతూకాన్ని కలిగివుంది. "మితవాద," "అతివాద" ఎటూ చేరని కొద్దిమందితో కలిసి సమిష్టిగా, జాతీయ సమితికి, పార్టీకి ప్రాతినిధ్యం వహించుచున్నది.

"అక్టోబరు మధ్యలో జరిగిన కేంద్ర శెక్రటేరియట్ సమావేశంతో సమతూకం ఛిన్నాభిన్నమైంది. శెక్రటేరియట్ చేసిన ప్రకటన దానిలోని చీలికను స్పష్టం చేసింది. మరుసటి రోజు జనరల్ శెక్రటరీ, చైర్మెన్ పత్రికలకు భిన్నంగా వ్యాఖ్యానించారు. పార్టీ శత్రువులు యీ అవకాశాన్ని పూర్తిగ వినియోగించి, "చైనా అనుకూలురు" అనబడే వారిపై పూర్తిదాడిని సాగించారు.

"పార్టీ శెక్రటేరియట్ అంతర్గత పరిస్థితి విషమించింది. శెక్రటేరియట్ ప్రకటన 12 గంటల తరువాత, ముగ్గురు శెక్రటేరియట్ సభ్యులు కలసి జనరల్ శెక్రటరీని, శెక్రటేరియట్ ప్రకటనకు వారు కోరిన విధంగా వివరణ యివ్వమని కోరారు. అది జనరల్‌సెక్రటరీ తిరస్కరించారు. శెక్రటేరియట్ మరో సభ్యుడు వ్యాఖ్యలలోని భేదాభిప్రాయాలను శెక్రటేరియట్ ప్లీనరీ సమావేశం మాత్రమే పరిష్కరించగలదనగా, ఆముగ్గురు తామొక ప్రకటన చేయగలమని బెదరించారు.

ఈ సంఘటనల తరువాత రెండు పరిణామాలు జరిగాయి. వాటిని బట్టి శెక్రటేరియట్ రెండు ఫ్రాక్షనులుగా పని చేస్తుందని స్పష్టమౌతుంది, ఒక ఫ్రాక్షన్‌లో చైర్మెన్ డాంగే కూడ వున్నారు.

i) శెక్రటేరియట్ ప్రకటనను వివరించుతు చైర్మెన్ డాంగే ఢిల్లీనుండి

6)

ప్రకటనగావించారు. ఈ ప్రకటన జనరల్ సెక్రటరీ, ఢిల్లీలోనే వున్న మరో సభ్యునికి తెలియకుండా, తదితర ముగ్గురు సభ్యులతో సంప్రదించి చేయబడింది.

ii) జనరల్ సెక్రటరీ, మరో సభ్యునికి, తదితర ముగ్గురు సభ్యుల మధ్య జరిగిన చర్చ అంతా "లింక్" పత్రికలో వచ్చింది. తదితర ముగ్గురలో వొకనిచే ఆ సమాచారం యివ్వబడినందనుటకు తగిన అంతర్గత సాక్ష్యాధారాలున్నవి.

"డాంగే ప్రకటన, జనరల్ సెక్రటరీ, భూపేష్‌గుప్తాలకు వెన్నుపోటు మాత్రమేగాక" చైనా అనుకూలురు" అనబడే వారిపై దాడికి వుద్దేశించబడింది. పార్టీ అంతర్గత పరిస్థితి తమవైపుకు పడిమొగ్గినట్లుగా, వారు జరుపుతున్న ప్రాక్షన్ పోరాటంలో వారి ప్రత్యర్థులను పార్టి నాయకత్వం నుండి "చైనా అనుకూలురు" అనే ముద్రతో దూరం చేయగలమని, డాంగే అతని అనుచరవర్గం తలచినట్లు కన్పడుతున్నది "అక్టోబరు 19 ప్రకటన సెక్రటేరియట్ నలుగురు సభ్యులు, ప్రాక్షన్ పోరాటంలో పేల్చిన గుండుగా "అతివాదులు అంచెనావేసారు. అదే సమయంలో చైనాసైన్యాలు మెక్‌మాహన్‌రేఖను దాటి, భారతదేశంలో ప్రవేశించుట, వారికి (మితవాదులకు) కలసి వచ్చిన అదృష్ట అవకాశం (?) పార్టి నాయకత్వంలోని వొక భాగంపై ఉద్రేకోన్మాదవాతావరణం సృష్టించబడింది. అవలంభించిన విధానమంతా, సరియైన పార్టీ నిర్మాణ సాంప్రదాయ సూత్రాలను బట్టి సమర్ధించజాలము అది అఖిలభారత సంక్షోభపరిస్థితి, పార్టీనిర్మాణ సూత్రాల ప్రకారం ఒక్క జాతీయ సమితి మాత్రమే పార్టి దృక్పథాన్ని అట్టి పరిస్థితులలో వివరించగలదు ఇది సెక్రటేరియట్‌లో కొందరికి అమోదయోగ్యంగా లేదు. అంచేత తామే నాయకత్వ బాధ్యత స్వీకరించారు. అదే పార్టీని పైనుండి క్రిందికి, మెజారిటీ, మైనారిటీ అనే రెండు వర్గాలుగా చీల్చింది. ఇది పార్టీలో వొక భాగపు పద్ధతి, నామమాత్రపు పార్టి అంతర్గత చర్చ లేకుండా పార్టీపై రుద్దుట అగుతుంది

"డాంగేవర్గం తాము జాతీయ సమితిలో మెజారిటీవర్గమైనందున, కేంద్ర సెక్రటేరియట్, కేంద్ర కార్యవర్గ సమితులలో తమ ఆధిక్యత వున్నందున జనరల్ సెక్రటరీ తమ సలహాల ననుసరించి పనిచేయాలని అంటున్నారు.

సహజంగానే జాతీయ సమితి, చైనా దురాక్రమణపై డాంగేవర్గం ప్రతిపాదించిన తీర్మానాన్ని అమోదించి, ఏప్రిల్ 1962లో యేర్పాటు చేసిన పార్టి అంతర్గత నిర్మాణ యేర్పాటులను త్రోసివేసింది. ముగ్గురు సెక్రటేరియట్ సభ్యులు రాజీనామా చేస్తూ వారి లేఖలలో సెక్రటేరియట్‌లోని చర్చలు క్రమబద్ధంగా బయటకు, బూర్జువా పత్రికలలో వస్తున్నందున, నిర్మొహమాటంగా చర్చలు జరుగుట అసాధ్యమైంది. జనరల్ సెక్రటరీ నంబూద్రిపాద్, భూపేష్‌గుప్తాలు కూడ జాతీయసమితిని; తమను ఆ బాధ్యతలనుండి విడుదల చేయమని కోరారు. కాని దానిని గురించి వొత్తిడి

చేయలేదు. మెజారిటి వారి రాజీనామాను ఆమోదించనందున వారి స్థానాలలో కొనసాగారు. ఏమైనా ఏప్రిల్‌లో యేర్పడిన మిశ్రమ శెక్రటేరియట్ పూర్తిగ విచ్ఛిన్నం చేయబడింది.

"జాతీయసమితి మెజారిటి, నవంబరు 1962లో విస్తృత సరిహద్దు సైనిక సంఘర్షణలపై చేసిన తీర్మానం, వారి సంస్కరణవాద, వర్గరాజీ దృక్పథానికి పరాకాష్ఠ. సరిహద్దు సంఘర్షణలపై పార్లమెంటులో కమ్యూనిస్టులు చేసిన వుపన్యాసాలను భారతప్రభుత్వం తన రాయబార కార్యాలయాలద్వారా ప్రపంచమంతటా పంపకం చేసింది. వారి ప్రచారానికి, సమర్థవంతంగా వినియోగించుకొంది.

"డిశెంబరు 1962 కేంద్రకార్యవర్గసమితి సమావేశంలో, చైనా నవంబరు 21 కాల్పుల విరమణ ప్రతిపాదనలను చాలమంది సభ్యులు "విద్రోహంగా" "రెండు నాల్కలు కలదిగా" విశ్లేషించి, నేరుగా నిరాకరించవలసిందిగా కోరారు." చైనీయులు యేకపక్షంగా కాల్పుల విరమణచేసి, సైన్యాల వుపసంహరణ ప్రారంభించారని జ్ఞప్తి చేసుకొనవలసి వుంది వీరనేది, భారతసైన్యం ఆక్సాయ్‌చిన్, మెక్‌మాహన్ సరిహద్దులపై యుద్ధాన్ని కొనసాగించాలని కోరుతున్నారు. సంఘర్షణ సమసిపోతే వారి ప్రచార పునాది కూలిపోతుందనే భయం కావచ్చు.

"కొలంబొ ప్రతిపాదనలపై, ప్రతినిధివిర్గం ఢిల్లీవచ్చువరకు, భారతప్రభుత్వం ఆమోదించువరకు, కమ్యూనిస్టుపార్టీ కేంద్ర కార్యవర్గ సమితి యెట్టి అభిప్రాయాన్ని వెలిబుచ్చకపోవుట, బూర్జువా పార్టీల తోకపట్టుకొని పోవుటయే అగుతుంది. డాంగే నాయకత్వంలోని ఎ. ఐ టి. యు సి వెంటనే కార్మికశాఖమంత్రి వర్గానికి "పారిశ్రామిక రాజీవిధానం" ప్రతిపాదింపుతు, త్రైపాక్షిక సమావేశాన్ని కోరుతు వ్రాయుటలో యిది మరింత స్పష్టమౌతుంది. ఇదంతా ట్రేడు యూనియనులను సంప్రదించకుండా జరిగిందని గుర్తించుకొనాలి. ఈ విధంగా "అత్యవసర పరిస్థితి" అన్న పేరుతో కార్మికవర్గం, బూర్జువా వర్గానికి అప్పజెప్పబడి, వారి విధానాలకు కట్టివేయబడింది.

ప్రజలలో కోల్పోతున్న గౌరవాన్ని కాంగ్రెసు తోకగా అయిందన్న అభిప్రాయం పెరుగుట చూచి, "మహాప్రదర్శనోద్యమాన్ని" చేబట్టే ప్రచారం ప్రభుత్వ వ్యతిరేకంగా రూపొందకుండా జాగ్రత్త వహించారు.

## మితవాదుల నాయకత్వంలో జాతీయసమితి నిర్మాణ పంథా

పార్టీ ఐక్యతపై చావుదెబ్బ అక్టోబరు-నవంబరు 1962 తదనంతరం "డాంగే వర్గం" కొట్టింది. ఆ దశలోనైనా తమ చర్యలను వుపసంహరించుకొనమని చేసిన నంబూద్రిపాద్ విజ్ఞప్తి చెవిటివాని యెడల శంఖమైంది. వారి సంస్కరణవాద పంథా నంబూద్రిపాద్‌ను జనరల్ శెక్రటరి కేంద్రకార్యవర్గ సమితి, న్యూఏజ్ పత్రికా

సంపాదకత్వాలకు రాజీనామ చేయునట్లు పరోక్ష వొత్తిడి, పరిస్థితులు సృష్టించబడినవి

జాతీయసమితి నవంబరు 1962 తీర్మానాన్ని బలపరచలేదని, పశ్చిమ బెంగాల్ రాష్ట్రకమ్యూనిస్టుపార్టీ సమితిని రద్దుచేసి జాతీయసమితి రాష్ట్రఆర్గనైజింగు కమిటీని వేసింది. వాస్తవానికి జాతీయసమితి సమావేశానంతరం రాష్ట్ర కమిటీ సమావేశమై జాతీయసమితి తీర్మానాన్ని అమలు చేస్తానని తీర్మానించింది. అసెంబ్లీ పార్టీ నాయకుడు జ్యోతిబసు, అసెంబ్లీలో ప్రభుత్వ తీర్మానాన్ని బలపరస్తూ, తాను దానినిఅమలుచేస్తానన్నారు. జాతీయసమితి, రాష్ట్రఆర్గనైజింగు కమిటీలను కొన్నింటిని ఏర్పరచి పార్టీ అంతర్గత ప్రజాస్వామ్యంపై దెబ్బతీసింది. అనేక క్రమశిక్షణాచర్యలు తీసుకొనట తప్ప మరేమీ చేయజాలకపోయింది.

పంజాబులో సెక్రటరీ అరెస్టు చేయబడకముందు అతనిని సంప్రదించకుండానే రాష్ట్రకమిటి సమావేశం పిలువబడి మైనారిటి అప్పటి పరిస్థితిని అవకాశంగా తీసుకొని నాయకత్వాన్ని చేబట్టి, చాలమంది అరెస్టుకాబడివున్నందున, సరియైన ప్రతినిధులను ఎన్నుకొనకుండా న్యాయవ్యతిరేకంగా ప్రత్యేక కాన్ఫరెన్సును జరిపి, మైనారిటి నాయకత్వం యేర్పరచి దుష్ప్రచార కార్యక్రమాన్ని చేబట్టింది.

ఆంధ్రలో జాతీయ సమితి తీర్మానాన్ని వ్యతిరేకించిన వారికి స్థానముండరాదంటూ, సెక్రటేరియట్‌ను పునర్నిర్మాణం చేసారు. తీర్మానాన్ని ఆమోదించకపోయినా, అమలు చేస్తామన్నవారికి స్థానం లేకుండా చేసారు.

ఇతర రాష్ట్రాలలో, జిల్లాలలో యిదే పునరావృతమైంది.

## పార్టి ఐక్యతకై 'అతివాదుల' ప్రతిపాదనలు

ఆంధ్ర, తమిళనాడు, కేరళ రాష్ట్రాలలో అరెస్టు చేయబడిన కామ్రేడ్స్ విడుదల అయిన వెంటనే పార్టీ అంతర్గత సంక్షోభ పరిస్థితిని గమనించి, పార్టీ ఐక్యత పునరుద్ధరించుటకు కొన్ని ప్రతిపాదనలు చేసారు. "పార్టీ ఐక్యతకు ప్రమాదం, అధిగమించే విధానం" అనే నోటును 17మంది జాతీయసమితి సభ్యులు రూపొందించి అక్టోబరు 1963 జాతీయసమితి సమావేశంలో సమర్పించారు. పార్టీ అంతర్గత ఐక్యతను కాపాడుటకు ప్రథమ, కనీస అవసరమైన చర్యలు అని నొక్కి చెప్పారు.

అంతర్జాతీయ సైద్ధాంతిక భేధాభిప్రాయాలపై, మన పార్టీ స్వతంత్ర పార్టీగ తన స్వంత నిర్ణయాలకు పూర్తి ప్రజాస్వామిక సైద్ధాంతిక పార్టీ చర్చల అనంతరం నిర్ణయాలు చేస్తుంది. "మాస్కో అనుకూల" "పెకింగు అనుకూల" అనే ప్రశ్న ఉదయించదు. బహిరంగంగా సి.పి.యస్.యు.నుకాని సి.పి.సి. నిగాని విమర్శించము. మన పార్టీ చర్చల అనంతరం, నిర్ణయాలుచేయు వరకు ఇండియా-చైనా సరిహద్దు వివాదంలో పరిస్థితిని విషమింపకుండా చేయాలంటే శాంతియుత సంప్రదింపులు పరిష్కార అన్వేషణ మాత్రమే మౌలిక మార్పులను తీసుకొని రాగలదు,

"వర్ధమాన రాజకీయ పంథాపై 17మంది కామ్రేడ్స్" విజయవాడ పంథాను నేడు అధికారంలో వున్నవర్గం వ్యాఖ్యానించి, నిర్మాణ చర్యలు, వ్యక్తులపై క్రమ శిక్షణా చర్యలద్వారా ఎన్నికైన కమిటీలను రద్దుచేస్తూ, ఆర్గనైజింగు కమిటీలను ఏర్పాటు చేయుట పార్టీ విధానాన్ని అమలుచేయుటలో విఫలమగుటయేగాక పార్టీ ఐక్యతను కాపాడుటలో విఫలంకాక తప్పదు.

"ప్రజాసమస్యలపై "పనిచేయుటలోనే, ఐక్యకార్యాచరణ పెంపొందించుట లోనే మరింత ఐక్యత అవగాహన విజయవాడ పంథాయెడల యేర్పడగలదు పార్టీలో i) విజయవాడ పంథా పునర్విచారణ ప్రధానంగా గత సంవత్సరం నుండి పార్టీ పొందిన అనుభవాల దృష్టిలో ii) జాతీయ ప్రజాస్వామ్యం "పెట్టుబడిదారేతర పంధాలను" భారత నేపధ్యంలో iii) పార్టీ కార్యక్రమాలపై పార్టీలో అంతర్గత చర్చలు విస్తృతంగా జరగాలి" అని 17మంది జాతీయసమితి సభ్యులు ప్రతిపాదించారు. అందు నిమిత్తం అందరి విశ్వాసం పొందిన 7 గురు సభ్యులుగల కమిటీని యీ చర్చలు కొనసాగించుటకు యేర్పాట్లు చేయాలని ప్రతిపాదించారు. పార్టీ పత్రికలు పార్టీ నాయకత్వం వహించుచున్న వొకేవొక గ్రూపు భావాల ప్రచారానికి వుపయోగపడరాదు. అందరిచే ఆమోదించబడిన నిర్ణయాలు గైకొన్న విధానాలనే ప్రచారం చేయాలి.

"పరస్పర విశ్వాసాన్ని పెంపొందించుటకు పార్టీ ఐక్యత పెంపొందించు టకు పార్టీ అంతర్గత సంక్షోభంలో తీసుకొన్న నిర్మాణ చర్యలను, బెంగాల్ ఆర్గనైజింగు కమిటిని రద్దుచేసి రాష్ట్రకమిటిని పునరుద్ధరించుట, పంజాబ్‌లో రద్దుచేయబడిన రాష్ట్ర కమిటిని పునరుద్ధరించుట కా. గోపాలన్ సుందరయ్యలపై విచారణను ఆపివేయు టను ప్రతిపాదించారు.

"పార్టీ కాన్ఫరెన్సులు, కాంగ్రెసు ప్రజాస్వామ్య పద్ధతులలో జరుపుటకు విజయవాడ పార్టీ కాంగ్రెసుకు ప్రాతిపదికయైన పార్టీ సభ్యత్వాన్నే ఆదారంగా ఆమోదించాలి. పార్టీ సభ్యత్వాన్ని పునరుద్ధరించుకొనుటకు అందరికి అవకాశమివ్వాలి కొత్త సభ్యత్వపు ప్రాంతాలలో ఆమోద యోగ్యమైన పద్ధతులలో పరిశీలన జరగాలి.

ఈ 17 మంది చేసిన ప్రతిపాదనలు "చాలతీవ్రమైనవని" ఆమోదించుతునే కా. డాంగే పార్టీ ఐక్యత యెడల పిసంమాత్రమైనా శ్రద్ధ చూపలేదు పైగా "చైనా అనుకూలుర ప్రతిపాదనలంటూ 17మంది పార్టీలో బాధ్యతలను గుర్తించాలంటూ త్రోసిబుచ్చారు పార్టీలో అంతర్గత చర్చలు జరుపకుండా పార్టీని సి.పి.యస్.యు. పంథాకు అనుబంధంగా చేసారు. విచ్ఛిన్నకర క్రమశిక్షణాచర్యలును సమీక్షించకుండా కేంద్రకార్యవర్గసమితినుండి కా. గోపాల్‌ను 6 మాసాలు తొలగించుటకు ప్రతిపాదిం చింది, దానిని మార్చి సెన్సార్ చేసారు.

"జనరల్ బాడీ సమావేశాలలో సుందరయ్య యిచ్చిన వుపన్యాసాలపై "సంజాయిషీని" కోరుతు, పశ్చిమ బెంగాల్ రాష్ట్రకమిటిని పునరుద్ధరించుటకు నిరాకరించారు "డాంగే గ్రూపు విచ్ఛిన్నకర" నిర్మాణ విధానాలను కొనసాగించదలచినదనుట స్పష్టం ఇవి పార్టీలో ఏర్పడిన అఘాతాన్ని మరింత లోతుగ చేస్తవి.

"జాతీయసమితి సమావేశానంతరం డాంగే అతని అనుచరులు విచ్ఛిన్నకర నిర్మాణ చర్యలను అధికం చేసారు. ఆంధ్రలో కా. సుందరయ్య, బసవపున్నయ్య, హనుమంతరావు, నాగిరెడ్డి తదితరులపై అనేక నేరారోపణలు చేసారు. కా. సుందరయ్యను పార్టీనుండి బహిష్కరించాలనే నిరవధిక ప్రచారం సాగించారు. తమిళనాడులో అదే విధంగా కా. రామమూర్తిపై చేసారు. పంజాబ్ రాష్ట్ర సమితి కా. సూర్జిత్‌ను 6 మాసాలు బహిష్కరించుటకు నిర్ణయించింది. బాంబేలో అనేక మందిపై నేరారోపణలు, నోటీసులు యిచ్చి సంజాయిషీలు కోరబడినవి.

కా నంబూద్రిపాద్ 1963 ఫిబ్రవరిలో "రివిజనిజం అండ్ డాగ్మాటిజం ఇన్ కమ్యూనిస్టుపార్టీ ఆఫ్ ఇండియా" అను సుదీర్ఘ సిద్ధాంత పత్రాన్ని సమర్పించారు. పార్టీలో అంతర్గత చర్చలు కొనసాగించుటకు వొక కమిషన్‌ను ఏర్పాటు చేసారు. అయితే అది పని ప్రారంభించకముందే అంతరించింది

జనవరి 1964లో పార్టీ కేంద్రకార్యవర్గం సమావేశమైనపుడు 10 మంది కామ్రేడ్స్ 8 అంశాలుగల ప్రతిపాదనలుచేస్తూ పైఅభిప్రాయాలను పునరుద్ఘాటించారు.

పార్టీ కాంగ్రెసుకు పత్రాలను రూపొందించుటకు కమిషన్‌ను ఏర్పాటు చేయుటకు ఏకగ్రీవ నిర్ణయంకాక, డాంగేవర్గం తమ మెజారిటీని వినియోగించారు.

డాంగేలేఖల సమస్య

ఈ లేఖల కథనాన్ని ఫొటోస్టాట్ కాపీలుతో 7 మార్చి 1964 'కరెంటు' పత్రిక ప్రకటించింది కమ్యూనిస్టుపార్టీ జాతీయసమితి సెక్రటేరియట్ 13 మార్చి 1964న స్టేటుమెంటులో అవి ఫోర్జరీవని ప్రకటించింది ఉమానాద్, యం.పి. 20 మార్చి 1964న సి.పి.ఐ. సెక్రటేరియట్‌కు కేంద్ర ఎగ్జిక్యూటివ్ కమిటీలకు నోటు, లెటరులను, బసవపున్నయ్య 25 మార్చి 1964న, జాతీయసమితి దృష్టికి డాంగే లేఖలను తన అభిప్రాయాన్ని లేఖ ద్వారా తీసుకొచ్చారు. ఆ వెంటనే 26 మార్చి 1964న బసవపున్నయ్య, రామమూర్తులు ప్రెస్ కాన్ఫరెన్సులో పార్టీ సెక్రటేరియట్ లేఖల విషయంలో అనుసరించిన విధానం అంగీకరించజాలమని, యీ సమస్యను కేంద్ర ఎగ్జిక్యూటివ్ కమిటీ, జాతీయసమితుల పరిశీలనకు వదలక అవి ఫోర్జరీలని ప్రకటించుటకు తమ వ్యతిరేకతను బహిరంగంగా ప్రకటించారు. నంబూద్రిపాద్ 29 మార్చి 1964న పార్టీ సెక్రటేరియట్‌కు వ్రాసిన లేఖలో నాయకులిద్దరు పత్రికా ప్రకటన చేసి "పార్టీకి లెక్కకట్టలేనంత నష్టాన్ని కలుగజేసారని" నేరం మోపిన

"ఆరోపణలు అత్యంత తీవ్రమైనవని" పేర్కొన్నారు. వారు అనుసరించిన విధానాన్ని తీవ్రంగా విమర్శించుతూ వారు అవాస్తవిషయాలను కేంద్ర ఎగ్జిక్యూటివ్ కమిటి జాతీయ సమితుల ముందుంచి నేషనల్ ఆర్చుల్స్‌లో పరిశీలించి, తగు చర్య చేబట్టవలసిందిగా కోరవలసిందని" పార్టీ నిర్మాణ సూత్రాలను అతిక్రమించవలసింది కాదనే అభిప్రాయాన్ని వెలిబుచ్చారు.[1]

డాంగే లేఖలు సమస్యకు సైద్ధాంతిక భేదాభిప్రాయాలకు ఎట్టి సంబంధం లేదు, వాటి నిజనిజాలను తేల్చుట పూర్తిగ సాంకేతికసమస్య విప్లవ నిజాయితీ సమస్యగా పరిగణించాలి పార్టీ కేంద్ర శెక్రటేరియట్ "ఆర్చిల్స్"కు వెళ్ళిచూడకుండానే 13 మార్చి 1964న ఉత్తరాలు "ఫోర్జరీవని" అతివాదులు యీ ఫోర్జరీ వుత్తరాలు సర్క్యులేటుచేయుటకు బాధ్యులని ఆరోపించింది. "బహిరంగంగా చైనా నాయకత్వం ఫిబ్రవరి 4న వ్యాసంలో బహిరంగంగా ప్రతి కమ్యూనిస్టుపార్టీ చీల్చే విధానాన్ని అవలంభించుటతో, భారత కమ్యూనిస్టుపార్టీలోని, చైనా వాదనవాదులు పార్టీని చీల్చాలనే నిర్ణయానికి వచ్చారనే ప్రచారాన్ని, డాంగేని కాపాడితేనే తమ రాజకీయవిధానం కాపాడుతుందని, తమ ఉనికి రక్షింపబడుతుందనె ధోరణి వుధృతం చేసారు. లేఖల విషయంలో సిద్ధాంత భేదాభిప్రాయాలు అడ్డురావని, వాటిని పరిశోధించి పరిశీలించుటకు అందరి ఆమోదం వుంటుందనే అతివాదుల ఆశ పోయిందని తెలిపారు. పైగా శెక్రటేరియట్, డాంగేలు రెండు ప్రకటనలలో అతివాదులను "వియోత్రాట్కీవాదులుగ" చిత్రించుటతో, లేఖలను కలిసి, పరిశీలించే అవకాశం మృగ్యమైంది. ప్రతిగా కేంద్రకార్యవర్గ సమితి సభ్యులలోని తొమ్మిదిమంది, కా. గోపాలన్, జ్యోతిబసు, రామమూర్తి, బసవపున్నయ్య, సుందరయ్య, ప్రమోద్‌దాస్‌గుప్తా. జగజిత్ సింగ్ లోయల్పురి, హరికిషన్ కొనార్, హరికిషన్‌సింగ్ సూర్జిత్‌లు "పార్టీగౌరవాన్ని, విప్లవనిజాయితీని కాపాడుటలో శెక్రటేరియట్ ఉత్సుకతను చూపుతుందని జాతీయ ఆర్చెల్స్ ఫైళ్ళను పరిశీలించుటకు చర్యలు చేబట్టుతుందని ఆశించి,యేకారణం చేతనో శెక్రటేరియట్ ఆ పని చేయనందుకు నిరాశ చెందామని"ప్రకటించారు.

శెక్రటేరియట్‌కు జాతీయ సమితిని, కేంద్రకార్యవర్గసమితిని పిలుచుట తప్ప మరో మార్గంలేదు. కాని వాటి కొరకు వేచియుండక, "అతివాదుల నిందించుతు" వార్తాసంస్థల వద్దకు పరుగెత్తింది.

ఈ వాతావరణంలో కేంద్ర కార్యవర్గసమితి ఏప్రిల్ 9న, సమావేశమై, ప్రధానంగా మొదట డాంగే లేఖలను చర్చించుటకు బదులు, ఎజండాలో పార్టీనాయ

1. నంబూద్రిపాద్ ఇ.యం.యస్. (1964) లెటర్ టు శెక్రటేరియట్ డాక్యుమెంట్సు ఆఫ్ ది కమ్యూనిస్టు మూమెంటు ఆఫ్ ఇండియా (1997) X-B, 1964. పార్ట్. 1. పే. 293.

కులలో కొందరిపార్టీ వ్యతిరేక చర్యలపై తీర్మానం ప్రథమ అంశంగా డాంగే లేఖలపై చర్చ రెండవ అంశంగా వున్నవి. అతివాదులు, మొట్టమొదట డాంగేలేఖలు చర్చింపబడాలని, అట్టి సమయంలో డాంగే అధ్యక్షస్థానంలో వుండరాదని కోరారు. ఇది డాంగే, డాంగే అనుచరవర్గానికి ఆమోదయోగ్యం కాకపోగా పోగా భూపేష్‌గుప్తా రెండు అంశాలు ఒకేసారి ఒకే అంశంగా చేబట్టాలని కోరగా జ్యోతిబాసు మిటింగు తాత్కాలికంగా వాయిదావేయవలసినదిగా సాధారణ వొప్పందానికి ప్రయత్నించాలని ఆ విధంగా పార్టీ ఐక్యత కాపాడబడుతుంది. పార్టీ ఐక్యతకొరకు అతివాదులు ఆ విధంగా ప్రయత్నించగా డాంగేవర్గం తిరస్కరించింది. అతివాదులు మిటింగుకు సంబంధం లేకుండా వెళ్ళిపోవుట తప్ప మరేమి చేయజాలకపోయారు. తరువాత మితవాదుల మెజారిటి గల కేంద్రకార్యవర్గసమితి సభ్యులు సమావేశమై, పార్టీలో విచ్ఛిన్నకర చర్యలపై తీర్మానాన్ని ఆమోదించి 7 గురు సభ్యులను బహిష్కరించుతు జాతీయ సమితి ఆమోదానికి నివేదించింది. ఈ తీర్మానాన్ని ఆమోదించుటయే దానిని పత్రికలకు వెంటనే విడుదల చేసారు జాతీయసమితి సమావేశమై ఆమోదించిన తరువాతనే విడుదల చేయవలసిన దానిని త్వరపడి విడుదల చేసారు. జాతీయసమితి ఆమోదించే ముందు సెక్రటేరియట్ నంబూద్రిపాద్, జ్యోతిబసు, భూపేష్‌గుప్తాల సంప్రదించాలనే ప్రతిపాదన చేయబడింది. డాంగే తానులేకుండా సంభాషణల ప్రశ్నయే లేదన్నారు. అంచేత మొత్తం సెక్రటేరియట్ ఆ ముగ్గురు కామ్రేడ్స్‌ను కలవాలని నిర్ణయించబడింది. విచారణ సమయంలో తాను అధ్యక్ష పదవిని కాళీచేస్తే, అది ప్రాథమికంగా విచారించవలసిన సమస్యగా అంగీకరించినట్లు అవుతుందని డాంగే అన్నారు. జాతీయసమితి సభ్యులు అనేకమంది అప్పటికే ఆ లేఖలను అనేకమంది చూచారు. కాన విచారించవలసి వుంటుందనేది స్పష్టం అవి నిజమైన వుత్తరాలు కావని ఋజువుచేయుట యిప్పుడు డాంగే బాధ్యత. జాతీయసమితిచూడకుండా చర్చించకుండా "తనకు పవిత్ర పత్రాన్ని" యివ్వాలని డాంగే కోరుతున్నారు. దీనిని నంబూద్రిపాద్ పేర్కొన్నపుడు సెక్రటేరియట్ ఏమీ చేయ సాధ్యముకాదనే వైఖరి చేబట్టింది. డాంగే సెక్రటేరియట్‌లతో ఏ జెండాపై యెట్టి వొప్పందం సాధ్యపడ లేదు.[1] వ్యక్తిగతంగా సెక్రటేరియట్ సభ్యులందరూ డాంగె లేఖలు నిజమైనవని తలచారు, అంగీకరించారు కాని బహిరంగంగా దీనిని ఆమోదించలేదు. అవి 40 సంవత్సరాలక్రితపువి అని డాంగేపై సానుభూతి చూపారు. సంస్కరణ వాదానికి ముసుగు వేయుటకు వారంగీకరించలేదు. అందుకే చట్ట సమ్మతమైన జాయింటు విచారణ కమీషన్‌ను వారంగీకరించలేదు.

---

1. ఫైట్ ఎగ్నెస్టు రివిజనిజం పొలిటికల్ ఆర్గనైజేషనల్ రిపోర్టు (కమ్యూనిస్టు పార్టీ ఆఫ్ ఇండియా (మార్కిస్టు 7వ పార్టీ కాంగ్రెసు నవంబరు 7 1964 కల పే. 50

జాతీయసమితి సమావేశం నుండి 32 మంది వెళ్ళిపోయి ప్రకటన చేసారు. మెజారిటీ నిర్ణయానికి వారు బాధ్యులు కాదలచలేదు జాతీయసమితిలోని సగంకంటె తక్కువమంది సభ్యులు మూడోవంతు సభ్యులను సస్పెండు చేసారు. ఈ వాస్తవం బయటపడకుండా వుండగలందులకు, చైర్మన్ తీర్మానానికి అనుకూలురు ఎంతమంది అనిగాక, వ్యతిరేకించేవారు ఎంతమంది అని వోటు తీసుకొన్నారు.

ఈ సమావేశంలో కంట్రోల్ కమీషన్ నివేదికను సమర్పించింది. కమీషన్ లోని 5గురు సభ్యులలో యిద్దరు కా. హాలిమ్, రామంలు జైలులో వున్నారు. మిగిలిన ముగ్గురు పూర్తిగ డాంగే అనుచరులు.

కమీషన్‌ను రెండు సమస్యలపై i) పోటీపార్టీ కేంద్రం యేర్పాటు చేసారనే ఆరోపణపై ii) మెజారిటి ఫ్రాక్షనిజం అనుసరించిందనే ప్రత్యారోపణలపై విచారించవలసి వుండగా, నివేదికలో రెండో విషయమై పరిశీలన యెక్కడాకానరాదు.[1]

కమీషన్ అనుసరించిన విధానం పాక్షికత్వాన్ని నైజాన్ని విస్తృతంగా తెల్పుతుంది అంతేగాక i) ప్రత్యారోపణలు విచారించు ప్రయత్నం శూన్యం ii) నంబూద్రిపాద్, తనంతతాను "లీకేజస్" విషయంపై సాక్ష్యాధారాలను సమర్పించారు. కమిషన్ వాటిని వుదహరించనైనా వుదహరించలేదు. iii) సుందరయ్య తనకు వ్యతిరేకంగా వున్న సాక్ష్యాధారాలను తనముందు వుంచమన్నపుడు కమీషన్ నిరాకరించింది. iv) కమీషన్ యెవరి విషయమై విచారణ చేస్తుందో, వారినుండి ఎట్టి విచారణ కావించలేదు. ఆ విధంగా తమ తొత్తులను కొందరిని విచారించి వారి నుండి కొన్ని స్టేటుమెంట్సు తీసుకొని కమీషన్ నివేదికను సమర్పించింది. క్లుప్తంగా అతివాదుల అభిప్రాయాలు పై విధంగా వున్నవి.

డాంగే లేఖలపై 1970 దశకంలో పార్టీయేతర వర్గాల నుండి అదనపు సమాచారం కొంత లభించింది. ద్విజేంద్రనంది కొన్ని డాక్యుమెంట్సును ప్రకటించుతు సుదీర్ఘ ఉపోద్ఘాతం వ్రాసారు.

"కమ్యూనిస్టుపార్టీ జాతీయసమితి ఏప్రిల్ 1964 సమావేశంలో డాంగే లేఖలు ప్రధాన వివాదాంశమై తదనంతరం కమ్యూనిస్టుపార్టీ ఆఫ్ ఇండియా (మార్క్సిస్టు) గా తెనాలిలో కన్వెన్షన్‌ను యేర్పాటు చేసినవారు సమావేశాన్ని బహిష్కరించి 32 మంది వెళ్ళిపోయారు. డాంగే లేఖలపై వ్యాఖ్యానించుతూ, అటువంటి వుత్తరాలను నేనెప్పుడూ వ్రాయలేదని ఖచ్చితంగా చెప్పుతున్నాను. నా

1. ఫైట్ ఎగైన్స్టు రివిజనిజం పొలిటికల్ ఆర్గనైజేషనల్ రిపోర్టు కమ్యూనిస్టు పార్టీ ఆఫ్ ఇండియా (మార్క్సిస్టు 7వ పార్టీ కాంగ్రెసు నవంబరు 7 1964 కల పే. 50

వుత్తరాలని చెప్పుతూ సర్క్యులేటు చేయబడుతున్నవి బ్రిటిష్ రహస్యశాఖ కమ్యూనిస్టు వుద్యమాన్ని నాశనం చేయుటకు సృష్టించిన ఫోర్జరీ వుత్తరాలు"[1] అని జాతీయ సమితికి రిపోర్టులో పేర్కొన్నారు. ఆర్చైల్స్ ఉద్యోగులపై అనుమానాన్ని సృష్టించుటకు ప్రయత్నించారు డాంగే లేఖలలో ప్రధాన అసంగత విషయాలంటూ, మొదటిది కాన్పూరు జైలునుండి నేను వ్రాసిన ఉత్తరంలో "శ్రీపాద" అను సంతకంలో "డి" ని వాడాను, సితాపూర్ జైలునుండి వ్రాసిన వుత్తరములో "టి"ని సంతకాలలో నేను రెండు రకాలుగ వాడినట్లున్నది

"మీ సంతకాన్ని అక్షరాలను తప్పుగా వ్రాయుట సాధారణంగా జరుగదు. అది అసాధ్యం అందులో అట్టి అక్షరాల తప్పులు పూర్తిగ పేరులోనే మార్పు వస్తుంది నా పేరులో 'డి' నుండి 'టి' కు చేయబడిన మార్పు నా పేరు ఉచ్చారణలో అర్థంలో మార్పు తెస్తుంది.[2]" ఇదేకాక యింకా అనేక యితర చిన్న విషయాలను లేవనెత్తారు. వాటిని చూద్దాము.

"ప్రధమంగా "ఫోర్జరీ" అనే విషయం చూద్దాము. ఫోర్జరీ ఫోర్జరీ కొరకు యెవ్వరూ చెయ్యరు. డాంగే అనినట్లు "బ్రిటిష్ రహస్యశాఖ కమ్యూనిస్టు వుద్యమాన్ని నాశనం చేయుటకు ఫోర్జరీ వుత్తరాలను సృష్టించింది." 1924లో భారత దేశాన్ని 1947లో బ్రిటిష్‌వారు విడిచి వెళ్ళారు సుదీర్ఘమైన యీ కాలంలో బ్రిటిష్ ప్రభుత్వం యెప్పుడు వాటిని యే విధంగాను ఉపయోగించలేదు, అయినా మనలను డాంగె "కమ్యూనిస్టు ఉద్యమ నాశనానికి సృష్టించబడినవని" నమ్మమంటారు. ఆ వుత్తరాలు 1964 లోనె మొట్టమొదటగా ప్రకటించబడినవి బ్రిటిష్‌పాలకులు భారత దేశాన్ని వదలి వెళ్ళిన తరువాత 17 సంవత్సరాలకు జరిగింది. బ్రిటిష్ రహస్య శాఖ వొక లక్ష్యం లేకుండా వాటిని సృష్టించిందని మనం విశ్వసించితే తప్ప డాంగె వాదనను ఆమోదించజాలము.[3]

ఇప్పుడు బ్రిటిష్‌వారు వెళ్ళిపోయిన తరువాతవాటికి అధిపత్యం వహించుతున్న ఉద్యోగులు ఆ వుత్తరాలకు కారకులయ్యే అవకాశం గురించి డాంగే వెలిబుచ్చిన అనుమానము. జాతీయ "ఆర్చైల్స్" ఎప్పుడైన పరిశీలించిన వారికి ఆ ఫైల్లు యెలా జాగ్రత్త పరచబడుతున్నవి తెలుస్తవి ఫైలులోనికి వచ్చిన ప్రతిదానికి రసీదు, నోట్సు వుంటుంది. వచ్చిన ప్రతి నూతన పేపరు వరస నంబరుతో డైరీలో వ్రాయు

1. డాంగె, యస్.ఎ. (1964) రిపోర్ట్, న్యూయేజ్ (వీక్లీ) 24 మే 1964 పే. 9 కాలం 5.
2. ........అదే ......పే. 10 కాలం 4.
3. వంపి ద్విజేంద్ర (1971) సమ్ డాక్యుమెంట్సు రిలేటింగుటు ఎర్లీ ఇండియన్ కమ్యూనిస్టుసు అండ్ కాన్ట్రవర్సస్ ఎరౌండు దెం. పే. 24.

టికి ఫైలుకు చేరుతుంది. ఆ ఫైలు అంతకుముందువున్నది కావచ్చు లేదా విషయాన్ని బట్టి కొత్త ఫైలుగా రూపొందు, నిర్ణయం కొరకు నోట్సు వ్రాయబడుతుంది. ఈ సుదీర్ఘ విధానం క్రాస్‌రిఫరెన్సులతో అనేకమంది ఆఫీసరులు సహాయకులు, వివిధ స్థాయిలలోని గుమాస్తాలు వారి అభిప్రాయాలను నమోదు చేస్తారు. సంతకాలు చేస్తారు. డాంగే సూచించినట్లు ఆర్చైవ్స్ అధికారులు వాటిని ఫైళ్ళలో చేర్చుటకు విస్తృత యంత్రాంగం కావలసి వుంటుంది. డాంగే వుత్తరాలనేగాక అనేక సంతకాలు వారి స్వదస్తూరి నోట్సులు, పేజీల నంబర్లు అన్నీ వాటి కొరకు ఫోర్జరీ చేయవలసి వుంటుంది సర్ సెసిల్ కాయె, జెక్రీరార్ అనేక యితర ఆఫీసరులు సంతకాలు ఫైల్ నం. 421 పొలిటికల్ డిపార్ట్‌మెంటు-1924 ఫైల్ బి నం. 278/25-పొలిటికల్ తదితర సంబంధిత ఫైళ్ళలోని కమ్యూనిస్టు వుద్యమము వాటినన్నిటిలో ఫోర్జరీ చేస్తే తప్ప క్రాస్ రిఫరెన్సులు సరిగా వుండవు. అనేకమంది కలసి చేయవలసిన పెద్ద కుట్ర అగుతుంది రహస్యంగా వుంచుట అసాధ్యమగుతుంది. బ్రిటిష్ వారు వెళ్ళిపోయిన తరువాత "అధికారులు యీ వుత్తరాలను చేర్చారనే" దానికి యేమాత్రం ఆస్కారంలేదు.

డాంగె చెప్పే వాదన తాను రెండు రకాలుగ సంతకం చేయననే విషయమై 1 మే 1964 న పేట్రియట్ దినపత్రిక పే. 7. లో మెస్సర్స్ రైసిన పబ్లికేషన్స్ ప్ర. లిమిటెడ్ షేర్స్ కలవారి పేర్లను ప్రకటించింది. అందులో 11 పేర్లలో "5 శ్రీ. యస్ అమరత్" C/O కోహినూర్ రోడ్, బాంబె-14" అని వున్నది. ఈ శ్రీ యస్. అమరత్" ఎవరు అని గుర్తించవలసి వుంది. ప్రజా సోషలిస్టు పార్టీ నాయకుడు హెచ్.వి కామత్ అడిగిన స్టార్డ ప్రశ్న నం 158 ప్రశ్నకు సమాధానంగా ఆర్థికమంత్రిత్వశాఖలో ప్రణాళికా విభాగపు స్టేటు మినిష్టరుగావున్న బి ఆర్. భగత్, జూన్ 4, 1964న లోక్‌సభలో "మా ప్రాథమిక విచారణలో శ్రీ. అమరత్ అనే వ్యక్తి శ్రీ. శ్రీపాద అమ్రిత్ డాంగే అనే వ్యక్తియేయని కంపెనీ నిర్ధారణ చేసిందని" చెప్పారు. అంతేగాక "కంపెనీల చట్టానికి" వ్యతిరేకంగా లేనందున, ప్రభుత్వ చర్య ప్రశ్నయే లేదన్నారు.

మారు పేరుతో డాంగే షేర్లు కలిగియుండుట కల్లోలాన్ని కలిగించగా తాను కంపెనీకి 30,000రు: అప్పుగా యిచ్చానని తరువాత కంపెనీ తనకు షేర్లను ప్రత్యేకించిందని ప్రకటించాడు. కంపెనీల చట్టం ప్రకారం 1964లో అప్పు క్రింద షేరు యిచ్చుట జరుగదు షేరుకు వ్యక్తి అప్లికేషనుపై సంతకంచేసి సమర్పించవలసి వుంటుంది. షేర్లు 28 ఫిబ్రవరి 1963న తన వృత్తిని "సాంఘికసేవ" గ నమోదుచేసిన "శ్రీ.యస్. అమరత్‌కు యివ్వబడినవి. డాంగే ఎందుకు మారుపేరుతో అలా చేసారు? కారణం బహుశా కమ్యూనిస్టుపార్టీ కేంద్రకార్యవర్గసమితి 9-12మే

1959లో "లింక్" వారపత్రిక, పార్టీ సభ్యులు, నాయకులుపై వొక తీర్మానాన్ని ఆమోదించింది. "లిక్" పత్రిక భారత కమ్యూనిస్టుపార్టీ, అంతర్జాతీయ కమ్యూనిస్టు వుద్యమాలపై "అపనిందలను" ప్రచారం చేస్తుందని దానిలోని పార్టీ సభ్యులు రాజీనామా చేయాలని పార్టీ సభ్యులు నాయకులు దానిలో రచనలు ప్రచురించరాదని తీర్మానించేసినందున కావచ్చు. ఈ పార్టీ తీర్మానానికి వ్యతిరేకంగా పార్టీ అధ్యక్షుడే ఆ పత్రికతో తన పేరుతోనే సంబంధాలను ఎలా కలిగి వుంటాడు. "లింక్", "పేట్రియాట్"లు, రెండూ ఒకే యాజమాన్యంలోనివని 1964 జనవరి ఢిల్లీ టెలిఫోన్ డైరక్టరీ పే. 294, 379 లలో ఒకే టెలిఫోన్ నం.లు కలిగియుండుట బట్టి స్పష్టం.[1] అంచేత డాంగే తన పేరు బయటపడకుండుటకు ఫిబ్రవరి 1963లో మారు పేరుతో యస్. అమరత్ అని సంతకం చేసారు 1924లో తన సేవలను గవర్నర్ జనరల్‌కు సమర్పించుకొంటూ, గుర్తింపబడకుండుటకు తన సంతకంలోని 'డి'కి బదులు 'టి'ని కావాలనే వాడి వుంటారనుటకు అవకాశమున్నది.

## (iii)

## ఐక్యతా సంభాషణల వైఫల్యము

ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమంలో సోవియట్–చైనా కమ్యూనిస్టు పార్టీల బహిరంగ సిద్ధాంత చర్చలలో "వెలుగు"తోపాటు "వేడి" జనించుటతో సైద్ధాంతిక మధ్యేమార్గశక్తులు వియత్నాం, ఆఫ్రికా, లాటిన్, అమెరికాలలో ప్రధానంగా యీ శతాబ్దిపు వలససామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాలు జరుగుతున్నందున వాటి అవసరాల రీత్యా ఆవిర్భవించినవి. అయినా అవి అనేక కారణాలవలన శక్తివంతంగా తమ వునికి ప్రదర్శించి గుర్తింపునుపొంది ప్రపంచకమ్యూనిస్టు ఉద్యమం తమ ప్రభావాన్ని చూపజాలకపోయింది. భారత కమ్యూనిస్టుఉద్యమంలో అట్టి శక్తులున్నా అవి అంత బలంగా లేవు పైగా తీవ్ర అతివాద, మితవాద సిద్ధాంతపోరాటాలమధ్య నలిగిపోయి తమ వైఖరులను వినిపించజాలకపోయాయి. అయినా పరస్పర వ్యతిరేక రెండుపక్షాల వాండొరుల నాయకత్వాలపై విశ్వాసం లేనందున 1950 దశకం ప్రారంభంలో పార్టీ నాయకత్వాన్ని అజయ్‌ఘోష్‌కు క్రమేణా భారతకమ్యూనిస్టుపార్టీలో మధ్యేమార్గ అనుచరులు కొందరు సమీకరించబడుట ప్రారంభమగుటతో పార్టీ చీలికను వారికా

1. నంది, ద్విజేంద్ర (1971) సమ్ డాక్యుమెంట్సు........పే. 25-29,

కుండా కొంత వరకైనా పార్టీ ఐక్యతను కాపాడుతు వచ్చినా భారత-చైనా సరిహద్దు యుద్ధముతోను అజయ్‌ఘోష్ అకాలమరణంతోను "మితవాద" "అతివాదుల" మధ్య రాజీ వొప్పందాల యేర్పాటు విచ్ఛిన్నమై, యిరువర్గాలలోని వేర్పాటువాదులు మరింత బలపడినట్లు కన్పించుచున్నది. న్యూఢిల్లీలోని భూపేష్‌గుప్తా నివాసంలో 4 జూలై 1964న రాజేశ్వరరావు అధికారి భూపేష్‌గుప్తాలు సి. పి. ఐ ! సెక్రటేరియట్ సభ్యులు జ్యోతిబసు, ప్రమోద్‌దాస్‌గుప్తా హరికిషన్‌సింగ్ సూర్జిత్‌ల మధ్య ఐక్యతా సంభాషణలు జరిగాయి. బహుశా మధ్యేమార్గవాదుల అంత్యప్రయత్నమే యీ ఐక్యతా సంభాషణలు. అందుకు సూత్రధారి ప్రధానంగా భూపేష్‌గుప్తా అని చెప్పాలి.

జ్యోతిబసు సంభాషణలు ప్రారంభిస్తూ భూపేష్‌గుప్తా యేవిధంగా యీ సంభాషణలకు ప్రోద్బలకారకుడైనదీ వివరించి "మమ్ము చైనా యేజంట్లు" అన్న డాంగే ప్రకటనపై సంభాషణల వుపయోగమేమిటని ప్రశ్నించి భూపేష్‌గుప్తాకు సంభాషణలకు వస్తామని మాట యిచ్చినందున యీ సంభాషణలు జరుగుతున్నవన్నారు. మేము ఇక్కడకువచ్చిన తదనంతరం సెక్రటేరియట్ మరో ప్రకటన సూచాము. అది సెక్రటేరియట్ సంభాషణలు జరుపుటకు సంసిద్ధతను స్పష్టం చేసింది. భూపేష్‌గుప్తాకు జాతీయసమితి తీర్మానం ప్రాతిపదికగా సంభాషణలు జరిపేది లేదని స్పష్టం చేసాము. భూపేష్‌గుప్తా సెక్రటేరియట్‌చే సంభాషణలు జరుపుటకు వొక కమిటీ యేర్పాటు చేయబడిందని తెలిపారు. ఆ కమిటీ మమ్ముకలుసుకొన కోరికగలిగి వుందని అది తనకు గలిగిన అభిప్రాయంకాదని తెలిపారు. తాను ఫోను చేసినపుడు "మన యెప్పు కలుస్తున్నామని" రాజేశ్వరావు అన్నట్లు మాకు భూపేష్‌గుప్తా తెలిపారు. పార్టీ ఐక్యతా అవకాశాలను పరిశీలించుట అవసరమని మేము తలచాము. అతను సమావేశాన్ని యేర్పరచి మాకు వ్రాసారు అంచేత మేము వచ్చాము. ఇప్పుడు మీరు డాంగే స్టేట్‌మెంటు సెక్రటేరియట్ స్టేటుమెంటుల గూర్చి తెలుపండి. మా నాలుగు అంశాలపై మీ వైఖరిని తెలుచుకొనదలచాము. మీ వైఖరి గనుక మేము వెనుకకు తిరిగి రావాలి తరువాత మిగతా విషయాలు మాట్లాడుకొనవచ్చు. అంటే మేము దానిని మేము అంగీకరించము ఇక్కడ యేసంభాషణలు జరిగినా అవి ప్రాథమికంగా అభిప్రాయాలను తెలుసుకొనునవి మాత్రమే, విజయవాడలో వున్న మా కామ్రేడ్స్‌కు నివేదించవలసివుంటుంది[1]" అని తెలిపారు.

రాజేశ్వరరావు చైనా ఏజంట్లు" అన్నవిషయమై డాంగేను ప్రశ్నించగా తానలా అనలేదన్నారు. కొంతమంది కామ్రేడ్స్ చైనా అభిప్రాయాలతో యేకీభవించుచున్నారని అనగా వార్తాసంస్థలు ఆ విధంగా వ్యాఖ్యానించివుండవచ్చని అన్నారు. మేము

1. రిజల్యూషన్ ఆఫ్‌ది తెనాలి కన్వెన్షన్ ఆఫ్ ది కమ్యూనిస్టుపార్టీ ఆఫ్ ఇండియా (జూలై 7-11, 1964) పే 29-30.

మనం చైనా ఏజంట్లుగా అనుకొనుటలేదని చెప్పవలసి వుంటుందని కొన్ని అంశాలలో వారితో అంగీకరిస్తున్నారని అనవలసివుంటుదన్నాము మీరు డాంగేని బ్రిటిష్ ఏజంట్లుగా అన్నారని ప్రెస్ పేర్కొన్నవిధంగా అయివుంటుందన్నారు. వివరించమని అడుగుతామన్నారు రాజశ్వరరావు. తీర్మాన విషయమై ప్రస్తావించుతు మన ఉద్యమంలో తీవ్ర అభిప్రాయభేదాభిప్రాయాలున్నందున పార్టీ కాంగ్రెసు వరకు వొక వొప్పందానికి వచ్చుటకు సుముఖులమే, దానికి తీర్మానం అడ్డురాదు. అయితే వొప్పందం ఎవరిమధ్య రెండువైఖరుల దృకృధాల మధ్య అయితే మేము అర్థంచేసు కొనగలము కాని యిప్పుడు రెండు పార్టీల మధ్య మీరు మరో పార్టీగా పనిచేస్తున్నారు పైనుండి క్రిందవరకు అలా జరుగుతున్నది. వొప్పందం రెండుపార్టీమధ్య వొప్పదం అగుతుంది. ఆమోదం లేని సమస్యలపై మా విధానాన్ని మేము అనుసరించుతాము. ఉదాహరణకు ప్రస్తుత ప్రభుత్వం యెడల తీసుకొనవలసిన వైఖరి, పన్నులు విషయమై రెండు పార్టీలుగ, రెండు కార్యక్రమాలు అనుసరించుతాము. మరోవర్గం యేర్పడినా అంతె. ఒప్పందాల ప్రాతిపధికగా పనిచేయుట మాత్రమే మీ వంథా మరోషరతు, శెక్రటేరియట్ను, చైర్మన్ పదవిని రద్దుచేయాలి. ఈ వైఖరిని జాతీయసమితి తిరస్కరించింది. అది ఐక్యతకు మూడు షరతులు విధించింది. i) జాతీయసమితి అధికారాన్ని గుర్తించాలి. ii) పోటీ కమిటీలను రద్దుచేయాలి iii) పోటీపత్రికలను ఆపివేయాలి. వీటిని సూత్రప్రాయంగా ఆమోదించితే మనం వొప్పందానికి వచ్చుటకు ప్రయత్నించవచ్చును.

జ్యోతిబసు "ప్రజాకార్యక్రమాలు పార్టీపనులు తప్పనిసరిగా వొప్పందాల ప్రకారం జరగాలని మేము నిర్ణయించాము. ఈ ముఖ్యాంశాన్ని రాజేశ్వరరావుగారు గ్రహించారు. జాతీయ సమితిలో మీకు మెజారిటి వుందని మాకు తెలుసు. పార్టీ క్రింది వర్గాలలో మాకు మెజారిటి వుంది పార్టీలో అటువంటి సంక్షోభం వుందని మనం అంగీకరిద్దాము. వొప్పందం ప్రకారం ముందుకుకెళ్ళదాము. రాజేశ్వరరావు యిది పార్టీ ప్రాధమిక సూత్రం కాదంటారు.

భూపేష్‌గుప్తా "ప్రధాన సమస్యలపై నిర్ణయాలు చేయవలసివున్నా తీవ్ర అభిప్రాయభేదాలున్నట్లయితే వాయిదా వేద్దాం. ఉదాహరణకు కాశ్మీర్ సమస్య షేక్ అబ్దుల్లా యెడల అవలంభించవలసిన వైఖరి. మనం వాయిదా వేయవచ్చు స్వర్గం యేమి తల క్రిందుకాదు అని సూచించారు.

హరికిషన్‌సింగ్ సూర్జిత్, "డాంగే కాశ్మీర్ పంధా జనసంఘవైఖరే. మీరు దానివి అంగీకరించుతారా?" అని ప్రశ్నించి అటువంటి సమస్యలపై గత నిర్ణయాల ననుసరించి పనిచేయవచ్చు అని అన్నారు. నవంబరు 1962 ముందు అనేక విషయాలపై మెజారిటి నిర్ణయాల ననుసరించి పనిచేసాము కాని తీవ్రఅభిప్రాయ భేదాలున్నపుడు మనం వొప్పందాల మీధ ఆధారపడి పని చేయవలసి వుంటుంది" అనిఅన్నారు.

ప్రమోద్‌దాస్‌గుప్తా "ఊహా సమస్యలను చర్చించుట ప్రయోజన శూన్యం. మనం తీవ్రసంక్షోభంలో వున్నాము. గతంలో సంక్షోభాన్ని యీ విధంగా పరిష్కరించు కొన్నాము ఆ సాంప్రదాయాన్నే అనుసరిద్దాం. ఏప్రిల్ 1962లో చైర్మెన్ పదవిని సృష్టించుటకు యెందుకు అంగీకరించారు[1]" అని ప్రశ్నించారు

జ్యోతిబసు "మనం పార్టీ నిర్మాణ సూత్రాలను ఎన్నిసార్లు త్రోసిపేయలేదు. విజయవాడలో దానిని వ్యతిరేకించలేదే తరువాత ఏప్రిల్ 1962లో అదే జరిగింది, నేటి పరిస్థితి మేము మిమ్మ నమ్మలేము వారు మమ్ము నమ్మరు. మీరు మమ్ము, మా పత్రికలను ఆపివేయమంటున్నారు కాని మితవాదులను యెల్లప్పుడూ "కాలాంతర్" "మెయిన్‌స్ట్రీమ్" లాంటివి యెంతో కాలం క్రితం నుండి నడుస్తున్న వాటిని ఆపివేయ మని కోరలేదు. ఇక డాంగే సమస్య విచారించుటకు మీరు 7గురు సభ్యులు గల వొక కమిషన్‌ను నిర్ణయించారు. మాలో నుండి 3, 4 రను అందులో చేర్చుకొనుటకు అంగీకరించుతారా?

రాజేశ్వరరావు "మేమంగీకరించమన్నారు." ఇంకా యిప్పటికేమీ వైఖరి నవలం భించే కామ్రేడ్స్ కమిషన్ వున్నారు. అదనంగా మరికొందరనగా మెజారిటీ".

అధికారి "మనమందరం వొకే పార్టీగ వుండుటకు యిక్కడ కూర్చున్నాము. ఒకే పార్టి కాంగ్రెసుకై వున్నాము. మీకు అది కష్టముగా వుంటే మేము చేసేదేమీ లేదు జాతీయసమితివుంది పార్టీసంస్థలు పార్టీ సంస్థలుగ పనిచేయాలి. మీరు మెజా రిటీగ వుంటే మీరు యేమి చేసేవారు? చీలిక కన్పడుతున్నపుడు మనం యేదో వొకటి చేయాలి మీరు దీనిని ఆమోదించితే మేము కొన్ని సదుపాయాలను కలిగించుటకు సంసిద్ధులమే ఒక్కొక్క సమస్యను చేబట్టవచ్చును." అని అప్పటి వాస్తవ పరిస్థి తిని వ్యతిరేకించే వర్గాల పార్టీలో ఆధిక్యతలోవుంటే ఏమి చేసేవారో, దానినే చేసా మని పార్టీ శ్రేయస్సే ప్రధానంగా పరిగణించితే, పార్టీని చీల్చే అభిప్రాయం లేనిచో కొన్ని రాయితీలను కలుగజేయుట సంసిద్ధులమే. అని వివరించారు.

జ్యోతిబసు "సాధారణ ఆమోదం వుండే వున్నది. కాని దాని అర్థమేమిటి? అంటే జాతీయసమితి అధికారాన్ని మేము ఆమోదించుచున్నాము. కాని మీరు విజయవాడ నిర్ణయాలను విడనాడారని మేమనుకొంటున్నాము. మీరు హేతువాదానికి నిలబడుటలేదు మీరు దేనిని అంగీకరించుట లేదు. సైద్ధాంతికసమస్యలపై నిర్ధారణలు చేసారు మేము వెంటనే నిర్ణయాలు చేయవలసిన అవసరంలేదంటున్నాము. దానిని పార్టీ వర్గాలముందు సమాలోచనలు, చర్చలు కొరకు వుంచండి. యుగోస్లోవియా విషయంలో మీరు 81 దేశాల నిర్ణయాలను త్రోసిబుచ్చారు." అని అన్నారు.

హరికిషన్‌సింగ్‌సూర్జిత్ "ఎన్నో అభిప్రాయభేదాలున్నా గతంలో మేము

1. రిజల్యూషన్ ఆఫ్‌ది తెనాలి కన్వెన్ - పే. 31.

మెజారిటి నిర్ణయాలను శిరసా వహించాము ఇక ముందు అల్లా చేయజాలము. మౌలిక సూత్రాల సమస్యలపై మెజారిటీ, మైనారిటి అనే ప్రశ్నేలేదు" అని స్పష్టం చేసారు.

జ్యోతిబసు "కొన్ని సమస్యలపై కొంతకాలం వరకు నీ అభిప్రాయం వెలి బుచ్చకుంటే మీకు వచ్చిన కష్టమేమిటి?" అని ప్రశ్నించారు.

సూర్జిత్ "జాతీయసమితి మేము పేర్కొన్న అంశాలను నిరాకరించిందని అనుకోవచ్చా" అని ప్రశ్నించగా "అవును" అని రాజేశ్వరరావు అన్నారు.

అధికారి "సెక్రటేరియట్ రద్దు చేయబడదు. దానిని పునర్నించవచ్చును. కా. ఇ.యం.యస్. సెక్రటేరియట్‌లో మౌలిక మార్పులు జరగాలన్నారు. మేము దానిని అంగీకరించము పార్టీ కాంగ్రెసుకు ఆమోదించబడిన కమీషన్‌లేదు. సిద్ధాంత పత్రాలు తయారుగవున్నవి. సెక్రటేరియట్ నివేదికలు, తీర్మానాలు తయారుచేసి, చర్చావేదికను నిర్వహించుతుంది. ఛైర్మెన్ జనరల్ సెక్రటరీ పోస్టులు రద్దు చేయ బడవు డాంగె కమీషన్‌కు మరొకరిని ప్రతిపాదించవచ్చు, జాతీయసమితి సమితి మరొకరిని అదనంగా వేస్తుంది." అన్నారు.

రాజేశ్వరరావు "మీ పక్షాన్నుండి ముగ్గురు లేక నలుగురు వేయవలసివస్తే యిక విచారించవలసిన ప్రశ్న వుదయించదు? మీరు యింతకు ముందే మీ అభి ప్రాయాన్ని అధికారికంగా తెలియజేసారు" అన్నారు.

జ్యోతిబసు అంతేనా అర్థిక విషయాలపై ముఖ్యంగా "లింక్" "పేట్రీ యాట్"లపై కమీషన్ వేయబడుట కు అంగీకారమేనా? కేంద్ర కార్యవర్గ సభ్యు లెవ్వరూ "లింక్" పత్రికతో యెట్టి సంబంధాలను కలిగి వుండరాదని పార్టీ తీర్మానం వుంది. కాని డాంగే 30 వేలరూపాయలను "పెట్రియాట్" పేపరుకు యిచ్చి, వుంచుట స్పష్టం చేయబడింది.

రాజేశ్వరరావు "ఆర్థికాంశాలు ప్రత్యేకమైనవి ఆమోదించబడిన కమిషన్ అనే ప్రశ్నలేదు. అప్పుడప్పుడు కేంద్రకార్యవర్గసమితి ఆర్థిక విషయాలను చూడ వలసి వుంటుంది." అన్నారు.

జ్యోతిబసు "పార్టీ కాంగ్రెసుకై ఆమోదించబడిన కమిషన్‌ను కలిగి వుండు టకు మీరంగీకరిస్తారా? "అని ప్రశ్నించగా" యేకమిషన్‌ను మేమంగీకరించము, సెక్రటేరియట్ ఆ పని చేస్తుందన్నారు" రాజేశ్వరరావు. అధికారి "ఆ కమిషన్ చేయు పని యేమని? "ప్రశ్నించారు. దానికి సూర్జిత్ "పార్టీ అంతర్గత చర్చలను కొనసాగించుటకు చర్చావేదికను నడుపుటకు డాక్యుమెంట్సును తయారుచేయుటకు "అని సమాధానం చెప్పారు. అధికారి "సెక్రటేరియట్ యీ కార్యాలను నిర్వహించు తుందని కమిషన్ అవసరంలేదని" అన్నారు.

జ్యోతిబసు "నవంబరు 1962 నుండి తీసుకొన్న క్రమశిక్షణాచర్యలను వుపసంహరించుకొంటారా?" అని ప్రశ్నించగా "అవి చాలలేవు" అన్నారు. రాజేశ్వరరావు. వెంటనే దాస్ గుప్తా "పార్టీ కాంగ్రెసులో ఎన్నికైన పంజాబ్ రాష్ట్రసమితిని పునరుద్ధరిస్తారా?" అని ప్రశ్నించగా "లేదు" అని రాజేశ్వరావు సమాధానం చెప్పారు "మీరు తీసుకొన్న క్రమశిక్షణ యితర చర్యలను వెనుకకు తీసుకొంటారా?" అని సూర్జిత్ ప్రశ్నించగా" ఉన్నపాళంగా ఆ పని చేయలేము. వ్యక్తిగతకేసులను మేము పరిశీలించగలము. ఉదాహరణకు, ఆంధ్రలో రాష్ట్రసమితికి వ్యతిరేకంగా సర్క్యులేటు చేయబడిన డాక్యుమెంటుల విషయమై యిద్దరు కామ్రేడ్స్‌పై తీసుకొన్న క్రమశిక్షణాచర్యను పరిశీలించుటగాని, వుపసంహరించుటగాని జరుగదు. అన్ని క్రమశిక్షణా చర్యలను రద్దుచేయలేము" అని రాజేశ్వరరావు సమాధానమిచ్చారు.

దానికి సూర్జిత్ "మనం యీ వైఖరి అవలంభించితే,వారి విడుదలకై "సంజాయిషీలను" అండర్ టేకింగ్‌లను వ్రాసి యిచ్చినవారున్నారు. వారిపై మేము వెంటనే తీసుకొనమని మేము కోరుట లేదనగా రాజేశ్వరరావు "అది మీ స్వవిషయం" అని అన్నారు.

సంభాషణలు యిక్కడనుండి పార్టీ సభ్యత్వ పరిశీలనాంశాలవైపు మళ్ళినవి. జ్యోతిబసు "పార్టీ సభ్యత్వాలను పరిశీలించుటకు ఆమోదించబడిన కమిటీని ఏర్పాటు చేయుటకు మీరంగీకరిస్తారా?" అని ప్రశ్నించగా రాజేశర్వరావు "లేదు. మేము పార్టీ కమిటీలచే పరిశీలన చేయిస్తామని" అన్నారు దానికి సూర్జిత్ "ఆక్షేపణలు వచ్చి, వివాదాంశాలైన చోట్లగూడ ఆమోదించబడిన కమిటీ" పరిశీలనకు మీరు సిద్ధంగా లేరు" అని అనగా "ఆమోద పరిశీలనను మేము కోరుటలేదు." అని రాజేశ్వరరావు అన్నారు. దానిపై జ్యోతిబసు "మీరు 1961 సభ్యత్వాన్ని ఆధారంగా మీరు అంగీకరించుతారా? ఆ లిస్టులలో 40 వేల సభ్యత్వం చోటును కోల్పోయింది. కేంద్రకార్యవర్గ సమితిలో నా ప్రతిపాదన 3 వోట్లతో వీగిపోయింది. సకాలంలో సభ్యత్వాన్ని పునరుద్ధరించుకొనజాలని వారి విషయంలో మరొక అవకాశాన్ని యిచ్చుటకు మీరు సిద్ధంగా వున్నారా?" అని ప్రశ్నించగా "దాని అర్థం రెండు పక్షాలు పార్టీ సభ్యత్వాన్ని చేర్పించుటకై సభ్యులవద్దకుపోవుట మరిన్ని వివాదాలకు కారణమగుతుంది. కేంద్రకార్యవర్గ సమితి తీర్మానానికి కట్టుబడి వుండగలము" అని రాజేశ్వరరావు సమాధానమిచ్చారు. "దాని అర్థం, బీహార్, ప్రతిపాదనను మీరంగీకరించరు" అని సూర్జిత్ అనగా 'జైలులో వున్నందువలనగాని, మరి యితర ప్రత్యేక కారణం వలనగాని చేరలేకపోయినవారికి జాతీయసమితి తీర్మానం మరో అవకాశమిస్తుంది. మేము ఆయా కేసులను సెక్రటేరియట్ ఆమోదాన్ని బట్టి పరిశీలించ

గలము" అని అధికారి అన్నారు. 'దాని అర్థం పాతకేంద్ర కార్యవర్గసమితి తీర్మా నాన్ని దాటివెళ్ళదలచుకొనలేదు." అని సూర్జిత్ అనగా "అవును" అన్నారు రాజేశ్వరరావు.

ఈ దశలో ప్రమోద్‌దాస్‌గుప్తా "మేము డాంగేను చైర్మన్‌గా ఆమోదించితే, పాత సెక్రటేరియట్‌ను మీరు పునరుద్ధరించుతారా, నంబూద్రిపాద్‌ను తిరిగి జనరల్ సెక్రటరీగా చేయుటకు మీరు సంసిద్ధులేనా" అని ప్రశ్నించి సంభాషణలను మరో వైపు మళ్ళించారు. దానికి" "లేదు నేడు ఆ సమతూకములేదు. నేటి పరిస్థితులు స్థానాలలో చాలా మార్పులొచ్చాయి. ఆసమతూకాన్ని నేడు పునరుద్ధరించుటకు మేము సంసిద్ధులంకాము. జాతీయసమితిలోనున్న మెజారిటియే సెక్రటేరియట్‌లో కొనసాగాలి పాత సెక్రటేరియట్ ఆసమతూకాన్ని తలక్రిందులు చేస్తుంది. అది జాతీయసమితి ప్రతిబింబం కాజాలదు" అని రాజేశ్వరరావుగారన్నారు. జ్యోతిబసు "సమతూకం యే విధంగా మారుతుంది? భూపేష్‌ను మీరు ఎక్కడ లెక్కపేస్తున్నారు ?" అని ప్రశ్నించారు. దానికి "రాజకీయంగా మావైపు, నిర్మాణరీత్యా గట్టిగా చెప్పజాలను అప్పుడప్పుడు మీ వైపు వుంటారు. మేము రిస్కు తీసుకొనదలచలేదు[1]" అని రాజేశ్వరరావు అన్నారు. దానికి భూపేష్‌గుప్తా "నేను లేకుండా పాత సెక్రటేరియట్‌ను పునరుద్ధరించండి. అది జాతీయసమితికి పూర్తి మెజారిటి నిస్తుందని" ప్రతిపాదించారు.

రాజేశ్వరరావు "అట్లుకాదు. కొంతమంది తటస్థులున్నారు. వారికి ప్రాతినిధ్యం పునర్నిర్మించబడిన సెక్రటేరియట్‌లో వుండవలసి వుంటుంది". అని అన్నారు. దానికి జ్యోతిబసు" దాని అర్థం. మా ప్రతిపాదనలేవీ మీకు ఆమోదంకావు. ఎన్నికైన జాతీయసమితిని గుర్తించమని అంటారు, కాని యేకగ్రీవంగా ఎన్నికైన సెక్రటేరియట్‌ను మీరు ఆమోదించరు" అని అన్నారు. "అవును అదే నేటి పరిస్థితి పరస్పర విశ్వాసంలేదు. మేము మా మెజారిటి విషయమై గట్టిగా వుండదలచాము. అని రాజేశ్వరరావు సమాధానమిచ్చారు, అధికారి సరళంచేస్తూ. "జాతీయ సమితి తీర్మానాన్ని మీరు ఆమోదించినట్లయితే, మీకు స్థానాన్ని కలిగించు విషయమై ఆలోచించగలము. నాలుగుసంవత్సరాల తరువాత మనం తిరిగి ఆలోచించవలసి వుంటుందని అనుకొంటున్నాను. సమావేశం వుపయోగకరమైంది. మనం వొండురులను అర్థం చేసుకొనుటలో వుపయోగపడింది"అని అన్నారు.

ఉభయ పక్షాల మధ్యగల సైద్ధాంతిక, రాజకీయ అభిప్రాయ భేదాల సమస్య

---

1. రిజల్యూషన్స్ ఆఫ్ తెనాలి కన్వెన్షన్ ఆఫ్ కమ్యూనిస్టుపార్టీ ఆఫ్ ఇండియా జూలై 7 1964 (ఆంగ్లంలో) రిపోర్ట్ ఆన్ 'యూనిట్ టాక్స్ పే. 29-35లో పే. 34.

లను ఒక ప్రత్యేకపార్టీ కాన్ఫరెన్సులో చర్చించి నిర్ణయాన్ని తీసుకోనాలని అతివాద వర్గం కోరింది ఆ ప్రత్యేక కాన్ఫరెన్సు అంతకు ముందు పార్టీ మహాసభ జరిగినపుడు వున్న పార్టీ సభ్యత్వాన్ని ఆధారం చేసుకొని ప్రతినిధులను ఆ ప్రత్యేక కాన్ఫరెన్సుకు ఎన్నుకోనాలని అతివాదవర్గం కోరింది. ఇది మితవాదవర్గానికి అంగీకారం కాలేదు. సి.పి.ఐ చీలికలకు ముందు యాధృచ్ఛికంగా నాయకత్వ సంస్థలో తనకున్న మెజారిటి సభ్యులను ఆధారం చేసుకొని తమ రాజకీయ నిర్మాణ సంబంధమైన ఆధిక్యతను మొత్తం పార్టీ ఆమోదించాలని మితవాదవర్గం పట్టుబట్టింది. దీనిపై నంబూద్రిపాద్ యిలా వ్యాఖ్యానించారు. "చీలికకు ముందు యాదృచ్ఛికంగా తమకున్న మెజారిటిని ఆధారం చేసుకొని తమతో విభేదించిన వారిపై క్రమశిక్షణా చర్యలను తీసుకొనుటకు మితవాద పక్షం తయారైంది. పార్టీలోగల రాజకీయ నిర్మాణ సంబంధమైన సమస్యలపై ప్రజాతంత్రయుతంగా పరిష్కారం చేసుకోవాలని వామపక్షం పదేపదే చేసిన విజ్ఞప్తులను వారు నిరాకరించారు. ఆ పరిస్థితులలో సి.పి.ఐ. లోని వామపక్షం[1] తప్పనిసరిగా వేరు పార్టీని సి.పి.ఐ (యం) పేరుతో స్థాపించుకోవలసిన అవసరం యేర్పడింది.

మరో నిర్మాణ సంబంధ సమస్య, నవంబరు 1962 నుండి తీసుకొన్న క్రమశిక్షణా చర్యలను వుపసంహరించుకొంటారా అనే ప్రశ్నకు, ఉన్నపాళంగా ఆ పని చేయలేమని వ్యక్తిగత కేసులను మాత్రం పరిశీలించగలమనే సమాధానం లభించింది. అలాగే అతివాద శక్తుల ప్రభావంలో నడుస్తున్న పత్రికలను మూసివేయగలరా అనే ప్రశ్నకు మితవాద శక్తుల ప్రభావంలోని పత్రికలు ఎంతోకాలం నుండి నడుస్తున్నా వాటిని మూసివేయుట జరుగలేదు కదా అనే సమాధానం వచ్చింది.

ఈ విధంగా ఐక్యతా సంప్రదింపులు ప్రధానంగా సైద్ధాంతిక రాజకీయసమస్యలపై చర్చించి యేకాభిప్రాయానికి వచ్చిన సమస్యలపై ఆమోదంపొందగల కార్యక్రమాలను చేబట్టుతు, వివాదగ్రస్థ అంశాలను చర్చలను కొనసాగించుట లేక కొంత కాలము వాయిదా వేయుటకు వొప్పందానికి వచ్చు ప్రయత్నం చేయుటకు మారుగ విభేదాలను తీవ్రతరం చేసుకొంటూ సైద్ధాంతిక రాజకీయ సమస్యకంటె నిర్మాణ సమస్యలకు యెక్కువ ప్రాముఖ్యత నిచ్చుట అన్యవర్గ భావాలు పార్టీలో ఎలాచోటు చేసుకొన్నవో స్పష్టం చేస్తున్నది.

జ్యోతిబసు "మేము స్పష్టంగా అర్థం చేసుకొనగలిగాము" అన్నారు. అంతటితో సమావేశం ముగిసింది. ఇరుపక్షాలు "రాజీద్వారాలను మూసుకొనే సమావేశానికి వచ్చినందున "సంభాషలు విఫలమయ్యాయి ఇరుపక్షాలు తటస్థులను తమవైపుకు ఆకర్షించుటకు ఎత్తుగడగా సంప్రదింపులు జరిపారు.

---

1. ఇ.యం.యస్. నంబూద్రిపాద్ 1999 భారత రాజకీయాల సిద్ధాంత ఆచరణలకు కమ్యూనిస్టుల దోహదం ప్రజాశక్తి-ప్రచురణ, పే. 21

# అఖిల భారత అతివాద కమ్యూనిస్టుల తెనాలి కన్వెన్షన్.

భారత కమ్యూనిస్టుపార్టీ జాతీయసమితి నుండి బయటకు నిష్క్రమించిన పుడు అతివాద కమ్యూనిస్టులు 32 మంది, పార్టీ సభ్యులకు సానుభూతిపరులకు, ప్రజాస్వామ్యానికి విజ్ఞప్తి చేస్తూ ప్రకటన చేసారు. ఈ విజ్ఞప్తి. పార్టీలో కలుగజేసిన స్పందనను పరిశీలించి భవిష్యత్ కార్యాచరణను నిర్ణయించుటకు తెనాలిలో 146 మంది, "ఒక లక్ష పార్టీ సభ్యులకు ప్రాతినిధ్యం వహించేవారు, జూలై 7-11, 1964లలో కన్వెన్షన్ సమావేశం జరిపారు.

జాతీయసమితి 32 మంది విజ్ఞప్తిలో డాంగేవర్గం వారి కాంగ్రెసు-కమ్యూనిస్టు ఐక్యతా పంథాను ముందుకు తీసుకొనిపోవుటకు, అత్యవసర పరిస్థితిని జాతీయ సమితిలో తమ మెజారిటీని వినియోగించి క్రమశిక్షణా చర్యలు తమ ప్రత్యర్థులపై వుపయోగించి పార్టీలో తమ పూర్తి ఆధిక్యతను నెలకొల్పుటను స్థూలంగా పేర్కొన్నారు అంతేగాక రాజకీయ ప్రత్యర్థులను "పెకింగు పంథా అనుచరులుగ" పార్టీ వ్యతిరేక గ్రూపుగా నిరసించి, ప్రజాస్వామ్యవిధానాలలో పార్టీ కాంగ్రెసు జరుపుటకు తగిన పరిస్థితులను కలుగజేయుటకు మేము చేసిన అన్ని ప్రతిపాదనలను త్రోసి పుచ్చారు. పైగా వారి పంథాను వ్యతిరేకించే సమర్థులైన పార్టీ ''అతివాద" నాయకులపై క్రమశిక్షణా చర్యలను తీసుకొని, పార్టీ కాంగ్రెసుముందు జరుగుచున్న చర్చలలో పాల్గొనకుండా చేసారు, పార్టీ కాంగ్రెసు ప్రతినిధులు కాకుండా చేసారు.[1]

మేము మా విజ్ఞప్తి ఆధారంగా పార్టీ అంతర్గత చర్చలు కొనసాగించాము, పార్టీ కమిటీలను శాఖలను పార్టీ సభ్యులను కలసి మా పంథాను వివరించాము. డాంగే ముఠా అనుసరించుతున్న సంస్కరణవాద పంథాను మెజారిటీ వ్యతిరేకించుతు, పార్టీ ఐక్యతను కోరుతున్నారు.

ఈ నేపథ్యంలో తెనాలి కన్వెన్షన్ జరిగింది, అది వెలిబుచ్చిన అభిప్రాయాలు క్లుప్తంగా యీ విధంగా వున్నవి.

1. సైద్ధాంతిక సమస్యలపై మాలో భేదాభిప్రాయాలున్నవి సమావేశంలో "సైద్ధాంతిక సమస్యపై వొక నోటు" అధ్యయనం కొరకు పంచబడింది. వివిధవైఖరులు అందులో వివరించబడినవి. కా. నంబూద్రిపాద్ అంతర్జాతీయ సైద్ధాంతిక సమస్యలపై తన అభిప్రాయాలను యింతకుముందే తెలియజేసారు. తన అభిప్రాయ భేదాలు చాలాకాలంనుండి వున్నవి. అక్టోబరు1963లో మాలో కొంతమందిమి జాతీయ

---

1. రిజల్యూషన్స్ ఆఫ్ తెనాలి కన్వెన్షన్ ఆఫ్ కమ్యూనిస్టుపార్టీ ఆఫ్ ఇండియా జూలై 7-11, 1964 పే. 1,

సమితికి, యీ అభిప్రాయభేదాలను యెలా పరిష్కరించుకోవాలో ప్రతిపాదనలు చేసాము స్వతంత్రపార్టీగ మనపార్టీ పూర్తి ప్రజాస్వామిక చర్చల అనంతరం అంతర్జాతీయ కమ్యూనిస్టు వుద్యమంలోని సైద్ధాంతిక సమస్యలపై స్వతంత్ర నిర్ణయాలను పెకింగు అనుకూలమా, మాస్కో అనుకూలమా అని కాక, సి. పి. యస్. యు.పై గాని సి. పి. సి పైగాని విమర్శనను మన చర్చలు ముగియు వరకు చేయకుండా వుండాలనే ప్రతిపాదించాము. జాతీయసమితి మా సూచనను పాటించక కీలకపక్షవాదనలను చేబట్టింది. పై సూచనపై ఆధారపడి పార్టీ కాంగ్రెసు అనంతరం అంతర్జాతీయ సైద్ధాంతిక సమస్యలపై చర్చలను సాగించి నిర్ణయాలను చేస్తుంది. కా. నంబూద్రిపాద్ సూచన ననుసరించి మన రాజకీయ సైద్ధాంతిక అభిప్రాయాలపై ప్రభావం కలిగివుండే తక్షణ ముఖ్యసమస్యలపై ఉదాహరణకు శాంతియుత పరివర్తన సహజీవన సమస్యలను చిత్తు కార్యక్రమంతోపాటు చర్చించి నిర్ణయిస్తుంది.

2) అతివాద కమ్యూనిస్టుల తెనాలి కన్వెన్షన్ చిత్తుకార్యక్రమాన్ని, చిత్తుతీర్మానంపై నంబూద్రిపాద్ నోటును మరో మూడు చిత్తులు డాంగే, భూపేష్‌గుప్తా జోషిల నోటులు లేక సిద్ధాంతపత్రాలను సర్కులేటు చేసి, చర్చలకు ఉపక్రమించింది. తక్షణ సమస్యలపై ముఖ్యంగా కార్యక్రమముపై చాలావరకు విస్తృత ఆమోదం కలిగి వున్నారు. కా. నంబూద్రిపాద్ కొన్నివిషయాలపై తన అనంగీకారాన్ని తెలియజేసారు. చిత్తు కార్యక్రమంలో జాతీయాంశము తక్కువగా అంచెనా వేయబడిందనేది నంబూద్రిపాద్ ప్రధానవిమర్శన, బూర్జువా జాతీయైక్యతపై మార్క్సిస్టు లెవినిస్టు విమర్శనలేదని మత, కుల, ఆటవిక జాతుల సమస్యపై సరియైన అవగాహన యివ్వలేదనేవి. తదితర విమర్శాంశాలు. అనేకమంది ప్రతినిధులు వీటిని బలపరచారు. వర్గాల ఐక్యతా సమస్యపై కూడా నంబూద్రిపాద్ చిత్తు కార్యక్రమంతో విభేదించారు. ముఖ్యంగా దేశ, విదేశీయ గుత్తపెట్టుబడిదారుల మధ్య అభివృద్ధిచెందే వైరుధ్యం నంబూద్రిపాద్ అవగాహన, పెట్టుబడిదారీ విధాన సంక్షోభం మూడవదశలో, దేశంలో పెట్టుబడిదారి విధానం అభివృద్ధి అయిన కొలది, విదేశీయబూర్జువావర్గం ప్రభుత్వాధికారాన్ని తన అభివృద్ధికి వుపయోగించినకొలది విదేశసామ్రాజ్యవాదంతో దాని పోరాటం అభివృద్ధి చెందుతుంది. చిత్తు యీ వైరుధ్యాన్ని తక్కువగా వేసిందని నంబూద్రిపాద్ అభిప్రాయం. అంటే సామ్రాజ్యవాదం, జాతిమొత్తంగా బడాబూర్జువావర్గంతో సహా మధ్యవ గల వైరుధ్యాన్ని తక్కువఅంచెనా వేసిందని, నంబూద్రిపాద్ అవగాహనను చాలామంది వ్యతిరేకించి మాట్లాడారు. కార్యక్రమానికి నంబూద్రిపాద్ సూచించినది మూడో ముఖ్యాంశం, జాతీయ ప్రజాస్వామ్యం పెట్టుబడిదారేతర పంధా ముఖ్యసమస్యలు. ఈ సమస్యపై, చిత్తుకార్యక్రమంలోని అవగాహనను తాను పూర్తిగ వ్యతిరేకించుటలేదని, జాతీయప్రజాస్వామ్యం, పెట్టుబడిదారేతర పంధాలపై

తన అవగాహన, డాంగే అవగాహనకు భిన్నమైనదని స్పష్టంచేస్తూ, ముఖ్యంగా జాతీయప్రజాస్వామ్యంలోని వర్గమైత్రిత్వం విషయమై కార్మికవర్గనాయత్వం, కార్మిక, కర్షక మైత్రి భూమికగా లేని యే వర్గ సంఘటనా మైత్రిని, తాను వూహించుట లేద న్నారు చర్చల అనంతరం చిత్తుకార్యక్రమం, కా. నంబూద్రిపాద్ విమర్శన, చర్చల నిమిత్తం పార్టీ సభ్యులందరికి సర్క్యులేటుచేసి, పార్టీ కాంగ్రెసులో చర్చించి,నిర్ణయం తీసుకొనాలని నిర్ణయించబడింది.

3 పార్టీ ఐక్యత, 7వ, పార్టీ కాంగ్రెసు సమస్యలపై కన్వెన్షన్ చర్చించి తీర్మానించింది. నంబూద్రిపాద్‌చే ప్రతిపాదించబడిన తీర్మానంలో "32 మంది కామ్రేడ్స్ ఆశించినది పూర్తిగ నెరవేరిందని" పేర్కొన్నది. అత్యధిక పార్టీసభ్యులు జాతీయసమితి నుండి బయటకు నడుచుటలోని ఔచిత్యం యెడల సందేహం కలవారు అందరూ 32 మంది ప్రకటనలోని ప్రతిపాదనలు సరియైనవని, ఆ విధంగా సంయుక్త పార్టీ కాంగ్రెసుకు మార్గమని ఆమోదించారు. కన్వెన్షన్ 32 మంది కామ్రేడ్స్‌ను బలపరచినవారికి, అభిప్రాయభేదాలున్నా 32 మంది చేసిన ఐక్యతా ప్రతిపాదనలను బలపరచు వారందరికి కృతజ్ఞతాభివందనాలు సమర్పించింది

"డాంగేముఠా మాటలలో ఐక్యత ప్రస్తావించినా, సంభాషణలలో పార్టీనిర్మాణ సూత్రాల ఆధారంగా వ్యతిరేకంగానే వ్యవహరించింది. ప్రతి రాజకీయ నిర్మాణ సమస్యలపై నిర్ణయాలు మెజారిటీ ఆమోద పై జరగాలి అనేదే ఆ సూత్రము. వారు యీ సూత్రాన్ని 32 మంది ప్రతిపాదనలను వ్యతిరేకించుటకు ఉపయోగించారు ప్రధాన సమస్యలను పార్టీ ఐక్యతను నిర్ధారించునపుడు వొప్పందాల ద్వారా పరిష్కరించుకొనాలి. దీనికి వారు మైనారిటీకి వీటో హక్కును యివ్వటమేనని అది పార్టీని నిర్వీర్యంచేసి, పక్షపాతరోగంలోనికి దింపుతుందని అంటారు

"నేటి జాతీయ సమితి కేంద్ర కార్యవర్గం, సెక్రటేరియట్ పార్టీ చైర్మన్ ఒప్పంద సూత్రప్రకారం యేర్పడిన వనుట స్పష్టమే. అయితే సూత్రాన్ని నేడు నిరాకరించుట, వారి వాదనలోని అనౌచిత్యాన్ని తెలియజేస్తుంది. జాతీయసమితి 6వ, విజయవాడ పార్టీ కాంగ్రెసులో ఎన్నుకొనబడలేదు. జాతీయసమితి పేర్లపానెలుపై తీవ్ర అభిప్రాయభేదాలు కారణంగా మెజారిటీతో నిర్ణయం జరుగలేదు. పార్టీలో సంక్షోభం యేర్పడింది, అది వొప్పందంతో పరిష్కారమైంది. నేడు వొప్పందం ద్వారా పరిష్కారమన్న దానిని, నేడు సూత్రబద్ధం కాదని వ్యతిరేకించేవారు, నాడు వ్యతిరేకించలేదు ఆ వొప్పందం కొరకు పార్టీ కాంగ్రెసు సూత్రాలకు భిన్నంగా పోయి, పార్టీనిర్మాణ సూత్రాలకు సవరణలు ఆమోదించింది. ఎజెండాలో లేనిది జరిగింది. తిరిగి ఏప్రిల్ 1962లో జాతీయసమితి ఆఫీసు కార్యనిర్వాహకులను ఎన్నుకొనవలసి వచ్చినపుడు, అంతగా చెప్పబడే మెజారిటీచే ఎన్నుకొనబడే సూత్రాన్ని

త్రోసిబుచ్చి అంతగా తెగనాడే ఒప్పందంపై నిర్ణయాలు జరిగినవి. నిర్మాణసూత్రాల ప్రకారం ఆ విధంగా చేయుటకు జాతీయసమితికి కూడ అధికారం లేదు. నూతనంగా ఒక చైర్మెన్‌ను కేంద్రకార్యవర్గసమితి సంఖ్యను పెంచుతు ఒప్పంద నిర్ణయాలు జరిగాయి. ఆ దశలో కూడ నేటి శెక్రటేరియట్‌గా ఉన్నవారు ఒప్పందంపై నిర్ణయాలను తీవ్రంగా వ్యతిరేకించేవారు, మెజారిటి ఆమోదంతో నిర్ణయాలు అనే సూత్రానికి ఆ రోజు కట్టుబడిలేరు. అందుకు విరుద్ధంగా అధికారపదవులలో స్థిరపడి పోవుటకు ఆ అవకాశాన్ని వినియోగించుకొని, తరువాత ఆ స్థానాలను వినియోగించుకొని తమ ముఠా, ఫ్రాక్షన్‌ను బలపరచుకొన్నారు.

4. తీర్మానం చివరలో 32 మంది కామ్రేడ్స్‌కు మద్దతుగా సమీకరించబడిన పార్టీ సభ్యులందరికి, 7వ, పార్టీ కాంగ్రెసు జరుపుటకు సహాయ సామగ్రాతులందించవలసినదిగా కన్వెన్షన్ విజ్ఞప్తి చేసింది. అందుకే మాకు పార్టీని పునర్నిర్మించుటకు సహాయ పడిందని కన్వెన్షన్ కోరింది.

కన్వెన్షన్ భారత కమ్యూనిస్టుపార్టీ 7వ, కాంగ్రెసు అక్టోబరు- 24-31, 1964లో కలకత్తాలో జరగాలని నిర్ణయించింది. అందుకుగాను, 41 మంది గల కేంద్ర ఆర్గనైజింగ్ కమిటిని కార్యనిర్వాహకవర్గసమితిని, శెక్రటేరియట్‌ను పార్టీ కాంగ్రెసుకు సన్నాహాలను యేర్పాటులను చేయగలందులకు ఎన్నుకొంది.[1].

# (V)

# ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమంలోని సిద్ధాంత పోరాటం ప్రేరితమే భారత కమ్యూనిస్టుపార్టీలోని అంతర్గత పోరాటం చీలిక

ఈ శతాబ్దంలో సోవియట్ యూనియన్ సోషలిస్టు విప్లవం, చైనా వ్యవసాయ ప్రజావిప్లవం భారత ప్రజలు పాలకవర్గాలలో కలిగించిన స్పందనలు భిన్నంగావున్నవి. ప్రజలు రెండింటిని ఆనందోత్సాహాలతో ఆహ్వానించారు. తమ స్వాతంత్ర్య పోరాటాలకు ఉత్సాహాన్ని ఉద్రేకాన్ని నూతన ఆదర్శాన్ని చూసారు. భారత

1. సూర్జిడ్, హరికిషన్‌సింగ్ (1964) తెనాలి కన్వెన్షన్ ఆఫ్ కమ్యూనిస్టుపార్టీ ఆఫ్ ఇండియా. కన్వెన్షన్ తీర్మానాలకు సూర్జిత్ వ్రాసిన పుపోద్ఘాతం నుండి సేకరించిన సమాచారము. పే 1-10.

జాతీయోద్యమ నాయకత్వం, స్వాతంత్ర్యేచ్ఛను, సామ్రాజ్యవాద వ్యతిరేకతను, సామాజిక దృక్పథాన్ని సోవియట్ విప్లవంలో చూసింది. బూర్జువావర్గంలో అత్యధికులు ప్రారంభంనుండి సోవియట్‌తో స్నేహ సౌభాతృత్వాలనే నెరపారు. చైనా విప్లవానికి దాని ప్వ్యాడల్సు, సామ్రాజ్యవాద వ్యతిరేకతను, సందేహ, భయ, ఆందోళనలను స్నేహ, సౌభాతృత్వాలను కలగాపులగంగా పాలకవర్గాలు ప్రదర్శించాయి. కమ్యూనిస్టులు రెండవ చారిత్రాత్మక విప్లవంగా శ్లాఘించి సోవియట్‌నే సైద్ధాంతిక వ్యూహాత్మక, మార్గదర్శక అగ్రగామిదళంగానెంచి చైనాకు ద్వితీయ స్థానాన్ని యిచ్చారు. అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో సాంప్రదాయక సోవియట్ కమ్యూనిస్టుపార్టి నాయకత్వాన్నే గుర్తించింది.

1950 దశకంలో

చైనా విప్లవం వ్యవసాయ విప్లవ పంథాయే ఏకైక మార్గంగా భారతకమ్యూనిస్టుపార్టి ఆమోదించకుండుటకు మూడు అంశాలు ప్రధానంగా కన్పడుతున్నవి. ప్రధమంగా నగరాలకు కార్యకలాపాలకు పునాదిగా వేసుకొన్న భారత కమ్యూనిస్టు పార్టీ బాలకాలంవరకు చైనా విప్లవ ప్రత్యేకతలను పరిగణలోనికి తీసుకొని అధ్యయనం చేయక, సోవియట్ విప్లవ అనుబంధంగానే నెంచారు. రెండవ విషయం భారత కమ్యూనిస్టు వుద్యమం మధ్యతరగతి విద్యాధికుల నాయకత్వం పునాదిగా, అభ్యుదయకర బూర్జువా వర్గంలో ఆర్థికంగా వెనుకబడిన వర్గాల ఆలోచనా విధానం వైపు మొగ్గు కలిగివున్నది. ఈ నైజము అత్యంత ప్రాధాన్యత కలది. నెహ్రూ తదితరులు మార్క్సిజం-లెనినిజంకు, జాతీయోద్యమానికి సోషలిజంకు చట్టబద్ధత చేకూర్చి, జాతీయోద్యమంలోని కమ్యూనిస్టు వ్యతిరేకులు మార్క్సిజం సోషలిజంలోని "మంచి లాభకర" అంశాలను త్రోసిపారవేయలేదు. కమ్యూనిస్టుపార్టీ పుట్టకముందే జాతీయోద్యమానికి అనుబంధంగా కార్మికట్రేడు యూనియన్ వుద్యమం ప్రారంభమైంది. భారతకమ్యూనిస్టుపార్టి కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ వైఖరినను సరించి, కాంగ్రెసు వ్యతిరేక విధానాన్ని అనుసరించునపుడు కాంగ్రెసులో వున్న తదితర పార్టీలవలెనె, లోనవుండి కాంగ్రెసు విధానాలకు అనుకూలంగానే పనిచేసింది. మాస్కో,ఇండియన్ కమ్యూనిస్టు వర్గాలను, కార్యకర్తలను పార్టీనిర్మాణానికి, భారత కమ్యూనిస్టులను గ్రామాలకుపంపించమనితద్వారావ్యవసాయ విప్లవవిషయమై జాగృతి-పరచుటకు నాయకులందరిని కోరింది. మూడవకారణం వలన సామ్రాజవాద వ్యతిరేక పోరాట విజయాలు ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికాలలోని అనుభవాలు ముఖ్యంగా వ్యవసాయ, సామాజికవ్యవస్థలు ఆధునిక సామ్రాజ్యవాదం నూతన ఆటం-లాసర్ సాంకేతిక పరిజ్ఞాన సంజనిత బహుముఖ ఆర్థిక, రాజకీయ సామాజిక నేపథ్య, సమగ్ర ఆలోచనా. అవగాహనలతో వాసికెక్కిన సిద్ధాంతాలకు వ్యతి

రేక వాస్తవ సామాజిక స్వాతంత్ర్యపోరాటాల అనుభవాలు, సోషలిస్టు విప్లవ అనుభవాలకు అనేక మార్పులు, చేర్పులు శాస్త్రీయంగానే చేర్చాయి. అయినా 1940-50లలో చైనా వివిధ మాజీవిశాల వలసలలో యింకా వలసలుగ ప్రధానంగా వ్యవసాయ సామాజిక వ్యవస్థలుగ వున్న దేశాలలో కమ్యూనిస్టు వుద్యమాలు అనుసరించవలసిన పోరాటవ్యూహం, దైనందిన పోరాటాల ఎత్తుగడలు వీటి సమగ్రరూపమైన సిద్ధాంతాలను రూపొందించి, ఆచరణలో వివిధదేశాల అనుభవాలతో సమగ్రపరచి ఆ ఆయుధంతో సోవియట్ అవగాహనలను, ముఖ్యంగా భిన్నపరిస్థితులలో జనించిన అనుభవాలతో మార్క్సిజం, లెనినిజంలకు స్వీయమానసికతత్వ, ప్రయోజనాల ప్రాబల్యంతో భావసంచయానికి పట్టిన తుప్పును సానబట్టి, ప్రక్షాళనం చేసి శాస్త్రీయపంథాను వర్తమానకాలానికి రూపొందించుటకు సహాయపడగల, అందుకు అవసరమైన సైద్ధాంతిక పోరాటాన్ని సాగించగల భౌతిక పరిస్థితులలో చైనా లేదు.

చైనా విప్లవపోరాటాలు 1940 దశకంలో, చివరి ఘట్టానికి చేరుకొని, భీకర సామ్రాజ్యవాద, భూస్వాముల వ్యతిరేక పోరాటాలలో మునిగిపోవుట, 1950 దశకంలో చిన్నాభిన్నమైన సామాజికపునర్నిర్మాణంలో మునిగిపోయి, సోవియట్ యూనియన్ తూర్పుయూరపుసోషలిస్టుదేశాల ఆర్థిక, పారిశ్రామిక, సాంకేతికసహాయాలపై ఆధారపడివుంది. కొంత ప్రాప్తకాలజ్ఞతకు, పరిస్థితుల ప్రభావంకులోనుగాక తప్పలేదు. చైనా 1949-50లలో చైనా విప్లవం, రష్యన్ విప్లవ విధానాలకు భిన్నమైనదనే సిద్ధాంతపోరాటాన్ని ప్రారంభించినా,సోవియట్ వ్యతిరేకతను వెంటనేఎదుర్కొనవలసి వచ్చింది. మావో కమ్యూనిస్టు విప్లవ సిద్ధాంతాలకు అధ్యయన విధానాలకు నూతనాంశాలను చేర్చుటను సోవియట్‌సిద్ధాంత అవగాహన త్రోసిపుచ్చింది. ఈ ప్రభావంలోనే మావోపై 1940 దశకంలో చైనాపై రణదివె విమర్శనను అర్థంచేసుకొనవలసి వుంటుంది అదేకాలంలో భారత కమ్యూనిస్టు వుద్యమం సోవియట్ యూనియన్ సిద్ధాంత ప్రభావంలో వుండుటను స్పష్టం చేస్తుంది.

ఈ సందర్భంలో నవంబరు 1949లో ప్రాక్దేశాల ప్రపంచ ట్రేడుయూనియన్ ఫెడరేషన్ పెకింగు సమావేశంలో లీషౌచీ "మావో పంథా వలస, అర్ధవలస దేశాల ప్రజలు తమ విముక్తికి ప్రధాన ప్రజా పంథాగా" చేసుకొంటారనే ఆశాభావాన్ని వ్యక్తం చేసారు. కాని వొక్కిచెప్పి సిద్ధాంత సమన్వయలిచేయలేదు. చెన్‌పొటా స్టాలినిజం నుండి మవో మేధోస్వాతంత్ర్యాన్ని నొక్కి చెప్పారు. అదే సమయంలో లూటింగ్ యీ సోవియట్, చైనా విప్లవాల ప్రభావాలకు భౌగోళిక ప్రాంత పంథాలుగ సూచించారు. ఈ సూచనలకు సోవియట్ సిద్ధాంత వేత్తలు ప్రత్యేకంగా భారత దేశ పరంగా యేమాత్రం సందివ్వక వ్యతిరేకించారు అయినా యీ కాలంలో

9)

1949-52లలో భారత కమ్యూనిస్టుల "రష్యాపంధా" చైనా పంధా"ల సుదీర్ఘ చర్చ లను యీనేపధ్యంలో శాస్త్రీయ వివేచనను విడనాడి "పంధాలను" యాంత్రికంగా దిగుమతి చేయుటగా స్పష్టమగుతుంది. ఒక్కమాటలో భారతకమ్యూనిస్టులు, దేశ వాస్తవ పరిస్థితులకు మార్క్సిజం లెనినిజంలనుఅన్వయించుటలో పరిపక్వతను సంపా దించకపోవుటయే, సైద్ధాంతిక బలహీనత వైఫల్యాలకు మూలమని చెప్పుకొనవలసి వుంటుంది. కొమిన్‌ఫారం జనవరి 1950 వ్యాసం "కార్మికవర్గం, అన్నితరగతుల రైతాంగం మధ్య ఐక్యత, సహకారాన్ని పెంపొందించమని" అదే "చైనా యితర దేశాల వలసల విముక్తి వుద్యమాల అనుభవం" అని భారతకమ్యూనిస్టు పార్టీకి సూచనల నిచ్చింది. అయితే ఆ వ్యాసం, చైనా కమ్యూనిస్టుపార్టీ, జపాన్ పాశిస్టు సామ్రాజ్యవాద దురాక్రమణకు వ్యతిరేకంగా "అన్నితరగతుల రైతాంగాన్ని సమీక రించగలుగుటగ పరిగణించలేదు. అట్టి ప్రధానాంశం, విదేశదండయాత్ర, నూతనంగా యేర్పడిన భారతజాతీయ ప్రభుత్వం, అన్నితరగతుల రైతాంగంతో రాజకీయ సంబం ధాలను, తన దైనరీతిలో భూ సంస్కరణలను ప్రారంభించి బలపరచుకొనుటకు తగినరీతిలో పరిగణించకపోవుట స్పష్టంగా కన్పడుతున్నది.

2) భారతకమ్యూనిస్టు పార్టీ కొమిన్‌ఫారం సూచనలను సిద్ధాంత వివేచనను, రైతాంగం, రైతువుద్యమాలపై కేంద్రీకరించాలని, దేశంలో 1940 దశకంలో విసరి వేయబడిన కొన్ని ప్రాంతాలలోని విప్లవపోరాట అనుభవాలతో యీ కర్తవ్యాలను నిర్వహించుటగా వ్యాఖ్యానించి, వివరించింది. చైనా కమ్యూనిస్టుపార్టీ 29వ జయంతి సందర్భంగా సి. పి. ఐ జూలై-ఆగస్టు 1950 "కమ్యూనిస్టు" సిద్ధాంత పత్రికలో సందేశమిస్తూ "వలస ప్రపంచంలోని కమ్యూనిస్టుపార్టీలు చైనా కమ్యూనిస్టుపార్టీని సమానంగా చూస్తున్నవని" ప్రకటించింది.

కొమిన్‌ఫారం 1950 సూచనలను, 1949-50లలో "చైనా పంధా" వ్యవసాయ విప్లవం, రైతాంగ మౌలికవ్యూహం, ఎత్తుగడల పంధానుండి తిరిగి "సోవియట్ పంధా" వైపు ఆలోచనా విధానాన్ని మళ్ళించే ప్రయత్నమనీ అభిప్రాయం కొంత మందిలో వున్నా, తదనంతర కాలంలోని సిద్ధాంతచర్చలు, భారతకమ్యూనిస్టుల ఆలో చనలో భారత ఆర్థిక, రాజకీయ, వ్యవసాయ సంబంధాలను అధ్యయనం చేసి, మన పరిస్థితులకు తగిన, మనదైన వొక పంధా రూపొందించుటకు అనువగు భౌతిక పరిస్థి తులున్నా, పార్టీలో రెండు పంధాల ఆలోచనలు సోవియట్ యూనియన్, చైనా రిప బ్లికల పార్టీలను "మార్క్సిస్టు పోపులుగ నెంచి, ఆరాధించే ప్రభావాన్ని తక్కువగా అంచెనా వేయుట పొరపాటు అగుతుంది. పార్టీ స్వతంత్ర ఆలోచనాశక్తి, వాస్తవ సిద్ధాంతాలను రూపొందించి ధైర్యంగా ప్రతిపాదించగలిగిన స్థాయికి ఎదుగుటలోని వైఫల్యం స్పష్టం కనీసం ఆ మార్గంలో పయనించుట ప్రారంభం కాక పోయినా, ఆలోచనలలో అంకురార్పణ జరుగలేదన జాలము.

ఈ కాలంలో కమ్యూనిస్టుపార్టీ నాయకత్వవర్గాలు, రణదిర-ఆంధ్ర సిద్ధాంతాల మధ్య రెండు పక్షాలుగా సిద్ధాంత చర్చలు జరుగుచున్నపుడే, సోవియట్ యూనియన్ కమ్యూనిస్టు పార్టీలో మూడవ ప్రపంచ దేశాలలోని కమ్యూనిస్టు వుద్యమాలకు మార్గదర్శిక సూత్రాలను రూపొందించుటకు, చైనా విప్లవానుభవాలు సిద్ధాంతాలు ఎంతవరకు అనువరించవచ్చు అనే అంశంపై సిద్ధాంతచర్చలు జరుగుతున్నవి. ఈ చర్చలలో సోవియట్ సిద్ధాంతవేత్తలలో కొందరు కొంతకాలం వరకు "మావో మార్గం" వైపు మొగ్గుచూపి, తెలంగాణా రైతాంగ పోరాటాన్ని సోవియట్ ప్రతిపాదనలల్లో ప్రస్తుతించారు. బలమైన మరోవర్గం, చైనా విప్లవప్రాధాన్యతను "మూడో ప్రపంచంలో ఆమోదిస్తూనే మావోవ్యూహం, ఎత్తుగడల ఆలోచనా విధానంలో, స్టాలిన్ ఆలోచనా విధానానికి మించిన ప్రత్యేకంగా ప్రతిపాదించిన సిద్ధాంత ప్రాతిపదికలేమీ లేవని, అనసాగారు. ఆ కాలంలోని సోవియట్ చైనా రచనలలో ప్రధానమైన భేదం వివాదం చర్చనీయాంశ యిదేనని తెలుస్తున్నది.

"చైనా పంథా"పై 1948-52 లలో సోవియట్ ఆలోచనా విధానం యెలా వున్నదో చూద్దాం. క్రైయిఫెట్స్ 1948లో "నూతన ప్రజాస్వామ్యం" "జనతా ప్రజాస్వామ్యం, ప్రథమంగా సామ్రాజ్యవాద ప్రయోజనాలతో బంధనాలుగల సామ్రాజ్యవాద అవశేషాల వ్యతిరేక విప్లవ పోరాటాలు జరుగుచున్న దేశాలకు వర్తించుతుందని, ద్వితీయంగా వివిధ స్థాయిలలో ప్యూడల్ అవశేషాలు గల దేశాలకు వర్తించుతుందని" రెండిటి మధ్యగల భేదాన్ని చూపెట్టాడు. దీనిఅర్థం తూర్పు దేశాల విప్లవాలకు, చైనా కమూనిస్టుపార్టీ సిద్ధాంత నాయకత్వాన్ని ఆమోదించుట అగుతుంది. అయితే క్రైయిఫెట్సు ప్రతిపాదనలను ఇ. యం. యూకోవ్ "జనతా ప్రజాస్వామ్యం" ప్రపంచంలో అన్నిదేశాలకు అదే విధంగా ఆచరణీయమని" ప్రకటించాడు. ఈ నిర్దిష్ట రూపంలో యీ పరిణామ భేదాలను వాటి వుధృతిని గురించి చెప్పవచ్చు. ఈ విధంగా పశ్చిమదేశాలలోని అనగా తూర్పు యూరపులోని జనతా ప్రజాస్వామ్యం, తూర్పు దేశాలలోని జనతా ప్రజాస్వామ్యానికి భిన్నమైనది కాదని "ప్రత్యేకపాలనరూపం, సోషలిస్టు విజయంతో ప్రపంచమంతటా ప్రజాస్వామ్యశక్తుల విజయంతో సాధ్యమైందని[2]" యుకోవ్ స్పష్టం చేసారు.

అయితే 1949 చివర అర్ధభాగంలో సోవియట్ సిద్ధాంతవేత్తలు మావోవ్యూహానికి చేరువైనట్లు కన్పించుతుంది. జూన్ 1949 అకెడెమి ఆఫ్ సైన్స్ సెస్ మీటింగులో మూడోప్రపంచదేశాలలో విస్తృత పునాది ఐక్యసంఘటన సిద్ధాంతాన్ని

---

1. ఎక్రైయి ఫెట్స్ (1948) ది నేషనల్ లిబరేషన్ మూమెంట్ ఇన్ ది కలొనియల్ డిపెండెంట కంట్రీస్ అనువ్యాసం నుండి బాబనిసేన్‌గుప్తా" కమ్యూనిజం ఇన్ ఇండియన్ పోలిటిక్స్"లో 357 పే. లోని ఉధహరింపు

ఝుకోవ్ వైఖరితో బలపరచబడింది. ఇంకా బాగా అభివృద్ధి చెందిన బూర్జువా వర్గం మాత్రమే "అభివృద్ధి నిరోధక సామ్రాజ్యవాద పక్షంలో చివరకు చేరిందని'' అన్నారు మాస్లినికోవ్ చైనా కమ్యూనిస్టు పార్టీ నాలుగువర్గాల వ్యూహంపై చాల అనుకూలంగా మాట్లాడి, సోవియట్ యూనియన్ అనుభవం "జాతీయ విముక్తి ఉద్యమానికి మిక్కిలి ప్రాముఖ్యతను కలిగివుందని"కూడ అన్నాడు. భారతదేశంలో జరిగిన అకెడిమీ సమావేశంలో బలబుషేలిక్ వొక పత్రాన్ని సమర్పిస్తూ, రైతాంగం, వ్యవసాయ సంస్కరణలు, గ్రామసీమలలో సాయుధపోరాటం గురించి నొక్కి చెప్పాడు. ఝుకోవ్ సమావేశంలోని చర్చలను సమీక్షిస్తూ "వలస బూర్జువావర్గం యేదశలో అభివృద్ధి నిరోధక పాత్రను ఆచరణలో పెట్టుతుంది అనే ప్రశ్నకు సమాధానం, ప్రధానసమస్య—సోవియట్ యూనియన్ యెడల దాని వైఖరినుండి రూపొందుతుందన్నారు."

"నవంబరు 1951లో సోవియట్ యూనియన్, మూడవ ప్రపంచంలోని దేశాలకు చైనా విప్లవ నమూనా' అనే దానిని గట్టిగా ప్రతిఘటించింది. సోవియట్ అకెడియా ఆఫ్ సైన్స్‌స్‌లో "చైనా విప్లవపు అనంత ప్రాముఖ్యతను" గుర్తించారు. కాని అది వొక్కచైనాలోనే సాధ్యం అని, దాని ముఖ్య లక్షణాలు సాయుధపోరాటం, అన్ని పోషకిస్టుదేశాలకు తప్పనిసరికాదని, చైనా విప్లవం అనుసరించవలసిన ఒక మూస నమూనా అనుకొనుట ప్రమాదకరం"[1] అన్నారు. చైనా విప్లవ ప్రాముఖ్యతను ఝుకోవ్ తగ్గించుటతో పాటు, సొబలేవ్ బోల్షివిక్ విప్లవం విశ్వనమూనా ఆధిక్యతను పునఃప్రతిష్ఠించుట జరిగింది[2]. సొబలేవ్ ప్రధాన సిద్ధాంతంగా 1951లో జనతా ప్రజాస్వామ్యం ప్రత్యేక రెండుదశల విప్లవమని బూర్జువా ప్రజాస్వామ్య విప్లవానంతర సత్వర సోషలిస్టు విప్లవమని ప్రతిపాదించారు. తూర్పుయూరపు దేశాల విప్లవాలు రెండుదశలను దాటాయని, చైనా విప్లవం, సోవియట్ "జనతా ప్రజాస్వామ్య సిద్ధాంతానికి" ప్రతిబింబమని, అయినా యూరపుదేశాల విప్లవాల కంటె వెనుకబడిందని, కారణం అది ప్రథమ దశనుదాటి పురోగమించలేదని సొబలేవ్ సిద్ధాంతం తెలుపుతున్నది.

కొరియా యుద్ధం, వలసవిముక్తి పోరాటాలను వెనుకకు మళ్ళించుట, సోవియట్ యూనియన్ చైనా దృక్పథానికి కొన్ని రాయితీలనిచ్చుట, ఝుకోవ్ చైనా తది

---

1. భాబనిసేన్ గుప్తా (1972) కమ్యూనిజం ఇన్ ఇండియన్ పాలిటిక్స్ పే. 55-62, 335-37.

2. ఝుకోవ్ (1952) ఆన్ ది కారెక్టర్, అట్రిబ్యూట్స్ ఆఫ్ పీపిల్స్ డెమోక్రసీ ఇన్ కంట్రోల్ ఆఫ్ ది ఓరియంట్ వ్యాసం నుండి గుప్తా 258 పేజీలలోని ఉదహరింపు.

తర ఆసియా ప్రజల విముక్తి పోరాటాలను మేల్కొల్పిందని, ఆమోదించాడు.

అందువలనే కొమిన్‌ఫారం 1950లో సి. పి. ఐ. ని చైనా పంథాను అనుసరించమని సూచించదని చెప్పజాలము. కొమిన్‌ఫారం వ్యాసపు ప్రధానోద్దేశ్యం, సిద్ధాంత పోరాటంలో ఆంధ్రసిద్ధాంతం మావో సిద్ధాంతానికి దగ్గరగా వున్నందున సి. పి. ఐ. ని బలపరుస్తూ మాస్కో తన ప్రాబల్యం తగ్గకుండా వుండుట ఆశించింది. ఇది రజనీ పామీదత్తు యిద్దరు సి. పి. ఐ. నాయకులకు యిచ్చిన యింటర్వ్యూలో స్పష్టం చేయబడింది. చైనీయులు భారత కమ్యూనిస్టులపై చేసిన విమర్శన వుపయోగకరమైనదిగా పరిణమించింది.

భారత కమ్యూనిస్టుపార్టీ నాయకత్వం, అజయ్‌ఘోష్, డాంగే, రాజేశ్వరరావు, బసవపున్నయ్యలు, అంతర్జాతీయ కమ్యూనిస్టు నాయకత్వపు సలహా, సంప్రదింపుల అనంతరం "సోవియట్‌పంథా" "చైనాపంథా"లను విడనాడి, "భారతీయ పంథాను" రూపొందించారు. అదే 1951 రాజకీయ విధానం, కార్యక్రమం, ఎత్తుగడలు అన్నీ కలసిన "భారతీయపంథా"గా ప్రచారం పొందింది. కమ్యూనిస్టుపార్టీ సమిష్టి నాయకత్వంచే, అత్యున్నత రహస్య సిద్ధాంత పత్రం రూపొందించబడి డిశెంబరు 1953లో మధురైలో జరిగిన 3వ, పార్టీ కాంగ్రెసులో కేంద్రకమిటీ సభ్యులకు మాత్రం పంచబడింది. ఎత్తుగడల పంథా పరిమితఅగ్రనాయకత్వానికి మాత్రమే పంచబడినట్లుగా తెలుస్తున్నది[1]. ఆ పత్రం నిర్దిష్ట భారత పరిస్థితిని, చైనా భారత దేశాల పరిస్థితుల లోని సారూప్యతను, భిన్నత్వాన్ని పోల్చి విశ్లేషణ చేసి, "చైనా విప్లవాన్ని దాని అనుభవాలను తప్పుడుగా అర్థం చేసుకొన్నామనే నిర్ణయానికి వచ్చింది." భారత విప్లవం సరిగా చైనా విప్లవంలాగ అదే విధంగా సాయుధ పార్టిజాన్ పోరాట రూపంలో ప్రధానంగా లేక దాని విజయాన్ని దృఢపరచే దగ్గరి దగ్గరిగా వాకే వాక పోరాట ఆయుధంగా సాగుతుందనే" తప్పుడు సిద్ధాంతీకరణ చేయుట జరిగింది.

భారతదేశంలో ముఖ్యంగా "నిజమైన ప్రజారైతువుద్యమం", "కార్మికవర్గ ఐక్యత"నిర్మించవలసిన ఇక్కట్ల అవశ్యకతయెంతో వుంది. విస్తృత సాయుధపార్టీజాన్ పోరాటాలకు చైనాలోవలె అనువైన పరిస్థితులు, భారతదేశంలోలేవు. అపరిపక్వ చెదురు, మదురు రైతాంగ తిరుగుబాటులుగా జరుగకుండాను, వుద్యమాల క్రమంలో అనేకప్రాంతాలలో, పార్టీజాన్ గెరిల్లా సాయుధ పోరాటరూపం అవసరం కలుగుతుంది. అట్టి పరిస్థితులలో గెరిల్లా పోరాటాలను, నిజమైన ప్రజారైతు వుద్యమప్రాతిపదికతో చేబట్టుట, ముఖ్యంగా అణచబడే వర్గాలతో భూస్వాములు, సామాజిక బహిష్కరణ, తదితర పోరాట రూపాలతో, పన్నుల, సహాయనిరాకరణోద్యమాలు, వ్యవసాయకూలీలసమ్మెలు సరియైన నిర్మాణక్రమంలో నాయకత్వం వహించి నడపితే, వుత్సాహంతో రైతువుద్యమం, దృఢనిశ్చయంతో పురోగమిస్తుంది. ప్రారంభంలో గెరిల్లా పోరాటం స్వరక్షణ ప్రాధాన్యంగానే వుంటుంది. దాని ఆశయం ముఖ్యంగా

ప్రభుత్వదాడులనుండి రైతు జనసామాన్యానికి రక్షణ కల్పించుటకు వుద్దేశించబడింది. ఆ పత్రం వ్యక్తిగత హింసావాదాన్ని పూర్తిగా ఖండించింది. గెరిల్లా పార్టిసాన్ పోరాటధ్యేయం ప్రత్యేకవ్యక్తులను నాశనంచేయుటగాదు. బహుళ ప్రజాసమూహాలతో దీర్ఘకాల పోరాటాలలో ద్వేషించబడే పాలనను నాశనం చేయుట. ఈ పత్రంలోని అవగాహన మధురై పార్టీ కాంగ్రెసు రాజకీయ తీర్మానంలో ప్రతిబింబించింది. తీర్మానం "ప్రజాస్వామ్య ఐక్యతా ప్రభుత్వం" అనే పోరాట నినాదాన్ని యిచ్చింది. విస్తృత ప్రజాపోరాటాలను వారి కోరికలు సాధించుటకై నిర్మించుటకై ప్రజా సమీకరణ గావించమంటున్నది. పాలకవర్గాల ఆర్థిక, రాజకీయ విధానాలను వోడించమని కోరింది. ప్రజాస్వామ్య ఐక్యత నిర్మించాలని కోరింది. ఈ పోరాట రూపాన్ని ఎత్తుగడల పత్రంలో వివరణలకు దగ్గరిగా లేవు. "భారతపంథా""లోని అంశాలకు చేరువగా లేవు. పత్రంలో నెహూ విదేశాంగ విధానం కొద్ది కాలంగా" శాంతికిద్రోహం చేస్తున్నదని అత్యంతప్రాముఖ్యతగల అంశంగా పేర్కొని, శాంతిప్రియులందరి ప్రశంసలందుకొన్నదని ఆమోదాన్ని తెలిపింది.

జాతీయ విముక్తి వుద్యమాలకు మూడో ప్రపంచంలో "చైనామార్గం" వొక్కటే సమూనా విప్లవమార్గంగా 1950 దశకంలో చైనా సౌభాతృత్వ మార్గాలలో ప్రపంచ కమ్యూనిస్టు వుద్యమం ఆమోదం పొందుటకు ప్రయత్నించింది. తన ప్రాపకాన్ని ప్రభావాన్ని పెంచుకొంది. భారత కమ్యూనిస్టుపార్టీ "చైనాపంథా" అవగాహనలను క్రమేణా విడనాడి, సోవియట్ 20వ పార్టీ కాంగ్రెసు వ్యూహాన్ని పందాని ఆమోదించి శాంతియుత పరివర్తనవిధానాలను చేబట్టింది. మావోస్వయంగా 1957లో సోవియట్ 20వ పార్టీ అవగాహనలను నేరుగా వ్యతిరేకించారు. చైనా కమ్యూనిస్టు పార్టీ పంథా, వ్యూహం ఎత్తుగడలు భారత కమ్యూనిస్టుపార్టీ అవగాహనలకు పూర్తిగ భిన్నంగా వున్నవి.

3. ఈ సందర్భంలో భారతకమ్యూనిస్టుపార్టీలో మెజారిటి-మైనారిటి రెండు వర్గాలు సైద్ధాంతికంగా సంఘర్షించుట సోవియట్-చైనా సిద్ధాంత పోరాటం ప్రారంభానికి ముందే, దశాబ్దం క్రిందట భారత విప్లవపంథా సమస్యపై "చైనామార్గమా", "రష్యామార్గమా" అనే సైద్ధాంతిక వివాదమేర్పడిందని మొదటి సంపుటిలో తెలుసుకొన్నాము. అవి అలాగే సాగుతున్నవని, పార్టీలో సైద్ధాంతిక ఐక్యత యేర్పడలేదని, 1 60 దశకంలోని సోవియట్-చైనా బృహద్వివాదం ఆజ్యంపోసిందని ఆకారణంగానే ప్రపంచంలో మరే పార్టీలోను జరుగనంతటి తీవ్ర సిద్ధాంత పోరాటం భారతకమ్యూనిస్టుపార్టీలో జరిగింది.

రాజకీయాల పరిణామక్రమంలో దీర్ఘకాలప్రభావంకల రెండుఫలితాలు చూడగలము మొదటిది నాడు "చైనాపంథాగా" భారతకమ్యూనిస్టుపార్టీ తలచిన రైతాంగ

గెరిల్లా పోరాటం, నగరాలలో తిరుగుబాటు స్థావరాలను రక్షితప్రాంతాలను యేర్పాటు చేయుట, కార్మిక, కర్షక, జాతీయబూర్జువావర్గంతో సంఘటనను యేర్పరచుట భారత పరిస్థితులకు తగిన దృక్పథంకాదని అంతేగాక నాడు "సోవియట్ పంథా"గా యెంచబడిన రైతాంగ సహకారంతో కార్మికవర్గం నగరాలలో తిరుగుబాటు విప్లవ పోరాటాలను సాగించుటకూడ భారత దేశపరిస్థితులలో సరియైన విధానంకాదని తలచబడింది. రెండింటిని సమన్వయపరచి "గ్రామీణ ప్రాంతాలలో రైతాంగ సాయుధ గెరిల్లా పోరాటాలు నగరాలలో కార్మికవర్గం, అన్నివర్గాలను ఐక్యపరచి తిరుగుబాటు విప్లవాల పంథాగా అంతర్జాతీయ కమ్యూనిస్టు అగ్రనాయకత్వంతో సంప్రదించి "భారత విప్లవ పంథా"గా రూపొందించబడింది. అయినా పార్టీలో "చైనాపంథా" దృక్పథం శాశ్వతంగా స్థిరపడి వొకవిధంగా 'చట్టబద్ధం' చేయబడిందనవచ్చు. అది వొక వర్గానికి ఫుత్సాహాన్నిస్తూ మార్గదర్శకమైంది. సోవియట్ ప్రభావంతో సరితూగగలిగినదిగా యెదిగింది. రెండవది పార్టీలో క్రమశిక్షణ కరువై ముఠాతత్వం పెరిగి కేంద్రనాయకత్వాన్ని నగ్నంగా ప్రాంతీయనాయకత్వాలు యెదిరించుట ముఖ్యంగా "అతివాద వ్యతిరేక పోరాటం" అనే పేరుతో పెరిగిపోయి భారత కమ్యూనిస్టుపార్టీలో శాశ్వత స్థానాన్ని సంపాదించింది. ఇట్టి పరిస్థితులు మరేయితరపార్టీలో యేర్పడినట్లు తెలియదు. నాటినుండి భారతకమ్యూనిస్టుపార్టీ కేంద్రనాయకత్వం, యంత్రాంగం కంటె చాలబలహీనపడి "బోల్షివిక్ పార్టీ" వలే "ఉక్కుక్రమశిక్షణ"ను అమలుపరచలేని స్థితికి దిగజారిపోయింది.

మరో ముఖ్యవిషయాన్ని యీ సందర్భంలో చెప్పాలి. ముఠాతత్వం, వివాదాలు, పార్టీలో దీర్ఘరోగంగా పరివర్తన చెందాయి. ఫెడరల్ రాజ్యాంగంలో అనేక బూర్జువాపార్టీల కేంద్రంగా, కేంద్రపార్టీ నాయకత్వ లక్షణం పెంపొందింది. కేంద్ర నాయకత్వం ప్రాంతీయనాయకత్వాలపై ఆధారపడే పరిస్థితి యేర్పడింది. పార్టీ జాతీయ నాయకత్వం బలహీనపడింది. ఇండియా ప్రత్యేక పరిస్థితులైన భాషా, కుల భేదాలు పై పరిస్థితిని మరింత అధ్వాన్నం చేసాయి. కనీసం పార్టీ వాటినుండి దూరం కాలేకపోయింది. ఇది యెంతవరకు వెళ్లినదంటే, పొలిట్‌బ్యూరో, కేంద్రకమిటీ సభ్యులు, వారివారి రాష్ట్రకమిటీల ఆలోచనా విధానాలు ప్రతిబింబించుతూ వాదించే వారుగ అయ్యారుగాని పార్టీజాతీయ విధానాలును ప్రతిబింబించుతు వాదించేవారుగ ఆచరణలో మనజాలకపోయారు. అంటే మార్క్సిస్టు పరిభాషలో కేంద్రీకృత ప్రజాస్వామ్య నాయకత్వ పటుత్వం శిధిలమైపోయింది. పొలిట్ బ్యూరో సమావేశాలు తగ్గిపోయాయి రాష్ట్రపార్టీలనుండి లేదా ట్రేడుయూనియన్ కిసాన్ సభలాంటి ప్రజాసంస్థలనుండి రాజకీయ పార్టీ బలాన్ని సంతరించుకొని బలహీనపడిన కేంద్ర నాయకత్వపు కార్యక్రమాలను కొంతమంది పొలిట్‌బ్యూరో సభ్యులు కొనసాగిం

చారు. అలక్ష్యం ఫలితంగా రాష్ట్ర నిర్మాణ సంస్థలు పార్టీలో ఏమిజరుగుతున్నది కేంద్రానికే నివేదించకుండుట పార్టీ జీవితంలో సర్వసాధారణమైపోయిందని కేంద్ర కమిటి నివేదికలో విచారాన్ని వెలిబుచ్చారు. పార్టి కాంగ్రెసు 1952, 1953, 1955 1956 చివరకు 1961 నివేదికలలో యీ విషయం స్పష్టంగా పేర్కొనబడివుంది.

అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో సిద్ధాంత పోరాటం బృహద్వివాదంగా పరిణమించుటకుముందు పార్టీలోవున్న వాస్తవ పరిస్థితిని పరిగణించగలిగితేనే తదుపరి పార్టీలో అంతర్జాతీయ బహద్వివాద కారణంగా చెలరేగిన పార్టీలోని ఆటుపోటులను సమంగా అర్థం చేసుకొనుటకు తోడ్పడుతుందని పార్టీలోని పూర్వపోరాట తరంగాలను క్లుప్తంగా ప్రస్తావించుట జరిగింది

## సోవియట్ పార్టి 20వ కాంగ్రెసు

4. కమ్యూనిస్టుపార్టీ 20వ కాంగ్రెసు తదనంతర ఘటనలు భారత కమ్యూనిస్టుపార్టీలో మౌలికస్పందనలను కలుగజేసాయి. పార్టీపై చైనా సోవియట్ సంబంధాలు తీవ్రమైన ప్రభావాన్ని కలుగజేసాయి. ప్రధానంగా సోవియట్ కమ్యూనిస్టు పార్టీలో స్టాలిన్ ప్రభావాన్ని తొలగించు ప్రయత్నాలు ఒకవైపుపార్టీ క్రమశిక్షణపై అశనిపాతంలాపడి, కదలిపోతూవున్న పార్టీ ఉక్కుచట్ర నిర్మాణాన్ని మరింతగా చిన్నాభిన్నం చేసింది. స్టాలిన్ విధానాల వ్యతిరేకదాడి, చైనా కమ్యూనిస్టుపార్టీ ప్రతిష్టను పెంచి, భారతకమ్యూనిస్టుపార్టీలోని చైనా విధానవాదులు మరింత బలపడునట్లుచేసి, చొరవను వారికి యిచ్చింది. చైనా దృక్పథం భారతదేశంలో మరింత బలపడింది. స్టాలిన్ వ్యతిరేక ప్రచారం, హంగేరిలో తిరుగుబాటు ఇత్రినాగిని రూపుమాపుడి సోవియట్ కమ్యూనిస్టు ప్రభావం భారతకమ్యూనిస్టుపార్టీలో బలహీనపడింది. సోవియట్ 20వ పార్టి కాంగ్రెసుతో వుద్భవించిన పెట్టుబడిదారి విధానం సోషలిజంలోనికి శాంతియుత పరివర్తన అవకాశాల అవగాహనను భారతదేశానికి వర్తింపజేయు ప్రయత్నంతో పార్టిలో అభిప్రాయ భేదాలు తీవ్రమయ్యాయి. ఈ సందర్భంలో న్యూటైమ్స్‌లో మోడెస్ట్ రూబెన్‌సేన్ వ్యాసం భారతకమ్యూనిస్టు పార్టీగాక నెహ్రూయే భారతదేశాన్ని సోషలిస్టు మార్గంలో నడుపుతున్నాడనే అవగాహనను యిచ్చుట బహిరంగంగా పార్టి కార్యదర్శి అజయ్‌ఘోష్ యీ అవగాహనను, మితవాద సంస్కరణవాదంగా తీవ్ర విమర్శకు గురిచేసి ఎదుర్కొనుటను జ్ఞాపకం చేసుకొనుట అవసరం ఫలితంగా సోవియట్‌పార్టీ తన పూర్వ అవగాహనకు తిరోగమించుట గమనించినా మొత్తం మీద భారతకమ్యూనిస్టుపార్టి నెహ్రూని బలపరచి ప్రధానంగా పార్లమెంటరీ ఎత్తుగడలను అవలభించాలనే ధోరణిని కొనసాగించింది.

సోవియట్ 20వ, పార్టి కాంగ్రెసు విధానాలపై చైనాపార్టీ అభిప్రాయ భేదాలు 1956లోనే ప్రారంభమగుట వెంటనే కమ్యూనిస్టుపార్టిలో ప్రతిబింబించుట

జరిగింది. కేరళ 1957 ఎన్నికలలో కమ్యూనిస్టుపార్టీ విజయం, కమ్యూనిస్టుపార్టీలోని ప్రధానంగా పార్లమెంటరీ పోరాట వర్గవాదుల బలాన్ని యినుమడింపజేసింది. సోవియట్ 20వ, పార్టీ కాంగ్రెసు సిద్ధాంతానికి కేరళ విజయం ప్రత్యక్షరుజువుగా నెంచబడి 1956 ఎప్రిల్ పాల్ఘాట్ విధానాలనుండి వైదొలగి 1958 ఏప్రిల్‌లో జరిగిన అమృత్‌సల్‌పార్టీ కాంగ్రెసు "సోషలిజంలోనికి శాంతియుత పరివర్తనను" విధానంగా ఆమోదించుటయేగాక యితర రాష్ట్రాలలో కేరళ మార్గం అనుసరణీయంగా నెంచబడింది పార్టీలోని అతివాదులను కేరళరాష్ట్రంలో కమ్యూనిస్టు మంత్రివర్గపాలన యిరకాటంలో పెట్టింది. కేరళమంత్రివర్గం, ఢిల్లీ కేంద్ర ప్రభుత్వం తమను తొలగించుటకు యెట్టి అవకాశం యివ్వని విధానాన్ని అనుసరించుట మరింత తోడ్పడింది. కమ్యూనిస్టుపార్టీలోని అతివాదులు వెలిబుచ్చుతున్న అభిప్రాయాలకు కేంద్రం 1958లో రాష్ట్రకమ్యూనిస్టు ప్రభుత్వాన్ని బర్తరఫు చేయుట మరింత బలం చేకూర్చింది. సోవియట్ తాత్కాలికంగా తమ పత్రికలలో నెహ్రూ ప్రస్తావన కొంత తగ్గించారు. రెండు మాసాల తరువాత "వరల్డ్ మార్క్సిస్టురివ్యూ"లో పావెల్ యూచిన్, చైనాలో రష్యారాయబారి నెహ్రూను బలపరచి, కమ్యూనిస్టులపై "హింసాప్రేమికులు"గా దాడిచేయుటను ఎదుర్కొని నెహ్రూ సోషలిజాన్ని పరిహసించుట జరిగింది. అధికార శాంతియుతంగా కమ్యూనిస్టుల చేతులలోనికి మారుటను వ్యతిరేకించిన భారత బూర్జువావర్గమే కమ్యూనిస్టులు మరోమార్గం అవలంబించుటకు కారణమని స్పష్టంచేసాడు అదేకాలంలో నెహ్రూయొక్క అభివృద్ధికర విధానాలను భారతకమ్యూనిస్టుపార్టీ బలపరచవలసి వుంటుందని అన్నాడు. సోవియట్ భారతదేశం యెడల అవలంబించిన విధానం పూర్తిగ తాత్కాలికమని తలంచుటకు, తరువాత కొద్దిమాసాలకు జరిగిన సోవియట్ కమ్యూనిస్టుపార్టీ 21వ, కాంగ్రెసులో తిరిగి నెహ్రూ విధానాలను కృశ్చేవ్ కొనియాడుట స్పష్టం చేస్తున్నది.

టిబెట్‌లో తిరుగుబాటు భిన్న అభిప్రాయాలు

5. ఈ సందర్భంలో టిబెట్‌లో తిరుగుబాటు భారత-చైనా సరిహద్దు సంఘర్షణలు అవి భారతకమ్యూనిస్టుపార్టీలోని వివిధ వర్గాల సైద్ధాంతిక పోరాటంలో కలుగుజేసిన పుద్రిక్తవివాదాంశాలు. చీలికలను ఎక్కువ చేసిన కథనాన్ని క్లుప్తంగా తెలుసుకొనుట అవసరము.

ప్రప్రథమంగా, సామ్రాజ్యవాదప్రపంచం పాలకబూర్జువా పార్టీల యెడల సోషలిస్టు ప్రపంచం ముఖ్యంగా సోవియట్, చైనా కమ్యూనిస్టుపార్టీలు అవలంబించవలసిన విధానాల యెడల 1959లో తీవ్ర అఘాత మేర్పడుటతో భారత కమ్యూనిస్టు పార్టీలోకూడ అవి తీవ్రంగా ప్రతిబింబించాయి. ముఖ్యంగా యీ భేదాభిప్రాయాలు

కమ్యూనిస్టులు అధికార సంపాదనకై జరిపే పోరాటంలో అవలంభించవలసిన విధానాలకు విస్తరించాయి. వీటితోబాటు చైనా-సోవియట్ కమ్యూనిస్టు పార్టీల ప్రమేయంలేని టిబెట్‌లో తిరుగుబాటు కేరళలో కమ్యూనిస్టురాష్ట్ర ప్రభుత్వాన్ని భారత ప్రధాని నెహ్రూ రద్దుచేయుటతో యీ భేదాభిప్రాయాల ఆఘాతం మరింత పెద్దదైంది. అదేకాలంలో అమెరికా కృశ్చేవ్‌ను పర్యటనకై ఆహ్వానించింది. ఆ కాలంలోనే సోవియట్ కమ్యూనిస్టు పార్టి మితవాదంవైపుకు చైనా కమ్యూనిస్టుపార్టి అతివాదంవైపు పయనించుట చారిత్రిక సత్యం. కృశ్చెవ్ 1959 చివరలో చైనా పార్టీకి మ్రింగుడు పడని విధంగా, భారత-చైనా వివాదంలో తటస్థ విధానాన్ని అనుసరించుటయేగాక, అమెరికా పర్యటన అనంతరం పశ్చిమదేశాల యెడల అవలంభించవలసిన విధానాలలో కొంత మెతకతనము కన్పడజొచ్చింది. సోవియట్-చైనా విదేశాంగ విధానాల ప్రభావాలకు లోనైన భారత సరిహద్దు సంఘర్షణల ఫలితంగా, భారత కమ్యూనిస్టు పార్టీలో అంతర్గత పోరాటం తీవ్రతరమైంది. ప్రధానంగా నెహ్రూ ప్రభుత్వం యెడల అనుసరించవలసిన విధానం యెడల కేంద్రీకరించబడినా వాస్తవంగా వివిధాంశాలకు వివిధరూపాలలో విస్తరించింది. చైనా-సోవియట్ కమ్యూనిస్టుపార్టీల సిద్ధాంత పోరాటం భారతదేశంలో ప్రధానంగా దానికి అనుబంధంగా పరోక్షంగా తీవ్రంగా జరిగింది.

టిబెట్ తిరుగుబాటుతో సరిహద్దు సంఘర్షణలకు బీజాలుపడ్డాయి "ప్రపంచం రెండు ప్రతిపక్ష శిబిరాల సిద్ధాంత" ప్రభావంలో మొదట్లో రష్యా-చైనాలు వొకే విధంగా ప్రకటనలు చేసాయి. ఏప్రిల్ 1959లో రెండుసార్లు పశ్చిమ బెంగాల్‌లో కలింపాంగ్‌ను ,టిబెట్ తిరుగుబాటుదారులు స్థావరంగా వుపయోగించుచున్నారనే చైనా ప్రకటనలను, సోవియట్ యూనియన్ రేడియో ప్రసారాలలో వ్యాఖ్యానించింది నెహ్రూ బహిరంగంగా వాస్తవంకాదని తిరస్కరించారు. తదుపరి అట్టి చైనా ప్రకటనలను రష్యా తన ప్రసారాలలో పునరుద్ఘాటించుట జరుగలేదు. టిబెట్ తిరుగుబాటును మాస్కో టిబెట్ అభివృద్ధి నిరోధకులు, పశ్చిమ సామ్రాజ్యవాదులు, చంగైషేక్ బాధ్యులని నిందించసాగింది. చైనా అట్లుగాక భారత అభివృద్ధి నిరోధకులను విస్తరణవాదులను నిందించసాగింది. ఏప్రిల్ చివరలో భారత లోక్‌సభ సమాచార శాఖ, చైనా ప్రజారిపబ్లిక్ సరిహద్దు వివాదాంశాలయెడల అవలంభించిన వైఖరిని తీవ్రంగా విమర్శించుటతో, చైనా కమ్యూనిస్టు వర్గాలు తమ భారత వ్యతిరేక ప్రచారాన్ని, భారత ప్రభుత్వానికి విస్తరించి టిబెట్ తిరుగుబాటుకు దలైలామా భారత దేశానికి వచ్చుటకు, భారతదేశపాత్రకలదని ముమ్మరంగా ప్రచారం మొదలుపెట్టింది సామ్రాజ్యవాదులతో నెహ్రూ అప్పుడప్పుడు భేధించుచు సామ్రాజ్యవాదంతో "బ్రహ్మముడి" వేసుకొన్న భారత బడాబూర్జువావర్గ బలమైన భావాల ప్రభావాలకు, తన విధానాలు లోనగుట ఆపజాలకవున్నాడు.

భారత కమ్యూనిస్టుపార్టీ యీకాలమంతా బహిరంగంగా కమ్యూనిస్టుచైనాకు పూర్తి మద్దతు నిస్తూనే వుంది. కాని సోవియట్ యూనియన్ నెహ్రూ విధానాల యెడలఅనుసరిస్తున్న విధానాలకు మించిపోవుటలేదు. సోవియట్ కలింపాంగ్‌పాత్రపై చైనా ప్రకటనలను త్రోసివేయనంతవరకు, 5 ఏప్రిల్‌న కమ్యూనిస్టుపార్టీ పత్రికకు "న్యూయేజ్" సరిహద్దు నగరమైన కలింపాంగులో జరిగే విషయాలపై పరిశీలన జరగాలనుట యేగాక కార్యదర్శివర్గం అదే విషయమై తీర్మానం కూడ చేసింది. కాని తదుపరి కలింపాంగు విషయమై ప్రస్తావించకపోయినా, జాగ్రత్తగా చైనా విధానాలకు మద్దతునిస్తూనే వున్నారు. మే 10 "న్యూయేజ్" పత్రికలో కార్యదర్శి అజయ్ ఘోష్, నెహ్రూ ప్రకటనలు కొన్ని తిరుగుబాటుదారులకు బలాన్ని చేకూర్చేవిగా వున్నవని అంటూనే తిరుగుబాటుకాలంలో భారత విధానం సక్రమంగానే వున్నదని చైనా యెడలనే తప్పు అంతా వున్నదని" అన్నారు. అంతేగాక సామ్రాజ్యవాదులు భారత స్వతంత్ర విధానాన్ని మార్చుటకై చేసిన మొరటు పద్ధతులను "ఉద్రేకంతో నెహ్రూ తిరస్కరించాడని" అన్నారు ఇండియ-చైనా సరిహద్దు వివాదంలో కమ్యూనిస్టుపార్టి చైనా ప్రభుత్వం చేయు వొత్తిడి విధానాన్ని వారి విస్తరణ విధానాన్ని ఖండించుటయు, భారతదేశంలో కమ్యూనిస్టు వుద్యమానికి ఎంతో హాని కలిగించిందని స్పష్టం చేసింది. అదే కాలంలో నెహ్రూ ప్రభుత్వం కేరళరాష్ట్రంలో కమ్యూనిస్టు ప్రభుత్వాన్ని రద్దుచేయుటను భారతదేశంలో ప్రజాస్వామ్యం వర్ధిల్లుటకు అట్టి చర్య అశనిపాతమని, కాంగ్రెసులోని అభ్యుదయకరశక్తులతో సహా అన్ని ప్రజాస్వామ్య శక్తులు యీ చర్యను వ్యతిరేకించాలని విజ్ఞప్తిచేసి ప్రచారం చేసింది. ఇంతకుముందు చెప్పినట్లు కేరళరాష్ట్ర కమ్యూనిస్టు మంత్రివర్గపు రద్దు ఫలితం, కమ్యూనిస్టుపార్టీలో అతివాదవర్గం బలపడుట దేశంలో, విదేశాలలోని ప్రజాస్వామ్యశక్తులలో నెహ్రూ విధానం అప్రదిష్టపాలగుట, కాంగ్రెసులో మితవాద శక్తులు బలపడుట, ప్రజాస్వామ్య శక్తులు బలహీనపడుట, అంతర్జాతీయంగా కమ్యూనిస్టు వర్గాలలో అతివాదం ప్రబలుటకు దోహదకారి అయిందనుట చారిత్రికసత్యం,నిర్వివాదాంశము.

అగష్టు 28, 1962న లోక్‌సభలో ప్రధాని నెహ్రూ చైనా ప్రజారిపబ్లిక్ భారతదేశ సార్వభౌమాధికారాన్ని లడక్ ఈశాన్య సరిహద్దు ఏజన్సీ ప్రాంతాలలో అతిక్రమించిందని ప్రకటించి ప్రజలలో వుద్రేక పరిస్థితిని కలుగజేసారు. రెండు రోజుల తరువాత కమ్యూనిస్టుపార్టీ కార్యదర్శి అజయ్‌ఘోష్ సరిహద్దు అతిక్రమణలపై మొట్టమొదటి ప్రకటన చేసారు. సరిహద్దు ఎప్పుడూ నిర్దేశించబడలేదని, మెక్‌మోహన్ లైను విషయం ప్రస్తావించక, వెంటనే సంభాషణలు ప్రారంభించాలని కోరారు. భారత కమ్యూనిస్టు పార్టీ విమర్శనావాతికి గురైంది. కారణం ప్రభుత్వానికి స్పష్టంగా మద్దతును ప్రకటించకపోవుట ప్రధానంగా చెప్పాలి. సెప్టెంబరు 3,

నోటులో చైనా భారతదేశాన్ని దురాక్రమణదారుగా నిందించింది. వివాదాస్పద ప్రాంతాలనుండి భారతసైనికులు వెనుకకుపోవాలని కోరింది. సెప్టెంబరు 8న చౌయెన్‌లై సరిహద్దు వివాదంపై సంభాషణలకు అంగీకారాన్ని తెల్పుతూ, ఎట్టి స్పష్టమైన ప్రతిపాదనను నెహ్రూను కలియుటకు ప్రతిపాదించక, వివాదాస్పదప్రాంతాలపై తమ హక్కులను పునరుద్ఘాటించుతు తూర్పున మెక్‌మోహన్‌లైన సరిహద్దు ప్రతిపత్తిని ప్రశ్నించి, త్రోసిబుచ్చాడు. చైనా సరిహద్దులుపై భారతసైనికుల "సాయుధదాడిని" తప్పిదముగా పేర్కొన్నాడు.

ఈ ప్రకటనలన్నీ భారతకమ్యూనిస్టుపార్టీని క్లిష్టపరిస్థితులలోనికి త్రోసివేసి, ప్రజలనుండి వేరుపడునట్లు చేసాయి. చౌయెన్‌లై నెహ్రూకు ఉత్తరం పంపిన సెప్టెంబరు 8న, అజయ్‌ఘోష్ సోవియట్ యూనియన్‌లో వున్నట్లు ప్రావధా ప్రకటించింది. మరుసటిరోజు సరిహద్దు వివాదంపై తటస్థవివాదాన్ని చేబట్టుతూ, పరస్పరం సంభాషణలద్వారా వివాదాన్ని పరిష్కరించుకొనాలని టాస్ ప్రఖ్యాత ప్రకటనగావించింది. అజయ్‌తో సోవియట్ నాయకత్వం సంప్రదింపుల అనంతరం టాస్‌చే అట్టి ప్రకటన చేయబడిందనే అభిప్రాయం రాజకీయ వర్గాలలో కలిగింది. ఫలితంగా ఇది చౌయెన్‌లై పట్టువిడుపులు లేని విధానాన్ని అనుసరించుటకు పరోక్షంగా తోడ్పడింది. అదే చౌయెన్‌లై సెప్టెంబరు 8 లేఖలో ప్రతిబింబించింది. సోవియట్ టాస్ ప్రకటన, చైనా వివాదాన్నుండి సోవియట్ దూరమగుటను సూచించుటకు వుద్దేశించబడింది, అదే కాలంలో భారతకమ్యూనిస్టుపార్టీపై యేర్పడుతున్న రాజకీయ వొత్తిడిని పరోక్షంగా తగ్గించుటకు ఉపయోగపడింది. ఫలితంగా చైనా పార్టీ తదుపరి చర్యలు, సోవియట్ ప్రవర్తనను, కమ్యూనిస్టు పక్షంలోని మరో పార్టీకి దోహదంగాను వొక బూర్జువా దేశంతో రాజీపడుటగాను పరిగణించబడింది. సోవియట్ అంతర్జాతీయ విధానాలను వ్యతిరేకించుచున్న చైనా ధోరణికి యిది మరి కొంత ఆజ్యంగా తోడ్పడి. చైనా బహిరంగంగా ఏప్రిల్ 1960లో ప్రపంచమంతటా ప్రచారదాడిని చేబట్టుటకు తోడ్పడినట్లు కన్పడుతున్నది.

భారతకమ్యూనిస్టుపార్టీ కార్యవర్గం సెప్టెంబరు చివరలో, సోషలిస్టు చైనా ఎప్పుడూ దురాక్రమణ చేయదని సుదీర్ఘ తీర్మానాన్ని చేసింది. చైనా మ్యాపులలో సూచించిన సరిహద్దు రేఖనుగాని, మాక్‌మోహన్‌రేఖగాని ఆమోదించాలనే షరతును సరిహద్దు వివాదంపై సంప్రదింపులకు విధించరాదని తీర్మానం వివరించింది. కమ్యూనిస్టుపార్టీయీప్రకటన భారతదేశంలో సంచలనాన్ని కలుగజేసింది. జాతీయవర్గాలు విద్రోహంగా ఖండించాయి. కమ్యూనిస్టేతరులలో యీ స్పందన, పార్టీతో మిత్రత్వం నెరపుతున్న వారిపై వొత్తిడిని కలుగజేయుటయేగాక, పార్టీలో క్రమశిక్షణారాహిత్యాన్ని పెంచి, మితవాదంపై మొగ్గిన కొన్ని రాష్ట్రాలలోని నాయకత్వాలు, ముఖ్యంగా మహా

రాష్ట్ర, కేరళలు వొత్తిడికిలోనై పార్టీకేంద్ర రాజకీయవిధానాన్ని వ్యతిరేకించునట్లు చేసాయి. కేరళ మాజీ ముఖ్యమంత్రి నంబూద్రిపాద్, మహారాష్ట్రపార్టీ సెక్రటరీ సర్దేశాయి కేంద్రపార్టీ సెక్రటేరియట్ సభ్యుడు, ట్రేడుయూనియన్ కాంగ్రెసునాయకుడు డాంగే ప్రభుత్వవిధానాలను బహిరంగంగా మద్దతునిస్తూ ప్రకటించారు. ఇందుకుగాను డాంగే, సర్దేశాయిలను, జాతీయసమితి చేత అభిశంచించబడ్డారు. మహారాష్ట్రపార్టీని బహిరంగంగా పార్టీలోని యీ వ్యతిరేకత నేపద్యంలో కార్యదర్శి అజయ్ నాయకత్వంలో చైనా రిపబ్లిక్ వుత్సవాలకు పార్టీ ప్రతినిధివర్గం అక్టోబరు ప్రారంభంలో వెళ్ళింది. అక్కడ కృచ్చేవ్ బహిరంగంగా బలప్రయోగంతో పెట్టుబడిదారి విధాన శక్తిని పరీక్షించు ప్రయత్నాలకు హెచ్చరించుట జరిగింది. ఆవిధంగా శాంతియుత సహజీవనానికి నెహ్రూ యెడల పట్టువిడుపులు లేని విధానానికి వ్యతిరేకంగా వొత్తిడి తెచ్చి చైనా తన విధానాన్ని మార్చుకొనునట్లు వొత్తిడి చేయబడింది. అజయ్ కూడ టిబెట్‌లో తిరుగుబాటు సరిహద్దు వివాదసందర్భాలలో చైనా విధానాలను అభిశంచించినట్లు భారతవార్తా సంస్థలు పేర్కొన్నవి. దీనికి ప్రతిస్పందనగా చైనీస్ పత్రికలలో సంప్రదింపులు జరుగుచున్నపుడు భారత ప్రభుత్వ వ్యతిరేకంగా భారతనాయకత్వం "ద్విముఖ తటస్థవాదులుగ" సామ్రాజ్యవాదంతో లోతైన సంబాధాలు కలిగిన "విస్తరణవాదులని దుయ్యబట్టారు

అజయ్ అక్టోబరు 18 పత్రికాగోష్ఠిలో మావోచైనా ప్రజారిపబ్లిక్ శాంతి ధ్యేయాన్ని నొక్కి పునరుద్ఘాటించుట "న్యూయేజ్" అక్టోబరు 25 సంచికలో స్పష్టం చేసారు. అదేకాలంలో భారత-చైనా సరిహద్దు దళాల మధ్య లడక్‌లో సంఘర్షణలు జరిగి భారతీయులకు ప్రాణనష్టం కలిగింది. చైనా ప్రభుత్వవర్గాలు భారతసాయుధ దళాలు రెచ్చగొట్టుటతో సంఘర్షణ జరిగిందని అధికారరీత్యా ప్రకటించారు. అజయ్ యిరుకునపడి స్పందించి, అక్టోబరు 24న పార్టీ కేంద్రసమితి సెక్రటేరియట్ "లడక్ సంఘటనలు విచారకరమని", కాల్పులకు ఎట్టి కారణాలులేవని ప్రకటించింది నవంబరు మీరట్ మీటింగులో అజయ్ ప్రజాభిప్రాయాన్ని పరిగణలోనికి తీసుకొని మితవాద వర్గనాయకుడైన డాంగే అభిప్రాయాలవైపు మొగ్గినట్లు కన్పించుతుంది. జాతీయ సమితిలో తీవ్రప్రతిఘటన అనంతరం వొక తీర్మానం ఆమోదించబడింది. తీర్మానం అనేక విషయాలలో జాతీయవైఖరికి దగ్గరిగావుంది. మెక్‌మాహన్‌రేఖపై భారత ప్రభుత్వవైఖరిని ప్రప్రథంగా బలపరచి, చైనా వాదనలను తిరస్కరించింది. లడక్‌లోని పశ్చిమ సరిహద్దు నిర్ణయించబడనిదిగా ప్రకటించింది. నవంబరు 7, చౌయెన్‌లై -నెహ్రూతో సమావేశపు ప్రతిపాదనకు స్వాగతం చెప్పి చైనా సాయుధ దళాలు వుపసంహరించబడాలనే షరతులను ప్రస్తావించక భారత వైఖరిని బలపరచింది.

భారత కమ్యూనిస్టులవైఖరి యీవిధంగా మార్పుచెందుతుండగా, సోవియట్

వైఖరి "తటస్థవిధానాన్నుండి", చైనా వైఖరిని "విమర్శించుట"గా మారింది. అక్టోబరు 31న సుప్రీంసోవియట్‌లో కృశ్చేవ్, లడక్ ఘటనపై విచారాన్ని వెలిబుచ్చుతు జరిగిన ప్రాణనష్టాన్ని యేవిధంగాను భర్తీచేయలేమని, "స్నేహ, సంభాషణలలో, పరస్పరం తృప్తికరంగా పరిష్కరించుకొనాలని విజ్ఞప్తిచేసారు. నవంబరు 7న న్యూయేజ్" పత్రికావిలేఖరికి "విచారకర తెలివితక్కువకథ"గా సరిహద్దు ఘటనలను వర్ణించి, వివాదగ్రస్థప్రాంతంలో జనసంచారం శూన్యమని, వ్యూహాత్మక ప్రాముఖ్యత లేదని, ఇరాన్‌తో తమ సరిహద్దు పరిష్కారాన్ని కృశ్చేవ్ ప్రస్తావించాడు. ఇది సోవియట్ తమ దృక్పథాన్ని భారతదేశానికి స్పష్టం చేయతలపెట్టినదైనా భారతకమ్యూనిస్టు వర్గాలపై సత్వర ప్రభావాన్ని కలుగజేసింది. అంతేకాక నెహ్రూ డిశంబరు 22న చౌయెన్‌లైకు సమాధానంగా పంపిన లేఖకు, సోవియట్ డిశెంబరు 22, ప్రకటనలో పూర్తి మద్దతును స్పష్టం చేసింది. ఆ విధంగా ప్రప్రధమంగా కమ్యూనిస్టేతర వర్గాలు కమ్యూనిస్టుదేశ ప్రభుత్వంపై చేయు విమర్శనను, ఎట్టి ఖండనలు లేకుండా సోవియటు వార్తాసంస్థ ప్రకటించింది. ఇదంతా భారతకమ్యూనిస్టుపార్టీలోని "జాతీయ "అంతర్జాతీయ లేక చైనా వాదుల" వైఖరులుగ శాశ్వతంగా చీలిపోయి స్థిరపడుటకు పరోక్షంగా దోహదపడింది. ఈ చీలిక భారత విప్లవ వ్యూహంపై యేర్పడినచీలికను అనుసరించే వుంది అవే "మితవాద" అతివాద వైఖరులు మితవాదవైఖరికి మహారాష్ట్ర పార్టీ నాయకత్వం వహించగా కేరళ, ఆంధ్రప్రదేశ్‌లోని బలమైనవర్గాలు బలపరుస్తున్నవి. అతివాద వైఖరికి పశ్చిమ బెంగాల్, పంజాబ్ రాష్ట్రపార్టీలు, నాయకత్వం వహించగా గణనీయమైన ఆంధ్ర కేరళపార్టీవర్గాలు తదితరులు బలపరచారు. పార్టీ సెక్రటేరియట్‌లో మితవాదవర్గానికి ప్రతినిధులుగా జడ్. ఎ. అహమ్మద్, మాజీకార్యదర్శి పి.సి జోషి, డాంగేలు ముందుకురాగా పార్టీలోని చైనా వ్యతిరేక శక్తుల నాయకుడుగా డాంగే ప్రాముఖ్యత వహించాడు పార్టీ జనవరి నాగపూరు సమావేశానంతరం నెహ్రూ దేశీయాంగ విధాన మద్దతుదారుగ డాంగే పార్టీలో ప్రాముఖ్యత వహించారు. కేంద్రసెక్రటేరియట్‌లో అతివాద వర్గ ప్రతినిధులుగ, రణదివె, బసవపున్నయ్య, భూపేష్‌గుప్తాలు కలసి చైనా ప్రజారిపబ్లిక్‌కు వ్యతిరేకంగా ప్రభుత్వాన్ని బలపరచాలనే విధాన ప్రకటనను వ్యతిరేకించారు. పార్టీ విస్తరించి బలపడుటకు అదే మార్గమన్నారు కేంద్ర సెక్రటేరియట్‌లో యీ రెండు వైఖరులను వ్యతిరేకించుతు అజయ్‌ఘోష్, నంబూద్రిపాద్‌లు దేశీయ విదేశీయ విధానాల రెండింటిలో మధ్యేమార్గాన్ని అనుసరించారు. సోవియట్ చైనా వివాదం 1960 నుండి విస్తరించిన కొలది అజయ్ మితవాద జాతీయపంథాకు చేరువయ్యారు

## "లెనినిజం చిరస్థాయి అగుకాక" చైనా సిద్ధాంతపత్రం

6. సోవియట్-చైనా కమ్యూనిస్టు పార్టీల 1960లలో బహిరంగ సైద్ధాంతిక

పోరాటానికి దిగి ప్రపంచకమ్యూనిస్టుపార్టీలకు నాయకులకు తమపై విశ్వాసిక్తె విజ్ఞప్తులు చేసాయి. ఈ సిద్ధాంత వివాదం దురదృష్టకరంగా నిర్మాణపోరాటంగా పరిణమించింది. భారతకమ్యూనిస్టుపార్టీ యీ పోరాటంలో పూర్తిగ మునిగిపోయింది. భారతకమ్యూనిస్టుపార్టి రాజకీయ విధానం, వ్యూహం, ఎత్తుగడలకు, ప్రపంచ సోషలిస్టు పెట్టుబడిదారి విధానాల రెండు శిబిరాల సిద్ధాంతం కారణంగా, మరింత ప్రాముఖ్యత వచ్చింది. ప్రపంచ కమ్యూనిస్టు వుద్యమ సిద్ధాంతపోరాటానికి ప్రధాన రంగం భారతదేశమైంది. చైనా కమ్యూనిస్టు పార్టి 1960 ఏప్రిల్‌లో "లెనినిజం చిరస్థాయి అగుగాక" అనె నాలుగు వ్యాసాలతో బహిరంగ సైద్ధాంతిక పోరాటం సాగింది. ఇండియాలో యీ వ్యాసాలు ఆంగ్లంలో పునర్ముద్రించబడి అందరి దృష్టి లోకి వచ్చాయి. దీని ప్రభావం ఏప్రిల్ 24న రణదివె "న్యూయేజ్"లో వ్రాసిన వ్యాసంలో ప్రతిబింబించింది భారతకమ్యూనిస్టు వర్గాలలో గందరగోళాన్ని సృష్టించింది. అదే పత్రికలో అజయ్, కృశ్చేవ్ భారత పర్యటన వ్యాసంలో రెండో దృక్పథం ప్రతిబింబించింది ఈ రెండు వ్యాసాలు, లెనినిజం చిరస్థాయిఅగుగాక అన్న వ్యాసాలలోని ముఖ్యభాగాలు, మే దినోత్సవ సందర్భంలో కుసినిన్ మాస్కోలో చేసిన వుపన్యాసంలోని భాగాలు ప్రచురింపబడినది. చైనా పార్టీ వైఖరిపై మొట్ట మొదటి సోవియట్ వైఖరి సారాంశం అదే మేలో జరిగిన భారతకమ్యూనిస్టుపార్టీ జాతీయసమితి సమావేశంలో "మార్క్సిజం స్వచ్ఛతను" చైనా కమ్యూనిస్టుపార్టీ కాపాడుతున్నందుకు అతివాదనాయకుడు ధన్యవాదాలర్పించుట, మితవాదనాయకుడు కృశ్చేవ్ "సృజనాత్మక" మార్క్సిజంను ఆమోదించాలని పట్టుబట్టినట్లు తెలుస్తున్నది రణదివె తాను సంపాదకుడుగా వున్న "న్యూయేజ్" మంత్లీ చైనా పార్టీ వైఖరి ప్రతిబింబించునట్లు చేయుటకు ప్రయత్నించింది. 'లెనినిజం చిరస్థాయి' అగుగాక 'అన్న ఏప్రిల్ చైనా వ్యాసాన్ని జూన్ సంచికలో ప్రచురించారు. మితవాద వర్గం కృశ్చేవ్ జూన్ 21 వుపన్యాసాన్ని దానికి సమానంగా ప్రచురించారు. దీనిలో కృశ్చేవ్ రుమేనియా పార్టీ కాంగ్రెసులో చైనా వైఖరిని ఘాటుగ విమర్శించుట జరిగింది.

రెండవ ప్రధానఘటన సోవియట్-చైనా పార్టీల మధ్య సిద్ధాంతపోరాటంలో 1960లో జరిగిన ప్రపంచట్రేడు యూనియన్ పెకింగు జూన్ సమావేశంలో జరిగింది. సోవియట్‌పార్టీ, కమ్యూనిస్టు క్రమశిక్షణ సూత్రాలను వదలి బహిరంగంగా, కార్మిక ప్రతినిధుల సమావేశంలో ప్రతినిధులను తమ విధానలకు కూడగట్టుకొను టకు ప్రచారం ప్రారంభించారు. ఆసంస్థ "సోవియట్ పంథా"ను విడనాడునట్లు చేయు ప్రయత్నించారు. యుద్ధం, పెట్టుబడిదారివిధాన స్వభావం, నిరాయుధీకరణ సమస్య లపై లాబీ సంభాషణలు జరిపారు. సమావేశంలోని వుపన్యాసాల ప్రచురణలో ఇటలీ ప్రతినిధివర్గం తదుపరి వెల్లడించిన దానిని బట్టి తమ విధానాలకు మద్దతును సంపా

దించుటకు చైనా కమ్యూనిస్టుపార్టీ అన్నివిధానాల ప్రయత్నించింది. కాని మెజారిటీ ప్రతినిధివర్గాల సానుభూతిని మద్దతును సంపాదించలేకయింది. చివరకు సోవియట్ ప్రతినిధి వర్గంతో తీవ్రపోరాటం అనంతరం ఓటమి పొందింది. మితవాతపక్ష నాయకుడైన డాంగేపై చైనాదాడిని సోవియట్ ప్రతినిధివర్గం ఎదుర్కొని, ప్రతిదాడిని సాగించుటతో, భారతప్రతినిధివర్గం సోవియట్‌కు అన్నివిధాల మద్దతునిచ్చింది. డాంగే చైనాకు ద్వంద ప్రతినిధిగా అనగా భారతట్రేడుయూనియన్ కాంగ్రెసు నాయకుడుగాను, ప్రపంచ ట్రేడు యూనియన్ సమాఖ్యఉపాధ్యక్షుడుగాను హాజరయ్యాడు. చైనా కమ్యూనిస్టులు సమావేశంలో తమ విధానాలకు మద్దతునిచ్చిన వారి వుపన్యాసాలను ప్రముఖంగాను తమను విమర్శించిన వారి వుపన్యాసాలను నామమాత్రంగానో లేక పూర్తిగ వదలివేసి ప్రచురించుటయో చేసారు. ఉదాహరణకు, డాంగే వుపన్యాసాన్ని అసలు ప్రకటించలేదు. ఇటలీ ప్రతినిధి విటోవియా ఫోవా జూన్ 14న ప్రకటించిన నివేదిక ప్రకారం యీ విషయం స్పష్టం కాగలదు. కారణం, భారతప్రతినిధి వర్గం, సోవియట్ వైఖరులను పూర్తి మద్దతు నిచ్చుటనే విషయం స్పష్టం. బహిరంగ సమావేశాలలోనేగాక, సమావేశం యేర్పాటు చేసిన కమిషనులలో యీ విషయం స్పష్టమైంది.

ఈ ఘటనల పూర్వరంగంలో మితవాద వర్గం, భారతకమ్యూనిస్టుపార్టీలో అతివాద వర్గంపై దాడిచేసి వొత్తిడి చేయసాగింది. అంతర్జాతీయంగా సోవియట్ పార్టీ రాజకీయ సిద్ధాంతాలను ఎదుర్కొంటున్న చైనా కమ్యూనిస్టుపార్టీతో భారత కమ్యూనిస్టుపార్టీలోని అతివాదవర్గం, రాజకీయసిద్ధాంత సాన్నిహిత్యాన్ని నెరపుతున్నదని మితవాదవర్గం తలచింది, సెప్టెంబరు ప్రారంభంలో భారతకమ్యూనిస్టుపార్టీ కేంద్ర కార్యవర్గం సమావేశమై యీ విషయం సిద్ధాంతరీత్యా తేల్చవలసి వచ్చినపుడు ఊగిసలాడే అవకాశవాద మెజారిటీ నాయకత్వంలోని వర్గాలు మితవాదం వైపు మొగ్గి సోవియట్ కమ్యూనిస్టుపార్టీని బలపరచాయి. చైనా విషయం ప్రస్తావించకుండా, యుద్ధనివారణ విధానంగా సోవియట్ అంతర్జాతీయ కమ్యూనిస్టు రాజకీయవిధానాన్ని బలపరచారు. అదేవిధంగా భారతదేశం యెడల సోవియట్ రాజకీయ విధానాన్ని, శాంతియుత అహింసా మార్గంలో సోషలిజంలోనికి పరివర్తన మార్గాన్ని, సృజనాత్మకంగా మార్క్సిస్టువిధానమార్గాలను బలపరచారు. ఆ విధంగానే తీర్మానించారు. అది అమృతసర్ కాంగ్రెస్‌లో పార్టీ భారతప్రభుత్వంపై కావించిన విశ్లేషణ సుముఖ అంచెనాను అనుసరించే యీతీర్మానం వుంది.

కేంద్రకార్యవర్గం, రణదివే, పశ్చిమబెంగాల్, పంజాబ్ తదితర అతివాద ప్రతినిధుల వ్యతిరేకతను త్రోసిపారవేసి, మెజారిటీ ఆమోదంతో చైనా కమ్యూనిస్టు పార్టీని ఖండింపతు తీర్మానించి, రహస్యంగా వుంచింది. ఈ తీర్మానం సోవియట్

రాజకీయ సిద్ధాంతాన్ని, శాంతిమండలాన్ని దాని ప్రాముఖ్యతను ముఖ్యంగా భారత దేశాన్ని గుర్తించుచున్నది. దలైలామాకు దేశంలో రక్షణయిచ్చుటను ఖండించింది, కలింపాంగ్ టిబెటన్ కుట్రదారులకేంద్రంగా పేర్కొనుటను ఖండించింది. దలైలామా ఇండియాకు "ఖైదీగా" తీసుకొని రాబడ్డాడనే నిందను ఖండించింది. కమ్యూనిస్టుచైనా "ఇండియా విస్తరణ విధానాన్ని అనుసరించిందని అనుటను ఖండించింది. భారత కమ్యూనిస్టుపార్టీ అభిప్రాయాలను తెలుసుకొనకుండా, భారతదేశ రాజకీయ విధానాన్ని తప్పుగా అంచెనావేయుటను ఖండించింది. సోవియట్ యూనియన్ ఇండియా చైనా సరిహద్దు వివాదంపై సరియైన విధానాన్ని అవలంభించుటను, ముఖ్యంగా శాంతి శిబిరంలోని దేశాలపై చైనా అవలంభించిన విధానం, భారతకమ్యూనిస్టుపై అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంపై విషమ పరిణామాలకు దారితీస్తుందని విమర్శించింది. చైనా తప్పుడు విధానాలకు కారణం "జాతీయ బూర్జువావర్గాన్ని దానిపాత్రను తప్పుడుగా అంచెనావేయుట వలన జరిగిందని" విమర్శించి వివరించింది. అంతేగాక భారతకమ్యూనిస్టు పార్టీ యీ అంచెనాను వ్యతిరేకించుతు అధికారాన్ని శాంతియుత మార్గంలో చేబట్టుటకు నూతనంగా యేర్పడిన అవకాశాలను నిజం చేయుటలో తనవిశ్వాసాన్ని పునరుద్ఘాటించింది. చివరకు చైనా ట్రేడుయూనియనుల ముఖ్యుడు వియోనింగ్ఇ, ప్రపంచట్రేడు యూనియనుల సమావేశంలో, పార్టీల అంతర్గత సిద్ధాంత సమస్యలను తీసుకొని వచ్చుటను ప్రత్యేకంగా పార్టీయేతర సమావేశాలలో చేయుటను తీర్మానం ఖండించింది.

ఈ రహస్య తీర్మానాన్ని కార్యవర్గం ఆమోదించుట, అతివాదవర్గ నాయకత్వాలను ముఖ్యంగా పశ్చిమబెంగాల్, పంజాబ్, ఆంధ్రప్రదేశలలో కోపోద్రేకాలను రేకెత్తించింది. అందులో కొంతమంది బహిరంగంగా చైనా విధానాలను బలపరస్తూ, భారత ప్రజలకు దూరమయ్యారు. అక్టోబరు 21, పశ్చిమబెంగాల్, పార్టీ కేంద్ర "కార్యవర్గాన్ని ఖండించుతు, దాని చర్య "వినాశకరము, తప్పుడుది" అని, చైనా కమ్యూనిస్టుపార్టీ అభిప్రాయాలను తెలుసుకొనకుండా చేసినదని తీవ్రంగా విమర్శించి, తీర్మానించింది. అదేవిధంగా పంజాబ్‌లో తీర్మానించారు, బీహారు తదితర రాష్ట్రాలలో తీర్మానించ ప్రయత్నించి విఫలులయ్యారు. వియత్నాం కమ్యూనిస్టుపార్టి మహాసభకు హాజరైన బెంగాల్ ప్రతినిధులకు చైనా కమ్యూనిస్టుపార్టి అభిప్రాయాలు తెలిసాయి. ఆ అభిప్రాయాలే కొన్ని బెంగాల్ రాష్ట్రకమిటీ తీర్మానంలో ప్రతిబింబిచాయి. బెంగాల్ అతివాద వర్గనాయకుడు హరికృష్ణకొనార్, కేరళ మితవాద వర్గనాయకుడు కె దామోదరన్ భారతకమ్యూనిస్టుపార్టీ ప్రతినిధులుగ వియత్నాం కమ్యూనిస్టుపార్టీ కాంగ్రెసుకు వెళ్ళిన విషయం తెలిసినదే. కలకత్తా జిల్లా పార్టీ సమావేశంలో నివేదికనిస్తూ కొనార్, చైనాపార్టీ ప్రతినిధి మితవాదవర్గ కేరళ కమ్యూనిస్టు

నాయకుని మాట్లాడకుండా చేసినట్లు, చెప్పినట్లు తెలుస్తున్నది. అనేక ప్రతినిధి వర్గ నాయకులు తనకు యింటర్వ్యూలనిచ్చినట్లు "కౌనార్ వెల్లడించారు (నూతనంగా స్వాతంత్ర్యం పొందిన ఆసియాదేశాలలోని బూర్జువా ప్రభుత్వాల నాయకులు చివరకు పశ్చిమదేశాల సామ్రాజ్యవాదులందరికి చేరతారని చైనా కమ్యూనిస్టుపార్టీ అంచె గా కౌనార్ ఉదహరించారు.) ఇండియా ప్రభుత్వం, నెహ్రూలు అదే వెల్లడి చేస్తున్నారని అన్నారు. చైనా కమ్యూనిస్టుపార్టీ 1960 వసంత కాలంలో భారతకమ్యూనిస్టుపార్టీపై సోవియట్ పార్టీకిగల ఆధిపత్యాన్ని వ్యతిరేకిస్తూ, తన ప్రభావాన్ని పెంపొందించు కొను ప్రయత్నాలు మొదలిడినట్లు కన్పించుచున్నది.

ప్రపంచ 81 పార్టీల సమావేశం 1960 నవంబరులో మాస్కోలో జరిగిన దాని ఫలితం, భారతకమ్యూనిస్టుపార్టీలోని అతివాద వర్గాలను, మితవాదవర్గాలను సరియైన శాస్త్రీయమార్గంలో మలుచుటకు బదులు భేదాభిప్రాయాలను యినుమడింపజేసినట్లు కన్పడుతున్నది. మాస్కోతో చైనా చాలాకాలంగా జరుపుతున్న సిద్ధాంత పోరాటం ఫలితంగా రూపొందిన సిద్ధాంత పత్రం మధ్యేమార్గంగా, తిరిగి చైనా బహిరంగంగా వివాదం రేకెత్తకుండునట్లు గ్యారంటీలను చేర్చుటలో సోవియట్ కమ్యూనిస్టు పార్టీ వైఫల్యం స్పష్టం. అదేవిధంగా చైనా కమ్యూనిస్టుపార్టీ గూడ, మితవాదంవైపు ప్రపంచ కమ్యూనిస్టు వుద్యమం పయనించకుండునట్లు నివారించువిధానాలను చేర్చుటలోని వైఫల్యం స్పష్టంగా కన్పడుతున్నది అది వొక "రాజీ సుదీర్ఘ పత్రం", ప్రతివర్గం తమకనుకూలంగా వ్యాఖ్యానించుటకు అనుకూలంగా వుంది. బహుశా వివిధ దేశాల సామాజిక వ్యవస్థలు వివిధ దశలలో వున్నందున, ఆదేశాల కమ్యూనిస్టు పార్టీలన్నిటికి, మార్గదర్శిగ సూత్రాలను పొందుపరచు సిద్ధాంత పత్రాన్ని రూపొందించుట అంతశాస్త్రీయమైనవి, సులభసాధ్యమూ కాకపోవచ్చు. చైనా కమ్యూనిస్టు పార్టీ, సోవియట్ కమ్యూనిస్టుపార్టీని కొన్ని ప్రత్యేక సమస్యలపై తీవ్రవిమర్శకు గురిచేయుట, భారతకమ్యూనిస్టుపార్టీలోని అతివాద వర్గానికి మరింత ధైర్యాన్నిచ్చింది. వారు పార్టీలో అధికారాన్ని, మెజారిటి సంపాదించుటకు తమ ప్రయత్నాలను ముమ్మరం చేయసాగారు. ఏప్రిల్ 1961లో జరుగబోవు 6వ, అఖిలభారత కమ్యూనిస్టుపార్టీ కాంగ్రెసు, కురుక్షేత్రంగా రూపొందించ ప్రయత్నాలు రెండువైపుల జరుగుతున్నది. జనవరిలో పార్టీ కాంగ్రెసుకై ప్రతినిధుల ఎన్నిక కాన్ఫరెన్సులు, సమావేశాలలో అతివాదులు అనేక రాష్ట్రాలలో పేర్కొనతగిన విజయాలనే సాధించారు. పశ్చిమబెంగాలు పార్టీ కార్యదర్శి ప్రమోదదాస్‌గుప్తా "సంస్కరణవాద పోకడలు సి. పి. ఐ. లో" అనే పత్రాన్ని అజయు విధానాలను విమర్శించుచూ వ్రాసిన దానిని పంపిణీ చేసారు. అజయ్ విధానాలు బూర్జువాలకు, సామ్రాజ్యవాదులకు లొంగుబాటు విధానాలుగ విమర్శించారు. పార్టీ అధికారానికి అంతర్యుద్ధం మార్గంగా కాక,

ఎన్నికలను మార్గంగా చేబట్టిందని విమర్శించాడు గుప్తా. ఉదాహరణంగా సోవియట్ పార్టీపై చైనా పార్టీ వ్రాతలను వుదహరించాడు, చైనా నాయకత్వంలో పార్టీ నడవాలని గట్టిగా కోరినట్లు తెలుస్తుంది.

భారత కమ్యూనిస్టుపార్టి కేంద్రసమితి సమావేశం 1961 ఫిబ్రవరిలో పార్టీ కాంగ్రెసుకు వివిధ పత్రాలను రూపొందించ పనుకట్టింది. ఈసమావేశంలో "జాతీయ ప్రజాస్వామ్య ప్రభుత్వంపై" శాస్త్రీయ అవగాహనకు చర్చ జరిగింది. ఈ చర్చ 1960 మాస్కో పత్రపు సిద్ధాంతప్రతిపాదన నేపధ్యంలో జరిగింది. మాజీ వలసలు రాజకీయ స్వాతంత్ర్యాన్ని సంపాదించుటకు,కమ్యూనిస్టులు నేరుగా పూర్తిఅధికారాన్ని స్వీకరించుటకు మధ్య తాత్కాలికంగా యీ "జాతీయ ప్రజాస్వామ్య ప్రభుత్వం" వొక దశగా వివరించబడింది. సామ్రాజ్యవాద ప్రపంచం నుండి పూర్తి ఆర్థికస్వాతంత్ర్యాన్ని కలిగి, సామ్రాజ్యవాద వ్యతిరేక విదేశాంగ విధానాన్ని, ప్రజాస్వామ్య స్వతంత్రహక్కులు కలిగి, ప్రజాస్వామ్య సంస్కరణలు, భూసంస్కరణలు చేబట్టు కమ్యూనిస్టులు బహిరంగంగా పనిచేస్తున్న, అది జాతీయ ప్రజాస్వామ్య ప్రభుత్వంగా నిర్వచించారు అట్టిదేశాన్ని జాతీయ ప్రజాస్వామ్యం గల దేశంగా, అట్టి ప్రభుత్వాన్ని జాతీయప్రజాస్వామ్య ప్రభుత్వంగా, అట్టి రాజ్యాంగాన్ని జాతీయ ప్రజాస్వామ్య రాజ్యాంగంగా వివరించారు. అన్ని దేశభక్తపార్టీలు, కార్మిక, కర్షక, జాతీయ బూర్జువా వర్గంతోసహా యేర్పడిన" విస్తృత సామ్రాజ్యవాద వ్యతిరేక ఐక్యసంఘటన ప్రభుత్వం"చే పాలింపబడే రాజ్యంగా చెప్పారు. కమ్యూనిస్టుపార్టీ ప్రభావం తక్కువగా కలిగి వుంటుందని సోవియట్ రచనలు తెలిపాయి. అట్టి భాగస్వామ్య ప్రభుత్వంలో కమ్యూనిస్టులు ఎంతకాలం వుండగలరో మాస్కో ప్రకటన స్పష్టం చేయలేదు. వెనుకబడిన దేశాలలో కమ్యూనిస్టు పార్టీ క్రమేణా అధికారాన్ని పరిణామక్రమంలో సంపాదించాలనే సోవియట్ అవగాహనను చైనా కమ్యూనిస్టుపార్టీ ప్రతిఘటించుతునే వస్తున్నది దాని కొక కాల నిర్ణయం లేకుంటే కమ్యూనిస్టు నాయకత్వ నిర్మాణం అధికార స్వీకారం అనంతరంగా వాయిదా పడుతుందని చైనా అవగాహన, విమర్శనగా వుంది. ఈ విషయం అక్టోబరు 10, 1961 జెన్‌మిన్ జీపావో పత్రికలో, సోవియట్ 20వ, పార్టీ కాంగ్రెసు సిద్ధాంతాన్ని విమర్శించుతువ్రాసిన వ్యాసంలో స్పష్టం చేయబడింది.

ఆశించిన విధంగానే, యింతకుముందు చెప్పినట్లు విజయవాడ 6వ, పార్టీ కాంగ్రెసుకు ముసాయిదా ప్రతాలు తయారుచేయుటకు కేంద్ర సమితి సమావేశమైనపుడు మూడు ముసాయిదా కార్యక్రమాలు. మూడు రాజకీయ తీర్మానములు చర్చల నిమిత్తం ప్రతిపాదించబడినవి.

మొదటిది, అజయ్‌ఘోష్ ప్రతిపాదించిన రాజకీయ తీర్మానం, నేటి "భూగిన

లాట" "రాజీవిధానపు" ప్రభుత్వాన్ని తొలగించి, జాతీయ ప్రజాస్వామ్య సంఘటన ప్రభుత్వాన్ని యేర్పాటు చేయుటధ్యేయంగాను, అదే .శాంతియుతంగా సోషలిజంలోనికి పరివర్తనకై పరిస్థితులను రూపొందిస్తుందని స్పష్టం చేసింది. ప్రతిపార్టీలోని దేశభక్తవర్గాలను సమీకరించుటకై విస్తృత ఆందోళన కావించి, ఐక్యసంఘటనను యేర్పరచి, ప్రభుత్వవిధానాలలో క్రమేణామార్పుకొనిరావాలని స్పష్టం చేసింది. కాంగ్రెసు, ప్రజాసోషలిస్టు, తదితర ప్రజాస్వామ్యశక్తుల సామాన్య కార్యకర్తల సహకారాన్ని, బలాన్ని, మద్దతును పొందుటకు ప్రయత్నించుటలో పాటు, సాధారణంగా "క్రిందినుండి ఐక్యసంఘటనను" నిర్మించే ఎత్తుగడతో పాటు, అజయ్ తీర్మానం, స్థానిక కాంగ్రెసుకమిటీలు, తదితర స్థానిక సంస్థలతోను, యితర కార్మిక, కర్షక సంఘాలతో కలిసి సంఘటనను యేర్పాటు చేయప్రయత్నిస్తుంది. జాతీయ ప్రజాస్వామ్య ఐక్యసంఘటనను యేర్పాటు చేయ ప్రయత్నిస్తుంది. జాతీయ ప్రజాస్వామ్య ఐక్యసంఘటన పోరాడవలసిన వారిని అజయ్ గుర్తించి, కాంగ్రెసులోని కరుడుగట్టిన మితవాదవర్గాలను, బడా బూర్జువావర్గం జాతీయ బూర్జువావర్గపు విరోధిగా పేర్కొన్నారు. తత్కారణంగా ప్రజాస్వామ్యశక్తులు చిన్న, మధ్యరకపు పారిశ్రామికుల యెడల తగిన విధానాన్ని అనుసరించాలని ప్రత్యేకంగా పేర్కొన్నారు. వీరు సామ్రాజ్యవాద వ్యతిరేకులని, కమ్యూనిస్టుల అధీనంలోని కార్మికసంఘాలు "సహకారం-పోరాటం" అనే విధానాన్ని అనుసరించాలన్నారు. వీరిని ప్రజాస్వామ్య సంఘటనలో సమీకరించుటకు అట్టి విధానాన్ని అనుసరించాలన్నారు. వీరిని ప్రజాస్వామ్యసంఘటనలో సమీకరించుటకు అట్టి విధానం అనుసరించాలన్నారు. ఫ్యూడలిజం, పశ్చిమదేశాల అప్పులవిధానం, భూసంస్కరణల యెడల నెహ్రూవిధానాలను తీవ్రంగా విమర్శించుకునే, విదేశాంగ విధానంలోని అభ్యుదయకర విధానాన్ని కొనియాడారు. అదే విధంగా భారత ఆర్థిక విధానంలోని ప్రజారంగాన్ని, ప్రభుత్వరంగాన్ని బలపరచారు.

రెండవ ముసాయిదా, రణదివె రూపొందించినది కూడ "జాతీయ ప్రజాస్వామ్య సంఘటనను" ప్రస్తావించుతు, నెహ్రూ యెడల మరింత దృఢతర వ్యతిరేక ధోరణిని వెలిబుచ్చుతు, స్థానిక కాంగ్రెసు కమిటీలతో సంఘటన యేర్పాటును బలపరచక, విస్తృత బూర్జువా వర్గాలను సంఘటనలో సమీకరించుటకు అంత ఉత్సాహాన్ని కనపరచలేదు. ప్రభుత్వవిధానాలకు వ్యతిరేకంగా పోరాటాలను నడపవలసిన అవసరాన్ని మరింత గట్టిగా చెప్పింది.

నంబూద్రిపాద్ నిర్మాణ నివేదిక ముసాయిదా, పార్టీలోని క్రమశిక్షణా రాహిత్యాన్ని. సంస్కరణా వాదాన్ని, పార్లమెంటరీ విధానాలలో ఆలోచించుటను, తీవ్రంగా విమర్శించినందున పార్టీ కాంగ్రెసులో నిర్ణయానికి వదలివేయబడింది. అతివాదుల

ముసాయిదా తీర్మానం, కార్యక్రమమూ పార్టీలో అన్నివర్గాలలో సర్క్యులేటు చేయు హక్కును పొందగలిగింది. చివరకు జాతీయ సమితి మితవాదులు రాజకీయ తీర్మానాన్ని, కార్యక్రమాన్ని ఆమోదించింది. పార్టీ కాంగ్రెసులో తీవ్రచర్చల అనంతరం అన్ని ముసాయిదాలు త్రోసివేయబడి పార్టీ చీలిపోయే దశకురాగా చివరకు రాజీగా, ఆమోదించబడిన అజయ్‌ఘోష్ నివేదిక ఆధారంగా రూపొందించబడిన వొక రాజీ, తీర్మానం ఆమోదించబడుట పాఠకులకు గుర్తుండి వుంటుంది. అది పార్టీలో ఐక్యతను రూపొందించకపోగా, అతివాదులు, మితవాదులు, మధ్యేమార్గవాదులు అందరూ తమ తమ అవగాహనలకు అనుకూలంగా వ్యాఖ్యానించి, వివరించుటకు వీలుగా వుండి, ఆచరణలో నిర్వీర్యమగుట తెలిసినదే వున్నది.

7. భారత కమ్యూనిస్టుపార్టీపై కృశ్చేవు నూతనవిధానం తీవ్ర వివాదాంశాల ప్రభావాలకు లోనుఅగునట్లు చేసి, పార్టీలో సంక్షోభ పరిస్థితులను కలగచేసింది.

సోవియట్ కమ్యూనిస్టుపార్టీ 22వ, కాంగ్రెసు అజయ్‌ఘోష్, నాయకత్వంలో భారతకమ్యూనిస్టు ప్రతినిధివర్గం హాజరు అయింది. అంతర్జాతీయ కమ్యూనిస్టు నాయకత్వాన్ని పదిలపరచుకొనుటకు, చైనా పోటీని ఎదుర్కొనుటకు పరోక్షంగా చైనాని వత్తిడి చేసి అల్బేనియాను బలపరచునట్లు చేయుటకు సోవియట్ కమ్యూనిస్టుపార్టీ అల్బేనియా కమ్యూనిస్టుపార్టీ నాయకత్వంపై తీవ్రమైన దాడి చేసింది. సాంప్రదాయంగా సోవియట్ కమ్యూనిస్టుపార్టీ ప్రభావంలో అంతంత మాత్రంగా ఉన్న కమ్యూనిస్టుపార్టీల విశ్వాసం దెబ్బతిన్నది. సోవియట్‌పార్టీ ఈ చర్య భారతకమ్యూనిస్టుపార్టీ లోని అతివాద వర్గాలపై ఎట్టి ప్రభావాన్ని కలుగచేస్తుందో అజయ్‌ఘోష్‌కు బాగా తెలుసు. అభిప్రాయ భేదాలని ఈ విధంగా పరిష్కరించ ప్రయత్నించుట మార్క్సిస్టువిధాన వ్యతిరేకమని వాదించిన చౌయెన్‌లై వైఖరి. సాంప్రదాయంగా సోవియట్ పార్టీ ప్రభావంలో ఉన్న భారతకమ్యూనిస్టు పార్టీలోని వర్గాలలో కూడ సానుభూతి పొందగలదనేది స్పష్టం. ఇక అతివాదుల విషయం చెప్పనక్కరలేదు. వారు చైనా దృక్పధం యెడల సానుకూలంగానే ఉన్నారు. అజయ్‌ఘోష్ అల్బేనియా చైనా దృక్పధాల వైఖరుల యెడల ఏ మాత్రం సానుభూతి కలిగిలేనప్పటికి తదనంతరపు అజయ్‌ఘోష్ ఉపన్యాసాలలో కొంత పునరాలోచన కనపడుతుంది. అతని ప్రధానధ్యేయం పార్టీ కార్యరర్మిగ పార్టీ నిర్మాణ ఐక్యతను కాపాడుట, విచ్ఛిన్నత నుండి కాపాడుటగ ఉంది. జనరల్ ఎన్నికల ముందు పార్టీలో ఎట్టి సంక్షోభాన్ని కోరుకొనుట లేదు. అందుచేత సోవియట్‌పార్టీ కాంగ్రెసులో అల్బేనియాపై దాడిలో ఏమాత్రం పాల్గొనలేదు. ఇదే విధానాన్ని కమ్యూనిస్టు పాలనలేని దేశాలలోని కమ్యూనిస్టుపార్టీలు అవలంభించాయి, అవి అన్ని ఇంతకుముందు సోవియట్—చైనా కమ్యూనిస్టుపార్టీల సిద్ధాంతపోరాటంలో సోవియట్‌పార్టీని బలపరిచే ఉన్నవి.

అజయ్ దృక్పథంలో, సోవియట్ పార్టీ కాంగ్రెసు స్టాలిన్‌ను తీవ్రంగా తిరిగి తెగనాడుట అత్యంత ఘోరమైనది. గతంలో 1956లో కృశ్చేవు రహస్యనివేదికలో స్టాలిన్ చేసినవన్ని ఘోరాలను ఏకరవు పెట్టి, తెగనడి బహిరంగంగా ప్రకటించాడు.

సోవియట్ జీవిత వాస్తవాలంటూ, పెట్టుబడిదారిదేశాలలో దశాబ్దాలుగా సాగుతున్న కమ్యూనిస్టు, స్టాలిన్ వ్యతిరేక దుష్ప్రచారాన్ని, నాటి వాస్తవాలంటూ సామ్రాజ్యవాదులు ప్రచారం చేసిన అనేక కట్టుకథలు, పురాతన అధికార పత్రాల నుండి అంటూ స్టాలిన్ వ్యతిరేక ప్రచారం కావించాడు. అతివిశాల, వెనుకబడిన దేశాలలో సామాజిక జీవితంలో విప్లవాత్మకమైన మార్పులు తీసుకొని వచ్చినపుడు కొన్ని పొరపాటులు జరిగివుండవచ్చు, అంతమాత్రంచేత మహోన్నతమైన సోషలిస్టు విప్లవాన్ని, దాని నాయకుడు స్టాలిన్‌ను తెగనాడుట ఎంతవరకు సమర్ధనీయం? అజయ్ 1956లో స్టాలిన్‌ను తెగనాడి దుష్ప్రచారం జరిగినపుడు, పార్టీ క్రమశిక్షణ, నైతికబలం యెంతగా దెబ్బతిన్నది, కోలుకొనజాలకపోవుటను మరచిపోలేదు. ఇంకా పార్టీలో స్టాలిన్ జ్ఞాపకాలు, విజయాలు బలంగా వున్నవని, పార్టీ, తన బలం సోవియట్ యూనియన్‌లో జీవితం సంతోషదాయకంగా వున్నదన్న నమ్మకంపైనే ఆధారపడివుందన్నది అజయ్‌కు తెలుసు. దానినే కృశ్చేవ్ కూలగొట్టుతున్నది. వీటన్నిటి కారణంగానే భారతకమ్యూనిస్టుపార్టీ ప్రతినిధివర్గం అసమ్మతిని తెలియజేసిందని, "న్యూయేజ్" 10, డిశెంబరు సంచికలో అజయ్ వ్రాసారు.

"న్యూయేజ్" పత్రిక మాస్కో విలేఖరులు, సంపాదకులు ఈ ఘటలన్నిటిని ప్రకటించారు అజయ్ ప్రతినిధివర్గం భారతదేశానికి తిరిగి వచ్చేటప్పటికి, పార్టీలో తుఫాన్ చెలరేగింది. సోవియట్ పార్టీ కాంగ్రెసు తరువాత వెంటనే యు.పి రాష్ట్రంలోని అతివాదవర్గాలు పార్టీపత్రికలో అల్బేనియాని బలపరచే వ్యాసం ప్రకటించారు. అక్టోబరు 31న కేరళపార్టీ పత్రిక "జనయుగం", స్టాలిన్ వ్యతిరేక పోరాటం, దిగజారిపోయి స్టాలిన్ శవ వ్యతిరేక పోరాటంగానగుట, విషాదకరం అని పేర్కొంది. భారతదేశంలో పి.టి.ఐ. వార్తాసంస్థ నవంబరు 12న కేరళ కమ్యునిస్టు నాయకుడు, స్టాలిన్ శవాన్ని భారతదేశానికి పంపమనికోరుట నంబూద్రిపాద్ స్టాలిన్‌ను బహిరంగంగా పొగిడినట్లు ప్రకటించింది. ఆంధ్రలో సుందరయ్య స్టాలిన్ వ్యతిరేక ప్రచారానికి అసమ్మతిప్రకటించుట "న్యూయేజ్"లోవచ్చింది. పశ్చిమబెంగాల్ రాష్ట్రపార్టీ సోవియట్ కమ్యునిస్టుపార్టీని వ్యతిరేకించుతు తీర్మానాన్ని ఆమోదించినట్లు, యుగోస్లేవియా దినపత్రిక "బోర్బా" జనవరి 10న ప్రకటించింది. ఈ తీర్మానం, స్టాలిన్ వ్యతిరేక విధానాన్ని ఖండించి, అల్బేనియాపైదాడి' మాస్కో 1960 ప్రకటనకు" దాని సూత్రాలకు నేరుగా వ్యతిరేకించుట యని తీవ్రంగా విమర్శించింది.

పార్టీ నాయకత్వం అజయ్‌ఘోష్, పార్టీ సభ్యులు మౌనంతో ప్రారంభించి

ఘటనలకు "నిశ్చేష్టులై నిరుత్సాహంతో మునిగిపోయారని నూతన పరిణామాలను పార్టీలో చర్చించుట ఎన్నికలు అయ్యేటంత వరకు సాధ్యంకాదనే నిర్ణయానికొచ్చారు అజయ్‌ఘోష్ పైవ్యాసాన్ని వ్రాయునప్పటికి, కమ్యూనిస్టుపార్టీలోని మితవాద, అతివాద వర్గాల మధ్య సంబంధాలు మరింత విపత్కర పరిస్థితులకు విషమపరీక్షగా, భారత-చైనా సరిహద్దు వివాదం తీవ్రపరిస్థితికి చేరే ఘటనలు జరిగాయి.

సోవియట్-చైనా కమ్యూనిస్టుపార్టీల విధానాలు 1961 అంతటా భారత నెహ్రూ ప్రభుత్వం యెడల వ్యవహరించవలసిన పద్ధతుల భిన్న విస్తృతమార్గాలలో నడిచాయి. భారతదేశానికి ఆర్థిక సహాయాన్నిచ్చేమార్గంలో సోవియట్ విధానం కొనసాగింది. నెహ్రూవిదేశాంగ విధానాన్ని సాధారణంగా అభ్యుదయకరమైనదిగా నెంచుట కొనసాగింది. అదేకాలంలో నాటి నిర్దిష్ట సమస్యలయెడల భారతదేశం, సోవియట్ వైపు మొగ్గుటకై వొత్తిడిచేసే కమ్యూనిస్టుపార్టీ చేయుట కొనసాగినది. మొదటి 1961 అర్ధభాగంలో కాంగో, క్యూబా సమస్యలపై సోవియట్ భారత కమ్యూనిస్టు పార్టీలు, భారత ప్రభుత్వ విధానాలయెడల శ్రద్ధ వహించాయి తదుపరి అర్ధసంవత్సరంలో సోవియట్ శ్రద్ధాశక్తులు అణుప్రయోగాలు తిరిగి ప్రారంభించు సమస్యపై కేంద్రీకరించుటతోపాటు, తటస్థ రాజ్యాల సమావేశంలో బెర్లిన్ సమస్యలపై నెహ్రూ విధానాలపై శ్రద్ధాశక్తులు, సోవియటు, భారతకమ్యూనిస్టు పత్రికలు ప్రదర్శించాయి. సోవియట్ యూనియన్, సంవత్సర ఉత్తరార్ధభాగంలో భారత ప్రభుత్వం ఎట్టి విమర్శనను చేయలేదు. చైనా 1961 అంతటా యిందుకు భిన్నంగా నెహ్రూను తీవ్రవిమర్శలకు గురిచేయుట కమ్యూనిస్టు బ్లాక్ దేశాలలో ప్రపంచ కమ్యూనిస్టు వుద్యమంలో కమ్యూనిస్టేతర జాతీయ విముక్తి ఉద్యమాలలో అతనికిగల సద్భావాన్ని గౌరవాన్ని కించపరచే ప్రచారోద్యమాన్ని సాగించింది. నెహ్రూని అమెరికా సామ్రాజ్యవాదానికి నమ్మకమైన బంటు అని, చైనా, సోవియట్ యూనియన్‌లకు శత్రువని, నెహ్రూ రచనలలోని అసందర్భ వ్యాఖ్యానాలను వుదహరించుచూ దుష్ప్రచారాన్ని కొనసాగించింది.

అదేకాలంలో కొత్తగా సరిహద్దుల అతిక్రమణలతో పెకింగ్ న్యూఢిల్లీ రాయబారులు పరస్పరం నోటులు అందజేసుకొన్నారు, వాతావరణం కలుషితం కాజొచ్చింది. నెహ్రూ నవంబరు 20న లోక్‌సభలో యీ సమస్యలను ప్రజల ముందుంచారు. ఫలితంగా భారత, విదేశీయ సమాచార సంస్థలు వార్తలలో చైనా ప్రజా రిపబ్లిక్ చర్యలను గర్హించాయి. నెహ్రూ లోక్‌సభలో చైనా చర్యలను ఖండితములు చేయుట నవంబరు 21న అజయ్‌ఘోష్ చొరవతో, భారతప్రభుత్వ సమాచారంపై సరిహద్దు ఘటనలపై "ఆశ్చర్యాన్ని సంతాపాన్ని" వెలబుచ్చుట, చైనా అధికార, కమ్యూనిస్టు వర్గాలలో కోపోద్రేకాలను కలుగజేసింది. అజయ్ చైనా చర్యలు తీవ్రే

కాల రెచ్చగొట్టి, భారత-చైనా సంబంధాలను కలుషితం చేసేవిగా వున్నవని, అట్టి చర్యలకు భరతవాక్యం చెప్పాలని, అవి తిరిగి జరుగకుండా తగిన కట్టుబాట్లు చేయాలని కోరాడు.

రెండువారాల తరువాత చైనా రిపబ్లిక్ డిశెంబరు ప్రారంభంలో పరస్పరం అందించుంకొన్న నోటులను ప్రకటించింది. నెహ్రూ ఇండియాలో చైనా వ్యతిరేక ప్రచారోద్యమాన్ని సాగించుటను, సంపాదకీయంలో "జెన్ మిన్ జిపావో" ఖండించింది దీనిలో వారు గత సంవత్సరమంతా అభ్యుదయ మానవజాతికంతా నెహ్రూ శతృవని చిత్రించుటకు చేసిన ప్రయత్నాలన్నిటిని సమీక్షించి అమెరికా ప్రోద్భలంతో కమ్యూనిస్టు శిబిరానికి నష్టం కలుగజేయుటకు, బలహీనపడిన కాంగ్రెసు వచ్చే ఎన్నికలలో బలాన్ని పుంజుకొనేందుకు, చైనా వ్యతిరేక వుద్యమాన్ని ప్రారంభించాడని నిర్ణయించింది. అజయ్‌పై గల కోపాన్ని వెలిబుచ్చుతూ "నెహ్రూను అనుసరించాడు....తొందరపడి చైనాను ఖండింపుతు ప్రకటించాడు సత్యాన్ని తెలుసుకొనుటకు ప్రయత్నించక, ఘటనలలోని తప్పు వొప్పులను చూడలేదు అని దాడి చేసింది, చైనా పత్రిక.

అజయ్ ఘోష్‌పై యీదాడి, సోవియట్‌పై పరోక్షదాడి మాత్రమే గాక, భారతకమ్యూనిస్టుపార్టీలోని అతివాద వర్గాన్ని బలపరస్తూ, మితవాద వర్గాన్ని గర్హించే చర్యగా చెప్పవచ్చు పెకింగ్ డిల్లీ వాగ్వివాదం చైనా-సోవియట్ అంతర్జాతీయ సైద్ధాంతిక విస్తృత వాగ్వివాదంతో మిళితమై అల్పేనియాని, భారత ప్రధాన మంత్రిని చైనా ఖండించుటను భుజాన వేసుకొంది, కాని తూర్పుయూరపు సోవియట్ యూనియనులు ఆ పని చేయ నిరాకరించాయి. చైనా పత్రిక నెహ్రూను తెగనాడుతు సంపాదకీయం ప్రకటించకముందే డిశెంబరు 2న, భారతదేశ సందర్శనకు బ్రెజ్నేవ్ ఆహ్వానించబడ్డాడని, అహ్వానం ఆమోదించబడిందని టాస్‌వార్తా సంస్థ ప్రకటించింది. రెండువారాల తరువాత బ్రెజ్నేవ్ భారతదేశాన్ని సందర్శించారు.

భారత కమ్యూనిస్టుపార్టీలోని మితవాద, అతివాద ప్రత్యర్థి రెండుగ్రూపులు మధ్య వివాదం పెరుగుటకు చైనాచర్య తోడ్పడింది. జనవరి 1962లో యుగోస్లోవియా వార్తా సంస్థల నివేదికల ప్రకారం, పశ్చిమబెంగాల్‌పార్టీ తీర్మానం ప్రకారం, అజయ్ ఘోష్ చైనా వ్యతిరేకప్రకటన "పార్టీలోని ఒక భాగం యొక్క అభిప్రాయం మాత్రమేనని" తెలుస్తున్నది. పశ్చిమబెంగాల్‌పార్టీ పత్రిక -స్వాధీనత" నెహ్రూపై దాడి చేస్తూ, చైనా వాదనల మార్గంలో అనేక వ్యాసాలు ప్రచురించింది. ఈ వ్యాసాలనే చైనా వార్తా సంస్థ చైనాలో ప్రచారంలో పెట్టింది. ఆ విధంగా కాక, పార్టీ పత్రిక "న్యూయేజ్" పత్రిక మితవాదుల అధ్వర్యంలో నవంబరు డిశెంబరులలో భారతకమ్యూనిస్టుపార్టీ, చైనా కమ్యూనిస్టుపార్టీల మధ్య అభిప్రాయభేధాలున్నట్లు ఆమోదించింది. డిశెంబరు 13న అజయ్‌ఘోష్‌పై చైనా దాడికి ప్రతిగా కేంద్ర శక్ర

ఉరియట్ సభ్యుడు డా॥ జడ్. ఎ. అహమ్మద్, అజయ్‌ఘోష్ తన్నుతాను చూచు కొనగలడని "బయటినుండి ఎట్టి సలహా అవసర లేదని, అతను చేసేది భారతప్రజ లందరికి సంబంధించినదని" అన్నారు. భారతదేశ విదేశాంగ విధానం, చైనా రిపబ్లిక్ యెడల దాని వైఖరి, అమెరికా ప్రభావం అనుట అసంగతమని త్రోసిబుచ్చారు. భారతకమ్యూనిస్టుపార్టీ, నెహ్రూ విదేశాంగ విధానాన్ని బలపరస్తుందని, పునరుద్ఘా టించారు.

భారతకమ్యూనిస్టుపార్టీ 1961 చివరకు ఒక దశ శిఖరాగ్రానికి చేరింది. పార్టీ లోని "మితవాద వర్గం" బహిరంగంగా చైనా కమ్యూనిస్టుపార్టీని విమర్శించుట, తిరిగి బహిరంగంగా విమర్శించబడుట, అల్బేనియా, చైనా వైఖరికి వ్యతిరేకంగా సోవియట్ అవగాహనలను బలపరచుట అయినా సోవియట్‌పై దాడి చేసిన పద్ధ తులకు విచారాన్ని వ్యక్తంచేసి, స్టాలిన్‌పై నూతన దాడులకు షాక్‌లకులోనై చీలికలకు ఎరయై, కృశ్చేవ్ తిరిగి ఎదురుదాడిచేసి సమస్యను క్లిష్టం చేసినందుకు విచారాన్ని వెలి బుచ్చింది. పార్టీలోని "అతివాదవర్గం" నెహ్రూ విధానంపై చైనీస్ ప్రకటనలను,వ్యాసా లను అచ్చువేసి పంపిణిచేస్తూ, చైనా రాజకీయ విధానాలను బలపరస్తున్నది. పార్టీ కార్యదర్శి అజయ్ చైనా విధానాల వ్యతిరేక ప్రకటనలను గర్హించుచున్నది. కనీసం సోవియట్‌పార్టీ విధానాలకు వ్యతిరేకంగా వొక తీర్మానాన్ని పార్టీ ఆమోదించుట జరిగింది. పార్టీ సమిష్టిగా స్టాలిన్, అల్బేనియా, చైనా విధానాలకు వ్యతిరేకంగా చేయు, సోవియట్ ప్రయత్నాలను వ్యతిరేకించింది.

ఇట్టి పరిస్థితులలో జనరల్ కార్యదర్శియైన అజయ్‌ఘోష్ జనవరి 13, 1962న చనిపోయి, భారత కమ్యూనిస్టుపార్టీలో చీలికలను రాకుండా చేసే జాతీయ అంతర్జాతీయ, ఐక్యతా తటస్థవాదుల ప్రయత్నాలకు అఘాతం సృష్టించారు. భారత కమ్యూనిస్టుపార్టీకి, జాతీయ, అంతర్జాతీయ కమ్యూనిస్టు వుద్యమాలలోని మితవాద" "అతివాద" వాద వర్గాల అందరితో కలసి చర్చించగల వ్యక్తి నాయకత్వం అన్ని విధాల అవసరమైంది. భారత ఎన్నికల ఫలితాలు ఫిబ్రవరిలో వచ్చుటతో యీ సమ స్యకు మరో కోణం తోడైంది. కమ్యూనిస్టుపార్టీ పరిస్థితి, దేశమంతటా పరిశీలించిన యేమంత మెరుగుకాలేదు. పార్టీ బలంగా వున్న పశ్చిమబెంగాల్, పంజాబు, ఆంధ్ర ప్రదేశ్, కేరళలలో అతివాద వర్గం" పార్టీలో గణనీయమైన బలం కలిగి వుంది. పార్టీ బలహీనంగా వున్న మహారాష్ట్ర తదితర రాష్ట్రాలలో "మితవాద వర్గం" బలంగా వుంది, వారి నాయకుడు డాంగే పార్లమెంటు సీటును కోల్పోవుట జరిగింది. "అతివాదులు" బలంగా వున్న రాష్ట్రాలలో వారు తమ బలాన్ని కాపాడుకొనగలి గారు.

12)

భారతకమ్యూనిస్టుపార్టీ నాయకత్వం ఏప్రిల్ చివరకు, పార్టీ స్వభావానికి తగిన అనిశ్చిత తాత్కాలిక రాజీకి, పార్టీలోని "వర్గాల" పోటీని వాయిదావేసి, పార్టీ నాయకత్వ నిర్ణయాలు చేయజాలకపోయింది. మాజీ కేరళముఖ్యమంత్రి నంబూద్రి పాద్ 1961లో బహిరంగంగా, అతివాదులబలం పెరిగినందున వారి యెడల కొంత సుముఖత చూపెట్టి యున్నందున, అతివాదులను సంతృప్తి పరచుటకు, అజయ్‌ఘోష్ స్థానంలో జనరల్ సెక్రటరీగాను, అదేకాలంలో బాధ్యతలు అధికారాలు నిర్వచించని అధ్యక్షపదవిని సృష్టించి, మితవాద నాయకుడైన డాంగేని అధ్యక్షునిగా పదవీబాధ్యతలు అప్పగించే రాజీ వొప్పందాన్ని "మితవాద అతివాద వర్గాలు" చేసుకొన్నవి డాంగేని అధ్యక్షస్థానానికి అంగీకరించిన అతివాద వర్గానికి కార్యవర్గవర్గం లేక కేంద్ర సెక్రటేరియట్‌లో అధిక ప్రాతినిధ్యాన్నిచ్చి, దైనందిన కార్యక్రమాలను నడిపే బాధ్యతలను అప్పగించారు. స్పష్టంగా, భిన్నవర్గాల (గ్రూపుల) మధ్య పార్టీ కేంద్రంలో అనిశ్చిత సమతూకం, పార్టీలోని వాటి పరిస్థితిని ప్రతిబింబించే విధంగా, జాతీయసమితి ప్రమేయం లేకుండా జరిగిన "రాజీ వొప్పందం" యేర్పాటు. ఇది యే మార్క్సిస్టు, లెనిన్ సూత్రాలననుసరించి జరిగిందో చెప్పజాలము. శాస్త్రీయ సోష లిస్టుపార్టీల నిర్మాణ మనజాలం. బూర్జువా పార్టీలు యిట్టి విధానాలు అనుసరించుట సర్వసాధారణము. ప్రాప్తకాలజ్ఞత పరాకాష్ఠయిది. తదనంతర పార్టీ చరిత్రదానినే రుజువుచేసింది.

సరిహద్దు సమస్య : కమ్యూనిస్టులు

8. ఈశాన్య, వాయువ్య సరిహద్దు ప్రాంతాలైన లడక్, నీఫాలపై అక్టోబరు 20, 1962న చైనా సైన్యాల దాడి, సరిహద్దుల అతిక్రమణలతో ప్రారంభమైంది. నెహ్రూ ప్రభుత్వం, ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమం యెడల తీసుకొనవలసిన వైఖరిలో పెద్దమార్పు మలుపువచ్చింది. పార్టీ "పక్షపాతం"తో స్తంభించిపోయింది. చైనాని నిర్మొహమాటంగా ఖండించకుండా, జాతీయప్రభుత్వాన్ని బలపరచకుండా, తను అతికష్టంతో నిర్మించుకొన్న బలాన్నంతా కోల్పోయే పరిస్థితి ఏర్పడింది. కమ్యూనిస్టు మితవాద వర్గాలు నాయకత్వం వహించే రాష్ట్రకమిటీలు బహిరంగంగా, చైనా దురాక్రమణను ఖండించనారంభించాయి. పార్టీ జాతీయసమితి నవంబరు 1న ప్రకటనచేయువరకు అధికారరీత్యా భారత కమ్యూనిస్టుపార్టీ యెట్టి చర్యతీసుకొన లేదు. అక్టోబరు 20నుండి నవంబరు 1 వరకు 12 రోజులలో ఆ తీర్మానానికి పూను నిచ్చే రెండు ముఖ్యఘటనలు జరిగాయి.

మొదటిది: అక్టోబరు 22న క్యూబాలో సోవియట్ మిసలీల సంక్షోభం ప్రారంభమైంది. భారతదేశంలో తన స్థానాన్ని పదిలపరచుకొనుటకంటె, మించిన అత్యావసర పరిస్థితి తనముందున్నదనే అవగాహనకు సోవియట్‌వచ్చినట్లు కన్పించుచున్నది

మూడు సంవత్సరాలలో భారత-చైనా సరిహద్దు వివాదంలో మొదటిసారిగా అక్టోబరు 25న, ప్రవదా సంపాదకీయాలలో నాను బలపరచింది. సంపాదకీయంలో మెక్ మహన్ రేఖను సరిహద్దుగా అంగీకరించుటకు గల న్యాయాన్ని ప్రశ్నించి, కాల్పుల విరమణకు చేసిన చైనా ప్రతిపాదనలను బలపరచింది. కాల్పుల విరమణకు భారత షరతులను వ్యతిరేకించింది. కమ్యూనిస్టు పక్షపక్ష ఐక్యత (సాలిడారిటి)కు సోవియట్ ప్రాధాన్యతనిచ్చి యిట్టి విపరీతచర్యను తీసుకొన్నట్లు కనపడుతున్నది. క్యూబా సంక్షోభంలో సైనిక సంఘర్షణ పరిస్థితి యేర్పడితే, చైనా మద్దతు అన్ని విధాల ఆశించి, దీనికి వొడిగట్టినట్లు కనపడుతుంది.

ఆ విధంగా సోవియట్ ఆశించుట అత్యాశ, ఊహాజనితమని వెంటనే రుజువైంది. క్యూబా సంఘర్షణలో సోవియట్ త్వరగానే వెనుకడుగువేసింది. చైనా నిర్దాక్షిణ్యంగా సోవియట్, అమెరికా యెడల "సంతృప్తిపరచే విధానం" అవలంబించిందని తెగనాడింది. ఇండియా విషయమై తమను సంతృప్తిపరచేవిధానం మాత్రమే చాలదని చైనా స్పష్టం చేసింది. జన్‌మిన్‌జిపావో అక్టోబరు 22న "నెహ్రూస్ ఫిలాసఫీ" అను వ్యాసాన్ని ప్రకటించింది గతంలో 1959లోని వ్యాసంలో నెహ్రూ గందరగోళంలోపడిన వూగిసలాటమానిగా చిత్రించి అతని విధానం "సామాన్యంగా అనుకూలమైనది"గా చెప్పబడింది, కాని నేడు నెహ్రూ అభివృద్ధి నిరోధకులకు, సామ్రాజ్యవాదులకు "ఏజంటు"గా పనిచేస్తున్నాడని నిందిందారు. భారత కమ్యూనిస్టు పార్టీని "నెహ్రూ వెనుక పోవద్దని" అతడు పెకింగ్‌పై చేసిన నిందలను పునశ్చరణ చేయవద్దని హెచ్చరించారు. ఆ విధంగా చేసాడని డాంగేని గర్హించారు. సంపాదకీయం నెహ్రూచర్యలను ఖండించినపుడే సోవియట్ కార్మికవర్గం అంతర్జాతీయతను చైనా దృక్పధాన్ని బలపరచినట్లు అగుతుందని స్పష్టంచేసింది. కృశ్చేవ్ ఇండియా విధానాన్ని పూర్తిగ వదిలేయాలని, గత 8 సంవత్సరాలుగ భారతీయులతో నెరపిన స్నేహ, సంబంధాలను విడనాడాలని కోరింది.

సోవియట్ యూనియన్ అక్టోబరు చివరకు, పెద్దపొరపాటు చేసానని భారతీయ ప్రజాసామాన్యంలో తమ స్థానాన్ని కోల్పోయానని, అయినా ఆశించిన ఫలితాలు కలుగకపోగా, తన ఇండియా విధానం, ఇండియా-చైనా వివాదాన్ని యే మాత్రం అదుపులో పెట్టకపోగా మంచిజరుగలేదని సోవియట్-క్యూబా విధానాలపై చైనా తీవ్రమైన దాడిని అదుపులో పెట్టజాలకపోయిందని, స్పష్టంగా చూడగలిగింది. అదే విధంగా నవంబరు 5వ న ప్రవదాసంపాదకీయం, తదనంతర వ్యాఖ్యలతో చైనాను కొంతవరకు బలపరచు విధానాన్నుండి 'వెనుదిరిగి తటస్థ విధానాన్ని సోవియట్ యూనియన్ అవలంబించింది.

భారత కమ్యూనిస్టుపార్టీ యీకాలంలో తీవ్ర అంతర్గతపోరాట ఫలితంగా

మాస్కో పెకింగులు బహిరంగంగా యిచ్చిన సలహాలను తిరస్కరించి, ప్రధానంగా సోవియటు యూనియన్‌నుకు ఆమోదయోగ్యంకాని విధానాన్ని చేబట్టింది. పార్టీ జాతీయసమితిలోని డాంగే వర్గం చైనాను ఖండించు తీర్మానాన్ని వొత్తిడిచే, ఆమోదింపజేసి, చైనా దురాక్రమణకు వ్యతిరేకంగా నెహ్రూ వెనుక ఐక్యమవ్వాలని పిలుపు నిచ్చింది. అక్టోబరు 25న ప్రవాస భారతకమ్యూనిస్టుపార్టీని అటువంటి తీర్మానాన్ని ఆమోదించవలదని కోరినా, అటువంటి తీర్మానం తప్పనిసరియని తలచబడింది. అంతేగాక, వ్యాపార ప్రాతిపదికపై యే దేశాన్నుండైనా ఆయుధాలు కొనవచ్చని తీర్మానం తెలిపింది. సోవియట్ యూనియన్‌కు యీ తీర్మానాలు మ్రింగుడుపడలేదు. చైనాకు వ్యతిరేకంగా పశ్చిమదేశాల సైనిక ఆయుధాల సహాయాన్ని పొందుటను మాస్కో ఆమోదించినా సోవియట్ అనుయాయులెందరి ప్రశ్నలనో యెదుర్కొన వలసి వచ్చింది. సాధారణంగా భారతకమ్యూనిస్టుపార్టీని బలపరచే బ్రిటిష్ కమ్యూనిస్టుపార్టీ అక్టోబరు, నవంబరులలో బహిరంగంగా భారతవ్యతిరేకతను వెలిబుచ్చింది జకోస్లోవేకియా కమ్యూనిస్టుపార్టీ మొదట పెకింగ్ కథనాన్ని అనుసరించి అక్టోబరు 20న భారతదేశమే పెద్దయెత్తున దాడిని మొదలుపెట్టిందని, అంటూ నవంబరు 8 వరకు మెక్‌మాహన్ రేఖ న్యాయబద్ధతను ప్రశ్నించింది. ఇటాలియన్‌కమ్యూనిస్టుపార్టీ గూడ భారత కమ్యూనిస్టుపార్టీ వైఖరిని తాము అర్థం చేసుకొనలేకుండా వున్నామని విమర్శించింది.

ఇంతలో నవంబరు 5న, ప్రపదా బహిరంగంగా తటస్థత వహించుతున్న సోవియట్ యూనియన్, తిరిగి పూర్వ విధానాన్ని చేబట్టుటతో, దేశంలోని పరిస్థితి కొంత మెరుగు అగుటతో కమ్యూనిస్టుపార్టీ డాంగే నాయకత్వం ఇంటాబయటా తన స్థానాన్ని పదిలపరచుకొనుటకు త్వరితంగా వ్యవహరించింది మరుసటిరోజు డాంగే నెహ్రూతో సంభాషణలు జరిపినట్లు ప్రకటించబడింది. జాతీయసమి తీర్మానాన్ని డాంగే నెహ్రూకి వివరించి కమ్యూనిస్టుపార్టీ మద్దతు నెరిగించాడు. చైనా పత్రిక జెన్‌మిన్ జిహావో అక్టోబరు 27న, భారతకమ్యూనిస్టుపార్టీ చేసిన విమర్శనాదాడిని, జాతీయసమితి సమావేశం ముందు డాంగే నాయకత్వాన్ని తొలగించవలసినదిగా చేసిన విజ్ఞప్తిని "జాతీయదురహంకారంగా" భారతకమ్యూనిస్టుపార్టీ వారపత్రిక "న్యూయేజ్" తీవ్రంగా విమర్శించింది. అదేకాలంలో ప్రపంచకమ్యూనిస్టుపార్టీలన్నిటికి భారతకమ్యూనిస్టుపార్టీ వైఖరి సరియైనది వివరిస్తూ, చైనాపై వొత్తిడి చేయవలసినదిగా విజ్ఞప్తి చేస్తూ సుదీర్ఘ లేఖలు వ్రాస్తూ వివరించుటకు విదేశాలకు ప్రతినిధి వర్గాన్ని పంపుటకు జాతీయసమితి నిర్ణయించింది.

కమ్యూనిస్టుపార్టీ కేంద్రనాయకత్వం, నవంబరు ప్రారంభానికి చాలవరకు డాంగే చేతులలోనికి వచ్చింది. వ్యతిరేకంగా వున్న నాయకత్వాలను రాష్ట్రాలలో

లొంగిపోవుటో, మార్చబడుటో జరిగింది. జనరల్ శెక్రటరీ నంబూద్రిపాద్ వూగిన లాటలోపడి, నవంబరు 1, తీర్మానాన్ని ఆమోదించుటకు నిరాకరించినట్లు కన్పడుతున్నది. కేంద్ర శెక్రటేరియట్‌లోని ముగ్గురు అతివాద సభ్యులు నవంబరు 1వతేదీ తీర్మానం జాతీయసమితిచే ఆమోదించబడుటతో రాజీనామా చేసారు. జనరల్ శెక్రటరీ అగ్రనాయకత్వంనుండి వేరుపడిపోయి అధికారంలేని వాడయ్యాడు. నాటి భారత ప్రజల వొత్తిడికి, గాలివాటానికి పార్టీ అగ్రనాయకత్వం లొంగిపోయి అతివాద వర్గాలను నాయకత్వాలనుండి, కేంద్ర, రాష్ట్రాలలో తొలగించుట జరిగింది. భారత ప్రభుత్వం జాతీయసమితి సమావేశ అనంతరం నవంబరు 7న రెండవసారి 27న, కమ్యూనిస్టుపార్టీలోని కేంద్ర, రాష్ట్రాలలోని అతివాద నాయకత్వ వర్గాలను ముఖ్యులను అరెస్టుచేసి డిటెన్యూలుగ జైళ్ళలో వేసింది.

ఈ పరిస్థితిని, అతివాదవర్గ నాయకత్వాలు అరెస్టు జగుటతో సంక్షోభం ఏర్పడుటతో ప్రజలలో తాత్కాలికంగా ప్రకోపించిన జాతీయతత్వానికి, వొత్తిడికి లోనై శేష అతివాదవర్గాలను త్రోసవేసి అన్నిస్థాయిలలో పార్టీనిర్మాణంలో మితవాద వర్గాలతో నింపివేసి యేకపక్షంగా పార్టీ నిర్మాణాన్ని ఆక్రమించుట అతివాదవర్గాలు మెజారిటీగ, బలంగావున్న రాష్ట్రాలలో జరిగిందనుట వాస్తవం. తాత్కాలిక ప్రలోభావాలకు లోనై పార్టీ భవిష్యత్తుకు నిర్మాణానికి శాశ్వత హానిజరుగుట మరోవాస్తవం అభిప్రాయ భేదాలున్నవారికి ద్వారాలన్నిటిని మూసివేయుట మరోచారిత్రిక సత్యం. వివాదగ్రస్థ విషయాలను పరిష్కరించవలసి వచ్చినప్పుడల్లా సంవత్సరాలకొలది నిర్ణయాలను వాయిదావేయు సాంప్రదాయం అశాస్త్రీయం బలంగా వేళ్ళూని వున్న పార్టీ. యీ వొక్క విషయంలో నిర్మాణ చర్యలద్వారా పరిష్కరించగలమనుకొనుట శాస్త్రీయ సోషలిస్టు విచేచనకు నిలబడదు. పార్టీ పరిస్థితిని పరిశీలించి నాపైనుండి క్రిందివరకు నిట్టనిలువుగా సైద్ధాంతికంగా నిర్మాణరీత్యా కొంతవరకు చీలికలు ఏర్పడి వున్నపుడు, యీ పార్టీ నిర్మాణచర్యలు మైనారిటీవర్గం బోర్డును పెట్టుటకు త్రోసివేయుట మితవాదమెజారిటీవర్గం అనుసరించిన "స్టాలిన్ అనుసరించిన నిర్మాణ పద్ధతులే అగుతవి." ఇది మితవాదులలోని అతివాద దుందుడుకు విధానాలను" తెలియజేస్తుంది. మార్క్సిజం చెప్పే మితవాదంలో అతివాద చర్యలు ఆచరణ, అతివాదంలోని మితవాద చర్యలు, ఆచరణ" అనే మౌలికాంశములోని పూర్వభాగాన్ని మన ముందుంచింది.

కమ్యూనిస్టుపార్టీలోని మితవాదవర్గం అతివాదవర్గం జైళ్ళలో వున్నపుడు మొదటసారిగా, అతివాదవర్గపు బలమైన కేంద్రాలన్నిటిని పశ్చిమబెంగాల్, పంజాబులలో తమస్థానాలను బలపరచుకొని అన్ని చోట్ల తమ బలాధిక్యతను పార్టీ నిర్మాణంలో సంపాదించగలిగింది. ఈ చర్య అతివాద వర్గపు ప్రతిచర్యకు దారితీసింది.

అటే పార్టీ చీలికకు ప్రాథమిక చర్య ప్రతిచర్యగా నెంచవచ్చును. పంజాబులో పార్టీ ప్రధానకార్యదర్శి అరెస్టుకుముందు అతివాదవర్గాని కంతటికీ, నూతనంగా యేర్పడే రాష్ట్రకమిటీతో సహకరించవద్దని సలహాయిచ్చినట్లు తెలుస్తున్నది. మితవాద శక్తుల నుండి, పార్టీకి అతివాదవర్గం హెచ్చరిక యిచ్చినట్లుగూడ తెలుస్తున్నది. పశ్చిమ బెంగాలులో వొకరహస్యకేంద్రం. అతివాదులునడుపుతున్నట్లు తెలుస్తున్నది. అదికూడ అట్టి సూచనలనే యిచ్చినట్లు, అనేకపార్టీ శాఖలు రహస్య కేంద్రంతో సంబంధాలు పెట్టుకొని అధికారపార్టీతో సంబంధాలను నిరాకరించినట్లు తెలిసింది పశ్చిమబెంగాల్ పార్టీ పత్రిక "స్వాధీనత నూతన పాలకవర్గం మాజీ అతివాదవర్గం సంస్థ ప్రెస్‌ను తనఖాపెట్టి తీసుకొన్న నిధులను దుర్వినియోగంచేసి పార్టీని ఆర్థిక సంక్షోభంలో ముంచివేసారని బహిరంగంగా ప్రకటించి, పేపరును కొనసాగించుట సాధ్యంకాదని చెప్పింది.

కమ్యూనిస్టుపార్టీ నిర్మాణంలో వస్తున్న చీలికలకు పెకింగు "డాంగేముఠా" కారణమని తరువాతతమతో అంగీకరించని వారందరినిత్రోసివేయుటకు, పాలకపార్టీ బలాన్ని కూడ వినియోగించుకొన్నారని నిందారోపణ చేసింది. డిశెంబరు 1962, జనవరి ఫిబ్రవరి 1963లలో కమ్యూనిస్టు చైనా బహిరంగంగా "నిజమైనమార్క్సిస్టు, లెనినిస్టులు సోవియట్ ననుసరించే పార్టీలలో తిరుగుబాటులు కావించాలని పిలుపు నిస్తూ ప్రపంచ కమ్యూనిస్టుపార్టీలన్నిటిలో ముఖ్యంగా భారత కమ్యూనిస్టుపార్టీలో చీలికలను ప్రోత్సహించింది తన స్థానాన్ని పదిలపరచుకొనుటకు, చట్టబద్ధంచేయుటకు భారతకమ్యూనిస్టుపార్టీ అంతర్జాతీయ సైద్ధాంతిక చర్చల వివిధ ధోరణులను, ప్రకటనలను పునర్ముద్రించి పంపిణీ చేసింది. సోవియట్-చైనా కమ్యూనిస్టుపార్టీల సైద్ధాంతిక బృహద్వివాదం విస్తృతమైన కొలది తూర్పు జర్మని 1963 జనవరి పార్టీ కాంగ్రెసులో సెక్రటరీ ఆల్‌బ్రిట్స్ "చైనా కమ్యూనిస్టు కామ్రేడ్స్ సరిహద్దు విషయంలో శాంతి సహజీవన విధానాన్ని అనుసరించలేదని" విచారం వెలిబుచ్చుట ప్రకటించారు.

సోవియట్ కమ్యూనిస్టుపార్టీ 1962-1963లలో భారతకమ్యూనిస్టుపార్టీ చీలిపోయే పరిస్థితులకు విచారిస్తున్నతీ అట్టి చీలిక ఏర్పడుటకు దోహదపడే విధానాలు అనుసరించుటకు కలత చెందుచున్నది న్యూఢిల్లీతో సంబంధాల విషయమై జాగ్రత్త పడుతు, సోవియట్ వార్తా సంస్థలు అనేకసార్లు కమ్యూనిస్టు నాయకులను అరెస్టు చేసి, జైళ్ళనందుంచుటకు తమ అసమ్మతిని తెలియజేసింది. ముఖ్యంగా జనరల్ సెక్రటరీ నంబూద్రిపాద్‌ను అరెస్టుచేయుటకు తీవ్ర అసమ్మతిని ప్రకటించింది. డిశెంబరు 30న ప్రవదా విలేఖరి "భారత కమ్యూనిస్టుపార్టీ అంతర్గత విషయాలలో" ఒక భారతమంత్రి "కమ్యూనిస్టుపార్టీ తన సభ్యులలో అనుమానాస్పదవర్గాలనుండి పార్టీని పరిశుద్ధం చేయాలని" చెప్పినట్లు పేర్కొని కలుగజేసుకొనుటకు విచార్యం

వ్యక్తం చేసాడు. అట్టి ప్రయత్నాలు "కమ్యునిస్టుల ప పవిత్రులు "అపవిత్రులుగా" చేయుటను ప్రపదా ఫిర్యాదు చేయుట అంటే "కమ్యునిస్టుపార్టీ అంతర్గత వివాదంతో మంటలు లేపుట, చీలికలు తెప్పుటయే తప్ప మరొకటి కాదన్నది.

కమ్యునిస్టుపార్టీ ప్రతినిధివర్గం డాంగే నాయకత్వంలో డిసెంబరులో సోవియట్ యూనియన్, తూర్పుయూరపు, ఇటలీ, బ్రిటనులలో పర్యటించి, నవంబరు జాతీయసమితి తీసుకొన్న వైఖరిని వివరించి, సంభాషణలు జరిపి సలహాలు పొందారు. డాంగే విదేశీ పర్యటనకు ముందు నెహ్రూ దేశీయంగ మంత్రిశాస్త్రితో సంప్రదింపులు జరిపాడని "న్యూఢిల్లీ ఏజంటు"గా పనిచేసాడని పెకింగు ప్రకటించింది. డాంగే పర్యటన లక్ష్యం పార్టీ చైర్మన్ స్థానాన్ని నూతన నాయకత్వాన్ని పదిల పరచుకొనుట, కృశ్చేవ్‌తో సంభాషణలలో కమ్యునిస్టుపార్టీ తన నాయకత్వంలో తీసుకొన్న చర్యలన్నిటిని సమర్థించుకొని. సరియైనవిగా వివరించి సుముఖ స్పందనను పొందుటగా కన్పడుతున్నది. అయితే యీ విషయంలో డాంగే పూర్తి విజయాన్ని సాధించలేకపోయాడని భారత వార్తాసంస్థలు ఆనాడు పేర్కొన్నాయి. కృశ్చేవ్ జాతీయసమితి తీర్మానం, అనవసరంగా చైనా సరిహద్దు అతిక్రమణను నిర్మొఖమాటంగా పేర్కొనుటను గర్హించినట్లు, నెహ్రూను బలపరచుటలో, తగిన పరిమితులు లేకుండా చేయుటను విమర్శించినట్లు వార్తలు వచ్చాయి.[1] డాంగే తిరిగి వచ్చినవెంటనే మొదట నెహ్రూకి నివేదించాడు, తరువాతపార్టీ కేంద్రకార్యవర్గానికి నివేదికనిచ్చాడు. పార్టీ కార్యవర్గం డాంగే విదేశాలనుండి తెచ్చిన సలహాలకు సుముఖంగా స్పందించినట్లు కన్పడుతున్నది. జనవరి 12న చేసిన తీర్మానం దానిని కొంతవరకు ప్రతిబింబించినట్లు చెప్పుకొనవచ్చు. భారతప్రభుత్వం సంప్రదింపులకై చేబట్టిన వైఖరిని కొంతవరకు బలపరచుట కొనసాగిస్తూనే వొడంబడిక జరుగుటకు బాధ్యత పెకింగుపైనే వుంచుతు, శాంతియుత పరిష్కారముపై నొక్కి చెప్పుతు పశ్చిమ సామ్రాజ్యవాద శక్తుల ఎత్తుల ప్రమాదాన్ని స్పష్టం చేయుట జరిగింది.

భారతకమ్యునిస్టుపార్టీ విధానంలోని యీమలుపు "శాంతియుత పరిష్కారాన్ని నొక్కి చెప్పుట పార్టీ జాతీయసమితి ఫిబ్రవరి సమావేశంలో చేసిన తీర్మానంలో స్పష్టంగా ప్రతిబింబించింది. అదే కాలంలో జాతీయసమితి చైనా కమ్యూనిస్టుపార్టీ విధానాన్ని స్పష్టంగా ఖండించి ప్రజల దృష్టిలో పార్టీ రాజకీయ విధానాన్ని నిర్వచించింది. ఈ జాతీయసమితి సమావేశంలోనే కార్యదర్శి పదవికి నంబూద్రిపాద్ రాజీనామా చేయుట జరిగింది. పార్లమెంటులో కమ్యూనిస్టు ప్రతిపక్ష నాయకుడు

1. "లింక్" (న్యూఢిల్లీవీక్లీ) డిసెంబరు 29, 1962
2. న్యూయేజ్ (వీక్లీ) జనవరి 20, 1963 జనవరి తీర్మానంపై టాస్ వ్యాఖ్యానించుతు తీర్మానపు ఉత్తర భాగాన్ని "శాంతియుత పరిష్కారం" నొక్కి చెప్పింది.

ఏ కె. గోపాలన్ పార్టీలోని అతివాద వర్గాన్ని, క్రిందిస్థాయిలలో కార్యకర్తలను సమీకరించ ప్రారంభించారు.

నంబూద్రిపాద్, మార్చి 1963 లో "వరల్డ్ మార్క్సిస్టు రివ్యూ"లో వొక సమీక్ష వ్రాస్తూ సోవియట్ యూనియన్ మౌలికసిద్ధాంతమైన "భారత బూర్జువా వర్గపు అభ్యుదయకరపాత్ర అంతంకాలేదు. అన్నదానిని పునరుద్ఘాటించి, నెహ్రూను బలపరచవలసిన అవసరం వుందంటూ, అవి ప్రజావ్యతిరేక చర్యలైనపుడు తప్పని సరిగా విమర్శించాలనే వైఖరిని చేబట్టారు. అయితే కొంతమంది కామ్రేడ్స్ నేరుగా నెహ్రూ ప్రభుత్వంతో పయనించుటను తీవ్రంగా విమర్శించారు అంతేగాక భారత కమ్యూనిస్టుపార్టీలోని మితవాదవర్గంలోనివారు కూడ కొంతమంది నెహ్రూ చాల వరకు మితవాదంవైపు వెళ్ళుటను విమర్శిస్తునే వున్నారు. ఈ స్పందనలను సోవియట్ పూర్తిగ త్రోసివేయజాలకపోయింది.

చైనాకు సంబంధించి, సమస్యచిక్కులు లేనివిగా కన్పించింది. మార్చి 9, 1963లో "జెన్‌మిన్ జీపావో" చైనా వైఖరిని స్పష్టం చేసింది. సంపాదకీయంలో భారతకమ్యూనిస్టుపార్టీ నాయకత్వాన్ని అతి పరుషపదాలతో ఖండించి, డాంగేని టిటోయిస్టు సంస్కరణవాదిగా, కమ్యూనిజానికి దూరమైన వానిగా, భారతకమ్యూనిస్టు పార్టీని విద్రోహంగా చీల్చి, నెహ్రూ, భారతబూర్జువా వర్గానికి దాసోహం అన్న వానిగా చిత్రించింది. భారతకమ్యూనిస్టుపార్టీలోని అతివాదవర్గం కూడ యిదే వైఖరిని అవలంభించింది.

9. భారత-చైనా కమ్యూనిస్టులకు అభిప్రాయభేదాలు 1959-64లలో యేర్పడినవి, వీటిని మరో పర్వంలో వివరంగా అధ్యయనం చేసాము. అయినా వొకటి, రెండు విషయాలు ముచ్చటించాలి. భారతకమ్యూనిస్టుపార్టీలోని మెజారిటీవర్గం క్రమేణా, బూర్జువావర్గ అభిప్రాయాలకు, కొన్ని మినహాయింపులతో చేరువైంది. చైనాను దురాక్రమణదారుగా పేర్కొన్నది. చైనా-సోవియట్ సిద్ధాంత వివాదంలో, పార్టీలోని మెజారిటీవర్గం సోవియట్ అవగాహనను బలపరుస్తున్నది. ఈ సిద్ధాంత విభేదాలను పార్టీలోని అగ్రనాయకులు కొద్దిమంది తప్ప, క్రింది కార్యకర్తలు ఎప్పుడూ చర్చించలేదు. అది కమ్యూనిస్టుపార్టీలోని మేధావి వర్గాల చర్చా వేదికగానే వుండిపోయింది. పార్టీ ఆర్గనైజరులు, వివిధ స్థాయిల నాయకులు, జనరల్ బాడీలలో కొంతవరకు నివేదించుట జరిగినా, క్రింది కాడర్లు, యూనిట్లు చర్చించుట జరుగలేదు.

భారతకమ్యూనిస్టు పార్టీ తన ప్రభావంలోనే వుండాలని సోవియట్‌పార్టీ ప్రయత్నం చేస్తున్నది. అతివాదవర్గం తిరుగుబాటు చేస్తే, రాష్ట్రస్థాయి నాయకత్వాలు విశేషంగా అటువైపు పోగలవనే అభిప్రాయానికి సోవియట్ యూనియన్ వచ్చి,

1963లో చీలితేనే మంచిదనే నిర్ణయానికి వచ్చినట్లు కన్పించుచున్నది. మోహన్ రాం "సి. పి ఐ. లోని మెజారిటీని సి.పి. యస్. యు. అసమ్మతివాదులతో తేల్చు కొనమని ప్రోత్సహించిందని" వ్రాసారు. ఈ సందర్భంలో, విజయవాడపార్టీ కాంగ్రెసులో సుస్లోవ్, మైనారిటీ బలాన్నిచూసి ఆశ్చర్యపోయి, "మీపార్టిలో చైనా ప్రభావం చాలా యెక్కువగానే వుందని" అన్నట్లు చెప్పబడింది (రాం. పే. 209) "చీలిక భూతాన్ని సి. పి ఐ. తగిన ఆధారాలతో చూపకముందే, సి. పి. యస్ యు నాయకత్వం చీలిక దుమారాన్ని లేవనెత్తింది. విజయవాడలో చీలికను నివారించుట సోవియట్ ప్రయోజనాలకు అవసరము అందుకే సుస్లోవ్ 1961లో రాజీ ప్రయత్నాలు చేసి విజయం పొందాడు చీలికను 1964లో తీసుకొని రాకపోతే, తదుపరి జరుగు పార్టి కాంగ్రెసులో మొత్తం పార్టి అతివాదంవైపు పయనించే అవకాశం యెక్కువగా వుందని, 1964 లోని సోవియట్ అంచెనాగా కన్పడుతుందని, రాం అభిప్రాయం (రాం. పే 208) ఈ పరిస్థితులలో మెజారిటీ వర్గం, సి.పి యస్.యు. పక్షంలో చేరుట స్వయం నిర్ణయము. సోవియట్ యూనియన్ భారత బూర్జువావర్గం వలెనె సి.పి ఐ లోని మెజారిటి చైనాలో శక్తివంతమైన భూతాన్ని చూసింది. అంతే గాక, పెట్టుబడిదారేతర మార్గాన్ని కనుగొనుటద్వారా, సి.పి.ఐ. నూతన సైద్ధాంతిక దృక్పధాన్ని గణనీయంగా యివ్వగలిగాననుకొన్నది.[1]

# (VI)

## కమ్యూనిస్టు పార్టీ చీలుట ; రెండు పార్టీ కాంగ్రెసులు

భారత రాజకీయపార్టీలలో కాంగ్రెసు తరువాత రెండవ పెద్ద పార్టీ కమ్యూనిస్టుపార్టీ, అంచేతనే పార్టీ జాతీయ కాంగ్రెసు, దేశ, విదేశ రాజకీయ వర్గాలలో శ్రద్ధా శక్తులను కలిగిస్తుంది. పార్టీ చీలిక అనంతరం, బొంబాయి, కలకత్తాలలో జరిగిన రెండు 7వ కాంగ్రెసులు, అంతర్జాతీయ కమ్యూనిస్టు వుద్యమంలో చెలరేగిన తీవ్రవాదోపవాదల నేపథ్యంలో దేశ, విదేశాలలో అత్యంత ఆశక్తిని రేకెత్తించాయి కాంగ్రెసుల రాజకీయ పత్రాలు, నివేదికలు, నిర్ణయాలు, తీర్మానాలు, ఉపన్యాసాలు,

---

1. బాబని సేన్‌గుప్తా (1972) కమ్యూనిజం ఇన్ ఇండియన్ పాలిటిక్స్ పె. 363 లోని నోట్సు ఉదహరింపులు.

సమావేశపు దైనిక కార్యక్రమాల పురోగతి రాజకీయ వర్గాలలో, పార్టీవర్గాలలో సానుభూతిపరులలో సంచలనాన్ని కలుగజేసాయి. భారతదేశ కమ్యూనిస్టు రాజకీయాలలో యీ రెండు కాంగ్రెసులు వొక నూతన చారిత్రాత్మకదశకు ప్రారంభమైనందున వివిదాంశాలను తగినంత వివరంగా అధ్యయనం చేయవలసి వుంది.

భారతకమ్యూనిస్టుపార్టీ 7వ, కాంగ్రెసును బొంబాయిలో 13-23 డిశెంబరు 1964లోను, విడిపోయిన అతివాదులు 7 వ కాంగ్రెసు కలకత్తాలో నవంబరు ప్రారంభం లోను 1964 జరిగాయి. భారతకమ్యూనిస్టుపార్టీ కార్యక్రమాన్ని, అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ సైద్ధాంతిక వివాదాంశాలపై వొక తీర్మానాన్ని, రాజకీయ విధాన తీర్మానాన్ని, నిర్మాణ నివేదిక, పార్టీ నిర్మాణసూత్రాలపై సవరణలను కేంద్ర కంట్రోల్ కమిషన్ నివేదికలను కాంగ్రెసు ఆమోదించింది. జాతీయసమితి కేంద్ర కంట్రోల్ కమిషన్‌ను ఎన్నుకొంది. అంతేగాక, కేరళ ఎన్నికలు; ధరలు పెరిగి పోవుట ఆహార సంక్షోభం, అత్యవసర పరిస్థితిని భారత రక్షణ చట్టాన్ని ప్రభుత్వం దుర్వినియోగపరచుట, అణుబాంబు భారతదేశము, జాతీయసమైక్యత, త్రిపురలో నిర్బంధ విధానం, వ్యవసాయభూములుకై రిపబ్లికన్ పార్టీ ఆఫ్ ఇండియా మార్మ గోవా రేవులో పరిస్థితి, డాక్టర్ల హౌజ్ సర్జనుల సమ్మె పోరాటాలు, డాంగే లేఖలుగా చెప్పబడుతున్న వాటిపై తదితర సమస్యలపై తీర్మానాలను ఆమోదించింది, అజయ్‌కుమార్ ఘోష్, జవహర్‌లాల్‌నెహ్రూ, రాజేంద్రప్రసాద్ మరణాలపై సంతాప తీర్మానాలును ఆమోదించింది. అంతర్జాతీయ కమ్యూనిస్టు నాయకులు కుసినిన్, థోరెజ్, జవాడ్స్కి, టాగ్లియాటీలపైకూడ సంతాప తీర్మానాన్ని ఆమోదించింది. భారతకమ్యూనిస్టుపార్టీ (మార్క్సిస్టు) "సంస్కరణవాద వ్యతిరేక పోరాటం" అనే రాజకీయ, నిర్మాణ నివేదికను, కార్యక్రమాన్ని పార్టీ నిర్మాణసూత్రాలను తీర్మానాలుగ ఆమోదించింది. అంతర్జాతీయ కమ్యూనిస్టు సైద్ధాంతిక సమస్యలపై చెలరేగుతున్న వివాదాంశాలను చర్చించి నిర్ణయాలను చేయుటను వాయిదావేసింది.

రెండు కాంగ్రెసులు చర్చించి నిర్ణయాలు గైకొన్న స్వాతంత్ర్య సమస్య భారత రాజ్యాంగం ప్రభుత్వ వర్గ నైజము, భారత విదేశాంగ విధానం, దేశంలో పెట్టుబడిదారి విధాన మార్గంలో అభివృద్ధి, సంక్షోభం, జాతీయ ప్రజాస్వామ్యం పెట్టుబడిదారేతర మార్గం, శాంతియుత మార్గంలో సోషలిజంలోనికి పరివర్తన, వ్యవసాయ సమస్య "సంస్కరణవాదం", "అతివాద పిడివాదం" లను అధ్యయనంచేద్దాం.

రాజకీయ స్వాతంత్ర్య సమస్య

నవంబరు 1964లో జరిగిన 7వ భారత కమ్యూనిస్టుపార్టీ (మార్క్సిస్టు) ఆమోదించిన కార్యక్రమం. రాజకీయ స్వాతంత్ర్య సమస్యను ఎలా వివరించిందో చూద్దాము, ఈ సమస్యపై ఐక్యకమ్యూనిస్టుపార్టిలో 1954, 1955లలో పార్టిలోని

అతివాదులు, మితవాదుల మధ్య తీవ్రవాదోపవాదాలు జరిగినవి. వాటిని సాగరమదన పర్వంలో అధ్యయనం చేయుట జరిగింది. ప్రధానంగా అతివాద, మితవాదులు అదే అవగాహనలను, వాదాలను మెరుగులు దిద్దుకొని, తదనంతర కాలంలోని రాజకీయ పరిణామాలలోని అనుభవాలతో, తమతమ కాంగ్రెసులలో యీ సమస్యను వివరించారు.

యుద్ధానంతరం అభివృద్ధి చెందుతున్న సామాన్య జాతీయ విప్లవ పరిస్థితిని గమనించిన బ్రిటిష్ సామ్రాజ్యవాదం, పరిపాలనను యింకేమాత్రం కొనసాగించజాలనని గ్రహించింది. కాంగ్రెసు నాయకత్వంకూడ సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాన్ని చేబట్టిన అది సామాన్య విప్లవ తిరుగుబాటుగా పరిణమించి జాతీయ శక్తులపై తమకు గల గుత్త నాయకత్వం, తమ చేతులనుండి జారిపోతుందనే భయ, ఆందోళనలకు లోనగుట జరిగింది. ఈ పరిస్థితులు బ్రిటిష్ సామ్రాజ్యవాదం, జాతీయ కాంగ్రెసు నాయకత్వాలు రాజీ సంప్రదింపులు సాగించుటకు తోడ్పడినవి. ముస్లిం లీగు అదే విధానాన్ని చేబట్టింది.

"ఫలితంగా దేశం విభజింపబడి అధికార మార్పిడి కాంగ్రెసు, ముస్లింలీగులకు ఆగస్టు 15, 1947లో జరిగింది. ఈ విధంగా బ్రిటిష్ రాజకీయ పాలన ఇండియాలో అంతమైంది. భారత బడా బూర్జువా నాయకత్వంలో రాజ్యాంగయంత్రం నిర్మితమైంది. దీనితో భారత విప్లవ ప్రథమదశ, సాధారణ జాతీయ ఐక్యసంఘటన దశ, సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా దాడిని ప్రధానంగా కేంద్రీకరించే దశ అంతమైంది.[1]" అని సి.పి.యం. 7వ, కాంగ్రెసు ఆమోదించిన తీర్మానం తెలిపింది.

అంతేగాక "వలసవిధాన అంతం సోషలిజంలోనికి పరివర్తనయుగం మనది" అని పేర్కొన్నది. "జాతీయ పునర్జీవన మార్గాలను సామ్రాజ్యవాదం యింకే మాత్రం అడ్డుకొని చరిత్ర పురోగమనాన్ని ఆపజాలదని" స్పష్టం చేసింది. "భారత విప్లవం రెండవదశ వెంటనే ప్యూడలు అర్ధప్యూడల వ్యవస్థను నష్టపరిహారం లేకుండా రద్దుచేసి భూములను వ్యవసాయ కూలీలకు, పేదరైతులకు, ఉచితంగా పంచి పూర్తి చేయుట బ్రిటిష్ పెట్టుబడిని స్వాధీనం చేసుకొని జాతీయం చేయుట జరగాలి బడాబూర్జువా వర్గం, బ్రిటిష్ ద్రవ్య పెట్టుబడి దోపిడి కొనసాగించుటకు వొప్పుకొని సామ్రాజ్యవాదంతో రాజీపడి, బ్రిటిష్ కామన్ వెల్తులో కొనసాగుటకు కూడ వొప్పుకొంది.[2]

---

1. సి.పి.యం. 7వ కలకత్తా పార్టీ కాంగ్రెసులో ఆమోదించబడిన కార్యక్రమము, (ఆంగ్లంలో) 1972 ప్రతి. పే, 2.
2. సి.పి.యం. 7వ కలకత్తా పార్టీ కాంగ్రెస్, పే. 2

నంబూద్రిపాద్ "రాజకీయ స్వాతంత్ర్యం అవగాహనా" క్రమాన్ని సమీక్షిస్తూ "ఐక్య కమ్యూనిస్టుపార్టీలో 1947-51ల మధ్య సుదీర్ఘ చర్చలు, వాదోపవాదాలు చెలరేగిన ఫలితంగా 1951 కార్యక్రమం రూపొందిందని, తదనంతర అనుభవం తిరిగి 1954-55లలో తీవ్ర అభిప్రాయభేధాలు చెలరేగుటతో 1951 కార్యక్రమం వదలివేయబడి నూతన కార్యక్రమ రచనా ప్రయత్నాలు జరిగాయని, కాని అభిప్రాయ భేదాలు తొలగకపోగా, చివరకు రెండు కమ్యూనిస్టుపార్టీలు యేర్పడుటకు దారి తీసిందని అవి రెండు కార్యక్రమాలను విడివిడిగా రూపొందించుకొన్నవన్నారు[1].

అంతేగాక, "గత 18 సంవత్సరాల అనుభవం, కమ్యూనిస్టు వుద్యమంలో 1947-51లలో ఆధిక్యత వహించిన రెండు వైఖరులలో యేదీ సరియైనది కాదని స్పష్టంచేసింది"అనిపేర్కొన్నారు. దీనినే వివరించుతు,అప్పుడు నాయకత్వం వహించుతున్నవారు, ఆగస్టు 15, 1947లో యేర్పడిన కాంగ్రెసు, లీగు ప్రభుత్వాలను "వ్యూహాత్మక ప్రజల ఆయుధాలని,యింకా పురోగమించుటకు సాధనాలనుట"పూర్తిగ తప్పు: అదే విధంగా పార్టీ 2వ, కాంగ్రెసు తదనంతరం యేర్పడిన నూతన నాయకత్వం,నూతనప్రభుత్వాలను "లొంగిపోయిన ప్రభుత్వాలు"అనుట అంతటి పొరపాటే నన్నారు. ఆ ప్రభుత్వనైజ నిర్వచనాలు వాటి వర్గ పొందికను, నైజాన్ని అశ్రద్ధ చేసాయన్నారు. వర్ధమాన దేశాలలోని బూర్జువావర్గాలు, సామ్రాజ్యవాద దేశాలలోని గుత్త పెట్టుబడిదారుల మధ్య యేర్పడుతున్న తరతమ భేధాలను అత్యల్పంగా అంచెనావేయుట, నూతన పాలక వర్గాల సామర్థ్యాని గుర్తించలేకపోవుట ప్రధానంగా ఎత్తి చూపారు. నూతన పాల వర్గం లభించిన ప్రభుత్వాన్ని, "వ్యూహాత్మక ఆయుధంగా" యిటు ప్రజలకు, అటు సామ్రాజ్యవాద దేశంలోని బలమైన ప్రత్యర్థులపై, తన బలాన్ని పెంచుకొని పురోగమించుటకై వినియోగించగలదని అంచెనావేయుటలో వైఫల్యం స్పష్టం. అనేక సంవత్సరాల తరువాత 1960 ప్రపంచ కమ్యూనిస్టు పార్టీల సమావేశంలో కమ్యూనిస్టు వుధ్యమం యీ సిద్ధాంత అవగాహన ఇచ్చిందని, వైఫల్యం ప్రపంచ కమ్యూనిస్టు ఉధ్యమంలోనే వుందని వివరించారు. "ఆగస్టు 1947లో పొందిన స్వాతంత్ర్యపు సంక్లిష్టనైజాన్ని, భారతకమ్యూనిస్టుపార్టీ (మార్క్సిస్టు) అక్టోబరు, నవంబరు 1964లో కలకత్తాలో జరిగిన 7వ, పార్టీ, కార్యక్రమంలో నిర్దిష్టంగా పరిశీలించింది, వివరించింది[2].

"సంక్షిప్తంగా, పరిస్థితి సారాంశం, భారతదేశం, తన స్వాతంత్ర్యాన్ని బలోపేతం చేసుకొనుటకు ప్రపంచంలోని బాహ్యాపరిస్థితులు సాధ్యంచేయగా, దేశాంతర్గత

1. నంబూద్రిపాద్ (1966) ది ప్రోగ్రాం ఎక్స్ప్లేన్ (ఆంగ్లంలో) పే, 9.
2. నంబూద్రిపాద్ (1966) దిప్రోగ్రాం ఎక్స్ప్లేన్ (ఆంగ్లంలో) పే. 10-12.

పరిస్థితులు-నూతనప్రభుత్వ వర్గనైజము, అట్టి స్వతంత్ర నిర్ణయాలకు క్లిష్ట పరిస్థితులను కలుగజేసాయి." ఇండియా, పాకిస్తాన్‌లలో, ఒక దానిలో భూస్వామ్య బూర్జువావర్గాలు బడా బూర్జువా నాయకత్వంలో పాలన, రెండవదానిలో యీ వర్గాలు నిర్వీర్యం చేయబడినందున, అవి తమ స్వతంత్రపాత్రను నిర్వహించుటలో గల భేదాలకు వివరణ లభించుతుందని వివరించారు[1].

స్వాతంత్ర్యపోరాట కాలంలో వలెనె భారత బూర్జువావర్గం, ద్వందనైజాన్ని ప్రదర్శించిందని;సామ్రాజ్యవాదం ఫ్యూడలిజంలతో ప్రజలకు బూర్జువావర్గానికి మధ్య వైరుధ్యాలు పెరిగినా, ప్రపంచసోషలిస్టు వ్యవస్థ రూపొందుటతోనూ తన అవకాశాలు వుద్భవించినా తన బలాన్ని యినుమడించుకొనుటకు పరిస్థితులు అనుకూలంగా వున్నా సామ్రాజ్యవాదం ఫ్యూడలిజంలపై నిర్ణయాత్మకమైన పోరాటాన్ని జరిపి వాటిని నిర్మూలించక, రాజ్యాంగంపై తనకు గల ఆధిక్యతను ప్రజలపై దాడి చేయుటకు మరోవైపు ఫ్యూడలు సామ్రాజ్యవాదశక్తులతో రాజీ సంప్రదింపులతో వైరుధ్యాలను, పరిష్కరించు ద్వందవిధానాన్ని పాలకవర్గం అనుసరించింది.[2]. అని నంబూద్రిపాద్ వివరించారు.

ఇప్పుడు భారతరాజకీయ స్వాతంత్ర్య సమస్యపై, భారతకమ్యూనిస్టుపార్టీ 7వ, కాంగ్రెసు కార్యక్రమ తీర్మానం యేమి చెప్పిందో చూద్దాము. తన కార్యక్రమ రచనను "ఆగస్టు 15 1947న జాతీయ స్వాతంత్ర్యాన్ని సంపాదించుటతో భారత ప్రజల చరిత్రలో నూతనయుగాన్ని ప్రారంభించింది" అన్న వాక్యంతో ప్రారంభించింది. "భారతస్వాతంత్ర్య"విజయం,మనప్రజలకే కాక మానవజాతికేదారిత్రకసంఘటన" అన్నది. "స్వాతంత్ర్యసాధనకై జాతీయ విప్లవ వెల్లువ, పాశిస్టు వ్యతిరేక పోరాటం సోవియట్ యూనియన్ నాయకత్వంలో రెండవ ప్రపంచయుద్ధంలో పాశిస్టుశక్తులపై పొందిన విజయాలతో యూరపులో ప్రజాస్వామ్య పోరాటాల నైరృతి ఆసియాలో జాతీయ విముక్తి పోరాటాల వెల్లువలో భాగంగా" విశ్లేషించింది. వలసవిధాన పతనం ప్రారంభమైంది. ఈ నేధ్యంలో 'భారతజాతీయ వెల్లువను గాంచిన బ్రిటిష్ సామ్రాజ్యవాదం, గోడపైగల భరతవాక్యాన్ని" చూచి రాజీకి నిర్ణయించి, "తిరిగి అదునులో దాడి చేయుటకు వ్యూహాత్మక తిరోగమనం చేసిందని కార్యక్రమం స్పష్టం చేసింది. సంపూర్ణ జాతీయస్వాతంత్ర్య, మతాతీత, సామాజికాభివృద్ధి నిర్దుష్టం, స్పష్టం అయిన ప్రాతిపధికను రూపొందించుటలో కాంగ్రెసు విఫలమైన కారణంగా, బ్రిటిష్ సామ్రాజ్యవాద పాలకులకు జాతీయోధ్యమశక్తులను విభ

---

2 నంబూద్రిపాద్ (1966) డిపోగ్రాం ఎక్స్‌ప్లేన్డ్ (ఆంగ్లంలో) పే. 15.

3. అదే, పే, 17.

జించి, విచ్ఛిన్నం చేసి, తన పతకాలను బలపరచుకొనుటకు సులువైంది[1].

హిందూ, ముస్లింల అనైక్యతను అవకాశంగా తీసుకొని భారతదేశాన్ని విభజించి, ఇండియా, పాకిస్తాన్ రెండు రాజ్యాలను యేర్పరచి, రాజ్యాధికారాన్ని అప్పగించింది. రెండుదేశాలు శత్రువులగుటకు ఎత్తులువేసి, బలహీనపరచింది. సామ్రాజ్యవాదం స్వాతంత్ర్యాన్ని "మాటమాత్రం" చేయతలచింది, సామ్రాజ్యవాద, పెట్టుబడి పరిధిలో తన ఉపగ్రహంగా చేసి, భారతస్వాతంత్ర్య ఆర్థికాభివృద్ధి అడ్డుకొను అంచనావేసిందనేది, తీర్మానం యిచ్చిన అవగాహన

"నూతన భారతప్రభుత్వం, సామ్రాజ్యవాదులదాడులను, ఎత్తులను త్రిప్పికొట్టి వారి ఆటలు కట్టించింది కాశ్మీర్‌పై దాడిని భారతసైన్యం, కాశ్మీరు దేశభక్తశక్తుల సహాయంతో త్రిప్పికొట్టింది. కాని కాశ్మీర్ సమస్యను ఐక్యరాజ్య సమితికి తీసుకొని వెళ్ళినందున, కాశ్మీరులో సంక్షోభాన్ని కలుగజేయుటకు వారి చేతులలో ఆయుధమైంది. రెండు దేశాలమధ్య రావణాసురిని కాష్టంలా, తగాదాలు ప్రజ్వలింప చేయుటకు వీలుకలిగింది.

సామ్రాజ్యవాద ఎత్తులలో భాగంగా సంస్థానాధీశులను పావులుగా వుపయోగించుకొని, తమ ప్రయోజనాలను, ఆధిక్యత కొనసాగించాలనే వారి ప్రయత్నాలు, చిన్నవిపెద్దవిగా 500పైగా వున్న వాటిని ప్రధాన స్రవంతి, భారత యూనియన్‌లో విలీనం చేయుట ద్వారా భారతజాతీయ ప్రభుత్వం, బ్రిటిష్ పునాది ఆలోచనలు కొనసాగకుండా చేయగలిగింది. అదేకాలంలో సైన్యం. సివిలు సర్వీసెస్‌లోని విదేశీయ వుద్యోగులను పెన్షనులనిచ్చి, విరమింపజేసి జాతీయప్రభుత్వం తన స్వతంత్రతను బలపరచుకొంది.

ప్రజాస్వామ్య పద్ధతులలో భారత రిపబ్లికు రాజ్యాంగ నిర్మాణచట్టాన్ని రూపొందించి, 26 జనవరి 1950న భారతదేశాన్ని స్వతంత్ర రిపబ్లిక్‌గా ప్రకటించింది.

భారతకమ్యూనిస్టుపార్టీ కార్యక్రమముపై దృష్టిని సారించి "ఈ నేపథ్యంలో భారతదేశం స్వతంత్ర ఆర్థికాభివృద్ధి పంథాను చేబట్టింది. సామ్రాజ్యవాదులనుండి జాతీయ స్వాతంత్ర్యాన్ని సంపాదించుటతో భారత విప్లవంలో వొక దశ ముగిసింది. సామ్రాజ్యవాద వ్యూడలు వ్యతిరేక కర్తవ్యాలును పరిపూర్తి చేసే నూతన విప్లవ దశకు కలిసి రండని విజ్ఞప్తి చేసింది. జాతీయ ఆర్థికపరిస్థితిని పునర్జీవింపజేసి, ప్రజల జీవన పరిస్థితులను మెరుగుపరచి, దేశాన్ని సుభిక్షంచేయుటకు, ప్రజాస్వామ్యాన్ని మరింత సౌభాగ్యవంతంచేసి సోషలిస్టు మార్గాన్ని సుగమం చేయమని కోరింది.

---

1. ప్రొసీడింగ్స్ ఆఫ్ ది 7 కాంగ్రెస్ అఫ్ సి పి. ఐ. డిశెంబరు 1964 డాక్యుమెంట్సు. పే. 1-2.

భారతకమ్యూనిస్టుపార్టీ బూర్జువా వర్గాన్ని, ప్రభుత్వాన్ని, దాని వర్గపొందికను "భారతదేశంలో ప్రభుత్వం, జాతీయ బూర్జువా వర్గం మొత్తంగా వర్గపాలనలో గల నిర్మాణమై వుంది. పెట్టుబడిదారి విధానాన్ని, సంబంధాలను వుత్పత్తి, పంపకం, భారత జాతీయ ఆర్థిక ద్రవ్యమారక విధానాలలో పెంపొందించుచున్నదని" పేర్కొన్నది. ప్రభుత్వ నిర్మాణంలో, ప్రభుత్వ ఆధికారాలను అమలుచేయుటలో బడా బూర్జువావర్గం గణనీయమైన ప్రభావాన్ని కల్గి వుందని" స్పష్టం చేసింది.

జాతీయ బూర్జువా వర్గాన్ని నిర్వచించుతు "జాతీయ బూర్జువా వర్గంలో భూస్వాములు భాగమని, మంత్రివర్గంలో, ప్రభుత్వయంత్రాంగంలో ప్రధానంగా రాష్ట్రస్థాయిలో చేర్చుకొనబడతారని, అదేవారు వ్యవసాయ సంస్కరణలు చేయుటకు అమలు చేయుటకు అడ్డుపడుటకు అవకాశాన్ని కలుగజేస్తున్నదని, రైతాంగానికి వ్యతిరేకంగా వారు రాయితీలను పొందుటకు తోడ్పడుతుందని" విశదీకరించింది.

ప్రభుత్వ వర్గనైజము, బూర్జువావర్గపుదైనప్పటికి, బూర్జువా ప్రజాస్వామ్య ప్రభుత్వ నిర్మాణం, మనదేశంలోని సామ్రాజ్యవాద బురాక్రటిక్ ప్రభుత్వం కంటె చారిత్రిక పురోగమనంగా పార్టీ కార్యక్రమం పేర్కొంది.[1]

వయోజన వోటింగు హక్కుగల పార్లమెంటరీ ప్రజాస్వామ్యాన్ని భారత రాజ్యాంగ చట్టం గ్యారంటీ చేస్తున్నది. రాజ్యాంగం ఆదేశ సూత్రాలలో ప్రాథమిక హక్కులను స్పష్టం చేసింది.

అంచేతనే ప్రజాస్వామ్య సోషలిస్టు శక్తులు ప్రభుత్వరంగాన్ని ప్రజాస్వామ్య అజమాయిషీని పార్లమెంటరీ ప్రజాస్వామ్యాన్ని బలపరుస్తున్నతని విపరించింది.

జాతీయ బూర్జువా వర్గం నుండి గుత్తపెట్టుబడి వర్గాలు యేర్పడి, బలపడి, పెరగుటతో బూర్జువా వర్గంలో వివిధ వర్గాల పోరాటం ప్రారంభమై రాజకీయ అధికారాన్ని తమ ఆధీనంలో ఉంచుకొనుటకు పార్లమెంటరీ యంత్రాంగంలో తమ బలాన్ని పెంపొందించుకొనుట ప్రయత్నిస్తాయి. బడ్జెట్టు తదితర ఆర్థికచర్యలు చట్టాలు, విధానాలు రూపొందించునపుడు తమ ప్రత్యేక వర్గాల ప్రయోజనాలను కాపాడుకొనుటకై పార్లమెంటులో ఆధిక్యతకై ప్రయత్నిస్తాయి.[2]

"ఈ పరిస్థితులలో పార్లమెంటేతర ప్రజా పోరాటాలు, పార్లమెంటరీ విధానాలును ప్రభావితం చేయుటకు, మార్పుచేయుటకు, ప్రజలకు అనుకూలంగాజేయుటకు సమర్థవంతమైన ఆయుధములగుతవి. గుత్తపెట్టుబడి దారులకు వ్యతిరేకంగా, ప్రజల ప్రయోజనాలను, ప్రజాస్వామ్యాన్ని, పార్లమెంటరీ విధానాన్ని రక్షించుటకు సాధనాలు అగునవి[1].

---

1 2 ప్రొసీడింగ్స్ ఆఫ్ ది 7 వ, కాంగ్రెసు ఆఫ్ సి.పి.ఐ. డిశెంబరు 1964 డాక్యుమెంట్సు పే. 26-7

2. ఆదే పే. 28.

బూర్జువా వర్గపాత్రవలన, పార్లమెంటరీపాత్రలో పరిమితులు యేర్పడుతు న్నవి గుర్తిపెట్టుబడిదారి, అభివృద్ధి నిరోధకవర్గాలు బలపడుట, ఆచరణలోవున్న ప్రజాస్వామ్యహక్కులకు, పార్లమెంటరీ ప్రజాస్వామ్యానికి మొత్తంగాను, వాటిని త్రోసిపారవేసే క్రొత్తప్రమాదం ఏర్పడుతుంది

కమ్యూనిస్టుపార్టీ పార్లమెంటరీ ప్రజాస్వామ్య అంశాలను రక్షించుటకు,ప్రజా స్వామ్యాన్ని పరిపూర్తి, వాస్తవమైనదిగా అందరికి వర్తించునదిగా చేయుటకు,పోరా డుతుందని కార్యక్రమం స్పష్టం చేసింది.

"పార్టీలో రెండు దశాబ్దాలపైగా వివిధ సమస్యలపై చెలరేగుతున్న వివాదాం శాలను కార్యక్రమము" సరియైన విశ్లేషణ, మార్క్సిజాన్ని సృజనాత్మకంగా కార్య క్రమ రచనలో వినియోగించి, ప్రజలలో వుదయించిన అనేక ప్రశ్నలకు శాస్త్రీయ సమాధానాలను, పురోగమనానికి స్పష్టమైన పంథాను రూపొందించింది". అని చాలా కాలంగా 1947లో లభించినది "బూటకపు స్వాతంత్రమని", బ్రిటిష్‌సామ్రాజ్యవాదం పరోక్షపాలనను ఈజిప్టు, దక్షిణకొరియాలలో వలె కొనసాగిస్తున్నదనే వైఖరిని సి. పి ఐ అవలంభించింది. ఈ తప్పుడు అవగాహన ఫలితంగా సమగ్ర అతివాద సెక్టేరియన్ రాజకీయ పంథాను రూపొందించి, జాతీయ విద్రోహ ప్రభుత్వాన్ని కూల ద్రోయుటకై విప్లవపోరాటాలకు పిలుపునిచ్చింది. ఈ విధానం పార్టీని ప్రజలనుండి దూరం చేయుటయేగాక ప్రమాదకర అతివాద దుందుడుకు పొరపాట్లు చేయుటదారి తీసింది. జాతీయ బూర్జువా ప్రభుత్వాన్ని కూలద్రోయుటకు బదులు, ఆ వర్గ ప్రజ లపై గుత్తాధిపత్యాన్ని బలపరచుకొనుటకు, అభివృద్ధి నిరోధకవర్గాలు బలపడుటకు తోడ్పడిందని" సేన్ తీవ్రంగా విమర్శించారు.

అంతేగాక "దీనికి విరుద్ధమైన మరో తప్పుడు అవగాహన కూడ వ్యక్త మైంది. ఈ వైఖరి భారత విప్లవంలో, స్వాతంత్ర్యం సంపాదించినందున వుద్భ వించిన నూతన దశను గుర్తించుటలోని వైఫల్యం కారణంగా, సాధారణ జాతీయ ఐక్యసంఘటనయేర్పాటు చేయు పంథాను కొనసాగించింది. బ్రిటిష్ సామ్రాజ్యవాదపు పాలనలో స్వాతంత్ర్య సంపాదనకై దానిని ప్రభోదించుట సరియైనదే అయినా, నూతనదశలో జాతీయ బూర్జువావర్గం పాలన స్వీకరించినందున దాని పాత్రలో వచ్చిన మార్పును గుర్తించజాలకపోవుటను" విమర్శించారు.

"నూతన కార్యక్రమము యీ రెండు తప్పుడు వైఖరులను త్రోసిపుచ్చింది. భారతదేశం ఆగష్టు 1947లో స్వాతంత్ర్యం సంపాదించుట చారిత్రిక ప్రాముఖ్య తను నొక్కి చెప్పి, మన ప్రజలకు నూతన యుగారంభాన్ని ప్రస్తుతించింది. భారత ప్లవంలో ఒక దశ పూర్తి అయిందని" పేర్కొన్నారు. దీనికి విరుద్ధంగా ప్రత్యర్థి

కమ్యూనిస్టుపార్టీ (మార్కిస్టు) కార్యక్రమం గత తప్పుడు అవగాహనలనే పట్టుకొని "అధికార మార్పిడి "నినామమాత్రంగానే గుర్తించిందని విమర్శించారు.

అంతేగాక స్వాతంత్ర్యం అహింసా మార్గంలో సంపాదించుట జరిగిందనే బూర్జువా ప్రచారాన్ని ఖండించుతు నావికా, సైనిక ప్రజాపోరాటాలను పేర్కొన్నారు.

సంగ్రహంగా, రెండు దశాబ్దాల అనుభవం నంబూద్రిపాద్ చెప్పినట్లు "కమ్యూనిస్టు ఉద్యమంలో 1947-57లలో ఆధిక్యత వహించిన రెండు వైఖరులలో యేదీ సరియైనది కాదని స్పష్టం చేసింది." అంటే ఆగస్టు 15, 1947న యేర్పడిన ప్రభుత్వం వ్యూహాత్మక ప్రజల ఆయుధమని, పురోగమన సాధనమనుట పూర్తిగ తప్పని అదే విధంగా పార్టీ 2వ, కాంగ్రెసు లొంగిపోయిన ప్రభుత్వం అనుట తప్పని చరిత్ర నేర్పినపాఠము రెండు వైఖరులు ప్రభుత్వ వర్గపొందికను నైజాన్ని అశ్రద్ధ చేసాయి. నూతన పాలకవర్గం లభించిన స్వాతంత్ర్యాన్ని వ్యూహాత్మక ఆయుధంగా "విదేశబలమైన శక్తులకు దేశీయ ఫ్యూడలు సంస్థానాధీశులు, పాక్షికంగా భూస్వామ్యశక్తుల వ్యతిరేకంగాను వెల్లుబుకుతున్న విప్లవ పోరాట శక్తులకు వ్యతిరేకంగాను వుపయోగించుట చారిత్రిక వాస్తవం, ఆ విధంగా పాలక శక్తులు లభించిన స్వాతంత్ర్యాన్ని బలోపేతం చేయుట చారిత్రిక సత్యం. పాలక వర్గాలకు ఆగస్టు స్వాతంత్ర్యం "వ్యూహాత్మక ఆయుధమగుట" ప్రజోద్యమాల బలహీనత, వైఫల్యాల కారణంగా వ్యూహాత్మక ప్రజల ఆయుధం కాజాలకపోవుట చారిత్రిక సత్యాలు.

పార్టీ 7వ, కాంగ్రెసు కార్యక్రమంలో సి.పి.ఐ. ఆగష్టు 15, 1947న జాతీయ స్వాతంత్ర్యాన్ని సంపాదించుటతో భారత ప్రజల చరిత్రలో నూతనయుగంగా ప్రారంభమైంది అన్నవాక్యంతో కార్యక్రమ రచన సాగింది. స్వాతంత్ర్య సంపాదన తోడ్పడిన జాతీయ అంతర్జాతీయ పరిస్థితులను వివరించింది. ప్రభుత్వం జాతీయ బూర్జువా వర్గానికి మొత్తంగా ప్రాతినిధ్యంవహిస్తుందని, బడాబూర్జువావర్గప్రభావంలో వుందని స్పష్టం చేసింది. జాతీయ బూర్జువావర్గంలో భూస్వాములు భాగములు, రాష్ట్రా మంత్రివర్గాలలో భాగస్వాములు బూర్జువావర్గ నైజప్రభుత్వమైనప్పటికి బూర్జువా ప్రజాస్వామ్య ప్రభుత్వ నిర్మాణం, దేశంలోని సామ్రాజ్యవాద బురాక్రటిక్ ప్రభుత్వం కంటె చారిత్రిక పురోగమనంగా కార్యక్రమం పేర్కొంది. "భారతదేశం స్వతంత్ర ఆర్థికాభివృద్ధి పంథాను చేబట్టింది." భారత విప్లవంలో వొకదశ ముగిసింది ఫ్యూడలు వ్యతిరేక కర్తవ్యాలను పూర్తిచేసే నూతన విప్లవదశకు కలసిరండని,

జాతీయ ఆర్థిక పునర్జీవనానికి, ప్రజాస్వామ్యాభివృద్ధికి సోషలిజానికి మార్గాన్ని సుగమం, చేయమని కోరింది.

కమ్యూనిస్టు (మార్క్సిస్టు) 7వ, కాంగ్రెసు ఆమోదించిన కార్యక్రమము, "దేశం విభజింపబడి ఆగస్టు 15, 1947న కాంగ్రెసు ముస్లింలీగులకు అధికారం మార్పిడి జరిగిందని ఈ విధంగా బ్రిటిష్ రాజకీయపాలన ఇండియాలో అంతమైంది. భారత బడా బూర్జువా నాయకత్వంలో రాజ్యాంగ యంత్రం నిర్మితమైంది. దీనితో భారత విప్లవ ప్రథమదశ సాధారణ జాతీయ ఐక్యసంఘటనదశ, సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా ప్రధానదాడిని కేంద్రీకరించే దశ అంతమైంది." అని పేర్కొంది. ఇంకా "వలస విధాన అంతం, సోషలిజం లోనికి పరివర్తనయుగం మనది" అన్నది. "సామ్రాజ్యవాదం యింక యేమాత్రం జాతీయ పునర్జీవనమార్గాలను అడ్డుకొని, చరిత్ర పురోగమనాన్ని ఆపజాలదని" స్పష్టం చేసింది.

రెండు కమ్యూనిస్టు పార్టీలు స్వాతంత్ర్య సమస్యలపై వెలిబుచ్చిన అభిప్రాయాలలో సారూప్యతే యెక్కువగా కన్పడుతున్నది. భేదం ప్రధానంగా ప్రభుత్వంలో ఎవరు నాయకత్వం వహించుతున్నారు అనే విషయంలో సి.పి.ఐ. జాతీయ బూర్జువా వర్గం మొత్తంగా అని, సి.పి.యం. బడా బూర్జువావర్గం అని అనుటలో కన్పడుతుంది. సి.పి.ఐ. జాతీయ బూర్జువావర్గం మొత్తంగా నాయకత్వం వహించుచున్నదని అంటూ బడాబూర్జువావర్గం గణనీయమైన ప్రభావాన్ని కలిగివున్నదని పేర్కొంటున్నది. ఆగస్టు 15న స్వాతంత్ర్యం వచ్చిందని సి.పి.ఐ. హృదయపూర్వకంగా విశ్వశించినట్లు కొంతవరకు సి.పి.యం. అస్పష్టంగానైనా ఆమోదించినట్లు కన్పడుతున్నది. ఇక కేంద్ర ప్రభుత్వంలో నాయకత్వం వహించే వర్గం విషయంలో మాత్రమే భేధమనే విషయం స్పష్టము,

భారత ప్రభుత్వ వర్గ పొందిక

బూర్జువా, భూస్వామ్యవర్గాలు బడా బూర్జువావర్గం నాయకత్వంలో యేర్పరచుకొన్న వర్గపాలనయే నేటి భారతప్రభుత్వము. పెట్టుబడిదారి విధానాభివృద్ధికి విదేశద్రవ్యపెట్టుబడితో మరింతగా పొత్తును కలిగివుంది. ఈ వర్గ ప్రాతిపదికలు జాతిజీవనంలో ప్రభుత్వపాత్రను నిర్ణయిస్తుంది.[1]

స్వాతంత్ర్యానంతరం, ఇండియన్ యూనియన్‌లో ప్యూడలు సంస్థానాలను సంలీనంచేయుటలో విజయంసాధించినా, అభివృద్ధి నిరోధకగుత్తపెట్టుబడిదారి హ్రస్వ దృష్టి ప్రభావంతో అన్ని రాష్ట్రాలను భాషా ప్రయుక్త రాష్ట్రాలుగ పున్నిర్మించుటను తిరస్కరించింది ప్రజాస్వామ్యవాదుల ప్రజల వొత్తిడితో యీసమస్యను కొంత

1. భారతకమ్యూనిస్టు కార్యక్రమము (మార్క్సిస్టు) నవంబరు 1963లో ఆమోదించినది. పే. 25

వరకు పరిష్కరించినా, తత్సంబంధ సమస్యలు కొన్ని అపరిష్కృతంగానే వున్నవి. భాషా సమస్య పరిష్కరించబడలేదు, ఆయా రాష్ట్రాలలో మాతృభాషలను పాలనా బోధనా, శాసన కోర్టుల భాషలుగ చేయవలసి వుంది.

ప్రాంతీయ భాషలు పార్లమెంటులో నిర్ణయాత్మక పాలనలో సమాన సముచిత స్థానాన్ని పొందకముందే, ఇంగ్లీషు భాషా స్థానంలో హిందీని ప్రవేశపెట్టు ప్రయత్నాలు, హిందీయేతర ప్రాంతాలలో ముమ్మరంగా జరుగుతున్నవి. ఇది రాష్ట్రాలు నిర్వీర్యులుగ కేంద్రంపై ఆధారపడునట్లుచేసి, అభివృద్ధిని కుంటుపరుస్తుంది

ఇట్టి పరిస్థితులలో సహజంగానే కేంద్రప్రభుత్వం రాష్ట్రప్రభుత్వాల మధ్య వైరుధ్యాలు పెరుగుతున్నవి. ఈ వైరుధ్యాలకు అంతర్గత మౌలిక పునాది బడా బూర్జువావర్గానికి వివిధ రాష్ట్రాలలోని ప్రాంతీయ బూర్జువావర్గాలకు ప్రజాసామాన్యమంతటికి ఈ మధ్యగల వైరుధ్యాలను పరిగణించవలసి వుంటుంది. పెట్టుబడిదారి విధాన పంథాలో జరిగే అసమానాభివృద్ధి కారణంగా యీ వైరుద్యాలు నిరవధికంగా పెరుగుతు తీవ్రరూపం ధరిస్తూ వుంటవి.[1]

బడాబూర్జువా నాయకత్వం మతాతీత ప్రజాస్వామ్య రాజ్యాంగం అని గొప్పలు చెప్పుకొంటుంది, వాస్తవానికి మతవాంధశక్తులకు వ్యతిరేకించుటకుమారుగ వారికి రాయితీలనిస్తూ బలపరుస్తున్నది. మతాన్ని,రాజకీయాలనురాజ్యాంగకలాపాలను పూర్తిగ వేరుచేయకుండా రాజకీయాలలో అన్నిమతశక్తులు సమానప్రాతిపదికపై పాల్గొనుటగా మతాతీత ప్రజాస్వామ్యానికి నూతన వికృత వాఖ్యను యివ్వ ప్రయత్నిస్తున్నదని బడాబూర్జువావర్గము. ఇది ప్రజాపురోగతికి అత్యంత ప్రమాదకర విధానము.

కమ్యూనిస్టుపార్టీ (మార్క్సిస్టు) పై విధంగా తమ కార్యక్రమంలో పేర్కొన్న అంశాలను, నంబూద్రిపాద్, "ది ప్రోగ్రామ్ ఎక్స్‌పేన్" అన్న సుదీర్ఘ పత్రంలో ఎలా వివరించారో తెలుసుకొనుట, యీ సందర్భంలో అవసరము.

కమ్యూనిస్టు ప్రణాళికలో "చారిత్రికంగా బూర్జువావర్గం అత్యంత విప్లవకర పాత్ర వహించింది." అని మార్క్స్ ఎంజెల్స్‌లు ఉదహరించినది, "పెట్టుదారి విధానం సామ్రాజ్యవాదంగా అభివృద్ధి చెందిన దశలో వర్తించదనే, సైద్ధాంతిక ప్రాతిపదికను నంబూద్రిపాద్ రూపొందించారు[1] ఇంకా "పాతది, కాలగర్భంలో కలసిపోవలసిన దానిని నిర్మూలించుటలో, సమాజంలో విప్లవాత్మకమార్పులు కొనివచ్చుటలో సమాజ వర్గాలలో బూర్జువావర్గం యింకా యేమాత్రం అగ్రగామిదళపాత్ర వహించజాలదని" వివరించారు. అంతేగాక, "తద్విరుద్ధంగా, సామాజిక విప్లవ శక్తుల పురోగ

1. భారతకమ్యూనిస్టు కార్యక్రమము (మార్క్సిస్టు) నవ బర్షు 1964లో ఆమోదించినది. పే. 25.

మనాన్ని అడ్డుకొనుటకు వివిధ అభివృద్ధి నిరోధక, విప్లవ ప్రతిఘాతకశక్తులతో చేతులు కలుపుతుంది." అని పేర్కొన్నారు.

"సామాజికాభివృద్ధిలో బూర్జువావర్గపు పాత్రలో వచ్చిన యీ మార్పు, ప్రభుత్వ రాజకీయ, యంత్రాంగ నిర్మాణంలో వచ్చిన మార్పును ప్రతిబింబించుచున్నది. బూర్జువావర్గం చారిత్రికంగా విప్లవాత్మకపాత్ర వహించుకాలంలోని బూర్జువా ప్రభుత్వ యంత్రాంగ నమూనా, బూర్జువా పార్లమెంటరీ ప్రజాస్వామ్యము, వివిధ రూపాల ప్రజాస్వామ్య వ్యతిరేక ప్రభుత్వాలచే తొలగించబడింది. వీటిలో మిక్కిలి అపఖ్యాతి వహించింది, ఫాశిస్టుప్రభుత్వం. "అని ఫాశిజానికి కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ యిచ్చిన నిర్వచనాన్ని ఉదహరించారు. ఈ ప్రత్యేక ప్రజాస్వామ్యవ్యతిరేక బూర్జువాప్రభుత్వ రూపం, బూర్జువావర్గపు మొత్తం ప్రయోజనాలకంటె తమ సంకుచిత స్వప్రయోజనాలకై ప్రభుత్వాన్ని తమ సేవలకై వినియోగించుకొనే అగ్రగుత్త పెట్టుబడిదారివర్గాలకు జన్మనిచ్చే, అభివృద్ధి చెందిన పెట్టుబడిదారి దేశాలలోని పెట్టుబడిదారి అభివృద్ధి క్రమంలో సాధ్యపడుతుంది". ఈ అవగాహనను వివరించి. దీని అర్థం ఇండియా వంటి అభివృద్ధి చెందని దేశంలో బూర్జువావర్గం, అభివృద్ధిచెందిన దేశాలలో వారి సహచరవర్గపుపాత్ర వహించగలదా? అని ప్రశ్నించి, సంస్కరణవాదులు అది సాధ్యమంటున్నారని, భారతకమ్యూనిస్టుపార్టీ కార్యక్రమంలోని "బూర్జువాలు-ప్రభుత్వం" అనే శీర్షిక నుండి "ఇండియాలోని ప్రభుత్వ, జాతీయబూర్జువావర్గ మొత్తపు పాలనా యంత్రాంగం, పెట్టుబడిదారి విధానాన్ని, పెట్టుబడిదారి వుత్పత్తి సంబంధాలను, వంపకొన్ని, ద్రవ్యమారక విధానాన్ని భారతజాతీయ ఆర్థిక విధానంలో నిలబెట్టి. అభివృద్ధి చేస్తున్నదని" ఉదహరించి, యీక్రింది విధంగా వాఖ్యానించారు[2].

పై విధంగా ప్రభుత్వనైజాన్ని నిర్వచించి, ఆ విధమైన లక్షణాలను కలిగివున్నా, బూర్జువా ప్రజాస్వామ్య ప్రభుత్వం "సామ్రాజ్యవాద బురాక్రటిక్ పాలనపై చారిత్రాత్మక పురోగమనం" "రాజ్యాంగం పోరాటవేదిక, ఆయుధం" అనుట "భారత పార్లమెంటరీ ప్రజాస్వామ్యం, పెట్టుబడిదారి విధానాన్ని సోషలిస్టు విధానంలోనికి పరివర్తన చేయుటకు వుపయోగపడుతుందా?" అని ప్రశ్నించి సమాధానంగా "సంస్కరణ వాదుల కార్యక్రమం, "ఆ విధానాన్ని వ్యతిరేకించే కొన్ని శక్తులున్నవని, అది కష్టాలతో కూడినది" అన్నారు. "ఈ శక్తులను సి. పి. ఐ కార్యక్రమం, గుత్తపెట్టుబడి దారి వర్గాలు, భూస్వాములు, ప్రధాన ప్రజాస్వామ్య వ్యతిరేక శక్తులుగా పేర్కొన్నదని, పార్లమెంటరీ ప్రజాస్వామ్యం యధాస్థితిగా నెంచి, మిత

1. నంబూద్రిపాద్, ఇ. యం. యస్. (1966) ది ప్రోగ్రాం ఎక్స్‌ప్లేన్డ్. (ఆంగ్లంలో) కమ్యూనిస్టుపార్టీ (మార్క్సిస్టు) పబ్లికేషన్. పే. 49-50.
2. అదే. పే 53-55.

వాద ప్రమాదంపై ప్రజలను హెచ్చరించిందని" యీ విశ్లేషణ సారాంశము "భారత బూర్జువా పార్లమెంటరీ ప్రజాస్వామ్యవిధానం సహజంగా విప్లవాత్మకం, ప్రజాస్వామ్యయుతమని, దానిలో మౌలిక ప్రజాస్వామ్య తప్పులు లేవని, కష్టాలకు కారణం అగ్రగుత్తపెట్టుబడిదారి వర్గాలుద్భవించి, బలపడి, ఫ్యూడలు యితర అభివృద్ధి నిరోధ వర్గాలతో కలసి, పార్లమెంటరీ విధానాన్ని త్రోసిబుచ్చుటయని, అంచేత అభివృద్ధి నిరోధక యీగుదిబండలను తొలగించుట అనారోగ్యంలో వున్న యీ రాజకీయ విధానానికి ఔషధమని" నిర్ధారణ చేసారు. "ఇండియలో పెట్టుబడిదారి ఆర్థిక, రాజకీయ సంస్థలను అశాస్త్రీయంగా విశ్లేణ చేయుటయే యీ అవగాహన ప్రాతిపధిక" అని నంబూద్రిపాద్ వ్యాఖ్యానించారు[1]. అంతేగాకభారతదేశంలో పెట్టుబడిదారి విధానాభివృద్ధి ప్రత్యేకతను పరిగణలోనికి తీసుకొనక పోవుటయే యీ వైఫల్యానికి కారణమన్నారు.

అంతేగాక "భారతప్రభుత్వం, రాజ్యాంగం భారతసమాజంలోని సామ్రాజ్యవాద ఫ్యూడలు వ్యతిరేక విప్లవప్రజాస్వామ్య ప్రభుత్వంగా 1947లో యేర్పడలేదని విదేశ గుత్తపెట్టుబడిదారి వర్గాలకు ప్రతిపక్ష దేశీయ బూర్జువా, ఫ్యూడలువర్గాలు రాజీపడుట ద్వారా యేర్పడింది. దీనిని స్పష్టంచేస్తూనే కమ్యూనిస్టు (మార్క్సిస్టు) పార్టీ కార్యక్రమము వలసబ్రిటిష్ సామ్రాజ్యవాదులు కాని, అధికారం చేబట్టిన భారత బూర్జువావర్గం కాని పెట్టుబడిదారి విధానాభివృద్ధికి ఆటకంగా వుండే ఫ్యూడలు సెమీ ఫ్యూడలువర్గాలపై చావుదెబ్బ కొట్టలేదు. సామ్రాజ్యవాదం, ఫ్యూడలు శక్తులతో గల రాజీపరిమితులలోనే బూర్జువావర్గం ఎందుండి గుత్తపెట్టుదారివర్గాలు అభివృద్ధి చెందాయి? అనేకమంది పారిశ్రామిక వేత్తలు వ్యాపారవర్గాలు, విదేశీయ,దేశీయ గుత్త వర్గాలకు, బడాద్రవ్యపెట్టుబడి దారులకు వ్యతిరేకంగా వున్నారంటూనే మితవాద కార్యక్రమం "దేశ, విదేశ గుత్తవర్గాలకు బడాబూర్జువావర్గానికి ప్రభుత్వంలో అధిక ప్రభావంకలిగి వున్నారంటూ బడాభూర్జువావర్గం నాయకత్వం వహించుచున్నదని నిర్ధారణ చేయుటలో వెనుకాడింది. కాని "రాజ్యాంగంలో పేర్కొన్నప్రాధమిక హక్కుల వేదిక ఆధారంతో ప్రజలు వారిపోరాటంలో ఆయుధంగా వినియోగించవచ్చని[2]". అంటుందని నంబూద్రిపాద్ తీవ్రంగా విమర్శించారు.

భారతవిప్లవ మౌలిక కర్తవ్యాలను సంపూర్తిచేయుటకు బూర్జువా భూస్వామ్య పభుత్వాన్ని తొలగించి జనతా ప్రజాస్వామ్య ప్రభుత్వాన్ని యేర్పరచాలని తమపార్టీ ప్రోగ్రాం స్పష్టం చేసిందని నంబూద్రిపాద్ వివరించారు.

---

1. నంబూద్రిపాద్ [1966] దిప్రోగ్రాం ఎక్స్‌ప్లేన్డ్ - పే. 53.
2. అదే పే. 54.

ఇప్పుడు యీ విషయాలపై భారత కమ్యూనిస్టు పార్టీ అవగాహనలు యే విధంగా వున్నవో పరిశీలించుదాము.

"జాతీయ బూర్జువా వర్గం మొత్తపు వర్గపాలనే భారత ప్రభుత్వ నిర్మాణం, అది పెట్టుబడిదారి విధానాన్ని, దాని సంబంధాలను ఉత్పత్తి సంబంధాలను, సంపకాన్ని, భారత జాతీయ ఆర్థిక విధానంలో ద్రవ్యమారక విధానాన్ని సమర్ధిస్తుంది. ప్రభుత్వాధికారాన్ని రూపొందించుటలో, ప్రభుత్వాధికారాన్ని అమలుచేయుటలో బడా బూర్జువావర్గానికి గణనీయమైన ప్రభావాన్ని కలిగివుంది. జాతీయ బూర్జువా వర్గం, భూస్వాములతో రాజీపడుతుంది, మంత్రివర్గాలలో స్థానం కల్పించుతుంది, రాష్ట్రస్థాయిలో ఫలితంగా వ్యవసాయ భూముల సంస్కరణల ఆమోదం, అమలు వెనుకాడుతున్నవి, అనేక రాయితీలు పొందగలుగుతున్నారు. రైతుల ప్రయోజనాలు దెబ్బతింటున్నవి.

భారత రిపబ్లిక్ రాజ్యాంగచట్టం పార్లమెంటరీ ప్రజాస్వామ్యాన్ని, వయోజన వోటింగు హక్కుతో ప్రజలకిచ్చింది ప్రాథమిక హక్కులు, ఆదేశసూత్రాలు పొందుపరచబడినవి. పరిమితులు వున్నా రాజ్యాంగ చట్టం వేదికగా పోరాట ఆయుధంగా ప్రజాస్వామ్య విస్తరణకు, వాటి రక్షణకు వినియోగపడుతుంది.

ఒక వర్గపాలన రూపమైనప్పటికి పార్లమెంటరీ ప్రజాస్వామ్యంనియంతృత్వ మార్గంలో అభివృద్ధి నిరోధక గుత్తపెట్టుబడిదారులు, భూస్వాముల ప్రయోజనాలకు వుపయోగపడునట్లు వక్రభాష్యాలకు వ్యతిరేకంగా పోరాడుటకు కొంతవరకు సహాయపడింది. ప్రజలు పాత్ర వహించే వేదికగా తమవాణిని ప్రభుత్వానికి వినపడునట్లు చేయుట అవకాశాన్ని కలిగించింది. శాంతి, జాతిస్వాతంత్ర్యం ప్రజాస్వామ్యాలకు వ్యతిరేకంగా జరుగు కుట్రలకు వ్యతిరేకంగా, ప్రజలకనుకూలంగా సామాజిక మార్పులకోరుతు తమ గళాలను భూసంస్కరణలకు, కార్మికవర్గ హక్కులకై వినపడునట్లు ప్రజలుచేయుటకు శక్తినిచ్చింది.

జాతీయ బూర్జువావర్గం నుండి రోజురోజుకు గుత్తపెట్టుబడిదారి వర్గాలు విడివడిపోవుటతో వైరుధ్యాలు యెక్కువై సంఘర్షణలు పెరిగి ఆర్థిక కలాపాలుచట్టాలు విధానాలు, బడ్జెటు నిర్ణయాలపై, గుత్తపెట్టుబడులపై పరిమితులపై సంఘర్షణలు మరింత పెరిగాయి. ఈ పరిణామాలలో విదేశ గుత్తపెట్టుబడి శక్తుల ప్రభావం ముఖ్యంగా దేశీయ గుత్త వర్గాలను, ఫ్యూడలు వర్గాలను బలపరచుటలో స్పష్టంగా కానవస్తున్నది. ఈ వర్గాలే విదేశీయ పెట్టుబడిని దిగుమతిచేయాలని, ప్రభుత్వ రంగాన్ని ఆలీన విధానాన్ని విడిచిపెట్టాలని వొత్తిడిచేయుట మరువజాలము. అంతేగాక దేశంలోని, అభివృద్ధి నిరోధక, ప్రజాస్వామ్య వ్యతిరేకశక్తులు యీ గుత్త పెట్టుబడిదారి వర్గాలు, సంస్థానాధీశలు, ఫ్యూడలు భూస్వామ్య వర్గాలని కూడ

మరువరాదు. ఈ వర్గాలే నిరవధికంగా రాజకీయ విధానాలను మితవాద మార్గం పట్టించుటకు ప్రభుత్వం పార్లమెంటుపై వొత్తిడి చేస్తున్నారు. అంచేతే, ప్రజా స్వామ్య సోషలిస్టు శక్తులు ప్రభుత్వరంగాన్ని, ప్రజాస్వామ్య, అజమాయిషీని, పార్లమెంటరీ ప్రజాస్వామ్యాన్ని బలపరుస్తున్నవి.[1]

మోహిత్ సేన్ సి పి. ఐ. కార్యక్రమంలోని ముఖ్యాంశాలను వివరించుతు "జాతీయ బూర్జువా వర్గపు మొత్తంగా యేర్పడిన పాలనావ్యవస్థయే నేటి భారత ప్రభుత్వం"గా పేర్కొని, జాతీయ బూర్జువావర్గం అంటే భారత పెట్టుబడిదారి వర్గాలన్నీ, అన్నితరగతుల చిన్న, పెద్ద, మధ్యతరగతి గుత్త, గుత్తేతర పెట్టుబడిదారి వర్గాలన్నీ అని వివరించారు. అంతేగాక, నగర, గ్రామీణ పెట్టుబడిదారి వర్గాలన్నీ అని కూడ వివరించారు. ఇది 'కలగూరగంప' బూర్జువావర్గం అధికారంలో వుందని, భారత ఆర్థికపరిస్థితిని పెట్టుబడిదారి మార్గంలో అభివృద్ధి చేయ ప్రయత్నిస్తుంద న్నారు. అంతేగాక యీ సూత్రీకరణ భారతదేశంలోనిది "బూర్జువా, భూస్వామ్య, ప్రభుత్వం" అన్న సూత్రీకరణకు వ్యతిరేకమైనది. అట్టి అవగాహన, బూర్జువా, ఫ్యూడలు, సెమీఫ్యూడలు భూస్వామ్య వర్గాలు భాగస్వాములుగా గల ప్రభుత్వంగా స్పురిస్తుంది. ఇది భారత ప్రభుత్వ మౌలిక విధానం ఉత్పత్తిరంగ ఫ్యూడలు, సెమీ ఫ్యూడలు సంబంధాలను విస్తరించుట, కొనసాగించుట లక్ష్యంగా కలదని తెలియ జేస్తుంది". ఇక్కడ వొకేవొక ప్రశ్న వేయవలసి వుంటుంది. పై అవగాహన ప్రభుత్వం బడాబూర్జువా వర్గనాయకత్వంలో వున్నదని స్పష్టం చేసి వున్నందున వక్రీకరణ, ఆపై వ్యాఖ్యగా నెంచవలసి వస్తుంది.

ప్రభుత్వంపరిధిలో ముఖ్య లేక నాయకత్వపాత్ర బడా లేక గుత్తపెట్టుబడిదారివర్గాలు వహించుతున్నవా అనే విషయాన్ని కార్యక్రమం స్పష్టం చేసిందన్నారు సేన్. కార్య క్రమం నేడు భారత ప్రభుత్వం, గుత్తపెట్టుబడిదారి బూర్జువా ప్రభుత్వం లేక వారి నాయకత్వంలో వున్నదని గాని చెప్పజాలము. కాని యీ బూర్జువావర్గం ప్రభుత్వ నిర్మాణంలో ప్రభుత్వాధికారాల అమలులో, పాలకవర్గ మొత్తంలో భాగంగా గణనీయ మైన పాత్రను, ప్రభావాన్ని కలిగివుందన్నారు.

"ప్రభుత్వాధికారం జాతీయ బూర్జువావర్గం మొత్తం చేతులలో వుందనేది వాస్తవం. దాని లక్ష్యమైనా, గుత్తపెట్టుబడిదారి వర్గాలు నాయకత్వాన్నిగాని లేక అధి కృతనుగాని యేర్పాటు చేసుకొనలేదన్న దానికి, కార్మికవర్గం జాతీయప్రజాస్వామ్య సంఘటనను నిర్మించక ప్రయత్నిస్తున్నదన్న దానికి ముఖ్యాంశం అగుతుంది. గుత్త వర్గాలు పాలక వర్గాలలో వున్నందున బలపడుట జరిగింది.

---

1. భారతకమ్యూనిస్టుపార్టీ 7వ బొంబాయి కాంగ్రెసు ఆమోదించినది. ఆంగ్లంలో కాంగ్రెసు డాక్యుమెంట్సు-సి.పి.ఐ. పబ్లికేషన్-1965. పే. 25-31.

ఈ విధంగా నేడు భారతదేశంలో ప్రభుత్వాధికారం 'కలగూరగంప' బూర్జువాలది. జాతీయ ప్రజాస్వామ్య విప్లవ శత్రువైన గుత్త బూర్జువావర్గం, అధికారంలో వున్న వర్గాలలో ప్రముఖ భాగస్వామి అదే విధంగా నేటి విప్లవదశలో కార్మికవర్గానికి వూగిసలాడే మిత్రుడైన గుత్తేతర జాతీయ బూర్జువావర్గం, భాగస్వామిగా అధికారంలో వుంది. కార్యక్రమం, భారతదేశపు యీ ప్రత్యేకపరిస్థితిని సి. పి, ఐ. వెలుగులోనికి తెచ్చింది.

ఈ కారణాలన్నిటి వలన సి. పి. ఐ కార్యక్రమం నేటి ప్రభుత్వాధికార రూపం, భారత ప్రజల చారిత్రిక పురోగమనానికి ప్రాతినిధ్యవహించుతుందని, తలచింది. ప్రజల ప్రభావంతో ప్రభుత్వ విధానాలలో మార్పుతెచ్చే అవకాశాలున్నవని కార్యక్రమ అవగాహన. రాజ్యాంగ చట్టంలోని ఆదేశసూత్రాలు, ప్రాథమిక హక్కులు ప్రజల పోరాటాలద్వారా వారి ప్రయోజనాలకు రక్షణ ప్రజాస్వామ్య విస్తరణకు వేదిక, సాధనములు అగుతవని కార్యక్రమము తలచుచున్నది-పార్లమెంటు "బూటకమని" ఫాశిజపు అవతరణ నిక్కమనీ" వైఖరిని కార్యక్రమంలో త్రోసిబుచ్చుచున్నది. పార్లమెంటరీ ప్రజాస్వామ్యం వుండుటయే ప్రజావిజయమని, మరింత పురోగమనానికి అవకాశమని తలుస్తుంది. ప్రజాస్వామ్య రక్షణ, నిస్తరణ అవసరం, సాధ్యము అనేది సి.పి.ఐ. అవగాహనగా వుంది.

ప్రస్తుత ప్రభుత్వాధికారంలో సంఘర్షణలు పెరుగుట వాస్తవం, తధ్యం గుత్తవర్గాలు పెరిగి బూర్జువావర్గంలో వర్గీకరణ జరుగుటతో సంఘర్షణలు అధికారంలో వివిధ స్థాయిలలో ఆధిక్యత కొరకు జరుగుట సహజము. గుత్తపెట్టుబడిదారి వర్గాలు, విదేశ సామ్రాజ్యవాదుల మద్దతుతో పౌరస్వాతంత్ర్యాన్ని పార్లమెంటరీ ప్రజాస్వామ్యాన్ని మొత్తంగా కూలద్రోయుప్రయత్నం చేస్తుంది. కార్మికవర్గం, ప్రజాస్వామిక వుద్యమం కలుగజేసుకొని పోరాటం సాగించాలి; రక్షించాలి. కార్మికవర్గం, ప్రజాస్వామ్య వుద్యమం యీ కర్తవ్యాన్ని గుత్తేతర బూర్జువా వర్గాన్ని అనుసరించుతు నిర్వచించలేదు. కార్మికవర్గం నేటి ప్రజాస్వామ్యాన్ని గుణాత్మకంగా రేపటి జాతీయ ప్రజాస్వామ్యంగా మార్చుటకు, అభివృద్ధి నిరోధకుల ఆర్థిక పునాది బద్దలు చేయుటకు తన విధానవేదికను ప్రతిపాదిస్తుంది. ఉన్న ప్రజాస్వామ్యాన్ని రక్షించుట, మౌలిక నిర్మాణ మార్పులుచేయు ప్రయత్నాలకు సంలీనం చేసి, పార్టీ వ్యూహాత్మక దృక్పధకార్యక్రమాన్ని జాతి ముందుంచుతుంది. ఆ లక్ష్యసాధనకు పార్టీ కార్యక్రమము పార్లమెంటరీ ప్రజాస్వామ్యాన్ని సరిగా వుపయోగించుటకు, అత్యంత ప్రాముఖ్యత నిస్తుంది అయినా పార్లమెంటేతర పోరాటం సాగించుటకు ప్రజాసమీకరణ అత్యంత ప్రాముఖ్యత వహించుతుంది. సి. పి. ఐ. అవగాహనను పేన్ వివరించారు.

పెట్టుబడిదారి మార్గంలో అభివృద్ధి

నంబూద్రిపాద్, భారతకమ్యూనిస్టు పార్టీ 7వ, కాంగ్రెసు ఆమోదించిన కార్యక్రమంపై వ్యాఖ్యానించుతు "జాతీయ ప్రజాస్వామ్య సంఘటన లక్ష్యంతో రూపొందించిన కార్యక్రమం, బూర్జువా వర్గాన్ని వూగిసలాడే అనిశ్చిత కార్మికవర్గ మిత్రునిగాకాక స్థిరమైన మిత్రుడుగా కార్మికవర్గంతో అధికారాన్ని పంచుకొనుటయేగాక, యీ దేశభక్త వర్గాల ఐక్యసంఘటన నాయకత్వంలో కూడ జాతీయ బూర్జువావర్గం పాలుపంచుకొంటుందని అవగాహన యిస్తున్నది. "సంస్కరణవాద పార్టీ తన శ్రేణులకు"" బూర్జువావర్గానికి అభ్యుదయకర పాత్రను అంటగట్టుతున్నది. పెట్టుబడిదారి విధానాభివృద్ధిలో వైరుధ్యాలు అని కార్యక్రమ మూడవ భాగానికి శీర్షిక పెట్టుటను పెట్టుబడిదారి విధానాభివృద్ధిని సంస్కరణవాదం విమర్శించుచున్నదని, త్రోసిపుచ్చుతుందనే భ్రమను మాత్రం కలుగజేస్తున్నదని వాస్తవానికి అది జరుగలేదు. మార్క్సిస్టులు పెట్టుబడిదారి విధాన సంక్షోభం మూడవదశను విశ్లేషణగావించి, అది ఆర్థిక రాజకీయ సాంస్కృతాభివృద్ధికి తోడ్పడదని సంక్షోభాల పుట్టయని నిర్ధారణ కొన్నారు.

"రెండు కార్యక్రమాల ప్రధాన మౌలిక భేదాలు యిక్కడే వున్నవి. మా కార్యక్రమం భారత పెట్టుబడిదారి విధాన ప్రత్యేకతలను యీ క్రింది విధంగా పేర్కొంది."[1]

a) ప్రపంచ పెట్టుబడిదారీవిధానం వేగంగాశిథిలమగుతున్న దశలో, సాధారణ సంక్షోభం మూడవదశలో ప్రవేశించిన తరువాత భారత బూర్జువావర్గం పెట్టుబడిదారి పంథాలో అభివృద్ధి మార్గాన్ని చేబట్టింది.

b) భారి పారిశ్రామిక సాంకేతిక పునాది లేకుండానే, పెట్టుబడిని కూడ పెట్టుకొనుటకు వలస సామ్రాజ్యాలు లేనపుడు దోపిడికొరకు తాము సంపాదించిన అధికారాన్ని ప్రభుత్వ యంత్రాంగాన్ని పెట్టుబడిదారి విధానాభివృద్ధికి బూర్జువావర్గం వినియోగించుకొనజాలనపుడు శ్రామికుల శ్రమ ఫలితాలను దోచుకొనుటకు రాజ్యాంగ యంత్రాన్ని వినియోగించుతుంది.

c) భారత సమాజం, పెట్టుబడిదారి పంథాలో అభివృద్ధి చెందుతున్నప్పటికి తనలోనే పెట్టుబడిదారి విధాన పూర్వసమాజ అంశాలను పెక్కింటిని కలిగివుంది. పెట్టుబడిదారి పూర్వ వ్యూడలు సమాజపు శిధిలాలనుండి అభివృద్ధి చెందిన దేశాల పెట్టుబడిదారి సమాజం అభివృద్ధి చెందింది. భారతదేశంలో పెట్టుబడిదారి విధానం, ఫ్యూడలు సమాజంపై పైనుండి రుద్దబడింది. ఒక శతాబ్దం సాగిన బ్రిటిష్ వలస

1. నంబూద్రిపాద్, ఇ యం.యస్. (1966) ది ప్రోగ్రాం ఎక్స్‌ప్లేన్డ సి.పి.ఐ (యం) పబ్లికేషన్ పే. 45.

సామ్రాజ్యవాదంకాని 1947లో అధికారం చేజిక్కించుకొన్న భారత బూర్జువావర్గం కాని భూస్వామ్య పెట్టుబడిదారీ పూర్వ సమాజంపై చావుదెబ్బ కొట్టలేదు, పెట్టుబడిదారీ సమాజాభివృద్ధికి తదనంతరం సమాజం సోషలిజంవైపు పురోగమించుటకు అవసర మైన యీ ముఖ్య కర్తవ్యం పూర్తి చేయలేదు. అందువల్ల కుల, మత, తెగల సమాజం గుత్తపెట్టుబడి వర్గాల ఒక ప్రత్యేక సమ్మిళిత ఆధిక్యతను కలిగివుంది.

భారత దేశంలో యీ ప్రత్యేక లక్షణాలుగల పెట్టుబడిదారీ విధానాభివృద్ధికి సంక్షోభాన్ని సుదీర్ఘమైనదిగా పెట్టుబడిదారీ విధాన వైరుధ్యాల పుట్టగా చేస్తుంది. కారణం అధికార అగ్రభాగాన పెట్టుబడిదారీ భూస్వాములు సమాజాల వెనుకబడిన అభి వృద్ధి నిరోధక గుత్తపెట్టుబడిదారీ వర్గాలు విదేశీ గుత్త పెట్టుబడితో పొత్తును కలిగి నవి వున్నవి. మాజీమహారాజులు జమిందారులు, చిగురులు తొడుగుతున్న పెట్టుబడి దారీ భూస్వామి వర్గాలున్నవి. ఈ కూటమికి వ్యతిరేకంగానే కార్మికవర్గం, మిత్రులు వెనుకబడిన వర్గాలు పోరాడవలసి వుంది.

నంబూద్రిపాద్ మాకార్యక్రమం "పెట్టుబడిదారీ పూర్వ సమాజం (భూస్వామ్యవిధానం) న్ని రూపుమాపాలనే అన్ని అభ్యుదయ కరశక్తులను కార్మికవర్గం దాని పార్టీ ఐక్యపరచి, విప్లవశక్తులను సమీకరించి ప్రజాస్వామ్య విప్లవాన్ని పూర్తిచేసి సోషలి జంలోని పరివర్తన మార్గాన్ని సుగమంచేయు కర్తవ్యం పార్టీపైపడింది.[1]" అన్నారు అంతేగాక పైనుదహరించిన "అభ్యుదయకర శక్తులు" అని విస్తృతార్థంలో కార్మిక వర్గం, రైతాంగం, మధ్యతరగతి వర్గాలు, బూర్జువా వర్గంలో గుత్తపెట్టుబడిదారులు మినహా అత్యధికులని వివరించారు.

"ప్రజల పక్షాన ఐక్యమయ్యే శక్తుల విషయంలో వాస్తవానికి మాకార్యక్ర మానికి సంస్కరణ వాదుల కార్యక్రమానికి చెప్పుకొనదగిన భేదాలు లేవు. అయినా యీ శక్తులు ఎవరికి వ్యతిరేకంగా పోరాడాలన్న విషయంలో మౌలికభేదమున్నది. "మా ప్రోగ్రాం బడా బూర్జువా నాయకత్వంలోని భూస్వామ్య బూర్జువా ప్రభుత్వానికి వ్యతిరేకంగా పోరాడాలని" అంటుంది. సంస్కరణవాదుల ప్రోగ్రాం బూర్జువావర్గీకరణ జరుగుతున్నదని, అందువల్ల గుత్తవర్గాలకు వ్యతిరేకంగా గుత్తేతర వర్గాలను బలపరచా లని కాంగ్రెసులోని అభ్యుదయ శక్తులతోకలసి జాతీయైక్యత నిర్మాణించుట ముఖ్య మంటున్నది.[2] మా కార్యక్రమము భూస్వామ్య వర్గాల బూర్జువా గుత్త వర్గాల మధ్య గల భేదాభిప్రాయాలను వైరుధ్యాలను పరిగణలోనికి తీసుకొని వినియోగించుకొం టుంది. అంతేగాక మాకార్యక్రమం జనతంత్ర ప్రజాస్వామ్య విప్లవం తప్పనిసరిగా

---

1 నంబూద్రిపాద్, ఇ యం.యస్ (1966) దిప్రోగ్రాంఎక్స్‌ప్లేన్డ్ (ఆంగ్లంలో) సి పి.య . పబ్లికేషన్ పే 46.

2. అదే........పే. 46-47

భారతదా బూర్జువా వర్గ ప్రభుత్వ అధికారాలమధ్య సంఘర్షణ వస్తుందనే వాస్తవికతపై ఆధారపడి రూపొందించబడింది. బడాబూర్జువా వ్యతిరేక పోరాటంలోనే విప్లవ మౌలిక కర్తవ్యం నిర్వహించబడుతుంది.

భారత కమ్యూనిస్టుపార్టీ 7వ, బొంబే కాంగ్రెసులో ఆమోదించిన కార్యక్రమం విషయంలో వెలిబుచ్చిన అభిప్రాయాలను చూద్దాము.

బ్రిటిష్‌పాలన కాలంలో భారత ఆర్థికవ్యవస్థ పరాధీన, వలసనైజాన్ని కలిగి వెనుకబడివుంది. అయినా, యితర వలస అర్ధవలస దేశాలతో పోల్చితే గణనీయమైన పెట్టుబడిదారవిధానాభివృద్ధి జరిగింది. పారిశ్రామిక బూర్జువావర్గం పుట్టి పెరిగి, రెండవ ప్రపంచయుద్ధానంతరానికి పెట్టుబడి, పారిశ్రామికోత్పత్తి కేంద్రీకరణ జరిగి, బ్యాంకింగ్ అభివృద్ధిచెంది భారత బూర్జువా వర్గాలనుండి బలమైన గుత్త పెట్టుబడిదారి వర్గాలు ఆవిర్భవించాయి.[1].

భారతబూర్జువావర్గ ప్రయోజనాలను పెంపొందుటకు, జవహరలాల్ నెహ్రూ అధ్వర్యంలో 1938లో, స్వాతంత్ర్యం రాకముందే, పోరాటకాలంలో జాతీయప్రణాళికా సంఘాన్ని యేర్పాటుచేయుట యుద్ధకాలంలోనే "తాతా, బిర్లా" "ప్రజాప్లాను" "ప్రాచుర్యంలోనికి వచ్చుట గుర్తుంచు కొనినపుడు, భారత బూర్జువావర్గాలు యెంతటి దూరదృష్టిని ప్రదర్శించాయో అర్థంకాగలదు. ఆగస్టు 1947లో అధికార మార్పిడి జరిగి జాతీయప్రభుత్వం యేర్పడుటతో, భారత పారిశ్రామిక బూర్జువా వర్గాలు, తమవర్గప్రయోజనాలను పెంపొందించుకొనుటకు తమ బలాన్ని పెంచుకొనుటకు, గట్టి పునాదులను యేర్పరచుకొనుటకు ప్రయత్నించుట, తమకు సామ్రాజ్యవాదానికి గల సహజవైరుధ్యాలను సరళీకృతం చేసుకొంటూ, బ్రిటన్‌లో యుద్ధకాలంలో ప్రోగైన స్టెర్లింగు నిలువలను, పారిశ్రామికీకరణకు వినియోగించుటకు ప్రయత్నాలు ప్రారంభించింది.

భారత స్వాతంత్ర్య ఆర్థికాభివృద్ధి, మౌలిక భారి పరిశ్రమల నిర్మాణం, సామ్రాజ్యవాద ప్రయోజనాలకు వ్యతిరేకమైన నైజాన్ని సహజంగానే కలిగి వుంది. అంతేగాక భూస్వాములు, సంస్థానాధీశుల, రాజుల, జమీందారులకు వ్యతిరేకమైనది కాన. ప్యూడలు శక్తులకు వ్యతిరేకశక్తులదాడిని సూచించుచున్నది. పెట్టుబడిని సమీకరించుట అంతర్గత మార్కెటు విస్తరణలలో భూ సంస్కరణలలో బూర్జువావర్గ ప్రాణప్రదమైన ప్రయోజనాలు యిమిడి వుండుట స్పష్టం. అయినా, స్వాతంత్ర్యానంతరకాలంలో జాతీయ బూర్జువావర్గం, జాతీయపోరాట కాలంలో స్పష్టం చేయబడిన విధానాన్ని అనుసరించుటలో "వూగిసలాట" "రాజీవిధానాలను" అవలంభిం

1. ప్రొసీడింగ్స్ ఆఫ్ ది సి. పి. ఐ. 7వ, కాంగ్రెసు డిశెంబరు 1964 (ఆంగ్లంలో) డాక్యుమెంట్సు.

చట గూడ స్పష్టంగా చూడగలము. భూస్వాములకు, సంస్థానాధీశులు, రాజులు, విదేశ పెట్టుబడిదారులకు కలిగించిన అనేక రాయితీలలో యిది స్పష్టం. అదేకాలంలో 1948లో "పారిశ్రామిక విధానాలపై తీర్మానాన్ని" చేయుట, వ్యూహాత్మక పరిశ్రమలను ప్రభుత్వరంగంలో స్థాపించ నిర్ణయించుట, 1949లో రిజర్వుబ్యాంకును జాతీయం చేయుట, వైమానిక సర్వీసులను, 1953లో ఇంపీరియల్ బ్యాంకును జాతీయం చేయుట జీవితభీమాన్ని బంగార గనులను జాతీయము చేయుట యీ విధంగా ప్రణాళికలకు వనరులను సమీకరించుట. సామ్రాజ్యవాదులకు రుచించలేదనుట స్పష్టం దేశీయగుత్త పెట్టుబడిదారి వర్గాలకు కంటకప్రాయమైంది[1]. ఈ విధంగా ప్రభుత్వపారిశ్రామికరంగం, భారతదేశస్వతంత్ర ఆర్థిక, పారిశ్రామికాభివృద్ధికి ప్రధాన ఉపకరణమైంది. అదేకాలంలో దేశ, విదేశ గుత్తపెట్టుబడి వర్గాల ఆధిక్యతను బలహీనపరచప్రయత్నించింది.

భారతప్రభుత్వం, విదేశసామ్రాజ్యవాదుల ప్రత్యేకంగా అమెరికా పెట్టుబడుల "సహాయాన్ని" అర్థించసాగింది, ప్రధానంగా ప్రభుత్వరంగంలో భారీ పరిశ్రమలను కోరసాగింది. మన ప్రయోజనాలకు భిన్నంగా అనేక వొడంబడికలను చేసుకొన్నది. అంతేగాక విదేశ ప్రవేటు పెట్టుబడిని ఆహ్వానించసాగింది అందుకు అవసరమైన గ్యారంటీల నివ్వసాగింది. వీటన్నిటి ఫలితంగా జాతీయ ఆర్థిక, పారిశ్రామికాభివృద్ధి మన ప్రయోజనాలకు వ్యతిరేకంగా సాగింది. సామ్రాజ్యవాద గుత్తపెట్టుబడి వర్గాలు మన భారీపరిశ్రములకు "మొండిచేయిని" "సహాయంగా చూపగా భారతదేశం మరోమార్గం లేక సోవియట్ యూనియన్ యితర సోషలిస్టుదేశాల సహాయాన్ని అర్థించసాగింది. ఇనుము, ఉక్కు తదితర భారీ పరిశ్రమలకు సోవియట్ యూనియన్ తదితర సోషలిస్టుదేశాల పెట్టుబడి సాంకేతిక పరిజ్ఞానం లభించుటతో భారత ప్రభుత్వ పంచవర్ష ప్రణాళికలను భగ్నం చేసి భారతదేశ ఆర్థిక పారిశ్రామిక విధానంపై ఆధారపడి సామ్రాజ్యవాద దేశాలకు ముడి సరుకులు సప్లయి చేసే పరాధీన ఆర్థిక వలస దేశంగా వుంచాలనే ప్రయత్నాలకు గండిపడింది. భారతదేశం యింకయేమాత్రం వొక్క సామ్రాజ్యవాద దేశాలపై ఆధారపడిన ఆర్థిక పారిశ్రామిక విధానం కలదిగా లేని స్వతంత్ర ఆర్థిక విధానాన్ని కొంతవరకు సాగించగల దేశమైంది.

సోషలిస్టు నమూనా విధానాన్ని అనుసరిస్తున్నామని ప్రభుత్వం ముమ్మరంగా ప్రచారం సాగించుతున్నా పెట్టుబడిదారి విధానంలోని సూత్రాలలో స్వతాహా వున్న వైరుధ్యాలు పరిమితుల ఫలితంగా అభివృద్ధి కార్యక్రమాలు గడ్డుపరిస్థితులను యెదుర్కొనవలసి వచ్చింది. వ్యవసాయరంగంలో ఉత్పత్తికర్తల వ్యూడలు బంధనాల

---

1. ప్రొసీడింగ్స్ ఆఫ్ది సి. పి. సి. 7వ కాంగ్రెస్ పే, 6-7

నుండి విముక్తి చేసే ప్రయత్నాల వైఫల్యం కారణంగా పెరిగే జనాభాకు తగినంత అధికాహారోత్పత్తిని చేయుట వైఫల్యం యెదురైంది

అధికధరలు దొంగ బ్లాక్‌మార్కెట్టు వ్యాపారుల అధికలాభాల అత్యాసతో సరుకులకొరత అంచేత ధరలు ఆకాశాన్నంటుట లంచగొండితనం విపరీతంగా పెరుగుటతో ద్రవ్యోల్బణం పెరిగిపోయి ప్రజల జీవితం దుర్భరమైంది

భారతజాతీయ బూర్జువావర్గం, అభివృద్ధికి ఆధారభూతమైన పెట్టుబడి అవసరం వున్నా, విదేశ గుత్తపెట్టుబడివర్గాలు వారి సంస్థలద్వారా విదేశవ్యాపారాన్ని ముఖ్యంగా కాఫీ, టీ, జనపనార, నూనెల వ్యాపారాన్ని జాతీయం చేయ నిరాకరించుతున్నది, అందుకు విరుద్ధంగా విదేశపెట్టుబడిని భాగస్వామ్యంగా ఆహ్వానించుచున్నది. స్వాతంత్ర్యానంతరం వ్యక్తియాజమాన్యంలోని విదేశపెట్టుబడి మూడురెట్లు పెరిగింది. ఇది లాభాలను తిరిగి పెట్టుబడిగా పెట్టుట వలన ద్రవ్యోల్బణం కారణంగా బుక్‌పాట్యాలో పెరుగుదల ప్రధానంగా జాతీయం చేసిన యెడల అధికనష్ట పరిహారాన్ని కోరగలందులకు, భారతగుత్త పెట్టుబడిదారులతో పొత్తుగా యేర్పడి పెట్టిన కారణంగాను విదేశపెట్టుబడి పెరిగింది. బ్యాంకింగేతర పెట్టుబడి 1948లో 256 కోట్లుకాగా, నేడు 1966లో 800 కోట్లకు పైగా పెరిగింది.

సామ్రాజ్యవాదులు యిచ్చే సహాయానికి "విధించే షరతులు మన జాతీయ ప్రయోజనాలకు నష్టదాయకమేగాక ఆర్థికసహాయం, విదేశవ్యాపార అసమానతల కారణంగా యేర్పడే తరుగును సరిచేయుటకు చేసే చెల్లింపులకు మాత్రమే ప్రధానంగా సరిపోతుంది. ఒకేమార్గంలో జరిగే వ్యాపారం కారణంగా భారతదేశపు 90 శాతపు ఎగుమతులు సామ్రాజ్యవాద దేశాలతోనే జరుగుతున్నది అంచేతనే అసమాన మారకద్రవ్యం వలన చెప్పజాలనంత నష్టం మనకు వస్తున్నది. అమెరికా యిచ్చే సహాయంలో 50 శాతం ఆహార పదార్థాల దిగుమతులకు వారికే చెల్లించుతున్నాము. మనకు వారిచ్చే సహాయం ఉపయోగపడకపోగా మనవ్యవసాయాభివృద్ధికి నష్టదాయకమైంది.

జాతీయ బూర్జువావర్గంలో వర్గ విభజన అభివృద్ధి చెందుతున్నందున వైరుధ్యాలు అంతర్గతంగా తీవ్రతరమగుతున్నవి, ఇది ప్రధానంగా గుత్తపెట్టుబడిదారీ వర్గాలు యేర్పడుటగా ప్రస్ఫుటమగుతున్నది. దేశపు ఆర్థిక, రాజకీయ జీవితంపై వారికిగల ఆధిక్యత కారణంగా విస్తృత జాతీయ బూర్జువా వర్గాలలో ప్రజలలో నష్టదాయకమగుటతో సంఘర్షణలు ఎక్కువగుతున్నవి. భారత స్వతంత్ర ఆర్థికాభివృద్ధికి ఆటంకంగా తయారైనవి. రాజకీయరంగంలో మితవాద అభివృద్ధి నిరోధక శక్తుల అభివృద్ధికి తోడ్పడుతున్నది.[1]

1. ప్రొసీడింగ్స్ ఆఫ్ ది 7వ, సి.పి.ఐ బొంబె, డిశెంబరు 1964 కాంగ్రెసు డాక్యు

పెట్టుబడిదారి పంథాలో అభివృద్ధి కొనసాగుటలోని వైరుధ్యాలను వివరించుతు సేన్ వివిదాంశాలపై యీ విధంగా వ్యాఖ్యానించారు. మొదటిది స్వాతంత్ర్యానంతర సంవత్సరాలలో భారత స్వాతంత్ర్యం బలపడిందా? యని ప్రశ్నించి, సి.పి.ఐ. కార్యక్రమము, నిర్ద్వంద్వంగా అవుననే సమాధానం యిచ్చిందన్నారు. భారతదేశాన్ని అర్ధవలస ఆర్థిక పరిమితులలోనే వుంచాలనే సామ్రాజ్యవాదుల ప్లానులు వమ్ముచేయబడి, మనదేశం స్వతంత్ర పారిశ్రామికాభివృద్ధి పంథాలో పురోగమించిందని కార్యక్రమం స్పష్టం చేసిందన్నారు.

స్పష్టంగా కన్పించే యీ వాస్తవాన్ని పోటీ కమ్యూనిస్టుపార్టీ క్రమవిధానంలో గుర్తించ నిరాకరిస్తున్నది. వ్యక్తి యాజమాన్యంలోని విదేశపెట్టుబడి పెరిగిపోవుటను వొకే దృక్పథంలో గణాంకాలను స్వాతంత్ర్యానంతరం నుండి సేకరించుతున్న విదేశ ఋణాలను పేర్కొంది. భారత ఆర్థిక విధానం ప్రధానంగా సామ్రాజ్యవాదులపై ఆధారపడుటయేగాక, యీ పరాధీనత రోజురోజుకు పెరిగిపోతున్నదనే నిర్ణయానికి వచ్చింది. అంటే 17 సంవత్సరాలనాటికంటె భారతదేశం ఆర్థికంగా పరాధీనమై, పూర్తిగా అర్ధవలసదేశంగా మారే మార్గంలో పయనిస్తున్నదని" చెప్పుతున్నది.

గత దశాబ్దకాలంలో అభివృద్ధి చెందిన భారీపారిశ్రామికాభివృద్ధిని, నూతన వ్యాపార సంబంధాలను కార్యక్రమం పేర్కొని తప్పుడు అవగాహనలను వైఖరులను ఖండించింది. పాలకవర్గాలు భారతదేశాన్ని స్వతంత్ర పెట్టుబడిదారి ఆర్థికాభివృద్ధి పంథాలో నడుపుతున్నవనే నిర్ధారణకు కార్యక్రమం వచ్చింది. దీనికి నేపథ్యంగా ఆంగ్లపాలనలోనే భారత జాతీయబూర్జువావర్గం యితర వలసలబూర్జువా వర్గాలతో పోల్చినపుడు అభివృద్ధి చెంది బలాన్ని కలిగివుండుటను గుర్తించకతప్పదు కాంగ్రెసులోని అభ్యుదయకర శక్తులు, జాతీయోద్యమంలో భాగంగా కమ్యూనిస్టులు సత్వర పారిశ్రామికాభివృద్ధికి రూపొందించిన ప్రణాళికలును మరో అంశంగా పరిగణించాలి ఈ పరిణామాలన్నిటికి, జాతీయబూర్జువావర్గ ప్రయోజనాలను తమబలాన్ని పెంచుకొనాలనే వారి బలమైన వాంఛప్రజావుద్యమాల బలం పెంపొందుట, ప్రపంచ సోషలిస్టు పక్షంపై ఆధారితులగుట గమనించాలి. ఈ పరిణామాలలో ప్రభుత్వ, పబ్లిక్‌రంగాలలో పారిశ్రామిక ద్రవ్యపెట్టుబడి, వ్యాపారరంగాలలోని అభివృద్ధిని పెట్టుబడిదారి విధానాభివృద్ధిని కార్యక్రమం ప్రతిబింబించింది. విశ్లేషణం గావించి వివరించింది. పబ్లిక్‌రంగం వొక విధంగా ప్రభుత్వ పెట్టుబడిదారి విధానమే. కమ్యూనిస్టుపార్టీ పబ్లిక్ ప్రవేటు రంగాల సంఘర్షణలలో తటస్థ వహించక రెండూ పెట్టుబడిదారి విధానాలైనప్పటికి ప్రభుత్వ పబ్లిక్‌రంగ విస్తరణను బలపరుస్తున్నది.

మొహిత్‌సేన్ యీ క్రింది విధంగా యీ సమస్య భారత కమ్యూనిస్టుపార్టీ అవగాహనను సంక్షిప్తంగా "ఈ విధంగా పాలకపార్టీ అనుసరించేపంథా, ప్రజా

స్వామ్య వ్యతిరేక అఘాతాన్ని తానే సృష్టించికొంటున్నదని, జాతీయ పునర్జీవనానికి యీ పంథా నిరుపయోగత జీవితంలో రుజువైంది. పోటీ కమ్యూనిస్టుపార్టీ భారత కమ్యూనిస్టుపార్టీ విపరీతనిందా ప్రచారంచేస్తున్నా నిర్మొకమాటంగా చేసిన యీ విశ్లేషణ స్వతంత్ర పెట్టుబడిదారి పంథాలోకావించే అభివృద్ధి రూపం కమ్యూనిస్టు పార్టీ పార్టీ వ్యూహ పంథాకు పునాది అగుతున్నది ప్రత్యామ్నాయ జాతీయ ప్రజా స్వామిక పెట్టుబడిదారేతర పంథాకు మూలమగుతున్నది. కాంగ్రెసు నాయకత్వం భారతదేశంలో నిర్మించ ప్రయత్నించేసే పెట్టుబడిదారి విధానము టలో సి.పి ఐ.కు ఎట్టి సందేహంలేదు, భ్రమలులేవు, మన జాతి, ప్రజల సమస్యలకు అవి వుపకరణలు కావని స్పష్టంగా తెలుసునని సేన్ వివరించారు.

భారత విదేశాగం విధానం, సామ్రాజ్యవాదుల తంత్రాలు

భారత కమ్యూనిస్టుపార్టీ 7వ కాంగ్రెసు ఆమోదించిన తీర్మానం భారత ప్రభుత్వం అనుసరించిన విదేశాంగ విధానం ప్రధానంగా శాంతి, సామ్రాజ్యవాద వ్యతిరేక అలీన విధానం. ఇది జాతీయ బూర్జువా వర్గ ప్రయోజనాలకు, భారత ఆర్థికాభివృద్ధికి, భారత ప్రజాసామాన్య అభిప్రాయానుగుణ్యంగా వుంది. ఈ విధానం అప్పుడప్పుడు రాజీలకులోనై గాడి తప్పుతున్నా మొత్తం మీద సాధారణంగా అనుసరించే పంథా ప్రధానస్వభావాన్ని నిలబెట్టుకొంది.

"ప్రారంభ సంవత్సరాలలో భారత విదేశాంగ విధానం, గతపరాధీనవారసత్వ ఫలితంగా బ్రిటిష్ ప్రభావాలకులోనై "ఆటుపోటులకు గురైనా సత్వరమే గణనీయంగా మారింది.[1]" అని సామ్రాజ్యవాద వ్యతిరేక శాంతి అలీన విధానాన్ని ప్రధానంగా భారత ప్రభుత్వం 'అనుసరించిందని స్పష్టం చేసింది.

ప్రారంభ సంవత్సరానలో "బ్రిటిష్ ప్రభావాలకు గురై ఆటు-పోటులకు గురియగుటను ప్రధానంగా శాంతి, ఆలీన, సామ్రాజ్యవాద వ్యతిరేకపంథా" వదనాడకుండుటను మొహిత్ సేన్ యిలా వివరించారు. "మనదేశంలో సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటంలో అంతర్జాతీయ దృక్పథాన్ని సూచించుటలో 1920 దశకంలో మధ్యనుండి సూచించుతూనే వుంది. కాంగ్రెసులోని మితవాద వర్గాలు సోషలిజం పేరును ఉచ్చరించుటను కూడ వ్యతిరేకించారు. సామ్రాజ్యవాద వ్యతిరేక తీవ్ర పోరాటాలను వ్యతిరేకించారు. స్వతంత్ర భారతదేశంలో కూడ నూతన పరిస్థితులలో యిదే వైఖరి కొనసాగించారు. స్వాతంత్ర్యం కొన్నిసంవత్సరాలు కాంగ్రెసు నాయకత్వం పశ్చిమ సామ్రాజ్యవాదదేశాలపై మొగ్గు చూపుతుబ్రిటిష్ విదేశాంగ ఛాయలకు, వొత్తిడులకు లోనైంది. అనేక విషయాలలో ఐక్యరాజ్యసమితిలో

---

1. మొహిత్ సేన్ (1966) యస్పెక్ట్స్ ఆఫ్ సి పి ఐ. ప్రోగ్రాం. (ఆంగ్లంలో) పే 11-12.

పశ్చిమ దేశాలను బలపరుస్తూ వోటు చేసిందని విజయలక్ష్మి పండిట్ తెలియజేసింది. ఈ కాలంలో కామన్‌వెల్తుతో సంబంధాలపై వివాదాలు చెలరేగినపుడు సహజంగానే భారతదేశం పశ్చిమదేశాలతో అనేక సంబంధాలను కలిగివుందని ప్రకటించారు. ఆ రోజులలోనే మలయాలో బ్రిటన్, కొరియాలో ఐక్యరాజ్య సమితి సైనికంగా కలుగ జేసుకొనుటను భారతదేశం బలపరచింది.

"ఆ రోజులలోకూడ భారత ప్రభుత్వ విదేశాంగ విధాన అంశాలలో 1949 నుండే చైనా ప్రజా రిపబ్లిక్‌ను గుర్తించాలనే చొరవను స్టాలిన్, ట్రూమన్‌లు కొరియాలోని సంఘర్షణలు అంతంచేయుటకు చొరవను ప్రదర్శించాలని కోరింది. నూతన ఆర్థిక విధానాన్ని చేబట్టిన రోజులలోనే నూతన విదేశాంగ విధానం కూడ రూపొందింది. "పంచశీల" ఒడంబడిక చైనాతో బాండుంగు సమావేశంలో చైనాతో కలసి, శాంతి తటస్థ అలీన విధానాన్ని రూపొందించుట వలసదేశాలలోని సామ్రాజ్య వాద వ్యతిరేక పోరాటాలన్నిటి బలపరచే విధానంతోపాటు పంచవర్ష ప్రణాళికారచన పబ్లిక్ ప్రభుత్వ రంగాలలో భారీపరిశ్రమల స్థాపన విధానంగా ప్రభుత్వం చేపట్టెను.

అంతేగాక "భారతదేశాన్ని స్వతంత్ర పెట్టుబడిదారి పారిశ్రామిక దేశంగా అభి వృద్ధి చేయాలనే జాతీయ బూర్జువావర్గకార్యక్రమం, సామ్రాజ్యవాదుల నూతన వలస విధానం, బూర్జువావర్గాల మధ్యగల వైరుధ్యాలను తీవ్రతరం చేసింది, యిదిఒక్కటే జాతీయ బూర్జువావర్గానికి వారసత్వంగా లభించిన, సామ్రాజ్యవాదంలో రాజీపడే విధానాన్ని త్రోసిబుచ్చి నూతన విధానాన్ని చేబట్టువట్లు చేయగలిగినంతటి శక్తివంత మైనది కాదు. ఈ విషయంలో నిర్ణయాత్మకపాత్ర, అంతర్జాతీయ పరిణామంలో ప్రపంచ సోషలిస్టు విధాన అవతరణకు చెందుతుంది, అదే కాలంలో ప్రపంచ మొత్తంలో బలహీనపడుట గమనించవలసిన అంశము. నూతనంగా స్వాతంత్ర్యం పొందిన దేశాలతో సామ్రాజ్యవాదము సైనికంగా కలుగజేసుకొని త్రిప్పికొట్టగల శక్తిని ప్రపంచ సోషలిస్టువిధానం కలిగి వుంది. బలహీనపడిన సామ్రాజ్యవాదా నికి వ్యతిరేకంగా జాతీయ ఆర్థిక విధానాల అభివృద్ధికి, భౌతికసహాయాన్ని సామ్రా జ్యవాద వ్యతిరేక పరిమితులలో అందజేయగల బలాన్ని కలిగి జాతీయ బూర్జువా వర్గం సామ్రాజ్యవాదంతో సంఘర్షించిన సందర్భంలో బలాన్ని, మద్దతును యివ్వ రతిగిన స్థితిలో వుంది.

"ప్రపంచ సోషలిస్టు సమాజంతో పోల్చిన బలహీనంగా వుండుటయేగాక, ఎఫ్రో ఏసియన్ ఖండాలలో జాతీయవిముక్తి పోరాటాల వెల్లువ ఫలితంగా 60దేశాలు స్వాతంత్ర్యదేశాలుగ వుద్భవించుటతో సామ్రాజ్యవాదం గణనీయంగా బలాన్ని కోల్పోవుట స్పష్టమగుతుంది.[2] అదే సమయంలో, భారత ప్రజల సామ్రాజ్యవాద

2. ప్రొసీడింగ్స్ ఆఫ్ ది 7వ, సి.సి.ఐ. కాంగ్రెసు. డాక్యుమెంట్సు పే. 32.

వ్యతిరేక శాంతిప్రియత్వం కాంగ్రెసు, ప్రభుత్వంపై కలుగజేసిన బృహత్ప్రభావాన్ని గమనించాలి.

అంత్యంగా నూతనపదేశాంగ విధానానికి చారిత్రిక ప్రాముఖ్యత యెంతో వున్నది. కార్యక్రమము మార్పుచెందిన కార్యక్రమనైజమేమిటి? ' అనే ప్రశ్నకు నేరుగా, శాంతి అలీనవిధానం, సామ్రాజ్యవద వ్యతిరేకత అని సమాధానమిస్తున్నది, ఇది ప్రధానంగా సామ్రాజ్యవాద వ్యతిరేక జాతీయఅభ్యుదయకర విదేశాంగ విధానం ప్రజాప్రయోజనాలకనువైనది ప్రపంచ ప్రజల ప్రయోజనాలకు అనుకూలమైనది. విదేశాంగవిధానాన్ని మొత్తంగా సి. పి ఐ. బలపరస్తున్నది. పోటీ కమ్యూనిస్టుపార్టీ రూపొందించిన విధానాలకు పూర్తి వ్యతిరేకమైనది, వారు చెప్పే ప్రపంచ ప్రతిపక్షాల రెండింటి మధ్య "దోబూచు" లాడుతుందనే అవగాహనకు పూర్తిగ భిన్నమైనది, భారతవిదేశాంగ విధానానికి పూర్తిగ వ్యతిరేక విధానమైన సి. పి. యం. వైఖరిని వ్యతిరేకిస్తుంది. సి. పి. ఐ. కార్యక్రమం భారత విదేశాంగవిధానాన్ని ప్రపంచ శాంతి మండల విధానంగా పేర్కొని, అత్యధిక దేశాలు ప్రపంచ సోషలిస్టు సమాజ సంఘటనలో సభ్యులుగ నూతన వలన విధానాలను ధ్యేయాలను సామ్రాజ్యవాద కుటిల విధానాలను ప్రత్యేకంగా అమెరికా సామ్రాజ్యవాద విధానాలను వ్యతిరేకించుచున్నది[1]. భారతప్రభుత్వ విదేశాంగవిధానాన్ని సి. పి.ఐ. కార్యక్రమం పూర్తిగ బలపరచుచున్నది. ప్రపంచకమ్యూనిస్టుపార్టీల 1957 విజ్ఞప్తిని 1960 ప్రకటనను పూర్తిగ బలవరస్తున్నది.

భారతకమ్యూనిస్టుపార్టీ (మార్క్సిస్టు) 7వ, కలకత్తా పార్టీ కాంగ్రెసు ఆమోదించిన రాజకీయ తీర్మానం, భారతప్రభుత్వ విదేశాంగ విధానంపై, యిచ్చే అవగాహనను చూద్దాము "భారత ప్రభుత్వ విదేశాంగ విధానం సహజంగా, బూర్జువావర్గ ద్వంద్వనైజాన్ని, అనగా సామ్రాజ్యవాదానికి వ్యతిరేకతను, దానితో రాజీ, పొత్తులను ప్రతిబింబించుచున్నది. సామ్రాజ్యవాద దేశాలలోని గుత్తపెట్టుబడి వర్గాలవలె గాక, భారతబూర్జువావర్గం తన అభివృద్ధి ప్రపంచశాంతి అవసరం, అందుచేత ప్రపంచయుద్ధానికి వ్యతిరేకి. యుద్ధపక్షం, శాంతిపక్షంగా విడిపోయిన ప్రపంచంలో, సామ్రాజ్యవాద పక్షం అమెరికా నాయకత్వంలో దురాక్రమణసైనిక కూటములను యేర్పరచుటద్వారా ఆదేశాలలో పరోక్ష ఆదిపత్యం కొరకు ప్రయత్నాలు సాగునపుడు, తటస్థత లేక అలీనవిధానం, నూతనంగా పొందిన స్వాతంత్ర్యాన్ని పరిరక్షించుకొనుటకు, తనవర్గ ప్రయోజనాల కాపాడుకొనుటకుగాను అవలంభించింది. ఈ విధానాన్ని అమలు చేయుటకు సామ్రాజ్యవాద, సోషలిస్టు పక్షాల మధ్య గల వైరుధ్యాలను, అమెరికా, బ్రిటిష్

---

1. యాస్పెక్ట్స్ ఆఫ్ సి. పి. ఐ. ప్రోగ్రాం (ఆంగ్లంలో) మొహిత్ సేన్. పే. 24-25.

16)

సామ్రాజ్యవాదాలమధ్య గల వైరుధ్యాలను వినియోగించు ప్రయత్నాల ఫలితమే[1] భారత ప్రభుత్వ విదేశాంగ విధానము.

స్వాతంత్ర్యానంతర ప్రథమ సంవత్సరాలలో భారతదేశం ఆర్థికాభివృద్ధికి, ఆ యుధాల కొరకు, సామ్రాజ్యవాదం ముఖ్యంగా అమెరికాకు ఎర్రులు చాస్తున్నపుడు, భారతప్రభుత్వం, వొత్తిడులకు లొంగిపోయిన వైఖరిని ప్రదర్శించింది. గూర్ఖా సైనికుల రిక్రూట్ చేసుకొనుట బ్రిటిష్‌సైనిక క్యాంపులను ఆమోదించింది, యిది స్వాతంత్ర్య పోరాటాన్ని సాగించుతున్న మలయాప్రజలను అణచివేయుటకు పరోక్షంగా ఆంగ్లసామ్రాజ్యవాదానికి సహాయపడుటయే అగుతుంది. అదేవిధంగా వియత్నాం రిపబ్లిక్‌పై ఫ్రెంచిసామ్రాజ్యవాదం సాగించే సైనికచర్యలకు, వారికి రేవులలో విమానాశ్రయాలలో సౌకర్యాలను కలుగజేయుట కూడ అట్టి చర్యయే అగుతుంది. కొరియాలోని అమెరికన్ "సైన్యాలకు వైద్యసదుపాయ మందులను అందజేయుట కూడ అట్టి వైఖరినే ప్రతిబింబించుచున్నది. ఈ దశలో ఐక్యరాజ్యసమితిలో భారత ప్రతినిధి సామ్రాజ్యవాద దురాక్రమణ చర్యలనే బలపరచారు.

కొరియాలో సామ్రాజ్యవాదుల వైఫల్యం, వియత్నాంలో "చావు తప్పి" బయటపడుట, ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికాలతో వలస ప్రజల విముక్తిపోరాటాల వెల్లువతో సామ్రాజ్యవాద దేశాలనుండి ఆర్థిక, ఆయుధసహాయం అందని నిరాశతో రష్యా, తదితర సోషలిస్టు దేశాల యెడల భారతదేశం నూతనవిధానాన్ని శాంతి యుద్ధ వ్యతిరేక విధాన్నా చేబట్టిందని తీర్మానం విశదీకరించింది. ఈ దశలో భారత ప్రభుత్వం 'వలసప్రజలు సామ్రాజ్యవాదంపై జరిపే పోరాటాలకు నైతిక సహాయం, సైనిక కూటములలో చేరని తటస్థవిధానాన్ని అవలంభించసాగింది. "అలీన విధానానికి యీ నూతనసామ్రాజ్యవాద వ్యతిరేక సుముఖరూపాన్ని యిచ్చి, అంతర్జాతీయ వివాదాలకు శాంతియుత పరిష్కారం, యుద్ధవ్యతిరేక శాంతిసహజీవన విధానానికి దోహద మిచ్చింది[2]. "భారత విదేశాంగ విధానంలో యిది వొక నూతనదశ"గా యెంచవచ్చు. అయితే, అల్జీరియా తాత్కాలిక ప్రభుత్వాన్ని గుర్తించుటలో వెనుకాడుట, అనేక యితర సందర్భాలలో నిర్ద్వందంగా వలససామ్రాజ్యవాద వ్యతిరేక వైఖరిని చేబట్టక పోవుటతో 1961లో బెల్గ్రేడ్‌లో జరిగి అలీన రాజ్యాల సమావేశంలో అనేక ఆఫ్రో-ఏసియన్ దేశాలవైఖరులకు వ్యతిరేకంగా ప్రదర్శితమగుటయేగాక కెయిరో సమావేశంలో, మలేషియాని గుర్తించుటలో వెనుకాడుట యీ వైఖరులనే స్పష్టంగా తెలియజేస్తుంది.

---

1. పోగ్రాం ఆఫ్ పార్టీ బై 7వ, సి. పి. యం. కలకత్తా కాంగ్రెసు, నవంబరు 1964
   పే 18-19. ఆర్టికల్ -47
2. అదే. పే. 20.

## జాతీయ ప్రజాస్వామ్యం, జనతా ప్రజాస్వామ్యం :

జాతీయ ప్రజాస్వామ్య విప్లవకర్తవ్యాలను పరిపూర్తి చేయుటకు భారతదేశము అవలంభించవలసిన పంథాయెట్టిది? ప్రజలకు జీవితమే, భారతదేశము అనుసరించుచున్న పెట్టుబడిదారి పంథాలో ఆకలిదారిద్ర్యం, దోపిడి తొలగించబడదని నేర్పుతుంది. సోషలిజం ఆర్థికాభివృద్ధి విజయాలతో ప్రజల అభిప్రాయాలను ప్రభావితం చేస్తున్నది, అది గ్రహించిన బూర్జువా రాజకీయవేత్తలు గూడ సోషలిస్టు నినాదాలను చేబట్టుటలో ఆశ్చర్యం లేదు. పాలకవర్గపార్టీయైన కాంగ్రెసు సోషలిస్టిక్ రాజ్యాంగాన్ని యేర్పాటు చేయుట తన ధ్యేయంగా ప్రకటించింది. భారతకమ్యూనిస్టుపార్టీ 7వ, కాంగ్రెసు ఆమోదించిన కార్యక్రమాలలో, పెట్టుబడిదారి సంక్షోభం లేని నిజమైన సోషలస్టు సమాజనిర్మాణం, మార్క్సిస్టు-లెనినిస్టు శాస్త్రీయ విశ్వసత్యాలను భారతీయ పరిస్థితులలో అన్వయించు విశ్వాసాన్ని కలిగియున్నదని స్పష్టం చేసింది. సోషలిజపు మౌలిక అంశాలుగ, ప్రధాన ఉత్పత్తిసాధనాలు సమాజ అధ్వర్యం, యజమాన్యంలో, మారకం, పంపకము, కార్మికవర్గ నాయకత్వంలో యేర్పడిన కార్మిక, కర్షక, మధ్యతరగతుల ప్రభుత్వం చేబట్టాలి, యిదే కమ్యూనిస్టుపార్టి ఆర్థిక, రాజకీయ లక్ష్యంగా ప్రకటించింది.

ప్రత్యామ్నాయపంథా, ప్రప్రథమంగా నేడు పెట్టుబడిదారి పందాలో జరిగే విధానాన్ని త్రిప్పికొట్టి వెంటనే పెట్టుబడిదారి సంబంధాలను నిర్మూలించక యీక్రింది ప్రధానకర్తవ్యాలను చేబట్టుతుంది. దేశంలో విదేశగుత్తపెట్టుబడిదారి వర్గ ఆధిపత్యాన్ని ఆర్థికవిధానాలలో పూర్తిగ తొలగిస్తుంది. విదేశగుత్తపెట్టుబడి నుండి విముక్తి పొందిన స్వతంత్ర ప్రభుత్వరంగంలో, స్వశక్తిపై ఆధారపడిని జాతీయ పారిశ్రామిక ఆర్థిక విధానాలను, ప్రజాస్వామ్యపద్ధతులలో నిర్మించి, విస్తరించి బలోపేతం చేస్తుంది. పారిశ్రామిక, ద్రవ్య, బ్యాంకింగ్, వ్యాపార, భారత గుత్తపెట్టుబడి వర్గాల కూటములను విచ్ఛిన్నంచేసి, అవితిరిగి తలెత్తే అవకాశం లేకుండా చేయుట, భూస్వాముల, ఫ్యూడలు అవశేషాలను రూపుమాపే వ్యవసాయ భూముల సంస్కరణలు చేసి, వడ్డీ వ్యాపారుల అప్పుల దోపిడి అరికట్టుట ద్వారా ప్రజాభివృద్ధి కార్యక్రమాలు చేబట్టుట భారతకమ్యూనిస్టుపార్టీ ఆమోదించిన కార్యక్రమంలో వివరించింది.

ఈ కార్యక్రమాన్ని అమలుచేయుటలో వుత్సాహాన్ని చూపే వర్గాలుగ, కార్మిక వర్గం దేశవ్యాప్తంగా పిటికై ప్రజాకార్యాచరణకుపక్రమించిందని, ధనికరైతులతో సహా విస్తృత రైతాంగం, వ్యవసాయకూలీలు అభివృద్ధికరవ్యవసాయ సంస్కరణ లకై పోరాడుతారని నగర గ్రామీణ మేధావివర్గాలు, నిరుద్యోగులు సామ్రాజ్యవాద ఫ్యూడలు వ్యతిరేక యీ కార్యక్రమాల యెడల సమీకృతులగుతున్నారని వీరికి తోడు

గుత్తేతర బూర్జువా వర్గాలు యీ కర్తవ్యాల యెడల ఆశక్తి కలిగి వున్నారని కార్య క్రమం వివరించింది.

అంతేగాక యీ కార్యక్రమాలను అమలు చేయు శక్తివంతమైన ఆయుధం జాతీయ ప్రజాస్వామ్యసంఘటన నిర్మాణాన్ని పార్టీ చేబట్టుతుందని తీర్మానించింది[1].

ఈ సంఘటన అన్ని దేశభక్త శక్తులను, కార్మికవర్గాన్ని, ధనికరైతులతో సహా రైతాంగాన్నంతటిని, వ్యవసాయకార్మికులను. మేధావివర్గాలను, గుత్తపెట్టుబడిదారే తర బూర్జువావర్గాలన్నిటిని ఐక్యపరస్తుంది, దీనికి కార్మిక, కర్షక ఐక్యత పునాది, ఇరుసుగా వుంటుందని స్పష్టం చేసింది.

జాతీయ ప్రజాస్వామ్య సంఘటన మితవాద అభివృద్ధి నిరోధకశక్తులపై కేంద్రీకరించి జరిపే ఆర్థిక, రాజకీయ పోరాటాల ద్వారానే యేర్పడుతుంది కార్మిక, కర్షక. వ్యవసాయకూలీల, మధ్యతరగతి వుద్యోగుల సంయుక్త ప్రజాపోరాటాల ద్వారా కమ్యూనిస్టుపార్టీ తదితర అతివాద, సోషలిస్టు పార్టీల ప్రజాసామాన్యాన్ని, జాతీయప్రజాస్వామ్య సంఘటనలో, కాంగ్రెసును అనుసరించే ప్రజాసామాన్యంతో పాటు అందరిని సమీకరించుతుంది.

జాతీయ ప్రజాస్వామ్య సంఘటన ఆధికత్యలో యేర్పడే ప్రభుత్వం, సంయుక్త తాత్కాలిక దశలో వుండే ప్రభుత్వం, అన్నివర్గాల ప్రభుత్వం, సామ్రాజ్యవాద ప్రయోజనాలను, అర్థభూస్వామ్య అవశేషాలను గుత్తపెట్టుబడి వర్గాల అధికారాన్ని బ్రద్దలు కొట్టిరూపుమాపే ప్రభుత్వము. జాతీయ ప్రజాస్వామ్యప్రభుత్వవర్గ పొందిక కార్మిక, కర్షక ఐక్యత పునాదిగా యేర్పడి కార్మికవర్గమే చొరవతో యేర్పాటు చేసిన నిర్మాతగాన అదే సంఘటన నాయకత్వపాత్ర వహించుతుంది. గత పది సంవత్సరాల అనుభవాలను సమీక్షించిన ప్రపంచ కమ్యూనిస్టువుద్యమం 1960 ప్రకటనలో స్పష్టం చేసిన విధంగా వర్ధమాన స్వతంత్రదేశాలలో నూతన అవకాశాలు యేర్పడినవి. జాతీయ బూర్జువావర్గపు సహజ ద్వంద్వవైఖరి కారణంగా అది అనుసరించే ఆర్థిక, రాజకీయవిధానాలు సంఘర్షలు, వైరుధ్యాలను వెలికి తెస్తున్నవి. ఇదే ఆర్థికాభివృద్ధిని కుంటుపరచి సంక్షోభంలోనికి త్రోస్తుంది. రాజకీయంగా అభివృద్ధి నిరోధవర్గాలు బల పడుటకు అవకాశం లభిస్తుంది. జాతీయ ప్రజాస్వామ్య సంఘటన తరువాత జాతీయ ప్రజాస్వామ్య సంఘటనా ప్రభుత్వ నినాదాలు నేడు అత్యధిక ప్రజాశక్తులను సమీక రించుటకు తోడ్పడుతున్నవి. అంచేతనే భారతకమ్యూనిస్టుపార్టీ, యీ దశకంతటికి కేంద్ర నినాదంగా యిచ్చిందని కార్యక్రమం వివరించింది[2].

---

1. ప్రొసీడింగ్స్ ఆఫ్ ది 7వ కాంగ్రెసు సి. పి. ఐ బొంబె డిశెంబరు 1964 పే. 35-38.
2. ప్రొసీడింగ్ ఆఫ్ ది సెవెన్త్ కాంగ్రెసు ఆఫ్ సి. పి. ఐ డాక్యుమెంట్సు (1966) ఆంగ్లంలో పే. 41-42.

భారతకమ్యూనిస్టుపార్టీ 1964 కార్యక్రమాన్ని వాఖ్యానించుతు సేస్ కొన్ని ప్రధానాంశాలు యిలా వివరించారు[1]. భారతకమ్యూనిస్టుపార్టీ సంక్లిష్ట పరిస్థితులలో ప్రత్యామ్నాయ ప్రభుత్వరూపాన్ని ప్రజల ముందుంచుతున్నది. అది జాతీయ ప్రజా స్వామ్య ప్రభుత్వం, పెట్టుబడి దారేతర పంధా పెట్టుబడిదారి ప్రభుత్వం, దాని పంధా భారతదేశంనుండి అదృశ్యం కావాలని పార్టీ కోరుతున్నది.

సుదీర్ఘ పరిశోధన, అనుభవాలను పరస్పరం చర్చించుకొంటూ ముఖ్యంగా అంతర్జాతీయ కమ్యూనిస్టు వర్గాలతో చర్చల అనంతరం సి. పి ఐ కొన్ని నిర్ధారణ లకు వచ్చింది. అంత్యంత ప్రాముఖ్యత గలవి భారతదేశంలో తగిన పరిణామరూపం జాతీయప్రజాస్వామ్య ప్రభుత్వం, పెట్టుబడిదారేతర మార్గం. అంచేత గుత్తేతర బూర్జువావర్గం భారతదేశంలో దాని రాజకీయ ప్రతినిధులు ముఖ్యంగా పండిట్ నెహ్రూ భారతప్రజలలో అత్యధిక అనుచరులను కలిగి వున్నారు ఈ వర్గమంతా సామ్రాజ్య వాద వ్యతిరేక, ఫ్యూడలు వ్యతిరేక ప్రజాస్వామ్యవిప్లవంలో అభిలాష కలిగివున్నారు ఈ శక్తులన్నిటిని ఐక్యపరచి జాతీయ ప్రజాస్వామ్య విప్లవాన్ని పరిపూర్తి చేయ వలసి వుంటుంది. అయితే గుత్తేతర జాతీయ బూర్జువావర్గం ద్వందనైజాన్ని కలిగి వుంది. వారసత్వంగా సామ్రాజ్యవాదం ఫ్యూడలిజంలతో రాజీవిధాన వైఖరి అవలం బించుచున్నది. ఆర్థికంగానీ రాజకీయంగాని గుత్త బూర్జువావర్గాలతో తెగతెంపులు చేసుకొనలేదు. ఇతరవర్గాలతో కలసి ప్రజావ్యతిరేకత అనుసరించుతున్నది. దాని లక్ష్యం, స్వతంత్ర పెట్టుబడిదారీ భారతాన్ని రూపొందించుటయేగాని, జాతీయ ప్రజా స్వామ్య పెట్టుబడిదారేతర భారతదేశాన్ని నిర్మించుటగాదు. ప్రజావిప్లవాలను వ్యతిరే కించుతుంది. అంచేత సి. పి. ఐ గుత్తేతెర జాతీయ బూర్జువావర్గ యెడల, ఐక్యత పోరాటం అదే ద్వంధవిధానాన్ని అనుసరించుతుంది. ఒక్క అటువంటి విధానమే కమ్యూనిస్టుపార్టీ నాయకత్వం, ప్రజలతో యేకమగుటకు అనుసరించుతుంది భారత గుత్తేతర జాతీయ బూర్జువావర్గ ద్వందవైఖరిని సరిగా అవగాహనచేసుకొని సి. పి.ఐ సరియైన వ్యూహం ఎత్తుగడలను దేశపరిస్థితుల ననుసరించి జాతీయ ప్రజాస్వామ్య విప్లవాన్ని కొనసాగిస్తుంది.

ఈ విప్లవాన్ని కొనసాగించుటకు జాతీయడెమోక్రటిక్ ఫ్రంటును నిర్మించు తుంది, కార్యక్రమం యిది యెలా నిర్వహించాలో స్పష్టం చేసింది. జాతీయ ప్రజా స్వామ్య సంఘటనవర్గపొందిక కార్మిక, కర్షక ఐక్యతా ఇరుసుపై ఆధారపడివుంటుంది రైతాంగమంతా ధనికరైతువర్గంనుండి. వ్యవసాయ కూలి వర్గం వరకు అందరినీ యీ ఫ్రంటులో భాగస్వాములుగచేయాలి దీని బలము, శక్తి, దాడి పదును, కార్మిక, కర్షక ఐక్యత చాలవరకు నిర్ణయిస్తుంది, యిదే గుత్తేతర జాతీయ బూర్జువావర్గాలు యెంత

వరకు భాగస్వాములుగ వుండి, సంఘటన నిర్మాణం బలోపేతమగుతుందో కూడ నిర్ణయిస్తాయి. ఈ ప్రక్రియలో నగర మధ్యతరగతి వర్గాలు, మేధావులు మరో ముఖ్య పాత్రదారులు గుత్తేతర జాతీయ బూర్జువావర్గ ప్రజాపునాది, రాజకీయచైతన్యం విస్తృత మగుటతో అభ్యుదయకరవర్గాలవైపు మొగ్గి, తనకు గల గుత్తబూర్జువా వర్గాలతో గల పొత్తును చీల్చుకొని, జాతీయ ప్రజాస్వామ్య సంఘటనలో తన పాత్ర నిర్వహించుతుంది.

ఈ విధంగా గుత్తపెట్టుబడిదారి బూర్జువావర్గం, యితరవర్గాలనుండి వేరుపడి పోవుటతో జాతీయ ప్రజాస్వామ్య విప్లవవుద్యమం బలవత్తరమైన దగుతుంది. సామ్రాజ్యవాదం, ఫ్యూడలువర్గాలు గుత్త బూర్జువావర్గాలతోపాటు ప్రజలనుండి వేరుగ, దూరమగుటతో, వారి జాతీయవ్యతిరేక ప్రజాస్వామ్య వ్యతిరేకనైజం అందరికి స్పష్టమగుటతో భారత బూర్జువావర్గంలో చీలిక సంపూర్తి అగుతుంది. గుత్తేతర జాతీయ బూర్జువావర్గం సంఘటనలో భాగస్వామియై దానికి బలాన్ని, విస్తృతిని, స్థిరత్వాన్ని చేకూర్చుతుంది నాయకత్వంలో అధికారంలో భాగస్వామి అగుతుంది. కార్మిక వర్గం, గుత్తేతర జాతీయ బూర్జువావర్గాల నాయకత్వాలు అధికారంలో పాలుపంచుకొనుట నూతన దృక్పధము భారతదేశ పరిస్థితులలో జాతీయ ప్రజాస్వామ్య దృక్పధంలో నూతనాంశము, జనతాప్రజాస్వామ్యంలో నాలుగువర్గాల కూటమిలో చైనాలో కార్మికవర్గమే నాయకత్వం వహించాలనే దృక్పదానికి భిన్నమైనది, తూర్పుయూరపులో జనతా ప్రజాస్వామ్యంలో ప్రధమదశగా ఐక్యకమ్యూనిస్టుపార్టీ గతంలో ఆమోదించిన దానికి కూడ భిన్నమైనది భారతప్రత్యేక పరిస్థితులను లోతుగ పరిశీలించిన పిదప నూతన యుగంలో భారత జాతీయ ప్రజాస్వామ్య విప్లవం పార్టీ నాయకత్వంలో గుత్తేతర జాతీయ బూర్జువావర్గపు నేటి భవిష్యత్తులో పాత్రను పునఃపరిశీలించి యీ నూతన అవగాహనకొచ్చిందని మొహిత్ సేన్ పార్టీ తీర్మానాన్ని వివరించారు[1].

ఇప్పుడు పార్టి నుండి చీలిన అతివాద కమ్యూనిస్టులు 7పార్టీ కాంగ్రెసును నవంబరు 1964లో కలకత్తాలో ఆమోదించిన రాజకీయ తీర్మానంలోని ముఖ్యాంశాలను జనతా ప్రజాస్వామ్యం, జనతాప్రజాస్వామ్యసంఘటన ప్రభుత్వాలకు సంబంధించిన అంశాలను తెలుసుకొందాము.

"పెట్టుబడిదారి విధానం ప్రజలదృష్టిలో అప్రదిష్టపాలైంది. అంచేతనే, మన బూర్జువాపాలకులు పెట్టుబడిదారి విధానాభివృద్ధిని, సోషలిజం అన్నబోర్డుక్రింద చేయ ప్రయత్నిస్తున్నారు." అని తీర్మానం పేర్కొన్నది.

1. మొహిత్ సేన్ (1966) యాస్పెక్ట్స్ ఆఫ్ సి. పి. ఐ. ప్రోగ్రాం (ఆంగ్లంలో) పే 31

ఇంకా "ప్రపంచ పెట్టుబడిదారి విధానం వేగంగా కూలిపోవుటతో ప్రపంచసోష లిస్టు వ్యవస్థ వేగంగా వృద్ధి చెందింది. స్వాతంత్ర్య సంపాదనానంతరం వెనుకబడిన వర్ధమాన దేశాలు జాతీయప్రజాస్వామ్య ప్రభుత్వాలను యేర్పరచుటకు విస్తృత నూతనావకాశాలు వుద్భవించాయి. అభివృద్ధి చెందుతున్న కార్మిక వర్గం క్రమేణా తన నాయకత్వాన్ని యేర్పరచుకొని, ప్రభుత్వంలో పెట్టుబడిదారేతర పంధాలో అభివృద్ధి తీసుకొచ్చి పెట్టుబడిదారి విధాన అభివృద్ధి దశను, దాటవేసి సోషలిస్టు వ్యవస్థను నెల కొల్పు అవకాశాలు యేర్పడినవి[1].

"భారత దేశంలో అట్టి అవకాశాలకు తలుపులు మూయబడినవి. బ్రిటిష్ వలస దేశంగా వున్నప్పుడే మనదేశం వలస అర్ధవలన దేశాలలో పెట్టుబడిదారి విధానం అభివృద్ధి చెందిన దేశాలలో వొకటిగా వుంది. జాతీయ విముక్తి వుద్యమానికి నాయ కత్వం వహించిన బడా బూర్జువావర్గం 1947లో స్వాతంత్ర్యం వచ్చిన నాటినుండి నూతన స్వతంత్ర్య భారత దేశపు ప్రభుత్వాధికారంలో వుంది. రెండు దశాబ్దాలుగ ప్రభుత్వాధికారంతో వుండి, తన వర్గస్థానాన్ని లెక్కలేనంతగా బలపరచుకొన్నది. ఇది ఒకవైపు సామ్రాజ్యవాదం బడా బూర్జువావర్గంతో రాజీవొప్పందాల ద్వారా, మరో వైపు ప్రజాసామాన్యపు ప్రయోజనాలపై దాడి చేయుట ద్వారా బలపడింది. భారత దేశంలో ఈ రెండు దశాబ్దాలలో భారతగుత్త పెట్టుబడిదారి వర్గాలు పెట్టుబడిదారి విధా నం విపరీతంగా పెరిగిపోయాయి. ఈ విధంగా జరుగుతున్నపుడు పెట్టుబడిదారేతర మార్గంలో అభివృద్ధి, జాతీయప్రజాస్వామ్య ప్రభుత్వాన్ని యేర్పరచాలనుట భారత దేశం దానిని లక్ష్యంగా నెంచుట అవాస్తవికత. సామ్రాజ్యవాద గుత్త పెట్టుబడిని పెకలించివేయుట, వ్యవసాయంలోని భూస్వామ్య, సెమీభూస్వామ్య బంధనాలను త్రెంచి వేయుట బూర్జువా-భూస్వామ్య ప్రభుత్వానికి నాయకత్వం వహించుతున్న బడా బూర్జువా వర్గాన్ని అధికారం నుండి కూలద్రోయకుండా చేయగలుగుట అసాధ్యము[2].

సోషలిస్టు సమాజస్థాపన ధ్యేయంగా పెట్టుకొని మార్క్సిస్టు కమ్యూనిస్టుపార్టీ తక్షణకర్తవ్యంగా ఆర్థికాభివృద్ధిని. కార్మికవర్గ రాజకీయ, సైద్ధాంతిక పరిపక్వతను, నిర్మాణబలాన్ని పరిగణలోనికి తీసుకొని, భూస్వామ్య వ్యతిరేక, సామ్రాజ్యవాద వ్యతి రేక అన్నిశక్తులను కార్మిక వర్గనాయకత్వంలో జనతా ప్రజాస్వామ్యస్థాపన నేటి తక్షణ కర్తవ్యంగా చేబట్టింది. ఇది జనతా ప్రజాస్వామ్య ప్రభుత్వం కార్మికవర్గ నాయకత్వంలో నేటి బూర్జువా, భూస్వామ్య ప్రభుత్వాన్ని తొలగించి, కార్మిక-కర్షక పునాదిగా యేర్పడాలి. ఇది మాత్రమే సత్వరం భూస్వామ్యవ్యతిరేక మౌలిక కర్త

---

1. సి. పి. యం. ప్రోగ్రాం 7వ కాంగ్రెసు ఆమోదించినది. పార్టీ 9వ కాంగ్రెసు, కార్యక్రమానికి సవరణలను ఆమోదించింది. పే 32.

2. అదే పే. 33.

వ్యాలను, విప్లవలక్ష్యాలను పరిపూర్తిచేసి, సోషలిజానికి మార్గాన్ని సుగమం చేస్తుంది. జనతా ప్రజాస్వామ్య ప్రభుత్వం ప్రధమదశలో చేబట్టవలసిన కర్తవ్యాలను కార్య క్రమము వివరించింది.

నంబూద్రిపాద్, మార్క్సిస్టుపార్టీ కార్యక్రమంలోని ప్రధానాంశాలను వివరించుటతో పాటు, భారత కమ్యూనిస్టుపార్టీ రూపొందించిన జాతీయ ప్రజాస్వామ్య సైద్ధాంతిక అవగాహనను తీవ్రంగా విమర్శించారు.[1]. ప్రధాన విమర్శశాంశాలను చూద్దాము. సి. పి. ఐ చెప్పే "జాతీయ ప్రజాస్వామ్యం" సి. పి. యం చెప్పే "జనతా ప్రజాస్వామం" రెండింటి భేధాలను గురించి నంబూద్రిపాద్, సి పి. ఐ. చిత్తు కార్య క్రమాన్ని రూపొందించుతు "1957లోని కార్యక్రమంలో జనతా ప్రజాస్వామ్యంను గురించిన దానికి భిన్నంగా "జాతీయ ప్రజాస్వామ్యాన్ని గురించి వివరించారని, పేర్కొన్నారు. మన 1951 కార్యక్రమపత్రంలోని సూచించిన వర్గపొందిక, జనతా ప్రజాస్వామ్య నిర్వచనం యిప్పుడు (1964)లో జాతీయ ప్రజాస్వామ్య విషయమై చెప్పినవి వొకేవిధంగా వున్నవి. జనతా ప్రజాస్వామ్య కూటమిలో దేశభక్త వర్గాలన్నీ కార్మికవర్గ నాయకత్వంలో వుంటవని స్పష్టంగా చెప్పుటలోనే భేధమున్నది. జాతీయ ప్రజాస్వామ్యంలో దేశభక్తవర్గాల కూటమి నాయకత్వం భాగస్వాములుగ జాతీయ బూర్జువావర్గం కార్మికవర్గం రెండింటిని పేర్కొనట జరిగింది." అని వ్రాశారు. దీనినే యింకా వివరించుతూ యీ దృక్పధంలో బూర్జువావర్గం, కార్మికవర్గం భాగస్వాములగ పేర్కొనుట, దేశభక్త వర్గాలన్నీ సంయుక్త పోరాటాలలో లభించిన రాజ్యాధికారం విషయం మాత్రమే ప్రస్తావించ లేదు, సామ్రాజ్యవాదాన్ని, ఫ్యూడలిజాన్ని, గుత్తపెట్టుబడిదారి వర్గాలతో సంయుక్తంగా పోరాడిన దేశభక్త వర్గాలన్నీ ఆ విధంగా రాజ్యాధికారంలో భాగస్వాములగుట, సామ్రాజ్యవాద వ్యతిరేక ఫ్యూడలు వ్యతిరేక గుత్తపెట్టుబడిదారీ వ్యతిరేక పోరాట సంఘటన దృక్పధంలోనే దేశభక్త వర్గాల ప్రభుత్వం అనేది యిమిడి వుంది. దేశభక్త వర్గాల సంఘటనలోని నాయకత్వం కార్మికవర్గం, బూర్జువావర్గం సంయుక్తంగా నిర్వహించుటను వ్యక్తీకరించుట జరిగింది. ఇది మార్క్స్, ఎంజెల్సు, లెనిన్‌లు చెప్పిన వ్రాసిన దానిని ప్రజాస్వామ్య విప్లవంలో కార్మికవర్గ నాయకత్వపాత్ర విషయమై స్పష్టంచేసిన వాటిని తిరస్కరించుటయే అగుతుంది అంతేగాక 1960లో పర్కర్స్ కమ్యూనిస్టుపార్టీల ప్రకటన జాతీయప్రజాస్వామ్యంపై చేబట్టిన దృక్పధానికి భిన్నంగా వుంది, సంస్కరణవాదులు చెప్పే 1960 ప్రకటన ప్రాతిజధికకు భిన్నంగావుంది.[2]

1. నంబూద్రిపాద్, ఇ. యం. యస్. (1966) దిప్రోగ్రాం ఎక్స్‌ప్లేన్డ్ (ఆంగ్లంలో) పే. 75-81.

2. అదే. పేజీ 75-6.

అంతేగాక, స్వాతంత్ర్యానంతరం నిర్మించతల పెట్టిన సమాజనిర్మాణంయెట్టిది అనే దానిపై ఆధారపడి, బూర్జువావర్గం శ్రామికవర్గాల మధ్య గల వైరుధ్యానికి సంఘర్షణల తీరుతెన్నులు ఆధారపడి వుంటవని ఆ వైరుధ్యాలను వారు అనుసరించే విధానాల బట్టి వుంటుందని జాతీయప్రజాస్వామ్య నినాదాన్ని యిచ్చిన 81 కమ్యూనిస్టు వర్కర్స్ పార్టీల ప్రపంచ సమావేశం తెలిపింది.

దీనికి, యితర వర్గాలపై బూర్జువావర్గం కార్మికవర్గాల సంయుక్త నాయకత్వం వుండాలనే దానికి సంబంధం లేదు. అంతేగాక, కార్మికవర్గ, బూర్జువా రెండువర్గాల దృక్పథాల మధ్య జరిగే పోరాటం ఫలితమే విప్లవం యేమార్గంలో అభివృద్ధి చెందుతుందనే దానిని కూడ నిర్ణయిస్తుందని స్పష్టం చేసింది, ప్రజాస్వామ్య విప్లవ కర్తవ్యాలను అత్యధిక ప్రజాసామాన్యం సంపూర్తి చేయు విప్లవక్రమం, సోషలిస్టుదశకు పురోగమనాన్ని నిర్దేశించుతుందని కూడ స్పష్టం చేసారు. నంబూద్రిపాద్. మార్కిస్టు-లెనినిస్టులమని చెప్పుకొనే వొకవర్గం, కార్మికవర్గం, బూర్జువావర్గ సంయుక్త నాయకత్వాన్ని యితర వర్గాలపై నిర్మించాలంటూ, దానినే జాతీయ ప్రజాస్వామ్యంగా పేరు పెట్టిందని" తీవ్రంగా విమర్శించారు. అయితే పై సూత్రీకరణ సి. పి. ఐ. ముసాయిదా కార్యక్రమంలో మాత్రమేవుందని, బొంబే పార్టీ కాంగ్రెసు ఆమోదించబడిన పార్టీ కార్యక్రమంలో లేదని తమ వాదన సాగించ వచ్చు. వారు కొన్ని మార్పులు సవరణలు చేసి, తీర్మానాన్ని ఆమోదించారు. అని చెప్పుకొనవచ్చు. చేసిన మార్పులు 'దేశభక్త కూటమిలోని వివిధ వర్గాల పాత్రల విషయంలో యెట్టి మార్పు తీర్మానంలో వుదహరింపులేదు. తీర్మానం అంత్యరూపంలో యీ విధంగా వుంది. "ఈ వర్గ కూటమిలో కార్మికవర్గ పూర్తి నాయకత్వం యింకా యేర్పడదు, అయితే బూర్జువా వర్గపు యేకైక నాయకత్వమూ, యింకా కొనసాగదు. దీనర్థం మరో మాటలలో సంయుక్త నాయకత్వ అవగాహనను పునశ్చరణచేయుట కాదాయని నంబూద్రిపాద్ ప్రశ్నించారు. పై వివరణ చాలదనుకొంటే సంస్కరణ వాదుల యెడల దురభిప్రాయంతో అన్వాయమనుకొంటే, సి. పి. ఐ. తీర్మానంలోని యీక్రింది వాక్యాలు చూడవచ్చని ఉదహరించారు. "జాతీయ ప్రజాస్వామ్య సంఘటన ప్రభుత్వం, అది ప్రాతినిధ్యం వహించే వర్గ పొందిక కార్మిక, కర్షక ఐక్యతా యిరుసుపై ఆధారపడి, క్రమేణా కార్మికవర్గం ఆ కూటమిలో నాయకుడుగా రూపొందుతుంది, కారణం ఆ కూటమిలో కార్మికవర్గమే జాతీయ ప్రజాస్వామ్య సంఘటనకు రూపాన్నిచ్చి నిర్మించే చైతన్యం కలది." సి. పి. ఐ. రూపొందించిన విధానం యీ రకంగా వుంది.

"అటువంటి జాతీయ ప్రజాస్వామ్య సంఘటన నేడు యేర్పడలేదు, కారణం

ప్రజాస్వామ్య ప్రజలలోని ఒక భాగం పాలకవర్గ పార్టీయైన కాంగ్రెసును బలపరుస్తున్నది, యీ ప్రజాస్వామ్య ప్రజలలోని మరో భాగం పాలకపార్టీ ప్రజాస్వామ్య వ్యతిరేక విధానాలపై పోరాడుతున్నది. ఈ ప్రజాస్వామ్య ప్రజలలోని ప్రధాన చీలికను అధిగమించి ఐక్యతను నెలకొల్పుట ద్వారానే జాతీయప్రజాస్వామ్య సంఘటన వుద్భవించుతుంది. పై కార్యక్రమాన్ని ఆచరణలో పెట్టుటకు విధానాలలో తీవ్రమైన మార్పులు కొన్ని వచ్చి, ప్రభుత్వాన్ని యేర్పరచుటకు, అభివృద్ధి నిరోధక శక్తులను వేరు పరచుటకై, పార్లమెంటరీ పార్లమెంటేతర, జాతీయ ప్రజామహోద్యమం దేశమంతటా విస్తరించే పోరాటాలలో జాతీయ ప్రజాస్వామ్య ఐక్యసంఘటన వుద్భవించి విస్తరించి, బలపడుతుంది. "దీనిపై నంబూద్రిపాద్ యీ విధంగా వ్యాఖ్యానించారు. "పోరాటాలక్రమంలో యేర్పడే సంఘటనకై జరిపే పోరాటాల దాడి, భూస్వామ్య, బూర్జువావర్గ ప్రభుత్వంపై కేంద్రీకరించబడక, లేక పాలకవర్గ కూటమిపై కూడ కేంద్రీకరించబడక "అభివృద్ధి నిరోధకశక్తులు" అని చెప్పబడేవారిపై కేంద్రీకరించబడుతుంది. పోరాట లక్ష్యం, వర్గ విధానాలను అనుసరించే జాతీయ బూర్జువావర్గాన్ని వోడించుటగాదు. వారు అనుసరించే విధానాలలో ప్రభుత్వ పొందికలో మౌలిక మార్పులు తెచ్చుట"గా వుందని తీవ్రంగా విమర్శించారు.

"ప్రభుత్వం, పాలకపార్టీలలో లోపమేమీలేదనే అవగాహన స్పష్టం. వారిదారిని వారిని వదలివేస్తే వారు మౌలిక అభివృద్ధికరమైనవి కాకపోయినా జాతీయ ప్రజాస్వామ్య విధానాలను అనుసరించుతారు పాలకవర్గపార్టీపై "అభివృద్ధి నిరోధక శక్తులు" వొత్తిడి తీసుకొస్తున్నవి యిదే ప్రమాదకరమైనది. కాన యీ శక్తులపై పోరాడి వేరుపరచి, వోడించాలి." అని సి.పి ఐ. చిత్తుకార్యక్రమం స్పష్టం చేసింది.

ఒక ప్రశ్న నేరుగా వేద్దాము ప్రజాస్వామ్యశక్తులు వొక్క "మితవాద అభివృద్ధి నిరోధకశక్తులపైనేనా పోరాడవలసింది, అంటే పాలకపార్టీలోపలా, బయటా వున్న శక్తులను మాత్రమేనా లేక పాలకపార్టీపై పోరాడాలా లేదా? ఎవరి పాలనా విధానాలు దేశాన్ని అధోగతిలోనికి తెస్తున్నవి. ప్రభుత్వం, పాలకపార్టీ విధానాలు కావా? లేక స్వతంత్ర జనసంఘ పార్టీల విధానాలా? లేక లోపలేవున్న మురార్జీ, పాటిల్‌లవిధానాలా? ఇదే కీలక ప్రశ్న దీనినే సంస్కరణవాదులు దాటవేస్తున్నారు. అందుకే వారు "అభివృద్ధి నిరోధక మితవాదశక్తులు" అని వాడుతున్నారు. విధానాలలో ప్రభుత్వ నిర్మాణంలో మౌలికమార్పులు తెచ్చుటకు ప్రయత్నించుట అంటున్నారు. నెహ్రూ నాయకత్వంలో యేర్పడిన ప్రభుత్వం పెట్టుబడిదారి పంథాలో అభివృద్ధిని సాగించాలని నిర్ణయించుటగాదా "గుత్త పెట్టుబడిదారి వర్గాలు యేర్పడి బలపడుటకుదారి తీసింది వారు భూస్వామ్య వర్గాలతో కూటమిగా యేర్పడి విదేశ సామ్రాజ్యవాద గుత్త పెట్టుబడితో పొత్తునెరపుతు భారతదేశ ఆర్థికాభివృద్ధికి నిరోధకులై ప్రమాదాన్ని తెచ్చిపెట్టుతున్నారు. అయినా, సంస్కరణవాదులు ఈ పంథానను

సరించే పాలకపార్టీకి వ్యతిరేకంగా కాదు, అందులోని బయటవున్న, "మితవాద అభివృద్ధి నిరోధక శక్తులపై" పోరాటాలని మనకు చెప్పుతారని నంబూద్రిపాద్ తీవ్రంగా విమర్శించారు.

"మనకు పాలకవర్గాలలోని అత్యంత అభివృద్ధి నిరోధక శక్తులపైదాడిని కేంద్రీకరించుటకు మనకు వివాదంలేదు, అంతేగాక అది మార్క్సిస్టు-లెనినిస్టు వ్యూహం, ఎత్తుగడలను అనుసరించే వుంది కాన అర్థం చేసుకొనగలము, అంచేతే పాలకపార్టీలోని మొరార్జీదేశాయి, పాటిల్ వర్గాలను, బయటవున్న స్వతంత్రపార్టీ, జనసంఘపార్టీలోను, అభివృద్ధి నిరోధకులతో పోరాడి, వేరుపరచి, వారిని వోడించ వలసి వుంది ఆయితే మన వివాదం, మితవాద అభివృద్ధి నిరోధక శక్తులను వేరుపరచి వోడించుటకు అనుసరించే పంథాపై వోడించి పాలకపార్టీలోని "అభ్యుదయకర జాతీయ పంథాలో అభివృద్ధి సాగించాలనే శక్తుల పాలనను పెంపొందించుతు బలపరచాలనే వైఖరి నవలంభించే సంస్కరణవాదంతో మనం విభేధించేది.

మన సంస్కరణవాదులను కొన్ని ప్రశ్నలు అడగదలచాము పాలకవర్గపార్టీ అవలంభించే పంథా మొత్తాన్ని క్రమంగా నిర్ద్వందంగా విమర్శించి ఎండగడ్తే పోరాటాలలో ప్రజలను సమీకరించివోడించుట కార్మికవర్గఅగ్రగామిపార్టీలోని ప్రధాన సైద్ధాంతిక రాజకీయ కర్తవ్యంకాదా? అవును అందులో పాలకపార్టీలోని అభ్యుదయ వర్గాలు వుంటవి,

"ప్రజలు తమ సమస్యలను పరిష్కరించుకొనుట అత్యధిక ప్రజాసామాన్యానికి, పెట్టుబడిదారి పంథా అనుసరించుటలో మౌలికవైరుధ్యం గలదని పోరాడవలసి వుంటుందని అంగీకరిస్తారా?

"పాలకపార్టీ అనుసరించే పెట్టుబడిదారి విధానాభివృద్ధిపంథా ఫలితంగానే, జనసంఘ బయటా, మొరార్జీదేశాయ్, పాటిల్‌లు లోపల అనుసరించే అభివృద్ధి నిరోధక విధానాలకు ప్రోద్బలం లభింపతుందని ప్రజలకు వివరించే కర్తవ్యాన్ని తమంతట తామే చేబట్టుతారా లేదా?

"ఈ పెట్టుబడిదారి పంథాలో అభివృద్ధిని ప్రజలు నిరాకరించాలని అవసరమని అనుకొంటారాలేదా? ఈ పంథా దేశాన్ని అధోగతికి పాల్జేస్తుందని విశ్వసించుతారా లేదా? అని ప్రశ్నించారు?

"ఈ నిరంతర పోరాటం జాతి అనుసరించవలసిన పంథాపై, కార్మిక, బూర్జువా వర్గాలమధ్య జరుగుతుందని ప్రపంచ కమ్యూనిస్టుపార్టీల 1960 ప్రకటన విశదపరచిందని అది ఆ సమావేశంలో రూపొందించిన జాతీయ ప్రజాస్వామ్య సిద్ధాంతంలో భాగమని యింతకుముందే ఈ వ్యాసంలో వివరించుట చూసారు. సంస్కరణవాదులు వారు చెప్పినట్లు ఈ లక్ష్యాలకు కట్టుబడి వుండేటట్లయితే, మిత

వాద అభివృద్ధి నిరోధకులను వేరువేసి, వోడించుట పెట్టుబడిదారి అభివృద్ధిపంథాను ఎండగట్టి జాతీయ బూర్జువా వర్గాన్ని మొత్తంగా పాలకపార్టీని వోడించుటనుండి విడదీయ జాలము.

"వారు ఈ కర్తవ్యాన్ని తిరస్కరించుటకు కప్పి పెట్టుకొనుటకు జాతీయ ప్రజాస్వామ్యాన్ని ప్రస్తావించుతారు. అది వొక్క కార్మికవర్గనాయకత్వంలోగాని లేక బూర్జువా వర్గ ప్రత్యేక నాయకత్వంలోగాని వుందంటూ పెట్టుబడిదారేతర మార్గాభివృద్ధికి అది అవసరమంటున్నారు వారి ప్రధాన వర్గపొత్తు, జాతీయ ప్రజాస్వామ్య వైఖరికి గౌరవప్రదమైన ముసుగువేయుటకు తోడ్పడుతుందని[1]" తీవ్రంగా విమర్శించారు.

సంగ్రహంగా "మెజారిటిపార్టీ" మైనారిటి పార్టీల కాంగ్రెసులు బాంబే, కలకత్తాలలో రూపొందించిన తీర్మానాలలోని సారూప్యతలును లేక భావజాలంలోని ఐక్యతను భిన్నత్వాలను లేక బావజాలంలోని అనైక్యతాంశాలను వ్యూహాత్మకంగా, ఎత్తుగడలరీత్యా వాటి ప్రాధాన్యతల క్రమాన్ని చూద్దాము. తదనంతరం రెండు కాంగ్రెసుల కార్యక్రమాలను సైద్ధాంతిక నాయకులిద్దరు యిచ్చిన వివరణలు వ్యాఖ్యలు వొండొరులు ప్రత్యర్థుల కార్యక్రమాలపై చేసిన ప్రగాఢ విమర్శనలు తదనంతర కాలంలో వాటి వాస్తవికతలు పరిణామాలలో ఎంతవరకు సరియైనవిగా వెల్లడైనది తెలుసుకొన్నపుడే, కాలం ధృవీకరించిన సత్యానికి యెంత చేరువగావున్నవో చూడగలము.

సి.పి.ఐ. తీర్మానం ప్రజాస్వామ్య విప్లవ కర్తవ్యాలును పరిపూర్తి చేయుట నేటి కర్తవ్యంగా పేర్కొని, అందుకై కార్మికవర్గం ధనిక రైతుతో సహా విస్తృత రైతాంగం, వ్యవసాయకూలీలు, నగర గ్రామీణ మేధావి వర్గాలు, నగర-గ్రామీణ నిరుద్యోగులు తదితర బడుగువర్గాలు, వీరికితోడు గుత్తేతర బూర్జువావర్గాలు, యీ కర్తవ్య నిర్వహణలో ఆశక్తి కలిగి వున్నందున ఆ వర్గాలన్నిటిని జాతీయ ప్రజాస్వామ్య సంఘటనలో కార్మిక కర్షక ఐక్యత పునాది ఇరుసుగా సమీకరించి, పోరాడి పెట్టుబడిదారి ఆర్థికాభివృద్ధి పంథాను త్రిప్పికొట్టి యీ దశలో పెట్టుబడిదారి విధానాన్ని పూర్తిగ నాశనంచేయుటగాక. ప్రజాస్వామ్య కర్తవ్యాలైన దేశ ఆర్థిక విధానంలో విదేశ గుత్త పెట్టుబడి వర్గాల ఆధిపత్యాన్ని తొలగించి, స్వతంత్ర ప్రభుత్వ పెట్టుబడి రంగంలో స్వశక్తిపై ఆధారపడిన పారిశ్రామికాభివృద్ధి విధానాలను ప్రజాస్వామ్య పద్ధతులలో నిర్మించి, విస్తరణచేసి జాతీయ ఆర్థిక విధానాన్ని బలోపేతం చేస్తుందని వివరించింది. దీని అమలుకు సాధనం జాతీయ ప్రజాస్వామ్య సంఘటన విజయానంతరం జాతీయ ప్రజాస్వామ్య సంఘటన ప్రభుత్వం యేర్పాటు చేయుట,

---

1. నంబూద్రిపాద్, ఇ.యం.యస్ (1966) ప్రోగ్రాం ఎక్స్‌ప్లేన్డ్. పే. 78-81.

జాతీయ ప్రజాస్వామ్య పంథాగా నిర్వచించింది. జాతీయ ఐక్యసంఘటనా ప్రభుత్వం అన్ని వర్గాల ప్రభుత్వం సామ్రాజ్యవాద ప్రయోజనాలను ఫ్యూడలు అవశేషాలను రూపుమాపే ప్రభుత్వం కార్మికవర్గమే చొరవతో కార్మిక, కర్షక ఐక్యత పునాదిగా యేర్పడిన జాతీయ ప్రజాస్వామ్య ఐక్యసంఘటనా క్రమంలో కార్మికవర్గమే నాయకత్వ పాత్ర వహించుతుంది. అంతేగాక, జాతీయ ప్రజాస్వామ్య సంఘటనా ప్రభుత్వంలో నాయకత్వం అందులో పాల్గొనే అన్నివర్గాల సంయుక్తంగా ఆధిపత్యం వహించుతవి.

మొహిత్ సేన్ భారతకమ్యూనిస్టుపార్టీ కార్యక్రమాన్ని వివరించుతు, అంతర్జాతీయ కమ్యూనిస్టు వుద్యమంలో చర్చల అనంతరం సి.పి.ఐ. భారతదేశంలో తగిన పరిణామరూపం, జాతీయ ప్రజాస్వామ్య ప్రభుత్వమని అది పెట్టుబడిదారేతర మార్గాన్ని చేబట్టుతుందని, భారతదేశంలో గుత్తేతర బూర్జువావర్గం దాని రాజకీయ ప్రతినిధులలో అత్యధికభాగం నెహ్రూనాయకత్వంలో సామ్రాజ్యవాద, ఫ్యూడలు వ్యతిరేక విప్లవంలో అభిలాష కలిగివున్నారని, ఈ శక్తులన్నిటిని ఐక్యపరచి జాతీయ ప్రజాస్వామ్య విప్లవ కర్తవ్యాలన్నిటిని పూర్తిచేయాలని దానికి జాతీయ ప్రజాస్వామ్య సంఘటన అన్ని వర్గాలతో యేర్పరచాలని సంఘటన ప్రభుత్వం అందుకు మంచి సాధనమని తెలిపారు. అంతేగాక గుత్తేతర బూర్జువావర్గం జాతీయ ప్రజాస్వామ్య సంఘటన భాగస్వామి అగుతుందని అదే విధంగా సంఘటన ప్రభుత్వంలో, కార్మికవర్గనాయకత్వంలో భాగస్వామియై సామ్రాజ్యవాద వ్యతిరేక ఫ్యూడలు వ్యతిరేక ప్రజాస్వామ్య కర్తవ్యాలను పరిపూర్తి చేయుటలో తోడ్పడుతుందని సిద్ధాంతీకరించారు.

సి పి యం. భారతదేశంలో పెట్టుబడిదారి విధాన అభివృద్ధిదశను దాటవేసి, పెట్టుబడిదారేతర పంథాలో ఆర్థికాభివృద్ధి గావించి సోషలిజంలోని పరివర్తన మార్గాన్ని సుగమం చేయు మార్గాలకు తలుపులు మూయబడినవనే వైఖరి చేబట్టింది. భారతదేశం, వలస, అర్ధవలస దేశాలతో పోల్చిన, పెట్టుబడిదారి విధానం అభివృద్ధి చెందిన దేశంగా పరిగణించి, జాతీయోద్యమానికి నాయకత్వం వహించిన బడాబూర్జువా వర్గం 1947లో స్వతంత్ర్యం వచ్చిన నాటినుండి, అధికారంలో వుండి తన ఆర్థిక, రాజకీయ బలాధిక్యతను యెంతో బలపరచుకొంది. ఇది వొకవైపు సామ్రాజ్యవాద గుత్తపెట్టుబడి వర్గాలతో పొత్తుద్వారా మరోవైపు ప్రజాసామాన్య ప్రయోజనాలపై దాడి చేసి తన వర్గాన్ని బలపరచుకొన్నదనేది సి. పి. యం విశ్లేషణ సారాంశం అంచేత పెట్టుబడిదారేతర మార్గంలో అభివృద్ధి, జాతీయ ప్రజాస్వామ్య ప్రభుత్వం యేర్పరచాలనే లక్ష్యం వాస్తవ పరిస్థితిని ప్రతిబింబించదు. సామ్రాజ్యవాద గుత్తపెట్టుబడి, వ్యవసాయంలో ఫ్యూడలిజాన్ని పెకలించివేయుట విదేశ సామ్రాజ్యవాద

పెట్టుబడితో గుత్త సంబంధాలు, భూస్వాములు వర్గాలతో మరోవైపు సంబంధాలను కలిగిన బూర్జువావర్గాలు భాగస్వాములైన ప్రభుత్వాన్ని కూలద్రోయకుండా చేయగలుగుట అసాధ్యం అనేది సి. పి. యం. విశ్లేషణ. అంతేగాక, సోషలిస్టు సమాజస్థాపన ధ్యేయంగా మార్క్సిస్టు కమ్యూనిస్టుపార్టీ, కార్మికవర్గ సైద్ధాంతిక, రాజకీయ పరిపక్వత, నిర్మాణ బలాన్ని పరిగణించి సామ్రాజ్యవాద భూస్వాములు వ్యతిరేక అన్నిశక్తులను కార్మికవర్గనాయకత్వంలో జనతా ప్రజాస్వామ్య సంఘటన ప్రభుత్వం నేటి కర్తవ్యంగా పేర్కొంది. ఈ విధంగా బూర్జువా భూస్వామ్య ప్రభుత్వాన్ని తొలగించి, కార్మిక, కర్షక ఐక్యత పునాదిగా యేర్పడే ప్రభుత్వమే భూస్వాములు, సామ్రాజ్యవాద వ్యతిరేక కర్తవ్యాలను, విప్లవ లక్ష్యాలను పరిపూర్తిచేసి సత్వరం సోషలిజానికి మార్గాన్ని సుగమం చేస్తుందని కార్యక్రమం స్పష్టం చేసింది.

జాతీయ ప్రజాస్వామ్య సంఘటన ప్రభుత్వంలో దేశభక్త వర్గాలకూటమి నాయకత్వంలో బూర్జువావర్గం, కార్మికవర్గం, రెండిటిని భాగస్వాములగ సి. పి. ఐ. కార్యక్రమం నాయకుల వివరణలు పేర్కొనుటను, నంబూద్రిపాద్ తీవ్రంగా విమర్శించి, సామ్రాజ్యవాద వ్యతిరేక భూస్వాములు వ్యతిరేక గుత్త పెట్టుబడిదారి వ్యతిరేక పోరాటంలో సంయుక్తంగా పాల్గొన్న వర్గాలన్నీ రాజ్యాధికారంలో భాగస్వాములనుట వారి దృక్పథంలోనే యిమిడి వుందన్నారు. దేశభక్త వర్గాల సంఘటనకు కార్మికవర్గం బూర్జువావర్గం సంయుక్తంగా నాయకత్వం వహించాలనుట ప్రజాస్వామ్య విప్లవంలో కార్మికవర్గం నాయకత్వపాత్ర వహించాలని మార్క్సు ఎంగెల్సులు, లెనిన్‌లు స్పష్టంచేసిన దానిని తిరస్కరించుటయే అగుతుందని నంబూద్రిపాద్ విమర్శించారు. అంతేగాక, కార్మికవర్గ బూర్జువావర్గాల రెండు దృక్పథాల మధ్య జరిగేపోరాట ఫలితమే విప్లవదశ సోషలిస్టు మార్గంలో పురోగమనాన్ని నిర్దేశించుతుంది. కాన కార్మికవర్గం బూర్జువావర్గం సంయుక్తంగా నాయకత్వం వహించే ప్రభుత్వం సోషలిస్టు పంథాలో పురోగమనాన్ని, జయప్రదంగా కొనసాగించజాలదని, నంబూద్రిపాద్, సి. పి. యం ల అవగాహన యనేది స్పష్టం.

మూడు దశాబ్దాలు సి. పి. ఐ, సి. పి. యం.లు జాతీయ ప్రజాస్వామ్య సంఘటననుగాని జనతా ప్రజాస్వామ్యసంఘటననుగాని అఖిల భారతస్థాయిలో చట్టబద్ధపార్లమెంటరీ పోరాటాలనుగాని పార్లమెంటేతర మార్గాలలో ప్రజా పోరాటాలను సాగించుటకైనా కనీసం తాత్కాలిక ఐక్యసంఘటనలను యేర్పరచజాలక పోయారు. రెండు దృక్పథాలవారులు కార్మిక, కర్షక ఐక్యత "పునాది" "ఇరుసు" అని చెప్పుతూనే వున్నారు. ఇది పోరాటాల ద్వారానేయేర్పడుతుందని సిద్ధాంతీకరించారు. ఇది యిరువుర ప్రచారనినాదంగానే యిచ్చారు. గాని ఆచరణ నినాదంగా చేసిన ఘటనలు దాదాపు శూన్యం, కార్మిక వర్గం అతివాదుల ఆధ్వర్యంలోని మూడు నాలుగు అఖిల

భారత కార్మిక సంఘాలలోను, బూర్జువావర్గం ఆధ్వర్యంలో రెండు, మూడు కార్మిక సంఘాలలోను రాష్ట్రాలలో అనేక ప్రాంతీయ పార్టీల అనుబంధ కార్మికసంఘాలుగ విపరీతంగా చీలికలకు లోనై, అనైక్యతకు ప్రతీకగా వుంది రైతాంగం కూడ అదే విధంగా రెండు మూడు సంఘాలలో చీలిపోయి అనైక్యత లోనైంది. ఒక్కమాటలో చెప్పాలంటే అఖిలభారత ఆర్థిక రాజకీయపోరాటాలకు చోధకశక్తి కావలసిన కార్మిక వర్గం, రైతాంగం అఖిలభారత పోరాటాలను ఐక్యంగా సాగించగల స్థితిలో లేదు. అఖిల భారతట్రేడు యూనియను సమన్వయ కమిటీని 1980 దశకంలో నామ మాత్రంగా యేర్పాటు చేయుట ఆర్థిక పోరాటాలను నామమాత్రంగా సాగించటం జరిగింది. భారత రాజకీయ పరిణామలలో కార్మికవర్గ అఖిల భారత రాజకీయ పోరాటాన్ని ఐక్యంగా జరుపగల పరిస్థితి లేదు. ఈ వాస్తవికతను గుర్తించుట మాత్రమే చాలదు, కమ్యూనిస్టు వుద్యమాలు కార్మికవర్గ ఐక్యతదారితీసే కనీస ప్రాధమిక చర్యలను పై నుండి, క్రింది నుండి తీసుకొనవలసిన ఆవశ్యకత వేరుగ చెప్పనవసరం లేదు.

పెట్టుబడి దారేతర పంధా సైద్ధాంతిక సమస్య

మానవసమాజపు ఆర్థికాభివృద్ధి వొక సరళరేఖవలె ఋజుమార్గంలో జరుగక వివిధ దేశాలలో భిన్నమార్గాలలో ఎటు పోటానికి గురియగుటను చరిత్ర స్పష్టం, చేసింది పరిణామక్రమంలో రాతియుగపు మానవుడు విల్లంబులతో అవతరించుటతో జీవన విధానంలో విప్లవకర మార్పులు వచ్చాయి. అదే విధంగా ఇనుపకర్రు నాగలి ప్రధాన వుత్పత్తి సాధనం రక్షణకు డాలు-కత్తి రూపొందించుకొని అశ్వారూఢుడు అగుటతో బానిస సమాజం యేర్పడింది. ఆవిరి యంత్రాల ఆగమనంతో వుత్పత్తి యినుమడించి బానిసలశ్రమశక్తి చోపిడితో అవసరాలకుమించిన వస్తూత్పత్తి అనేక రెట్లు పెరిగి మార్కెట్టులకై విదేశ దండయాత్రలలో వలససామ్రాజ్యాలు, బానిస దేశాలు బానిసలు వెలిసారు. ఈ విధంగా యేర్పడిన వ్యూడలు సమాజం పరిశ్రమల అభివృద్ధితో కార్మికవర్గాన్ని రూపొందించుకొంటు పెట్టుబడిదారి విధానం గుత్త పెట్టుబడిదారి విధాన అభివృద్ధి చెందుటకు దగ్గరి దగ్గరిగా రెండు శతాబ్దాలు పట్టింది. అంటే వ్యూడలు సమాజం అభివృద్ధి చెందిన గుత్త పెట్టుబడిదారి సమాజంగా అభివృద్ధి చెందుట రెండు శతాబ్దాలు పైగా పట్టింది వెనుకబడిన దేశాలలో బానిసత్వం, వ్యూడలిజం యింకా కొనసాగుతూనే వుంది. సమాజంలో సంక్షోభాలు, తిరుగుబాటులు, విప్లవాలతో సంపద సమాజపరం జేసి, మానవాభ్యుదయాన్ని బహుముఖంగా చేయు సోషలిస్టు సమాజం 1920 దశకంలో అవతరించి విస్తరించి సగం మానవజాతితో ఆశలను వెలిగించి, అంతర్గత వైరుధ్యాలకు గురై యూరపులో తాత్కాలికంగా కనుమరుగైనా తూర్పున ఆశాజ్యోతిగా కొనసాగుతున్నది. సమాజ పరిణామం

వరళ రేఖలో వుండదని సమాజం ఒకదశనుండి మరొక దశకు పరివర్తన చెందుటకు శతాబ్దాలు పట్టవచ్చు విప్లవాలు ఆక్రమాన్ని త్వరితం మాత్రమే చేయగలవు.

1. సోషలిస్టు విధానం అవతరించిన తరువాతనే పెట్టుబడిదారి పూర్వసమాజ సంబంధాలుగల దేశాలలో మాత్రమే పెట్టుబడిదారేతర విధానాభివృద్ధి సాధ్యమని చరిత్ర రుజువు చేసింది.

లెనిన్ మార్క్సిజాన్ని సృజనాత్మకంగా, వెనుకబడినదేశాల ప్రజలు పెట్టుబడిదారి విధానఆర్థికాభివృద్ధి దశకులోనుకాకుండా నూతన చారిత్రిక పరిస్థితులలో సోషలిజంలోనికి పరివర్తనమునకు గల అవకాశాలను అధ్యయనం చేసి సైద్ధాంతిక ప్రతిపాదనలను రూపొందించారు. రష్యన్ 2వ, పార్టీ కాంగ్రెసులో లెనిన్ పెట్టుబడిదారి మార్గంలో అభివృద్ధిని సాధించుట వెనుకబడినదేశాలకు తప్పనిసరియా అని ప్రశ్నించి, కాదని సమాధానం చెప్పారు. అభివృద్ధి చెందవి దేశాల ప్రభుత్వాలు, కార్మికవర్గాల సహాయాన్ని పొంది పెట్టుబడిదారి విధానదశను "కప్పదాటు"గ దాటి, సోషలిజానికి పురోగమించగలవన్నారు.

ఆర్థికాభివృద్ధి యేదశలోవున్నా ఉత్పత్తిశక్తులు, శ్రామికోత్పత్తి శక్తియేదశలేక స్థాయిలోవున్నాలేకఅత్యున్నతదశలోవున్నా ఒక సమాజవ్యవస్థమరో సమాజవ్యవస్థగా పరివర్తనచెందుటకు నిర్ణయాత్మక పరిమితులను విధించజాలవు. రాజకీయఅధికారాన్ని విప్లవమార్గంలో స్వీకరించిన వ్యవస్థ మార్పులకు తగిన ప్రాథమిక అవసరాలను విప్లవ పద్ధతులలో రూపొందించవచ్చు నూతన రాజకీయ వ్యవస్థకు తగిన స్థాయిలో ప్రాథమికాంశాలను రూపొందించగలదు. అంటే జాతీయ ప్రజాస్వామ్య విప్లవం, సోషలిస్టు విప్లవంగా దాని పరివర్తన పథము వలన సామ్రాజ్యవాదంనుండి విముక్తి పొందిన దేశాలు, పెట్టుబడిదారి విధాన ఆర్థికాభివృద్ధి పంథాను విడనాడి "కప్పదాటుగ" సోషలిజంలోనికి పరివర్తన చెందు మార్గాన్ని సుగమం చేయగలదు.

లెనిన్ వెనుకబడినదేశాల ప్రజల పరిస్థితులకు కార్మిక ప్రభుత్వ సూత్రాలను అన్వయించు విషయమై పెక్కుసారులు ప్రస్తావించారు. "సోషలిస్టు విప్లవ అవకాశాలు" అన్న నివేదికపై ఎ సుల్తాన్‌జాడె సోవియట్లు నిర్మాణాలను కమ్యూనిస్టు పార్టీని తూర్పు వలసదేశాల రైతాంగస్థాయికి తగిన విధంగా చేయాలన్నారు. ఇది మౌలిక సమస్య అధ్యయనంచేసి నిర్దిష్ట సమాధానాలు పొందవలసినది" అని వ్యాఖ్యానించారు.

ఒక్కమాటలో పెట్టుబడిదారేతర ఆర్థికాభివృద్ధిపంథాను మొట్టమొదట రూపొందించినది మార్క్స్, ఎంజెల్స్‌లు, దానిని సృజనాత్మకంగా విస్తృతపరచింది లెనిన్. సామాజిక వ్యవస్థ పరివర్తనలో వొక రూపంగా సోషలిజం కానిది యింకా యేమాత్రం పెట్టుబడిదారి విధాన సమగ్రరూపంకానిదానిని సమాలోచించాడు

సోషలిజంవైపు పురోగమన మార్గంలో పెద్ద ముందడుగుగా వూహించారు. సోషలిజానికి పరిక్వం చెందని దేశాలకు పెట్టుబడిదారీ విధానాన్ని "కప్పదాటుగ" దాటి పురోగమించుటగానెంచారు. అంచేత పెట్టుబడిదారి ఆర్థికాభివృద్ధి విధానానికి సోషలిస్టు ఆర్థికాభివృద్ధి విధానానికి మధ్యేమార్గం అనుసరించే మూడో పంథాకాదని స్పష్టం చేశారు. వెంటనే సోషలిజాన్ని ఎజెండాలో చేర్చకపోయినా, సోషలిస్టు పంథాలో పయనించుతుంది పెట్టుబడిదారేతర ఆర్థికాభివృద్ధిపంథా పరిణామం చెందే సామాజిక వ్యవస్థ సోషలిజ వైపు పురోగమించుటకు తగిన పరిస్థితులను రూపొందించుతుంది. నేటి కమ్యూనిస్టు సాహిత్యంలో 1990 దశకం వరకు సోషలిజం దృక్పథంలోని దేశాలుగ పేర్కొన్నారు. సోవియట్ యూనియన్ 24వ, కమ్యూనిస్టు కాంగ్రెసులో సుదీర్ఘకాలంలో సోషలిస్టు సమాజాన్ని నిర్మించే పెట్టుబడిదారేతర ఆర్థికాభివృద్ధి పంథాగా వొక్కి చెప్పారు.

పెట్టుబడి దారేతర ఆర్థికాభివృద్ధి పంథా దృక్పథం విప్లవ ప్రజాస్వామ్యంతో రక్తసంబంధం కలిగివుంది. విప్లవప్రజాస్వామ్య ప్రభుత్వపరిణామక్రమంలో అన్ని సాంప్రదాయ దోపిడులను రద్దు చేస్తుంది. విప్లవ మార్గంలో అన్ని సమగ్ర పరిపూర్ణ ప్రజాస్వామాన్ని ప్రవేశపెట్టుటకు ప్రయత్నిస్తుంది. మనం 20వ శతాబ్దంలో సోషలిజం వైపు పెట్టుబడిదారి విధానదశనుండి పురోగమించాలి విప్లవ ప్రజాస్వామ్యాన్ని వర్గ దృక్పథంలో కార్మికవర్గ సంయుక్త కార్యాచరణగా లెనిన్ నిర్వచించారు.

2. తృతీయ ప్రపంచ దేశాలలో సోషలిస్టు దృక్పథాన్ని అనుసరించుతున్న సిరియా, ఈజిప్టు, అల్జీరియా, టాన్జానియాలలో 10 మిలియనుల చదరపు కిలోమీటర్ల విస్తీర్ణంలో 100మిలియనుల ప్రజలు పెట్టుబడిదారేతర ఆర్థికాభివృద్ధి పంథాను చేబట్టారు ప్రపంచంలో యీదేశాలన్నీ చాలవరకు పెట్టుబడిదారిపూర్వ ఆర్థిక విధానదశలో అంటే ప్యూడలు వ్యుత్పత్తి సంబంధాల ఆధిక్యతలో వొక నిర్దిష్ట ప్రాంతాలలో వున్నవి రాజకీయంగా పెట్టుబడిదారి విధానాన్ని త్రోసిపుచ్చిన విప్లవ ప్రజాస్వామ్య శక్తులు అధికారంలో వున్నవి, దోపిడీలేని సమాజాన్ని నిర్మించ ప్రయత్నిస్తున్నవి. ఈ దేశాలలో నేటి సామాజిక ఆర్థికాభివృద్ధిదశలో రైతాంగం నగర బస్తీ పెట్టీ బూర్జువా వర్గాలు సంయుక్తంగా మిగతావర్గాలపై ఆధిక్యత కలిగి వున్నవి కార్మికవర్గం సంఖ్యలో చాలాచిన్నది, రాజకీయ ఘటనలు పరిస్థితులలో తమ ప్రభావాన్ని వునికిని సమర్ధవంతంగా శక్తివంతంగా కలుగజేసుకొన గలిగిన శక్తివి కలిగిలేవు, ఈ దేశాలలో మార్పుచెందే కాలంలోవున్న తాత్కాలిక ప్రభుత్వాలు పెటీ బూర్జువా ప్రాతినిధ్యమూగల విప్లవ ప్రజాస్వామ్య నియంతృత్వ లక్షణాలను కలిగి వున్నవి. ఈ ప్రభుత్వాలలోని విప్లవ ప్రజాస్వామ్యవాదులు పెటీ

బూర్జువాలలోని అతివాదులు, పెటీ బూర్జువాలలో దోపిడిని చేబట్టని వర్గాలకు ప్రాతినిధ్యం కలిగించుతారు. అంచేతనే విప్లవ ప్రజాస్వామ్యవాదులు రాజకీయాలలో విస్తృతశ్రామిక వర్గాలకు ప్రాతినిధ్యం వహించగల సామర్థ్యం కలిగివున్నారు. కాని, ఈ దేశాలలోని విప్లవ ప్రజాస్వామ్యవాదుల రాజకీయాలలోగల బలహీనతలను త్రోసి బుచ్చరాదు. ఈ నాయకత్వాలలో వూగిసలాట ప్రత్యేకతను కలిగివుంటుంది. పెటీ ఆస్తిపరుల దృక్పథంలో ఆచి, తూచి అడుగులువేయుట, సంక్షోభరాజకీయాలలో తడబడుట వూగిసలాట సహజం వారి సోషలిస్టు అవగాహనలలో యింకా అస్పష్టత వుంటుంది. మార్క్సిజంలో యేవోకొన్ని అంశాలు మాత్రం జీర్ణించుకొంటారు కాని సమగ్ర మార్క్సిస్టు దృక్పథం వుండదు. సోషలిస్టు పంథాలో వారి మార్గాన్వేషణ కొనసాగుతుంది. ఈ దేశాలలో మార్క్సిస్టు-లెనినిస్టు దృక్పథంలో కమ్యూనిస్టుల మార్గదర్శకత్వం అత్యంత ప్రాముఖ్యతను కలిగివుంటుంది. విప్లవ ప్రజాస్వామ్య దృక్పథాల నియంతృత్వాల యెడల కమ్యూనిస్టులు సుముఖ వైఖరి నవలంభించాలి, దోపిడికిదూరంగా వుండే పెటీ బూర్జువాల నైజాన్ని నొక్కి చెప్పాలి. శ్రామిక వర్గాలు పెటీ బూర్జువా వర్గాలమధ్య వైరుధ్యం లేదని స్పష్టం చేయాలి. ఆ విధంగా విప్లవ ప్రజాస్వామ్య నియంతృత్వం శాంతియుతంగా సోషలిజంలోనికి పరివర్తన చెందగల అవకాశాలను కమ్యూనిస్టులు వొకవైపు గుర్తించుతునే పెటీ బూర్జువాల వూగిసలాటలను ఎదుర్కొని పోరాడాలి.

పెట్టుబడిదారీ విధానాభివృద్ధి మధ్య స్థాయికి చేరిన దేశాలలో పెట్టు బడిదారేతర ఆర్థికాభివృద్ధి అవకాశాలు

3. తృతీయ ప్రపంచంలో జాతీయ ప్రజాస్వామ్య విప్లవం, సామ్రాజ్యవాద వ్యూహాలు వ్యతిరేక సామాన్యలక్షణాలను కలిగివుండుటలో సందేహంలేదు. చారిత్రక నిర్దిష్ట పరిస్థితుల కారణంగా ఆయాదేశాలలోని ఆర్థికాభివృద్ధి మార్పులకు లోనగు తుంది. కొన్ని అరబ్ దేశాలు పెట్టుబడిదారేతర ఆర్థికాభివృద్ధి పంథాను చేబట్టాయి. లాటిన్ అమెరికా కమ్యూనిస్టుపార్టీల సాహిత్యంలో ఈ విధానం పేర్కొనబడలేదు. అంచేత భారతదేశం యే ఆర్థిక పంథాలో అభివృద్ధిని చేబట్టాలనే ప్రశ్న వుదయించు తుంది.

సాధారణంగా వ్యూహాలు పెట్టుబడిదారీ పూర్వదశలో వున్నదేశాలకు పెట్టుబడి దారేతర ఆర్థికాభివృద్ధి పంథా ఆచరణీయంగా యెంచబడుతున్నది. ఆదేశాలు పెట్టు బడిదారీ ఆర్థికాభివృద్ధి దశ "కప్పదాటగ" దాటి సోషలిస్టు ఆర్థికాభివృద్ధి దశను పురోగమించుట సాధ్యం. అందులో ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ అండదండలు ఆర్థిక, రాజకీయ రక్షణరంగాలలో దృఢంగా వున్నప్పుడు పెట్టుబడిదారేతర ఆర్థికాభి వృద్ధి పంథా సాధ్యమనుటలో సందేహంలేదు. "కప్పదాటుగ" పెట్టుబడిదారీ విధా

హాన్ని అధిగమించుట అనే ప్రశ్న భారతదేశ విషయంలో వుదయించదు. కారణం పెట్టుబడిదారీ విధానం వేరూని అభివృద్ధి చెందుతు, ఆ విధాన శిఖరాగ్రదశమైన గుత్తపెట్టుబడిదారి విధానం సహజంగా అభివృద్ధి చెందుతు ముఖ్యంగా కొన్ని బల మైన గుత్తపెట్టుబడిదారి వర్గాలు యేర్పడి జాతీయ ప్రజాస్వామ్య ప్రభుత్వంలో గణ నీయమైన ప్రభావం కలిగివున్నపుడు పెట్టుబడిదారేతర ఆర్థికాభివృద్ధి పంధా నమూనా మరోరూపంలోనైనా అనుసరించుట సాధ్యమని చెప్పుటకు మరికొంత శాస్త్రీయ అధ్యయనం అవసరం. అట్టి అనుభవాలు కానరావు.

4. భారతదేశంలో జాతీయ ప్రజాస్వామ్య విప్లవ ప్రత్యేక లక్షణాలు అధ్య యనం చేయ ప్రయత్నించుదాము.

దేశం పెట్టుబడిదారి విధానాభివృద్ధి మధ్యస్థస్థాయికి చేరింది. బ్రిటిష్ ప్రభుత్వం 200 సంవత్సరాలపాలనలో పెట్టుబడిదారి విధానం వేరూని కొంత అభివృద్ధి చెం దింది. అది వలస దేశాలలోని పెట్టుబడిదారి విధానాభివృద్ధి బ్రిటిష్ పెట్టుబడి అధికృత పెట్టుబడిదారి ఫ్యూడలు విధానాలలో వుత్పత్తి కొనసాగింది. వెనుకబడిన ఆర్థిక విధానాన్ని 1947లో భారతదేశం వారసత్వంగా పొందింది. అధికార మార్పిడి అనంతరం స్వతంత్ర భారతదేశం పెట్టుబడిదారీ విధాన ఆర్థికాభివృద్ధి పంధాలో పయనించిన ఫలితంగా పెట్టుబడిదారి విధానం బలపడి, కొన్ని బలమైన గుత్తపెట్టు బడిదారి వర్గాలు పెంపొందాయి. గ్రామీణ ప్రాంతాలలో కూడ పెట్టుబడిదారి విధానాభి వృద్ధి వేరూని కొనసాగింది. పెట్టుబడిదారి విధానపూర్వ ఆర్థిక ఉత్పత్తి సామాజిక సంబంధాలు విప్లవ మార్గాలలో కాకపోయినా వివిధ సంస్కరణలతో క్రమేణా కను మరుగై, పెట్టుబడిదారీ సంబంధాలు అభివృద్ధి చెందుతున్నవి.

భారతదేశంలో కార్మిక, బూర్జువా వర్గాలు ఎప్పుడో యేర్పడినవి. వర్గ పోరా టాలు దీర్ఘకాలంనుండి జరుగుతూనే వున్నవి. నేడు కార్మికవర్గం శక్తివంతమై తన ప్రభావాన్ని ప్రసరించగలిగింది. స్వాతంత్ర్యానికి పూర్వం కార్మికవర్గం విముక్తి పోరాటంలో చోదకశక్తులలో వొకటిగానే వుంది కాని నాయకత్వపాత్ర చేబట్టుటలో విఫలమైంది. నేడునిరవధిక, అత్యంత బలోపేతమైనవిప్లవశక్తిగా కార్మికవర్గంవుద్భవిం చింది. అనేక సమ్మెలు, బందుల పోరాటాలలో కార్మికవర్గ నాయకత్వం వహించు తున్నది. కాంగ్రెసు భూసంస్కరణలు, ఫ్యూడలు భూస్వాముల ప్రభావాన్ని గ్రామీణ ప్రాంతాలలో కొంత తొలగించినా బడుగు వర్గాల ఆర్థిక అదోపతాన్ని ఆపజాలక పోయింది. గ్రామీణ ప్రాంతాలలో వ్యవసాయకూలీలు, అర్థవ్యవసాయ కూలీలు పేద రైతాంగం వేగంగా పెరగసాగింది. రైతాంగపు అన్ని వర్గాలలో అసంతృప్తి వ్యాపించింది.

కార్మిక, కర్షక వర్గాలు రెండూ వొకదాని కొకటి విముక్తి పోరాటాలలో చేయు వగుటయేగాక చోదకశక్తులగుతున్నవి. మరో ముఖ్య విప్లవశక్తి నగర పెటీ బూర్జువా వర్గం. పెట్టుబడిదారి పూర్వ ఫ్యూడలు విధానం, పెట్టుబడిదారి విధానం సహజీవనం జరుపుతున్న దేశంలో పెటీబూర్జువావర్గం ప్రముఖపాత్ర వహించుతుంది. పెటీబూర్జువావర్గాల జీవితం దుర్భరమగుటతో పోరాటమార్గాన్ని చేబట్టుతారు. అభివృద్ధి నిరోధక వర్గాలకు వ్యతిరేకంగా కార్మిక, కర్షక వర్గాలతో కలిసి దైనందిన సమ్మె పోరాటాలలో పాల్గొంటారు. అతివాద మేధావివర్గాలు గణనీయమైన విప్లవపాత్రను వహించగలవు.

భారత బూర్జువవర్గం యెడల విప్లవశక్తుల అవలంభించవలసిన వైఖరి అత్యంత ప్రాధాన్యతకలది. బూర్జువావర్గం పోతపోసినట్లు వొక్కటిగా లేదు నియోవలస సామ్రాజ్యవాదులకు గుత్తపెట్టుబడిదారులకు సామాజిక పునాదిగ వుంది. గుత్తేతర బూర్జువావర్గం సామ్రాజ్యవాద వ్యతిరేకపోరాటంలో కలసి వస్తుంది. అందుకు ఉదాహరణ బంగ్లాదేశ విముక్తి పోరాటకాలంలో భారతజాతికి సామ్రాజ్యవాదానికి వైరుధ్యం తీవ్రమై యుద్ధ పరిస్థితి నెలకొన్నపుడు గుత్తేదర బూర్జువావర్గం, సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాన్ని బలపరచింది. దేశంలో వర్గపోరాటం తీవ్రమైన కొలది వూగిసలాడి సామ్రాజ్యవాదంతో రాజీపడుతుంది. అంతర్జాతీయ సామ్రాజ్యవాదం, సోషలిజంల మధ్య గల వైరుధ్యం బలాబలాల మధ్య సమతూకాన్ని మార్పులను, తన ప్రయోజనాలకు వుపయోగించుకొంటుంది. సోవియట్ సహాయాన్ని పొంది, తన స్థానాన్ని బలపరచుకొని ఆర్థికస్వాతంత్ర్యానికి గట్టి పునాదులు వేస్తున్నది. అయితే అది కూడ దోపిడి వర్గమే అయి వున్నందున పెట్టుబడిదారి విధానానికి అంటి పెట్టుకొని వుంటుంది. వారి ధ్యేయం బూర్జువా విధానాన్ని సుస్థిరం చేయుట. అంచేతనే వ్యవసాయ సంస్కరణలను అసంపూర్తిగ చేసింది. జాతీయ బూర్జువావర్గం కూడ గుత్తపెట్టుబడి దారివర్గ వ్యతిరేకతను అదే విధంగా కొనసాగిస్తుంది. గుత్తేతర పెట్టుబడిదారి బూర్జువావర్గాలు నిరవధికంగా విప్లవవైఖరిని అవలంభించుననుకొనుట పొరపాటు. జాతీయ బూర్జువావర్గపు సామ్రాజ్యవాద ఫ్యూడలు, గుత్తపెట్టుబడిదారి వ్యతిరేకత పెట్టుబడిదారివర్గ ప్రయోజనాల పరిధి లోపలనేయని మరువరాదు. ఆ వ్యతిరేకత నిరవధికంగా వుండకుండుట ఆ వర్గ నైజము.

కార్మికవర్గం జాతీయ విముక్తి వుద్యమాన్ని తన లక్ష్యమైన సోషలిజం విజయానికి పురోగమించుట ప్రజాస్వామ్య విప్లవ కర్తవ్యాలను విప్లవ మార్గాలలో పరిపూర్తిచేయుటగా నెంచుతుంది. అదే దృక్పథంతో సామ్రాజ్యవాద, ఫ్యూడలు వ్యతిరేక విప్లవాన్ని చూస్తుంది. పెట్టుబడిదారీ విధానానికి అంటిపెట్టుకొని వున్నంత వరకు ఆర్థిక స్వాతంత్ర్యంగాని మౌలిక వ్యవసాయ సంస్కరణ గాని విజయం పొందజాల

దని కార్మికవర్గ అవగాహన సామ్రాజ్యవాద వ్యతిరేక ప్రజాస్వామ్య విప్లవ కార్యక్రమాన్ని అమలు చేయుటకు పెట్టుబడిదారి విధాన వ్యతిరేక దృక్పధం, పంధా అవసరము.

పెట్టుబడిదారి విధాన పంధా వ్యతిరేక పోరాటం అంటే ఏమిటి? ప్రప్రధమంగా విదేశ గుత్తపెట్టుబడిని రద్దుచేయుట భారత గుత్తపెట్టుబడి ఆధిక్యతను, ఆజమాయిషీని తొలగించి పెట్టుబడిదారి విధాన సూత్రాలకు పరిమితులు విధించుట, తదితర చర్యలతో పెట్టుబడిదారి విధాన పంధాను తిరుగగొట్టుట గుత్త బడా, వర్గాల వలననే గుత్తేతర పెట్టుబడి వర్గాలు కూడ పెట్టుబడిదారి విధానాభివృద్ధి చేరువును కార్మికవర్గపై త్రోసివేసాయి అంటే ఆచరణలో పెట్టుబడిదారి విధాన వ్యతిరేక పోరాటం దేశ విదేశ గుత్తపెట్టుబడిపై రాజీలేని పోరాటం దానితోపాటు బడా మధ్యతరగతి గుత్తేతర బూర్జువా వర్గాల గుత్తపెట్టుబడిదారి వైఖరి దృక్పధాన్ని అణచివేయుట అదుపులో పెట్టుట జరగాలి. ఈ అర్ధంలో మనదేశంలో ప్రజాస్వామ్య విప్లవం బూర్జువా ప్రజాస్వామ్య విప్లవ అవధులు లేక పరిమితులను దాటి పెట్టుబడిదారి విధాన వ్యతిరేక మార్గం చేబట్టుట లేక పెట్టుబడిదారి పంధాను అనుసరించువారు దానిని వ్యతిరేకించు వారు పరస్పరం త్రోసి బుచ్చుకొనే పంధాలో వున్నారా? మన పెట్టుబడిదారి విదాన పంధాను అనుసరించువారు దానిని వ్యతిరేకించువారు సామ్రాజ్యవాద వ్యూడలు వ్యతిరేక వైఖరిని చేపట్టవచ్చు కొంతవరకు కలసి రావచ్చు. జాతీయబూర్జువావర్గం సామ్రాజ్యవాద వ్యతిరేక ప్రజాస్వామ్య వైఖరిని చేబట్టినపుడు బలపరచాలి. అప్పుడు జాతీయ బూర్జువావర్గ కార్మికవర్గప్రయోజనాలు కలసిపోతాయి. అయినా జాతీయ బూర్జువావర్గం పెట్టుబడిదారి విధానపంధానే అంటిపెట్టుకొని వుంటుంది. సంస్కరణలపరిధిలో తన చర్యలను పరిమితం చేసుకొంటుంది, తప్పనిసరి అయితే అయిష్టంగానే బ్యాంకుల జాతీయకరణ లాంటివి కొన్ని చేస్తుంది. అదేకాలంలో లబ్ధిదారులకు ప్రయోజనం చేరకుండా పాలకవర్గాలే ప్రయోజనాలు పొందునట్లు, ఆచరణ సాగిస్తుంది. వర్గాల ప్రయోజనాలు వేరు వేరుగా వుండుట స్పష్టం. అందేతనే కార్మిక వర్గం బూర్జువా వర్గం యెడల "ఐక్యత-పోరాటం-ఐక్యత" అనే ఎత్తుగడలు అనుసరించుతుంది. ఏమైనా కార్మికవర్గం-బూర్జువావర్గంతో కలసిపోదు. ప్రజాస్వామ్య విప్లవ కర్తవ్యాల యెడల స్వతంత్రవైఖరిని చేబట్టి తన పాత్ర నిర్వహించుతుంది.

మన జాతీయ విప్లవోద్యమంలో జాతీయ బూర్జువావర్గ సాధారణ పంధాకు, కార్మికవర్గ సాధారణ పంధాకు మధ్యవాస్తవానికి వైరుధ్యముంది. ఉద్యమం బూర్జువా వర్గ నాయకత్వంలో జరుగుతున్నపుడు యీసంఘర్షణ జరుగుతుంది. జాతీయ బూర్జువావర్గ శక్తుల నాయకత్వాన్ని అంతం చేయుటకు రాజకీయ శక్తుల బలాబలాలలో సంబంధాలలో గణనీయమైన మార్పులు తీసుకొని రావలసివుంది. జాతీయ ప్రజాస్వామ్యశక్తుల నాయకత్వాన్ని రూపొందించాలి.

జాతీయ ప్రజాస్వామ్యశక్తులు అంటె కార్మికులు, కర్షకులు పెటీ బూర్జువాలు. గుత్తేతర బూర్జువావర్గంలో కొందరుగ చెప్పాలి. జాతీయ ప్రజాస్వామ్య సంఘటనలో జాతీయ ప్రజాస్వామ్య ప్రభుత్వాధికారంలో యీ నాలుగు వర్గాలు భాగస్వాములుగ వుంటవి, కాని ప్రధాన పునాది శక్తులు కార్మికులు, కర్షకులు, పెటీ బూర్జువా వర్గాలు సహజంగా దోపిడి చేయని ప్యూడలు, పెట్టుబడిదారి దోపిడిని ఆ సంబంధాలను వ్యతిరేకించే శక్తులుంటవి. చైతన్య సామాజికశక్తుల ప్రతినిధులు మార్గదర్శకత్వం వహించుతారు. కార్మికవర్గం యేకైకనాయకత్వం చేబట్టు అవకాశాలు లేవు, కాని దాని వర్గ స్థాయిని బట్టి క్రమేణా నాయకత్వపాత్ర వహించగలుగుతుంది. గుత్తేతర బూర్జువా వర్గాలు కూడ దోపిడి వర్గాలలో వొకటైనందున, నాయకత్వంలో భాగస్వామ్యం కలిగి వుండదు, జాతీయ బూర్జువావర్గ ప్రభుత్వానికి మార్గదర్శకత్వం వహించజాలదు మరో మాటలో దేశంలో జాతీయ ప్రజాస్వామ్య విప్లవ నాయకత్వం, విప్లవ ప్రజాస్వామ్య నియంతృత్వ రూపంలో వుంటుంది. అంటే కార్మిక, కర్షక, పెటీ బూర్జువా వర్గాలకు ప్రజాస్వామ్య ప్రభుత్వం, దేశభక్త జాతీయ బూర్జువావర్గంయెడల ఐక్యత-పోరాటం వైఖరి అవలంభించుతుంది. సామ్రాజ్యవాద, ప్యూడలు, గుత్తపెట్టుబడిదారి వర్గాలకు నియంతృత్వాన్ని, అంటే విప్లవశక్తులకు,మిత్రులకు ప్రజాస్వామ్యాన్ని శత్రువులకు విప్లవ ప్రతీఘాతకశక్తులకు, అది నియంతృత్వాన్ని ప్రసాదిస్తుంది. ప్రజాస్వామ్యవిప్లవం విజయుసాధించుటతో జాతీయ ప్రజాస్వామ్య నియంతృత్వం, సమాజం తదనంతర ఉన్నత సోషలిస్టుదశకు పరివర్తన చెందుట కనువగు పరిస్థితులను రూపొందించుతుంది. జాతీయ ప్రజాస్వామ్యనియంతృత్వం పరస్పర వైరుధ్య వర్గాల నియంతృత్వమైనందున, సోషలిజంలోనికి శాంతియుత పరివర్తన అవకాశాలున్నవి.

ఆసియా, ఆఫ్రికా యితర దేశాలకంటె భారతదేశ పరిస్థితులు పరిపక్వం చెంది, విప్లవ ప్రజాస్వామ్య పరిణామానికి అనుకూలంగా వున్నవి. కార్మికవర్గం బాగా అభివృద్ధి చెందని దేశాలలోని విప్లవ ప్రజాస్వామ్య నియంతృత్వం పెటీ బూర్జువా ప్రతినిధుల నియంతృత్వంగా రూపొందుట సాధారణంగా జరుగుతుంది. భారత్‌లో పరిస్థితులు మరింత పరిపక్వతకు చేరినందున కార్మిక, కర్షక, పెటీ బూర్జువా వర్గాల సంయుక్త నియంతృత్వంగా రూపొందుతుంది. అట్టి కూటమిలో కార్మిక వర్గ పాత్ర విప్లవ ప్రజాస్వామ్య నియంతృత్వానికి వొక ప్రత్యేక నైజాన్ని కలుగజేస్తుంది.

భారత పరిస్థితిని అదేకాలంలో అతిగా అంచెనా వేయక జాగ్రత్త వహించాలి దేశంలో విప్లవ ప్రజాస్వామ్య పరివర్తనకు కార్మికవర్గం నాయకత్వం వహించు దశకు ఎదగలేము. ఈ ప్రత్యేక కారణంగా భారతదేశం తన ప్రత్యేక పంథాలో, పయనించాలి. అరబ్ లాటిన్ అమెరికాలోని పరిస్థితులు భారత్‌లో లేవు, కొన్ని

లాటిన్ అమెరికా దేశాలలోవలె భారతదేశం మధ్యస్థాయి పెట్టుబడిదారి దేశ దశ నుండి అత్యంత వేగంగా పెట్టుబడిదారి దేశంగా అభివృద్ధి చెందుతున్నది. కార్మిక వర్గంలో అత్యధికభాగం జాతీయ బూర్జువా వర్గం యెడల భ్రమలను కలిగివుండుటయే గాక రైతాంగంతో విస్తృత ఐక్యతను రూపొందించుస్థాయికి ఎదుగలేదు. అంతేగాక, కార్మికవర్గం చీలికలై అనైక్యతకు గురియై నాయకత్వం వహించగల శక్తివంతం కాలేదు, అయినా ఉత్పత్తి క్రమంలో తన సహజ స్థానాన్నిబట్టి నిర్ణయాత్మక పాత్ర వహించగలుగుతుంది. అందుచేతనే జాతీయ ప్రజాస్వామ్యం పెట్టుబడిదారేతర పంథాలో ప్రధానపాత్ర వహించగలది కార్మికవర్గమే. ప్రజాస్వామ్య విప్లవం సోషలిస్టు విప్లవంగా పరివర్తన చెందుటకు అవసరమైన బాహ్యపరిస్థితులను రూపొందించి పునాదులను యేర్పరచవలసినది అంతర్జాతీయ కార్మికోద్యమమని గుర్తించాలి.

5 పెట్టుబడిదారేతర పంథాలో ముడివడిన ముఖ్యసమస్య, పెటీ బూర్జువా వర్గపు విప్లవపాత్ర, విప్లవ ప్రజాస్వామ్యాలుపై కమ్యూనిస్టు వర్గాలలో భేదాభిప్రాయాలున్నవి ప్రాబ్లమ్స్ ఆఫ్ నేషనల్ లిబరేషన్ పత్రికలో "ఒక మార్క్సిస్టు" నగర పెటీ బూర్జువాలను ఉపాధ్యాయులు వైట్ కాలర్ కార్మికులు, ఇంజినీర్లు, డాక్టర్లు తదితరులు తమ కోర్కెలకై పోరాడునప్పుడు పైటాయింపు సమ్మెలు వగైరా కార్మికవర్గ పోరాట రూపాలను చేబట్టినా కార్మికులవలె వెనుకాడక పోరాడేతత్వం లేదు. బెంగాలులో సి.పి.ఐ (యం) అధికారంలో వున్నపుడు పెటీబూర్జువా వర్గాలు అనేకం నిర్మాణాలలో సమీకరించబడ్డారు, కాని అధికారంలో లేనప్పుడు కొద్దిమంది మాత్రమే పార్టీ మద్దతుదారులుగ మిగిలారు, వీరుకూడ తిరిగి సి.పి.ఐ అధికారంలోనికి రాగలదనే ఆశతోనే కొనసాగారు. నగర పెటీ బూర్జువావర్గాలలో విప్లవోత్సాహ అంశంలేదు. కారణం వారిలో పెక్కుమంది ఆస్తులుగల కుటుంబాలనుండి వచ్చినవారు గ్రామాలలోవున్న వారిఆస్తులనుండి వచ్చిన ఆదాయాలతోగాని, పూర్వీకులనుండి సంక్రమించిన ధనంతోగాని విద్యావంతులు ఉద్యోగులు అయ్యారు. నగర పెటీ బూర్జువా వర్గాలలో పెక్కుమంది, వారి కౌలుదారులతో గ్రామాలలో సంఘర్షణకు పడినవారే. అయినా వారి జీతాలు కరువుభత్యాల పెరుగుదలకు కార్మికులతో కలసి పోరాడుతున్నారు. వారిది అవకాశవాదం కాదనగలమా? అందుచేత నగర పెటీ బూర్జువా వర్గాలను విప్లవ శక్తులుగా గుర్తించుటను కొన్ని కమ్యూనిస్టు వర్గాలు వ్యతిరేకించుతున్నవి. మరో ముఖ్య విషయం పెటీ బూర్జువా వర్గాలను వారి ఆర్థిక ప్రమాణాలబట్టి మాత్రమే నిర్ధారణ చేయరాదు. వారు దారిద్ర్యరేఖపై జీవిస్తూ వుండవచ్చు. దారిద్ర్యరేఖపై వున్న యితర వర్గాల మనోస్థితితో సమానంగా యెంచరాదు. మధ్యతరగతి వుద్యోగులు, ఉత్పత్తి కార్యక్రమంలో పాల్గొనే కార్మికులకంటే నెలసరి ఆదాయం తక్కువగా వుండవచ్చు, వారు ట్రేడు యూనియనులలో వారి

కోర్కెలకై పోరాడవచ్చు, అయినా సామాజిక విప్లవోత్సాహంలో కార్మికవర్గానికి దీటుగాదు. వారి వర్గనైజపు వూగిసలాటతత్వం వారిని వెన్నంటే వుంటుంది.

బెంగాలులో సి. పి. యం, సి పి ఐ యితర అతివాద పార్టీల తదితరుల ఐక్యసంఘటనా ప్రభుత్వం ట్రేడుయూనియను వుద్యమాలలో రాజకీయ పోరాటాలలో పెటీబూర్జువావర్గం విప్లవకర పాత్ర వహించుటలో విఫలమైందని సత్యరాయ్ అభిప్రాయం. ఈ సమస్యను తృతీయ ప్రపంచ విముక్తి వుద్యమాల సందర్భంగా పరిశీలించుతు "నేడు జాతీయ విముక్తి వుద్యమం ప్రధానంగా సామ్రాజ్యవాద వ్యతి వుద్యమే. అయినా ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ ప్రదానంగా నిర్ణయోత్మక పాత్ర వహించుచున్నందున పెట్టుబడిదారి విధాన వ్యతిరేక వుద్యమంగా విస్తరించుచున్నదని" వివరించారు. అయితే ప్రపంచసోషలిస్టు వ్యవస్థ అంతరించిన నేటి పరిస్థితులలో పెటీ బూర్జువాల విప్లవకరపాత్ర ప్రధానంగా అతివాద, ప్రజాస్వామ్య వుద్యమాల బలంపై ఆధారపడి వుంటుందనేది స్పష్టం.

"జాతీయ విముక్తి వుద్యమాలలో పెటీ బూర్జువా వర్గాల పాత్రలను వేరు వేరుగా చూడాలి. ఆయా వర్గాల ప్రయోజనాలను లక్ష్యాలను అనుసరించే వాటి పాత్ర వుంటుందని మరువరాదు. సామ్రాజ్యవాదం ప్యూడలిజంలతో దాని వైరుధ్యాలను పెట్టుబడిదారీ విధాన పరిధిలోనే పరిష్కరించుకొన ప్రయత్నించుట,దాని వర్గ ద్వంద వైఖరి నైజాన్ని స్పష్టం చేస్తుంది. జాతీయ విముక్తి వుద్యమం పెట్టుబడిదారి వ్యతిరేక మార్గంలో పయనించినకొలది పెటీబూర్జువావర్గం ప్రజావిప్లవమార్గం నుండి దూరమగుతుంది. అయితే ఆ వర్గంలోని కష్టజీవులైన రైతాంగం చిన్నవ్యాపారులు, మేధోశ్రామికవర్గాలకు, పెటీ బూర్జువా వర్గాలకు మధ్య వైరుధ్యం లేదు. పెటీబూర్జువా ప్రజాస్వామ్యం నుండే విప్లవ ప్రజాస్వామ్యం వుద్భవించింది. అది గ్రామీణ, నగర పెటీబూర్జువా వర్గాలలోని విప్లవ శ్రామికోత్సాహానికి ప్రాతినిధ్యం వహించుతుందని" సత్యరాయ్ వివరించుతు, తన వాదనకు బలంగా "రాజకీయంగా చైతన్యం పొందిన రైతాంగం నగరపెటీ బూర్జువావర్గాలు జాతీయ బూర్జువా వర్గ మేధావులలోని అభివృద్ధి కాముకులు సామ్రాజ్యవాద, ప్యూడలు వ్యతిరేక పోరాటానికి అంకితమైన వారే, విప్లవ ప్రజాస్వామ్యవర్గాలు[1]" అని స్పష్టం చేసిన ప్రొఫెసర్ బ్రూటెంట్స్ వ్యాఖ్యాలను పునరుద్ఘాటించారు. ప్రజాస్వామ్య వర్గాల నుండి చైతన్యంతో రాజకీయంగా సోషలిస్టు దృక్పదాన్ని ఎన్నుకొన్న సామాజిక వర్గంగా విప్లవ ప్రజాస్వామ్య వర్గాలను పరిగణించాలి అంతేగాక, విప్లవప్రజాస్వామ్య వర్గల రాజకీయ ప్రాతినిధ్యం సామాజిక పునాదుల మధ్య లక్ష్మణరేఖవుందని మరువరాదు. విప్లవ ప్రజాస్వామ్య

1. బ్రూటెంట్స్ (1975) ప్రోబ్లంస్ ఆఫ్ పీస్ అండ్ సోషలిజం జనవరి 1975 ది న్యూటైప్ ఆఫ్ నేషనల్ లిబరేషన్ రివల్యూషన్.

వర్గాలు సిద్ధాంతరీత్యా విశ్వమానవ నమానత శాస్త్రీయ సంక్షేమ సోషలిజం నిర్మిస్తామంటారు, జాతీయతత్వ వూగిసలాటలను ప్రదర్శిస్తారు. "ఈ వర్గానికి వూగిసలాట తత్వం సహజం" అని అన్న లెనిన్ మాటలు మరువరాదు.

పెటీబూర్జువా ప్రజాస్వామ్యవర్గ వూగిసలాటపై సోషలిస్టు వైఖరి ఆధిక్యత పొందితే విప్లవ ప్రజాస్వామ్య నైజం మారిపోయి మార్క్సిజం, లెనినిజాన్ని చేబట్టుతుంది. అట్లుగాక బూర్జువా వర్గ సుముఖ వైఖరి పెట్టుబడిదారి విధానం ఆధిక్యత పొందితే విప్లవ ప్రజాస్వామ్యం నీరుగారి పెట్టుబడిదారి విధానంగా రూపొందుతుంది. అంచేతనే కమ్యూనిస్టుపార్టీపాత్ర ప్రాముఖ్యత వహించుతుంది. విప్లవ ప్రజాస్వామ్యంలోని విరుద్ధ లక్షణాలను మరువక విప్లవ ప్రజాస్వామ్య శక్తులను బలపరుస్తూ, సైద్ధాంతిక విప్లవ పోరాటాలను సదా పెంపొందిస్తారు. ఆ విధంగా విప్లవ ప్రజాస్వామ్య పాలనకు బలాన్ని స్థిరత్వాన్ని పెంపొందిస్తూ, శాస్త్రీయ సోషలిజం వైపు పురోగమించుటకు మార్గదర్శకత్వం వహించి తోడ్పడుతారు.

విప్లవ ప్రజాస్వామ్యం క్రమేణా శాస్త్రీయ సోషలిజం వైపు మొగ్గితే పరిణామ క్రమంలో నేరుగా సోషలిస్టు నిర్మాణ మొదటి దశగా రూపొందుతుంది, లేక అదే గాడి తప్పితే పెట్టుబడిదారి విధాన దృక్పధాన్ని చేబట్టితే, సోషలిజంలోనికి పరివర్తన విప్లవమార్గంలో జరుగుతుంది. అత్యంత తీవ్ర రాజకీయ పోరాటాల ఫలితంగా పరివర్తన జరుగుతుంది. ఏమైనా విప్లవ ప్రజాస్వామ్యం, అది వారసత్వంగా పొందిన పెటీ బూర్జువా, విప్లవశక్తిగా సాగితే వూగిసలాటలను బలహీనతలను ప్రతిబింబిస్తుంది. అల్జీరియా. సిరియా, ఇరాక్, బర్మాల అనుభవాలు, అవి పెట్టుబడిదారేతర ఆర్థికాభివృద్ధిని చేబట్టుటలో పెటీ బూర్జువావర్గాలలోని విప్లవశక్తిని ఈజిప్టు అనుభవం ప్రధానంగా పెట్టుబడిదారేతర పంథానుండి తిరోగమించి పెట్టుబడిదారి విధానపంథాను పునరుద్ధరింపుట, ఆవర్గ బలహీనత, వూగిసలాటలను ప్రతిబింబిస్తుంది. అదేవిధంగా 1990 దశకంలో సోషలిస్టు వ్యవస్థపతనానంతరం, వర్ధమాన దేశాలు పెట్టుబడిదారేతర ఆర్థికాభివృద్ధి పంథాలనుండి తిరోగమించి పెట్టుబడిదారి విధానాన్ని పునరుద్ధరించుటను ప్రారంభించుట ఆవర్గ నైజాన్ని అది జాతీయ అంతర్జాతీయ కార్మిక కామ్యూనిస్టు వుద్యమాల తిరోగమనంతో ఆ వర్గ నైజం ఆధిక్యత పొంది పెట్టుబడిదారి విధానాన్ని పునరుద్ధరింపుటను స్పష్టం చేసింది కాలచక్రం.

భారతదేశంలో పెటీ బూర్జువావర్గంలోని ద్వంద్వవైఖరి అంశాలు అత్యధిక సంఖ్యాంకంగా వున్న ఆ వర్గ రాజకీయ పాత్రలో స్పష్టమౌతూనే వుంది. బూర్జువా జాతీయతత్వం మనదేశంలో బలంగా వేరూని వుంది. దేశంలో వివిధ సామాజిక ఆర్థిక రూపాలున్నా పెట్టుబడిదారి ఆర్థికవ్యవస్థ ఆధిక్యతలో వుంది. వర్గ వైరుధ్యాలు బలంగా యేర్పడినవి. బూర్జువా కార్మికవర్గాలు తమ సహజరూపాన్ని పొం

దాయి. మరోవైపు కార్మికోద్యమాలు బలపడుతున్నవి, చైతన్యవంతమగుతున్నవి. ఈ క్రమం వొక సరళరేఖలోగాక "మెలికలు మలుపుల"తో జరుగుతున్నది. బూర్జువా జాతీయతా ప్రభావం ఆధిక్యతలో వుండి పెటీ బూర్జువా వర్గంలోని నిజమైన అతివాద వైఖరికి చెలియలికట్టగా వుంది. బహుళసంఖ్యాక పెటీబూర్జువావర్గాలు కాంగ్రెసు భ్రమలకులోనై వున్నవి, వారి బాహుబంధాల నుండి బయట పడలేదు. అతివాద వర్గాలు కొన్ని యీ భూర్జువాపాలనను అంత మొందించుటకు దగ్గరి మార్గాలు వెతుకుతు సాహసిక అతివాద ప్రభావంలోపడి విప్లవ పదజాలాన్ని విరివిగా వాడుతు మితవాద అభివృద్ధి నిరోధకుల ప్రయోజనాలకు ఉపయోగపడుతున్నారు.

సమస్యక్లిష్టత, పెటీబూర్జువావర్గ నైజం స్పష్టమైనా అది విప్లవ కార్యాచరణ చేబట్టే అవకాశం బలాన్ని కలిగివున్నదని మరువరాదు. పెటీబూర్జువావర్గాల యెడల కమ్యూనిస్టుపార్టీ లెనినిస్టు ఎత్తుగడల అవలంభించి దాని అవకాశవాదాన్ని, బూర్జువా అనుకూలశక్తులను వేరుచేసి పోరాటశక్తులను కార్మికవర్గ పక్షానికి కొని రావలసివుంది. ఇది దీర్ఘకాల ప్రాతిపదిక కార్యక్రమంగా చేబట్టవలసివుంది పార్టీ బలాన్ని పెంపొందించుకొన్నకొలది యీ పనితేలిక అగుతుంది.

6. స్వాతంత్ర్యానంతరం భారతదేశంలో పెట్టుబడిదారి విధానాభివృద్ధి, ధనికులను మరింత ధనికులుగా పేదలు మరింత పేదలగు రీతిలో జరుగుతున్నదని, కమ్యూనిస్టు వర్గాలన్ని విశ్వశింపుతున్నవి. ఈవిధానం అనేక దుగ్మతలతో సంక్షోభం తరువాత సంక్షోభానికి లోనయ్యే ప్రణాళికా బద్ధంగా జరుగుతున్నది. భారత బూర్జువా వర్గం లాభాలకు దీర్ఘకాలం వేచివుండవలసి వచ్చే "భారీపరిశ్రమలలో పెట్టుబడి పెట్టుటకు సుముఖంగా లేదని అందువలన ప్రవేటు, పెట్టుబడిదారుల ప్రయోజనాల కోసమే ప్రభుత్వ పారిశ్రామికరంగం వుద్దేశించబడిందని ప్రభుత్వరంగం నిర్వహించే సామ్రాజ్యవాద వ్యతిరేకపాత్రను అతిగా చిత్రించుతు అది ప్రవేటు రంగానికి చేసే వుడిగం పాత్రను సి పి. ఐ. కప్పిబుచ్చటం నిజాయితీరహిత చర్యయని" బసవపున్నయ్య విమర్శించారు. అంతేగాక భారత బడాబూర్జువావర్గాన్ని సి. పి. ఐ. స్వతంత్ర జాతీయ ఆర్థికవ్యవస్థను నిర్మించుతున్నదని," "స్వతంత్రవిదేశాంగ విధానాన్ని అనుసరించగల శక్తిని సంపాదించిందని," వొకవైపు మరోవైపు "స్వతంత్రం వచ్చిన తరువాత విదేశ పెట్టుబడి మూడు రెట్లు అయిందని" తమ కార్యక్రమంలో పరస్పర విరుద్ధంగా పేర్కొన్నారని" "ఒక్కమాటలో చెప్పాలంటే బూర్జువా భూస్వామ్య రాజ్యాంగ యంత్రంతోను ప్రభుత్వంతోను తమ పార్టీ మిలాఖత్ అగుట ద్వారా భారతదేశానికి పెట్టుబడిదారేతర పంథా'ను రూపొందించాలనే రివిజనిస్టు లక్ష్యం పూర్తిగా దారుణంగా విఫలమైందని[1]" తీవ్రంగా విమర్శించారు.

1 బసవపున్నయ్య (1985) మనకార్యక్రమము నంబూద్రిపాద్ వర్తమాన ఎత్తుగడలపై పార్టీ పంథా ఒక అధ్యయనం ప్రజాశక్తి ప్రచురణ. పేజి. 44-45.

నంబూద్రిపాద్ "ఫ్యూడలిజం ప్రభావంలో వున్న వలసలు, వెనుకబడిన దేశాలలో పెట్టుబడిదారేతర మార్గంలో కార్మికవర్గం అధికారాన్ని స్వీకరించిన అనంతరం ఆర్థిక, పారిశ్రామికాభివృద్ధిని కావించి, ప్రజల జీవితాన్ని మెరుగు పరచు అవకాశాలున్నవన్న లెనిన్ సిద్ధాంతాన్ని నేడు మన మితవాదులు వక్రీకరించి విప్లవ సారాన్ని వదబోసి తొలగించి పెట్టుబడిదారీ మార్గాభివృద్ధి దశను "కప్పదాగా" అధిగమించి పెట్టుబడిదారీ పూర్వసమాజాన్ని సోషలిజం కమ్యూనిజంలవైపు పురోగమించునట్లు కొన్ని పరిస్థితులలో చేయవచ్చని అదే పెట్టుబడిదారేతర ఆర్థికాభివృద్ధి పంథా అంటున్నారు. అందు పెట్టుబడిదారులు ప్రవేటుపెట్టుబడిరంగంలో, ప్రభుత్వం ప్రభుత్వ పెట్టుబడిరంగంలో ఆర్థిక పారిశ్రామికాభివృద్ధి కావించబడుతుందని, ప్రవేటు పెట్టుబడిరంగం అనేక నియమ నిబంధనలపు గురిచేయబడుతుందంటున్నారు. బూర్జువా, భూస్వామ్య నాయకత్వంలోని ప్రభుత్వం, ప్రవేటురంగాన్ని ఎంతవరకు అదుపులో పెట్టగలదో విచితమే" అని విమర్శించారు.

ప్రప్రథమంగా లెనిన్ వూహించినట్లు మనదేశంలో నేరుగా సోషలిస్టు సమాజలోనికి "కప్పదాటుగ" పెట్టుబడిదారి ఆర్థికాభివృద్ధి దశను దాటగలమా అని ప్రశ్నించి వ్యతిరేకంగా నమాధానం చెప్పారు కారణం మనదేశం పెట్టుబడిదారి విధానాభివృద్ధిలో వొకదశకు చేరిందని విముక్తి చెందిన దేశాలలో పెట్టుబడిదారి విధానం బాగా అభివృద్ధి చెందిందని "నంబూద్రిపాద్ యింకా యిలా వివరించారు." స్వాతంత్ర్యానంతరం పెట్టుబడిదారి విధానం బాగా అభివృద్ధి చెందిందని, గుత్తపెట్టుబడిదారి వర్గాలు గణనీయంగా అభివృద్ధి చెందాయని సంస్కరణవాదులు యీ వాస్తవికతనే "ప్రవేటురంగంలో ప్రవేటు పెట్టుబడిదారి విధానాన్ని ప్రభుత్వరంగంలో ప్రభుత్వ పెట్టుబడిదారీ విధాన్ని కాంగ్రెసు ప్రభుత్వం అభివృద్ధి చేస్తుందని వొప్పుకొనక తప్పలేదు" ఈ పరిస్థితులలో పెట్టుబడిదారి విధానాభివృద్ధిని కప్పదాటుగ అధిగమించుట అనే ప్రశ్నయే ఉద్భవించిందని వివరించారు.

ఇంకా సంస్కరణవాదులు తమ కార్యక్రమంలో పెట్టుబడిదారేతర ఆర్థికాభివృద్ధి పంథాను ప్రత్యామ్నాయంగా పేర్కొని మౌలిక సంస్కరణల ద్వారా, వివిధ బంధనాలను బ్రద్దలుచేసి వుత్పత్తి శక్తులను అభివృద్ధిపరచి. పెట్టుబడిదారి విధానాభివృద్ధిపై పరిమితులు నిబంధనలు విధించి సోషలిస్టు మార్గంలో దేశపురోగమనానికి అవసరమగు పరిస్థితులను రూపొందించాలని గుత్తపెట్టుబడిదారి విధానాభివృద్ధిని, నిబంధనలతో అరికట్టి దీనినమలుకు గుత్త బూర్జువా వర్గాన్ని మినహాయించి నాలుగు వర్గాల జాతీయ ప్రజాస్వామ్య సంఘటనను సంఘటన ప్రభుత్వాన్ని నిర్మించుట

1. నంబూద్రిపాద్ (1966) దిప్రోగ్రాం ఎక్స్‌ప్లేన్డ్ పే. 85-86. ఇందులో సి.పి. ఐ సి. పి ఐ పెట్టుబడిదారేతర పంథాపై 9 పేజీల సుదీర్ఘ విమర్శ పే. 131

సి.పి.ఐ. రాజకీయ విధానంగా వుంది. ఇవన్నీ మాటలలో కొనసాగగా జాతీయ వర్గాలలోని చీలికను రూపుమాపి, కాంగ్రెసు వెనుకనున్న ప్రజాసామాన్యంతో ఐక్యమగుటకు ఆచరణ కార్యక్రమాన్ని చేబట్టారు. ఇదే విధంగా మాటలలో కార్మిక, కర్షక ఐక్యత మౌలికమైనదిగా పేర్కొంటూ చేతలలో తద్విరుద్ధంగా చేసారని నంబూద్రిపాద్ విమర్శన కొనసాగించారు. ప్రభుత్వ అభ్యుదయకర మార్పుల ధ్యేయ లక్ష్యంగా తమ శక్తినంతా వినియోగించారు.

నంబూద్రిపాద్ తన సంస్కరణవాదులపై విమర్శనను యిలా ముగించారు. ప్రథమంగా పెట్టుబడిదారి-పెట్టుబడిదారేతర ఆర్థికాభివృద్ధి వంద్వా వారి ఆచరణల మధ్య వర్గ పోరాటంగాను, సామ్రాజ్యవాద వ్యూడలు వ్యతిరేక పోరాటంలో మిత్రులైనా పరస్పరం వైరుధ్యాంశాలున్నవని మరచారు. ప్రతివర్గం పెట్టుబడిదారి విధానాభివృద్ధికి వ్యతిరేకంగా పరిగణించారు. ఈ అవగాహన 81 కమ్యూనిస్టుపార్టీల అవగాహనకు భిన్నంగా వుంది రాజకీయ స్వాతంత్ర్యం సంపాదనానంతరం సంఘటనలోని మిత్రులమధ్య వైరుధ్యాలు యినుమడించుటను మాస్కో ప్రకటన స్పష్టం చేసింది. రెండవ అంశం పాలక వర్గాల ప్రభుత్వ విధానాలను "జాతీయ సమగ్ర విధానాలను నిర్వచించుట యీ విధానాలకు వ్యతిరేకంగా జరిగిన పోరాటాలను జాతీయ విధానాలకు ద్రోహంగా నెంచుట జాతీయ ప్రజాస్వామ్య సంఘటనా నిర్మాణ పోరాటం సంస్కరణవాదం జరిపింది. జాతీయ విధానం అనిచెప్పబడేది వాస్తవానికి కాంగ్రెసు సంక్షిప్త విధానము. తృతీయంగా భూస్వామ్య బూర్జువా ప్రభుత్వాన్ని తొలగించి సామ్రాజ్యవాద వ్యూడలు వ్యతిరేక ప్రజాస్వామ్య సంఘటన ప్రభుత్వాన్ని యేర్పాటు చేయుటగాక, ప్రభుత్వ విధానాలలో మౌలికమార్పులకై పోరాటంగా సంస్కరణవాదుల ధ్యేయంగా వుంది. ఈ పోరాటాన్ని గూడ కాంగ్రెసు విశ్వాస పాత్రులతో ఐక్యసంఘటనగా యేర్పడి కొనసాగించుటగా ప్రతిపక్ష పార్టీలకు స్పష్టం చేసారు. సంగ్రహంగా పెట్టుబడిదారీ పూర్వ ఆర్థిక సంబంధాలను గురించి లెనిన్ అనుభవాలను మన పరిస్థితులకు కత్తిరించి పెట్టుబడిదారి విధానాభివృద్ధిని దాటవేయు విధానాన్ని సంస్కరణవాదుల ప్రధాన నినాదమైందని విమర్శించారు.

## సంయుక్త నాయకత్వంపై సైద్ధాంతిక విమర్శ ప్రతివిమర్శన

7. పెట్టుబడిదారేతర పంథా ప్రవచించే కమ్యూనిస్టు వర్గాలు రూపొందించిన కొన్ని తప్పుడు సూత్రీకరణలను ముందుగా పరిశీలిద్దాము.

రెండవ ప్రపంచ యుద్ధానంతరం చైనా, కొరియా, వియత్నాంలలో రూపొందించబడిన "జనతాప్రజాస్వామ్య" ధోరణిని ప్రపంచంలో కొన్నిపార్టీలు మన దేశంలోని కమ్యూనిస్టుపార్టీలోని అతివాదవర్గాలు ప్రవచించ మొదలుపెట్టాయి. భారత దేశంలో పెట్టుబడిదారి విధానం గణనీయంగా అభివృద్ధి చెందియున్నందున జనతా

ప్రజాస్వామ్య విప్లవమార్గం అనుసరణీయమని, పురోగమనానికి భారత బడా బూర్జువావర్గం అడ్డుగా వుందని నాయకత్వంనుండి బూర్జువావర్గాన్ని తొలగించి, కార్మికవర్గం నాయకత్వాన్ని చేబట్టగలిగినంతటి శక్తిని కలిగి వుందనే వైఖరిని తీసుకొన్నారు. ఈ వైఖరి i) భారతదేశం యింకా ఆర్థికంగా సామ్రాజ్యవాదంపై ఆధారితదేశంగా వుందని మరచి, పెట్టుబడిదారి విధానం బాగా అభివృద్ధి చెందిన దేశంగా అతిగా అంచెనా వేసారు. అంచేతనే సామ్రాజ్యవాదమే ప్రధాన శత్రువని, ఆర్థిక స్వాతంత్ర్యం కొరకు పోరాడవలసి వుంటుందనుటలో విఫలమయ్యారు ii) అతివాద వర్గాలు సామ్రాజ్యవాదంకాక దేశబూర్జువా వర్గాలనే ప్రధాన శత్రువులుగ వారి వైరుధ్యాల అధ్యయనం నిర్ధారణ చేసింది ఒక వైపు జాతీయ బూర్జువా వర్గపు సామ్రాజ్యవాద వ్యతిరేకతను గుర్తించకపోవుట, మరోవైపున కార్మికవర్గ రాజకీయ పరిపక్వతను అతిగా అంచెనా వేయుట చేసారు. సామ్రాజ్యవాదం, భారత ప్రజల మధ్యగల వైరుధ్యపు తీవ్రతను అది అపరిష్కృతంగానే వుందని పరిగణించుటలో విఫలమయ్యారు. అంచేత, జాతీయ బూర్జువా శక్తుల విప్లవ పాత్రను, వాడిని త్రోసిబుచ్చారు. ప్రజలకు వ్యతిరేక పక్షంలో చేర్చారు. ఇండోనేషియా, ఘనా అనుభవాలు మరువరాదు అతివాద వర్గాల వొంటెత్తు పోకడలను అవకాశంగా తీసుకొని మితవాద జాతీయ వర్గాలు విప్లవ శక్తులపై జరిపిన "మారణ, హింస, రక్తపాతాన్ని" మరచిపోలేము. iii) చివరగా కార్మికవర్గం నుండి బూర్జువా జాతీయ శక్తులు దూరమగుటను అతివాదులు అతిగా అంచెనా వేసారు. కార్మికవర్గం విప్లవ శక్తులకు నాయకత్వం వహించగలిగినంతటి శక్తివంతం అప్పటికే అయిందని అతిగా అంచెనా వేసారు. కార్మిక కర్షక పెటీబూర్జువా వర్గాలలోని అత్యధికులు జాతీయబూర్జువా వర్గ ప్రభావంలో వున్నారనే వాస్తవాన్ని, స్వీయ మానసిక దృష్టితో గుర్తించ నిరాకరించారు. ఈ అవగాహనలన్నిటి ఫలితంగా బూర్జువా వర్గాన్ని, దాని నాయకత్వం, అధికారాలనుండి తేలికగా త్రోసిబుచ్చగలమనే నిర్ధారణకొచ్చారు. కార్మికవర్గం దీర్ఘకాలపు పోరాటాలద్వారా మెట్టుమెట్టుగ తన శక్తిని అభివృద్ధిపరచుకొంటూ నాయకత్వ పాత్రకు చేరుకొనగలదనే శాస్త్రీయ అవగాహన వదలి వేసారు. ఈ పరిస్థితులలో కార్మికవర్గ నాయకత్వం మౌలికాంశంగా వున్న "జనతా ప్రజాస్వామ్య విప్లవం" అనే సూత్రం ఆచరణ సాధ్యంకాదు. అంచేత యీ అతివాద ధోరణినుండి కొంతవరకు బయట పడవలసిన ఆవశ్యకత వుంది. అదే కాలంలో జాతీయ ప్రజాస్వామ్యం, పెట్టుబడిదారేతర పంథాలను మితవాద దృక్కోణం నుండి వ్యాఖ్యానించుట వివరించుటను యెదుర్కొనవలసిన ఆవశ్యకత కూడ వుంది.

పోరాటక్రమంలో వివిధవర్గాలు వేరగుటను తప్పుగా అర్థంచేసుకొనుట వలన జాతీయ బూర్జువావర్గపాత్ర సంయుక్త నాయకత్వఅవగాహనలు పెడమార్గం పట్టాయి.

అంచేత, గుత్త, గుత్తేతర బూర్జువావర్గ పాత్రను సరిగా అంచెనావేయుట, ఆ వర్గాల భేదాలను గమనించుట అత్యవసరమయింది. దేశంలోని మితవాద అభివృద్ధి నిరోధకులకు, గుత్త పెట్టుబడిదారి వర్గం సామాజిక పునాదిగా వుంది. గుత్తేతర బూర్జువావర్గం ఆ విధంగా కాక ప్రజాస్వామ్య విప్లవంలోని అసంపూర్తి కర్తవ్యా లను కొన్నింటిని పరిపూర్తి చేయు సమస్యపై సామ్రాజ్యవాద వ్యతిరేక వైఖరిని చేబట్టుతుంది. మనం దీనిని పరిగణలోనికి తీసుకొనుటలో విఫలమైతే జాతీయ ప్రజా స్వామ్య సంఘటనను నిర్మించుటలో పెట్టుబడిదారేతర పంథాలో ఆర్థికాభివృద్ధి చేయు టలో విఫలం కాక తప్పదు. అదే కాలంలో గుత్తేతర పెట్టుబడిదారివర్గం నిరవధిక విప్లవశక్తిగా తలంచుట పొరపాటు. గుత్తేతర బూర్జువావర్గంలో మధ్యతరగతి,కొన్ని గుత్తబూర్జువావర్గాలు వుంటవని లేక రూపొందగలవని మరువరాదు. అంచేత అది దోపిడివర్గాలలో భాగస్వామి యే అగుతుంది. జాతీయ బూర్జువా వర్గపు ద్వందవైఖరిని మార్క్సిస్టులు చెప్పుటలో, గుత్తేతర పెట్టుబడిదారివర్గపు పాత్ర వారి మనోవీధులలో వుండుటను తెల్పుతుంది. గుత్తేతర బూర్జువావర్గాలు సామ్రాజ్యవాద, ప్యూడలు గుత్త పెట్టుబడిదాతీ వ్యతిరేక పోరాటాన్ని సంయుక్త నాయకత్వంలో కార్మికవర్గంతో కలసి విప్లవ ప్రజాస్వామ్యాన్ని యేర్పరచగలరని ఆశించుట ఆ వర్గపు సహజ వూగిసలా టను, దోపిడినైజాన్ని మరచుటయే అగుతుంది.

సంయుక్త నాయకత్వం అవగాహన వెనుక పెట్టుబడిదారేతర ఆర్థికాభివృద్ధి అవగాహన వుంది. అదే పెట్టుబడిదారి విధానం సోషలిజపు విధానం కాని పెట్టుబడి దారేతర అర్థికాభివృద్ధి, మధ్యేమార్గం, మూడోరకపు మార్గం. పెట్టుబడిదారేతర పంధాని, స్వతంత్ర జాతీయ అర్థికాభివృద్ధి పంధాగా, అంటే గుత్త పెట్టుబడిదారి వర్గాలు పెరగకుండా పరిమితులు విధించే పంధా, మౌలికంగా పరిమితులు గల పెట్టు బడిదారి పందాగా చెప్పవచ్చు,

సంయుక్త నాయకత్వం వైఖరి, జాతీయ ప్రజాస్వామ్య విప్లవంలో కార్మిక కర్షక ఐక్యత, నాయకత్వం మౌలికమైనదనే అవగాహనకు భిన్నమైనది, కార్మిక బూర్జువా వర్గాలు సంయుక్త నాయకత్వపు వైఖరి కార్మిక, కర్షక వర్గాలు చోదకశక్తి ఇరుసు వంటివి అనే వైఖరిరెండూపరస్పర వైరుద్యాంశాలు. నాయకత్వంలో బూర్జువా వర్గాన్ని భాగస్వాముబుగ నెంచితే, వారికి గల ఆధిక్యతా స్థానాన్ని బట్టి రైతాంగ వుద్యమానికి పరిమితులు విధిలచుట మౌలిక కర్తవ్యాల వైఫల్యం తథ్యం. అట్లుగాక నాయకత్వం దోపిడిచేయుని కార్మిక, కర్షక, పెటీ బూర్జువా వర్గాల సంయుక్త నాయ

కత్వమైతే నాయకత్వం-చోదక యిరుసు వర్గాల మధ్య వైరుధ్యం యేర్పడదు, కార్మిక, కర్షక ఐక్యత మౌలిక కర్తవ్యంగా ప్రాముఖ్యత గలది అగుతుంది. పునాది "ఇరుసు" పాత్రను నాయకత్వ పాత్రను గందరగోళపరచేవారు వాస్తవానికిరైతాంగ పాత్రను జాతీయ బూర్జువా వర్గ పాత్రనూ గందరగోళపరుస్తారు. బూర్జువావర్గం విప్లవకరపాత్రను మధ్యలో వదలివేస్తుందని చివరకంటా విప్లవకరపాత్రను రైతు వర్గం నిర్వహించుతుందని మరువరాదు. బూర్జువా కార్మికవర్గ సంయుక్త నాయకత్వం యేదో వొకరూపంలో బూర్జువా ప్రజాస్వామ్య నియంతృత్వం యేర్పడుటతో ముగుస్తుంది. కార్మిక, కర్షక మైత్రి సహకారం అట్లుగాక విప్లవ ప్రజాస్వామ్యం యేర్పడు వరకేగాక తదనంతరం సోషలిజంవైపు పురోగమించుటకు అగ్రగామిగా దారితీస్తుంది. సంయుక్త నాయకత్వాన్ని ప్రవచించేవారు విప్లవ ప్రజాస్వామ్యాన్ని కూడ గందరగోళపరచారు. వారి దృష్టిలో "సంయుక్త విప్లవ నియంతృత్వం కార్మికవర్గం, రైతాంగంలోని అన్నివర్గాలు, నగర పెటీ బూర్జువా వర్గాలు, గుత్తేతర బూర్జువా వర్గాలు కలసి జాతీయ ప్రజాస్వామ్య ప్రభుత్వం యేర్పడుతుంది. కార్మిక, కర్షక, దోపిడి చేయని పెటీ బూర్జువా వర్గాలు, జాతీయ బూర్జువా వర్గం సమానస్థాయిలో వుంటాయి బూర్జువా ప్రజాస్వామ్యాన్ని రైతాంగ ప్రజాస్వామ్యాన్ని గందరగోళ పరచి లెనిన్ చెప్పిన విప్లవ ప్రజాస్వామ్యాన్ని నీరు కార్చి వేసారు. సంయుక్త నాయకత్వం జాతీయ ప్రజాస్వామ్యంలో కార్మికవర్గం నిర్ణయాత్మక పాత్ర వహించు కుండా చేస్తుంది. సంయుక్త నాయకత్వమైనందున బూర్జువావర్గం కార్మిక, కర్షక యితర బడుగు వర్గాలు పోరాటాన్ని పెట్టుబడిదారి విధాన వ్యతిరేక పోరాటంగా పయనించకుండా అడ్డు తగులుతారు. కార్మికవర్గ నాయకత్వపాత్రకు అడ్డు తగులు తారు. సంయుక్త నాయకత్వంలో భారత జాతీయ ప్రజాస్వామ్య విప్లవం క్రమేణా పెట్టుబడిదారి విధాన వ్యతిరేకంకా, తదనంతరం సోషలిస్టు మార్గంలో పయనిస్తుందని తలచుట పొరపాటు. గుత్తపెట్టుబడిదారేతర బూర్జువావర్గం, కార్మికవర్గంతో సంయుక్తంగా ప్రజాస్వామ్య విప్లవం సోషలిస్టు విప్లవంగా పరిణామ మొందుటకు దారి తీస్తుందని తలంచుట అసంగతము.

జాతీయ ప్రజాస్వామ్య విప్లవంలో కార్మిక వర్గం జాతీయ బూర్జువా వర్గంలో నాయకత్వాన్ని పంచుకొనుటను వ్యతిరేకించుతు శర్మ యీ క్రింది వాదనలను లేవ నెత్తారు.

జాతీయ ప్రజాస్వామ్య విప్లవంలో పెట్టుబడిదారేతర ఆర్థికాభివృద్ధిని వ్యూహాత్మక లక్ష్యంగా నెంచాలి, దాని పురోగమనం మెట్టుమెట్టుగ అంచెలుగా లేక దశలలో సాగుతుందనే అవగాహన యీ విషయంలోగల గందరగోళానికి స్పష్టతను చేకూర్చు తుంది. అతివాదులు యీ దశలో సోషలిస్టు విప్లవాన్ని కోరుతు ఆచరణలో దాని కనుకూలంగా కార్మికవర్గ నియంతృత్వాన్ని కోరుతున్నారు. అయితే, కుదించబడిన

దైనా సోషలిజానికి ముందు ఆర్థికాభివృద్ధిని పెంపొందించి పరిణామాన్ని సుగమం చేయుటకు ఒక మధ్యస్థ దశ అవసరముందని శర్మ అంటున్నారు. అట్టి ఆర్థికాభివృద్ధి పెట్టుబడిదారేతర మార్గంలో అట్టి విధానంలో ఆసక్తిగల వర్గాలు శాఖలతో నాయకత్వంలో భాగస్వాములుగ ఆచరణ కొనసాగుతుంది, శర్మ ప్రజాస్వామ్య వాదులుగ మారిన వ్యక్తుల విషయంగాక ఆ వర్గపు ప్రతినిధులతో సంయుక్తంగానాయకత్వం వహించుటగా స్పష్టం చేసారు.

భారత పెట్టుబడిదారి విధానం కొంతవరకు అభివృద్ధి చెందింది. కార్మికవర్గం తృతీయ పంచంలోని అనేక దేశాలకంటె సంఖ్యాబలం కలిగివుంది. అందుచేత కార్మిక వర్గం మరికొంత ముఖ్యపాత్ర వహించగలుగుతుంది. గుత్తేతర బూర్జువా వర్గం కొన్ని సంఘటనలలో సామ్రాజ్యవాద వ్యతిరేకతను ప్రదర్శించి, కొన్ని చర్యలు గైకొనవచ్చు. వాటిని పరిగణలోనికి తీసుకొనకుండిన క్లిష్ట పరిస్థితులను కొన్నింటిని తెచ్చుకొన్నవారమగుదము. అయితే పెట్టుబడిదారి విధాన వ్యతిరేకత పెట్టుబడిదారేతర వైఖరి మాత్రమే ఆ విధానానికి దారి తీయదు.

ఈ విధానం, ఐక్యసంఘటనా వ్యూహాన్ని ఎత్తుగడలను సామ్రాజ్యవాద వ్యతిరేక పెట్టుబడిదారేతర పోరాటస్థాయిలో వచ్చేవారినందరిని కలుపుకొని కార్మిక, కర్షక పెటీబూర్జువాలపై ఆధారపడి, నగర చిన్న పెట్టుబడిదారులు పాల్గొనుట ఆశించిన సౌలభ్యాలను కలుగజేయాలి. మధ్యతరగతి బూర్జువావర్గాలలో కొన్ని కలసిరావచ్చు సహకరించవచ్చు, కాని దాని అర్థం పెట్టుబడిదారేతర జాతీయ ప్రజాస్వామ్య ప్రభుత్వంలో జాతీయ బూర్జువావర్గంలో నాయకత్వాన్ని పంచుకొనుటగా నిర్ధారణ చేయరాదు. ఈ విధంగా శర్మవాదనచేసి జాతీయ ప్రజాస్వామ్య బూర్జువావర్గం సంయుక్త నాయకత్వాన్ని చేబట్టుటను తిరస్కరించారు [1].

సంక్షిప్తంగా పాలంవర్గాలలోని అత్యంత అభివృద్ధి నిరోధకశక్తులపై దాడిని కేంద్రీకరించుటలో ఎవరికి వివాదంలేదు. అది మార్క్సిస్టు లెనినిస్టు వ్యూహం, ఎత్తుగడలను అనుసరించేవుంది. కాన అందరు అర్థం చేసుకొనగలరు. అందుచేత పాలక పార్టీలోని మురార్జీదేశాయ్, యస్. కె. పాటిల్ వర్గాలను బయటవున్న స్వతంత్ర పార్టీ, జనసంఘపార్టీలతోను తదితర అభివృద్ధి నిరోధకులతో పోరాడి వేరుపరచి వోడించవలసి వున్నది. అయితే వివాదం, మితవాద, అభివృద్ధి నిరోధకశక్తులను వేరు పరచి వోడించుటకు అనుసరించే విధానంపై పాలకపార్టీలోని "అభ్యుదయకర జాతీయ పంథాలో ఆర్థికాభివృద్ధి గావించాలనే పాలక వర్గాలలోని శక్తులను బలపరచాలనే అంశంపై మాత్రమే అట్టి ఐక్యసంఘటనా విధానంలో పాలకపార్టీలోని అభ్యుదయ శక్తుల కొంత బలపడుట సహజమే. అయితే అభివృద్ధి నిరోధకుల వోటమి, అతివాదశక్తులు బలపడితే లక్ష్యం నెరవేరుతుంది.

---

1. ప్రోబ్లంమ్స్ ఆఫ్ నేషనల్ లిబరేషన్ (1976) వా 1, సం. 2. పే. 110-111

# (vii)

## చీలికల సిద్ధాంతం రూపొందుట

అంతర్జాతీయ కమ్యూనిస్టు వుద్యమంలో చెలరేగిన సైద్ధాంతిక పోరాటం ఆ పరిధులను దాటి దూషణ భూషణలకు, నింద అపనిందలకు దారి తీసి, ఆ వుద్యమాన్ని బలహీనపరచిందనుట నేడు చారిత్రిక వాస్తవంగా రుజువైన దానిగా చెప్పుకొనవచ్చు. సంస్కరణవాదాన్ని తీవ్ర విమర్శకు గురిచేస్తున్నామని వొకరు, అతివాద పిడివాదాన్ని విమర్శించుచున్నామని మరొకరు, కమ్యూనిస్టు వుద్యమాన్ని అప్రదిష్ట పాలుచేసి సామ్రాజ్యవాద ఆయుధాగారానికి, మరికొన్ని నూతన ఆయుధాలను పరోక్షంగా సప్లయి చేసారు. ఇరువురు ఆశించిన రాజకీయ ప్రయోజనం వొకరు తమ సాంప్రదాయ ప్రపంచ కమ్యూనిస్టు వుద్యమ నాయకత్వాన్ని కాపాడుకొనుటకు, మరొకరు ఆ వుద్యమంపై తమ నూతన నాయకత్వాన్ని స్థాపించుటకు ప్రయత్నాలు యిమిడి వున్నవి. అది సాధ్యంకానిచో వుద్యమం నుండి కొందరిని వెలివేసి లేక వుద్యమాన్ని చీల్చియైనా నాయకత్వం కొరకు చేసిన ప్రయత్న ఫలితమిది.

ఈ ప్రయత్నంలో భాగంగా చైనా సైద్ధాంతికవైఖరుల వేదికను పరిశీలించవలసిన అవసరముంది. ఇందుకు అవలంభించిన పద్ధతులు "వర్గపోరాటం", "విప్లవం", "కార్మికవర్గ నియంతృత్వం"అని సాధ్యమైనంత పెద్దగా, నిరవధికంగా మారుమ్రోగించుట, అతివాద పెడవాదులందరూ గతంలో అనుసరించిన మార్గాలనే అనుసరించారు. లక్ష్యం తామొక్కరమే శాస్త్రీయ మార్క్సిస్టు విప్లవ పంథాకు కట్టుబడివున్నామని యితరులు వారి చీలికల ప్రయత్నాలను ప్రతిఘటించిన వారిని "సంస్కరణవాదులు విద్రోహులు" లెనినిజానికి వ్యతిరేకులు అని నిందా ప్రచారంచేసి తామేసిసలైన విప్లవకారులమనే అభిప్రాయాన్ని కలుగచేసారు. లెనిన్ విచ్ఛిన్నకారుల నాయకుల గ్రూపుల ప్రయత్నాలను ఎల్లప్పుడూ, కార్మికవర్గానికి తీరని ద్రోహంగా ఖండించారు విచ్ఛిన్నకారులు చీలికవాదులు, అతివాద మితవాద సంస్కరణవాద పెడమార్గాలు అవలంభించిన రెండుతరగతులకు చెందినవారు, వారి దేశాలలోని పరిస్థితుల ననుసరించి రూపొందారు. లాటిన్ అమెరికాలోని దేశాలలో 1960 దశకంలో కమ్యూనిస్టు పార్టీ నుండి "అతివాదులు" చీలిపోయి వేరే పార్టీని పెట్టుట, అదే విధంగా "మితవాదులు" చీలిపోయి వేరేపార్టీ పెట్టిన సంఘటనలువున్నవి. కాన కమ్యూనిస్టుపార్టీలు చీలుటకు "మితవాదులు" లేక "అతివాదులు" లేక "ఇద్దరూ" బాధ్యులు కావచ్చు. చీలికకు మైనారిటి యెంత వుత్సాహాన్ని చూపుతుందో మెజారిటీ కూడ అంతటి వుత్సాహాన్ని చూపవచ్చు లేక పరోక్షంగా అదే మార్గంలో పయనించవచ్చు.

## చీలికల సిద్ధాంతం

"అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ ఐక్యత" అనే మావోవ్యాఖ్యలో సోవియట్ కమ్యూనిస్టుపార్టీ బహిరంగలేఖలో చైనా కమ్యూనిస్టుపార్టీ చీలికలను ప్రోత్సహించుచున్నదనే వ్రాయుటను ఖండించుతు, సోవియట్ కమ్యూనిస్టుపార్టీ సంస్కరణవాదంలో మునిగిపోయి, ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమ ఐక్యతకై నిలబడిన దానిగా నాటకమాడుతుందని వాస్తవానికి తాము 1957 విజ్ఞప్తి 1960 ప్రకటనలకు కట్టుబడి వుండగా సోవియట్ పార్టీయే మెజారిటీ పార్టీల కూటమిగా, చీలికల తత్వాన్ని ప్రోత్సహించుతున్నదని, మావో తీవ్రంగా విమర్శించారు.

ఈ విమర్శనాక్రమంలో మార్క్స్, ఎంజెల్సులు "ప్రపంచ కార్మికులారా ఏకంకడని" నినాదమిచ్చి, శాస్త్రీయ కమ్యూనిస్టు సిద్ధాంతాన్ని, ఆచరణను పెంపొందించారని బకునిస్టుల ప్రౌధనిస్టులు, బ్లాన్కీవనిస్టులు, లస్సేనియన్స్లు, తమ అవకాశవాద విధానాలను ఇంటర్నేషనల్ వర్కింగ్ మెన్స్ అసోసియేషన్పై, రుద్ద ప్రయత్నించుటతోపాటు, మెజారిటిని తమవైపు సమీకరించి, సెక్టేరియన్ విధానాలు అవలంభించినపుడు, మార్క్స్ఎంజెల్సులు బకునిస్టులకు వ్యతిరేకంగా వారి చీలికల యత్నాలకు వ్యతిరేకంగా సూత్రబద్ధమైన పోరాటాన్ని సాగించారు. ఫలితంగా 1872లో ఇంటర్నేషనల్ హేగ్ కాంగ్రెసులో వారి చీలికల యత్నాల కారణంగా, వారు బహిష్కరించబడిన కాంగ్రెసులో మార్క్స్ స్వయంగా పాల్గొన్నారు. హేగ్ కాంగ్రెసు, బకనిస్టులను బహిష్కరించక "ఐక్యతా" వేదికగా వ్యవహరించిన ఇంటర్నేషనల్ ముక్కలైపోయేదని ఎంజెల్స్ బెబెల్కు, 20 జూన్ 1873లో వ్రాసిన లేఖలో వివరించారు. ఈ విధంగా మార్క్స్, ఎంజెల్స్ ప్రథమ ఇంటర్నేషనల్లో మార్క్సిజం-ఆధిక్యతను నిలబెట్టారు. తదనంతరం 1875లో జర్మన్ సోషల్ డెమోక్రటిక్ పార్టీ గొథే కార్యక్రమాన్ని విమర్శనకు గురిచేసి ఇంటర్నేషనల్ను విప్లవ పథంలో నడిపించారు.

అన్ని పార్టీలలో వలెనె, రష్యన్ సోషల్ డెమోక్రటిక్ లేబరు పార్టీలో విప్లవ పక్షం, అవకాశవాదపక్షం రెండూ వున్నవి. బోల్షివిక్లు లెనిన్ నాయకత్వంలో, మెన్షివిక్లతో సుదీర్ఘ సైద్ధాంతిక, రాజకీయ పోరాటాన్ని, కార్మికవర్గపార్టీ ఐక్యతకొరకు విస్తరింపజేసారు, చివరకు 1912లో మెన్షివిక్ల అవకాశవాదాన్ని చీలికల ప్రయత్నాలను సహించక, వారి పార్టీ నుండి బహిష్కరించారు. ఐక్యత గొప్ప ధ్యేయం, గొప్పవినాదం. అయితే కార్మికవర్గ లక్ష్యానికి మార్క్సిస్టుల ఐక్యత అవసరం, కాని మార్క్సిస్టు వ్యతిరేకులతో ఐక్యతకాదు" అని లెనిన్ అన్నారు.

"ఐక్యత, పోరాటం లేక చీలికలు-విభజన-నూతనప్రాతిపదికపై నూతన

ఐక్యత-అంతర్జాతీయ కార్మికోద్యమాభివృద్ధికి తాత్వికసూత్రం[1]" అని మావోతన వ్యాఖ్యలో పేర్కొన్నారు.

అంతర్జాతీయ కమ్యూనిస్టు వుద్యమచరిత్రలో, ఐక్యతా పరిరక్షకులు చీలిక సృష్టికర్తల మధ్య జరిగిన పోరాటాలు ప్రతికాలంలోను మార్క్సిజం-మార్క్సిస్టు వ్యతిరేకుల మధ్య జరుగుట స్పష్టంగానే వున్నది. జాతీయంగా అంతర్జాతీయంగా నిజమైన ఐక్యత మార్క్సిజం-లెనినిజం ప్రాతిపదికపైనే సాధ్యం.

"అంతర్జాతీయంగా యేవొక్కదేశంలోనైనా కార్మికవర్గశ్రేణులలో అవకాశ వాదం, సంస్కరణవాదం ప్రబలినచో చీలిక అనివార్య మగుతుంది. కమ్యూనిస్టు వుద్యమంలోని ప్రతి చీలిక అవకాశవాదం సంస్కరణవాదం మార్క్సిజాన్ని, లెనిని జానికి ద్రోహం చేయుటవలన అనివార్యమగుతుంది[2]."

"చీలికల తత్వమంటే యేమిటి?" అని ప్రశ్నించి, "మార్క్సిజం, లెనినిజం నుండి చీలిపోవుట" అని మార్క్సిజానికి, లెనినిజానికి, కార్మికవర్గ ఐక్యతకు ప్రాతిపదికకు ద్రోహం చేసేప్రతివ్యక్తి-చీలికవాది" అని నిర్వచించారు. ఇంకా "దాని అర్థం కార్మికవర్గ విప్లవపార్టీలో చీలిక. సంస్కరణవాద[3]. పంథాను కొనసాగించుతు, కార్మికవర్గ విప్లవపార్టీని, సంస్కరణవాద బూర్జువా పార్టీగా మార్చే ప్రతివ్యక్తి,వొక చీలికవాదే. అంటే, విప్లవవాదుల విస్తృత కార్మికవర్గ ప్రజాసామాన్యం మధ్యచీలిక. అని వివరించారు కార్మికవర్గ ఐక్యత గీటు రాయి చేసారు.

"ఎక్కడ వర్గచైతన్యం గల అత్యధిక కార్మికవర్గం నిర్దిష్ట నిర్ణయాత్మకంగా సమీకరించబడుతుందో అక్కడ అభిప్రాయ, ఆచరణ ఐక్యత స్పష్టంగా కన్పడుతుంది. అత్యధిక కార్మికవర్గపు కోర్కెలను, అవకాశవాదం, సిగ్గులేకుండా నీరుగార్చుతుంది. కార్మికవర్గ ఐక్యతను విచ్ఛిన్నం చేస్తూ చీలికతత్వం బూర్జువావర్గపు అవసరాలను తీర్చుతుంది. బూర్జువావర్గం నిరంతరం కార్మికవర్గంలో చీలికలుకొని వచ్చుట, దాని విధానంగా చేబట్టింది. కార్మికశ్రేణులలోని వారిని కొనివేయుట ద్వారాగాని, విద్రోహ ఏజెంట్లను రూపొందించుట ద్వారాగాని బూర్జువావర్గం తమ లక్ష్యసాధనకు ప్రయత్నిస్తున్నది.

"సంగ్రహంగా అవకాశవాదం, సంస్కరణవాదాలు, చీలికల తత్వానికి రాజకీయ సైద్ధాంతిక పునాదులు. అవకాశవాదం, సంస్కరణవాదాల నిర్మాణస్వరూపమే చీలికతత్వం. అవకాశవాదాన్ని, సంస్కరణవాదాన్ని, చీలికలతత్వం, పెక్టేరియని

---

1. మావో (1963 ?) అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ ఐక్యత. (ఆంగ్లంలో) మావో నం (?) వ్యాఖ్య పే. 10.

2. — అదే పే. 10.

,,,, అదే పే. 10.

ఙంగా చెప్పవచ్చును. కమ్యూనిస్టు వుద్యమంలో సెక్టేరియనులు సంస్కరణవాదులు అత్యంత విద్రోహ చీలికదారులని[1]" మావో తెలిపారు.

క్రుచ్ఛెవ్ నాయకత్వంలోని సి. పి. యస్. యు. అతి పెద్ద చీలిక దారులు.

సోవియట్ కమ్యూనిస్టుపార్టీ 20-22 పార్టీ కాంగ్రెసుల మధ్య సంస్కరణ వాదాన్ని చేబట్టి, కార్మికవర్గ విప్లవ కార్మికవర్గ నియంతృత్వాలకు వ్యతిరేకంగా, "శాంతియుత సహజీవనం" "శాంతియుత పరిణామం", "ప్రజలందరిప్రభుత్వం" "ప్రజాసామాన్యపుంతటి పార్టీ" అనే నినాదాలిచ్చి ఇది మార్క్సిజం, లెనినిజాన్ని, కార్మికవర్గ అంతర్జాతీయతను త్రోసిబుచ్చి నేటి చీలికల ప్రమాదాన్ని తెచ్చారు.

ప్రపంచ కమ్యూనిస్టుపార్టీ 1957 విజ్ఞప్తిని, 1960 ప్రకటన రూపొందించిన పార్టీల మధ్య సంబంధాలను మార్గదర్శిక సూత్రాలను త్రోసిబుచ్చి అగ్రరాజ్య జాతీయతత్వాన్ని సోదర సౌహార్ద పార్టీల యెడల ప్రదర్శించారు, సార్వభౌమాధికారాన్ని దెబ్బతీసారు వారి అంతర్గత విషయాలలో కలుగజేసుకొన్నారు విద్రోహచర్యలకు పొడగట్టారు సౌహార్ద మిత్రదేశాలపై ఆధిపత్యం వహించ ప్రయత్నించారు. "అంతర్జాతీయ శ్రామికశక్తి విభజన పేరుతో, సౌహార్ద దేశాలు సోషలిస్టు నిర్మాణాన్ని చేబట్టుటను వ్యతిరేకించారు. అగ్రరాజ్య తత్వవిధానాన్ని అనుసరించుటలో సి. పి. యస్ యు నాయకత్వం మొరటుగా రాజకీయ, ఆర్థిక, సైనిక వొత్తిడులను సౌహార్దపార్టీలపై వుపయోగించారు. అల్బేనియా కమ్యూనిస్టుపార్టీ నాయకత్వాన్ని ప్రభుత్వాన్ని కూలద్రోయండని బహిరంగ పిలుపునిచ్చారు. రాయబార సంబంధాలన్నిటిని, వార్సా సంధి సంస్థ సభ్యవిభాగల చట్టబద్ధ హక్కులను నిరంకుశంగా తొలగించారు. చైనా-సోవియట్ సరిహద్దులలో సంఘర్షణలు రెచ్చగొట్టారు, సింకియాంగులో విద్రోహ చర్యలకు పాల్పడ్డారు. చైనా కమ్యూనిస్టుపార్టీ కేంద్ర కమిటీ నాయకత్వ సభ్యుల కొందరితో చైనా కమ్యూనిస్టుపార్టీలోని పార్టీ వ్యతిరేక శక్తులు కొన్ని తమ ముఖ్య మిత్రులని చెప్పారు. చైనా పార్టీ సాధారణ పంథాను "పెద్దగా ముందుకు దూకుట" విధానాన్ని ప్రజా కమ్యూనులను వ్యతిరేకించేవారిని సాహసవంతులని పొగిడారు క్రుచ్చేవ్. ఇది పార్టీ అంతర్గత విషయాలలో కలుగ జేసుకొనుట తప్ప మరొకటి కాదు. సోవియట్ కమ్యూనిస్టుపార్టీ నాయకులు తమ పార్టీ వేదికను సౌహార్దపార్టీ కాంగ్రెసుల వేదికలను తమ పార్టీ రాజకీయవిధానాలను ఆమోదించని సౌహార్దపార్టీలపై దాడులకు వినియోగించారు.

---

1. మావో (196౩ ?) అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమం ఐక్యత. (ఆంగ్లంలో) మావో నం (?) వ్యాఖ్య పే. 10.

సోవియట్ కమ్యూనిస్టుపార్టీ నాయకులు సౌహార్ధపార్టీలమధ్య సంప్రదింపుల ద్వారా యేకగ్రీవామోదాన్ని పొందే ప్రయత్నించు సూత్రాన్నివదలి అనువాయితిగా నిరంకుశ నిర్ణయాలుచేసి, యితరులకు ఆజ్ఞాపత్రాలు జారీచేయసాగారు. అందరికి సంబంధించిన ప్రధాన విషయాలపై, సంయుక్త వొప్పందాలకు త్రోసివేసి, తమ యిష్టానుసార నిర్ణయాలు చేసి, యితరులపై అమలుకై వొత్తిడి చేయసాగారు

సౌహార్ధ పార్టీల మధ్యగల అభిప్రాయ భేధాలను, పార్టీల అంతర్గత సంప్రదింపులద్వారా పరిష్కరించుకొనాలనే సూత్రాన్ని అతిక్రమించారు. సోవియట్ కమ్యూనిస్టు పార్టీ నాయకత్వం సౌహార్ధ పార్టీలను రాయబార చదరంగంలో పావులుగ తలస్తున్నది. అనేక కమ్యూనిస్టు పార్టీలలో తమ విధానాలను అనుసరించేవారిని సోవియట్ కమ్యూనిస్టుపార్టీ నేరుగ బలపరస్తుంది పెట్టుబడిదారి దేశాలలోని కమ్యూనిస్టుపార్టీలలో వేర్పాటు వాదులకు నిర్మాణ చీలికల స్వరూపాన్ని యిచ్చింది. సోవియట్ కమ్యూనిస్టుపార్టీ వేర్పాటు వాద విధానం.

## సౌహార్ధ పార్టిలలోని కమ్యూనిస్టు వ్యతిరేక గ్రూపులను బలపరుస్తున్నారనే నేరారోపణను తిరస్కరించుట

ఈ విషయంలో వాస్తవాలను మావో యిలా వివరించారు కొద్ది సంవత్సరాలుగ కొన్ని పార్టీలలో యేర్పడిన చీలికలు సి.పి.యస్.యు. నాయకత్వం తమ సంస్కరణవాద విధానాలను బలవంతంగా యితర పార్టీలలో అమలుచేయు ప్రయత్న ఫలితంగా యేర్పడుట వాస్తవం. అంతర్జాతీయ కమ్యూనిస్టు వుద్యమం తమ సంస్కరణవాద విధానాలను సోవియట్ కమ్యూనిస్టు కమ్యూనిస్టు పార్టీ నాయకత్వం రుద్ద ప్రయత్నించినందున వుద్యమ ఐక్యత విచ్ఛిన్నమై చీలికలు యేర్పడినవి.

ఉదాహరణకు బెల్జియం కమ్యూనిస్టుపార్టీలో జరిగిన అంతర్గత పోరాటాన్ని చూద్దాము. సోవియట్ కమ్యూనిస్టుపార్టీ నాయకత్వం బహిరంగలేఖలో చైనా కమ్యూనిస్టుపార్టీ అమెరికా. బ్రెజిల్, ఇటలీ, ఆస్ట్రేలియా, ఇండియా కమ్యూనిస్టు పార్టీలలోని కమ్యూనిస్టు వ్యతిరేక గ్రూపులను బలపరస్తూ చీలికలను తీసుకొస్తున్నదని నిందారోపణ చేసింది. వాస్తవాలు యీ క్రింది విధంగా వున్నవి.

బెల్జియం కమ్యూనిస్టుపార్టీలో అభిప్రాయ భేధాలు చాలకాలంనుండి కొనసాగుతున్నవి. ఆ పార్టీలో మెజారిటిగ్రూపు సంస్కరణవాదంలో మునిగిపోయి మార్క్సిజాన్ని లెనినిజాన్ని అంతర్జాతీయకార్మికవర్గ ఐక్యతను వదలివేసింది. హంగేరిలో సోవియట్ యూనియన్ విప్లవ ప్రతీఘాత శక్తులను అణచివేయుటలో కలుగజేసుకొనుటను ఖండించింది. అదే విధంగా బెల్జియన్ సంస్కరణవాద కమ్యూనిస్టుగ్రూపు కాంగోలో బెల్జియం వలసవాదులను ప్రజలు ప్రతిఘటించుటను వ్యతిరేకించింది. యుగోస్లోవియా కమ్యూనిస్టుపార్టీ టిటోయిస్టు కార్యక్రమంలో మార్క్సిజం లెనిని

జాన్ని పరిపూర్ణం చేసే అంశాలున్నవని, బెల్జియం సంస్కరణవాద గ్రూపు పొగిడింది. ప్రపంచ కమ్యూనిస్టుపార్టీల 1960 ప్రకటనలో పరస్పర వైరుధ్యాంశాలున్నవని విమర్శించింది బెల్జియం కార్మికవర్గం 1960-61 సమ్మె పోరాటంలో పోలీసు, సాయుధదళాల హింసాకాండను ప్రతిఘటించుటను సంస్కరణవాదగ్రూపు ఖండించింది. ఈ చర్యలను కా॥ జాక్వెస్ గ్రిప్ప నాయకత్వంలోని మార్క్సిస్టు-లెనినిస్టులు ప్రతిఘటించి, తీవ్రంగా విమర్శించి, మితవాదాన్ని బహిరంగపరచారు ఆ పార్టీలో జరిగిన అంతర్గత సిద్ధాంత పోరాటమది బెల్జియం కమ్యూనిస్టుపార్టీలోని మితవాద పార్టీ నాయకత్వం, యీ పార్టీ అంతర్గత సైద్ధాంతిక పోరాటాన్ని నిర్మాణ విధంగా పరిష్కరించింది. మార్క్సిస్టు లెనినిస్టుల యీ సూత్ర బద్ధ పోరాటాన్ని, అన్యాయ మార్గాలలో పెట్టేదియక్, విభజన పంథాలో, వారి గళాలను నొక్కి అణచివేయ ప్రయత్నించింది. బెల్జియం కమ్యూనిస్టుపార్టీ 14వ, కాంగ్రెసులో జాక్వెస్ గ్రిప్ప తదితర కామ్రేడ్స్ మాట్లాడుటకు కూడ అవకాశం యివ్వకుండా పార్టీ నిర్మాణ సూత్రాలకు వ్యతిరేకంగా పార్టీనుండి వారిని బహిష్కరించుటను ప్రకటించారు.

అట్టి పరిస్థితులలో విప్లవ సాంప్రదాయాలను కాపాడుటకని అంటూ గణనీయమైన పార్టీ సభ్యత్వ నాయకత్వం, సంస్కరణవాదాన్ని మెజారిటీవర్గ వైఖరిని ప్రతిఘటించి బెల్జియం పార్టీని పునర్నించింది. అంటే చీలిక పార్టీని స్థాపించారు. అయితే వారి ఈ చర్య పూర్తిగ సమర్థనీయమైనదాయనే ప్రశ్న వుదయించకమానదు.

భారత కమ్యూనిస్టు పార్టీకి సంబంధించినంతవరకు మరింత క్లిష్టతరమైంది. "అనేక వాస్తవ విషయాల ఆధారంతో, 9 మార్చి 1963న రెమిన్ రిబావో సంపాదకీయవర్గం "సంస్కరణవాదుల దర్పణం" అనే వ్యాసంలో విద్రోహ డాంగే నాయకత్వంలోని వర్గం మార్క్సిజం, లెనినిజం కార్మికవర్గ అంతర్జాతీయతకు ద్రోహంచేసి కార్మికవర్గ తత్వాన్నివదలి, కార్మికవర్గ విప్లవ ప్రయోజనాలను, ప్రజలను వదలి జాతీయ తత్వానికి ద్రోహం చేసిందని వివరించాం. ఈ ముఠా భారతకమ్యూనిస్టుపార్టీ నాయకత్వాన్ని చేజిక్కించుకొని భారత బడాబూర్జువావర్గం భూస్వామ్యవర్గాల వాంఛితాలకనుకూలంగా వారి ప్రయోజనాలకు ప్రాతినిధ్యం వహించే నెహ్రూ ప్రభుత్వ అనుయాయులుగ పార్టీని మార్చప్రయత్నిస్తున్నది."

డాంగే ముఠా విద్రోహమార్గంలో పయనిస్తున్నదని ప్రతివారుచూడగలుగుతున్నారు నేడు. ఇంకా వర్గ పొత్తును ప్రబోధించుతు నెహ్రూ ప్రభుత్వంద్వారా సోషలిజం సాధించుదామంటున్నది. ఆయుధీకరణ విస్తరణ, యుద్ధసమాయత్తతకు, ప్రజలను పీడించే అతిపెద్ద నెహ్రూ ప్రభుత్వ బడ్జెట్టును పార్టీ బలపరస్తున్నది. నెహ్రూ ప్రభుత్వ పన్నుల విధానానికి వ్యతిరేకంగా ఆగస్టు 1963లో పదిలక్షల బొంబాయి కార్మికుల గొప్ప పోరాటాన్ని కమ్యూనిస్టుపార్టీ బలపరచక ద్రోహం చేసింది. జైలులోని కమ్యూనిస్టులను విడుదల చేయాలని కలకత్తా కార్మికవర్గం సమా

వేశంలో ప్రజాసమీకరణ చేయు ప్రయత్నాలను అడ్డుకొన ప్రయత్నించింది ఉద్రేక పూరిత చైనా వ్యతిరేక చర్యలను కొనసాగిస్తూ నెహ్రూ ప్రభుత్వ విస్తరణ విధానాలను బలపరచింది. అమెరికా సామ్రాజ్యవాదపు కౌలుదారుగ మారిన నెహ్రూప్రభుత్వ విధానాలను బలపరస్తున్నది."[1]

సోవియట్ కమ్యూనిస్టుపార్టీ 'అట్టి పెడదారిని పట్టిన వారి" "విద్రోహుల" మద్దతుకై యెంతగానో పరితపించుచున్నది. డాంగే ముఠాలాంటి విద్రోహులకే పరిమితులు లేని సమయాన్ని బలాన్ని సోవియట్ కమ్యూనిస్టుపార్టీ యిస్తున్నది. కమ్యూనిస్టులు విప్లవ సృష్టికర్తలు. వారా కార్యక్రమాన్ని చేబట్టకపోతే, మార్క్సిస్టు-లెనినిస్టులే కారు, సంస్కరణవాదులు వంటివారగుతారు. మార్క్సిస్టు-లెనినిస్టులుగా కమ్యూనిస్టులు సహజంగానే విప్లవ పంథాచేబట్టి, సంస్కరణవాదాన్ని వ్యతిరేకించుతారు.

"అన్నిదేశాలలోని మార్క్సిస్టు-లెనినిస్టులు, నిరంకుశత్వానిక, కష్టాలకుభయపడక, పోరాటసాహసాన్ని కమ్యూనిస్టుల విప్లవోత్సాహాన్ని ప్రదర్శించారు. అట్టి సాహస పోరాట యోధులలో జాక్వేస్ గ్రిప్ప నాయకత్వంలోని బెల్జియం కమ్యూనిస్టులు, జోఅమెజానాస్, మారిసియోగ్రా బొయిస్‌ల నాయకత్వంలోని బ్రెజిల్ కమ్యూనిస్టులు, హిల్ అనుచరులైన ఆస్ట్రేలియా కమ్యూనిస్టులు, ప్రేమలాల్‌కుమారశ్రీ, నాగలింగం షన్ముగదాసన్ నాయకత్వంలోని సింహళకమ్యూనిస్టులు తదితర ఇండియా ఇటాలియన్. ఫ్రెంచి, అమెరికా యితర కమ్యూనిస్టుపార్టీల లోపల బయటా వున్న మార్క్సిస్టు-లెనినిస్టులు పోరాట యోధులున్నారు. ప్రపంచమంతటా కమ్యూనిజం విజయానికై పోరాడే ప్రజాసామాన్యమంతటి సానుభూతి మద్దతు, గౌరవం పొందతగినవారు[2].

"లాటిన్ అమెరికన్ కమ్యూనిస్టుపార్టీలలో సాయుధ గెరిల్లా పోరాటాల పంథావైపు మొగ్గుచూపే అతివాద వర్గాలున్నవి, ఆ వర్గాలు కమ్యూనిస్టుపార్టీల నుండి చీలిపోయి, పెకింగు విధానాల కనుకూలపార్టీలుగ యేర్పడినవి. అదేవిధంగా గెరిల్లాలను బలపరచే వర్గాలు వెనిజులాలో మరో పార్టీగ యేర్పడినవి. ప్రపంచ కమ్యూనిస్టు పార్టీలను చీల్చాలనే చైనా కమ్యూనిస్టు పార్టీ నిర్ణయం, చుయాంగ్ పీపిల్సు డెయిలీలో 27 డిశెంబరు 1963లో "ప్రతిదీ రెండుగా చీలుతుంది" అనే వ్యాసంతో ప్రాచుర్యం పొందింది.

---

1, మావో (1963) అంతర్జాతీయ కమ్యూనిస్టు ఐక్యత (అంగ్లంలో) మావో వ్యాఖ్యానం 7 పె. 38-39.

2. అదే పే. 24.

"ఈ పెకింగును అనుసరించే గ్రూపులు ఎంత పెద్దవి? లభించిన గణాంకాల ప్రకారం మొట్టమొదటి జనవరి 1964లో చీలిన పెరూ కమ్యూనిస్టుపార్టీలోని మెజారిటి కేంద్ర కమిటీ సభ్యులు, 17 ప్రాంతీయ కమిటీలలోని 13 కమిటీలు కలసి చైనా అనుకూల కమ్యూనిస్టు పార్టీగ సమావేశంలో యేర్పడినది, కమ్యూనిస్టు యూత్ లీగ్ ప్రతినిధులు పరిశీలకులుగ సమావేశంలో పాల్గొన్నారు. బొలివియాలో కమ్యూనిస్టుపార్టీ 1965లో చీలింది. కేంద్ర కమిటీలోని 44 సభ్యులలో 9మంది చీలిపోయి వేరే పార్టీని యేర్పరచారు. దేశంలో కొన్ని శాఖలలో బలంగా వున్నారు. మొత్తం 14 శాఖలలోని 6 శాఖలలో చీలికపార్టీని యేర్పాటు చేయగలిగారు. ముఖ్యకార్యాలయాన్ని కాందిశీకులుగ అర్జెంటైనాలో యేర్పరచుకొన్న పెరాగ్వే కమ్యూనిస్టుపార్టీ పెక్కురు విదేశాలలో ఆశ్రయం పొందివున్నా 1965లో చీలిక యేర్పడింది. పార్టీ కార్యదర్శితో సహా మెజారిటి నాయకత్వం చైనా అనుకూల పార్టీగ యేర్పడ్డారు. ఇతరదేశాలలోని చీలిన పార్టీల సంఖ్యాబలాలు లభించలేదు కాని గణనీయమైన శ్రేణులను కలిగి వున్నవి.

"జనవరి 1968కి, మావోయిస్టు పంథాను అనుసరించే కమ్యూనిస్టుపార్టీలు లాటిన్ అమెరికాలో 10కి మించి యేర్పడినవని చైనీయులు ప్రకటించారు. అయితే ఆ గ్రూపులను, పార్టీలను ఆచరణలో గుర్తించుటలో వెనుకాడారు. బ్రెజిల్, పెరు కొలంబియా కమ్యూనిస్టుపార్టీలను మాత్రమే గుర్తించారు. సోవియట్ యూనియన్‌తో చీలిపోయిన వర్గాల విప్లవ కార్యాచరణలో యిమడించిన తీవ్రత యేమీ కానరాలేదు. విప్లవ ధ్యేయమార్గాన్ని సోవియట్ యూనియన్‌తో విడిపోవుటతో సాధించగలిగారు.

"చీలిక ప్రధాన ఫలితం, సోవియట్ విధానాలను అనుసరించే పార్టీల నుండి చురుకైన అతివాద వర్గాలు విడిపోవుటతో సాంప్రదాయ కమ్యూనిస్టుపార్టీలు బహిరంగ కార్యకలాపాలను చేబట్టి సాయుధపోరాటాలను వదలివేసి మితవాదంవైపు పయనించసాగారు[1]. పెకింగ్ అనుయాయులు చీలిపోయిన తరువాత పార్టీలో అంతర్గతపోరాటం, విచ్ఛిన్నతలేనందున సాధారణ కార్యకలాపాలకు పరిమితమయ్యారు. పెకింగ్ విధానాలను అనుసరించే లాటిన్ అమెరికన్ కమ్యూనిస్టువర్గాలు 1964 చివర నుండి, క్యూబాపార్టీ విధానాలను వ్యతిరేకించసాగారు. బొలివియా, కొలంబియా, పెరూలలోని గెరిల్లా పోరాటాలను వ్యతిరేకించుటయేగాక 1967 అల్బేనియా కమ్యూనిస్టు పార్టీ ప్లీనం సమావేశంలో కొలంబియా కమ్యూనిస్టుపార్టీ ప్రతినిధి, లాటిన్ అమెరికాలో వాస్తవానికి కాస్ట్రో వ్యతిరేక సంఘటనను యేర్పాటు చేయుటకు విజ్ఞప్తి చేసాడు.

---

1. లికార్‌గాట్ (1973) రూరల్ గెరిల్లాస్ ఇన్ అమెరికా(ఆంగ్లంలో) పే. 43-44

పెకింగ్ అనుచర కమ్యూనిస్టు వర్గాలు బయట వేరే పార్టీలను పెట్టుటతో గెరిల్లాలు మాజీ సైనికాధికారులు, వెనిజులా, కొలంబియా, గౌటుమెల్లా, బొలివియా కమ్యూనిస్టుపార్టీల కేంద్ర కమిటీ సభ్యులనుండి సాంప్రదాయ కమ్యూనిస్టు వర్గాలకు ప్రతిఘటన వచ్చింది ప్రధానంగా గెరిల్లా పోరాట దళాలనాయకత్వం నగరాలలో వుండాలా లేక గ్రామీణ ప్రాంతాలలోని కొండలలో వుండాల అనే విషయంపై భేదాభిప్రాయాలు వచ్చాయి. కమ్యూనిస్టు పార్టీలు తను శక్తినంత వినియోగించి, గెరిల్లా పోరాటాలను బలపరచుచున్నట్లయితే ఈ ప్రశ్న వుదయించేదేకాదు. ఇదే విషయాన్ని రెజిస్ డెబ్రె ప్రస్తావించారు.[1]

"సనాతన పెరు కమ్యూనిస్టుపార్టీ సోవియట్ సిద్ధాంత నాయకత్వంలోని దాని వలెనె పెకింగ్ పంథానుసరించే పోటీ పెరు కమ్యూనిస్టుపార్టీ గెరిల్లా పోరాటాలను బలపరచే వైఖరిలో లేదు, సాయుధ పోరాటంలో ప్రయోజనాలను ఆశింపుతున్నప్పటికి విధానాన్న మార్చుకొంది. జనవరి 1964లో చైనా విధానాన్ని అనుసరించే పార్టీ యేర్పడింది. అది సంస్కరణవాదంపై పోరాటాన్నే కేంద్రీకరించింది, గెరిల్లా పోరాటాలనభివృద్ధి చేయుటలో శ్రద్ధ వహించలేదు.

"ఆండీస్‌లో 1965 మధ్యలో గెరిల్లా దళాలు చర్యలు ప్రారంభించినవెంటనే, చైనా విధానాన్ని అనుసరించే పార్టీ ప్రారంభంలో మాట్లాడక మిన్నకుంది. పొలిట్ బ్యురో సెప్టెంబరు అక్టోబరులలో సమావేశాలు జరిపి, సాయుధ పోరాట ప్రారంభం పెరు విప్లవాభివృద్ధిలోనూ తన దశను సూచించుతున్నదన్నది. నవంబరు మధ్యలో శిలాప్యూంతె చనిపోయిన తరవాతే, చైనానుసరించే పార్టీ ద్వితీయ జాతీయ సమావేశాన్ని జరిపి పరిస్థితి సమీక్షించి గెరిల్లా పోరాటాలను పార్టీ యెందుకు బలపరచనది వివరించింది చైనా పంథానుసరించే పెరు కమ్యూనిస్టుపార్టీ తమ మహాసభను 5వ కాంగ్రెసుగా పేర్కొంటూ తమ పార్టీయే సాంప్రదాయ పార్టీయని సోవియట్ వైఖరిననుసరించే వారే "చీలిన పార్టీ గ్రూపు"గ పేర్కొంది.

సాయుధ గెరిల్లా పోరాటరూపంలో సామాజిక సంఘర్షణ పెరూలో తీవ్ర ఉన్నత దశకు చేరుకొంది. చారవ "మిర్" గెరిల్లా పోరాటాలను తానే ప్రారంభించింది. చీలిన మైనారిటీపార్టీ మెజారిటీపార్టీని "మిర్" పోరాటాన్ని "సాహసికవాదం" తీవ్రంగా విమర్శించింది. ఫలితంగా చీలిపోయిన "విద్యార్థి బృందాలు" జాతీయ విముక్తి సాయుధ దళాలుగ యేర్పడినవి. ఈ గ్రూపు మరో చీలికకు తదనంతరం గురైంది. చైనా కమ్యూనిస్టుపార్టీ విప్లవానికి ప్రధానాంశాలు, కమ్యూనిస్టుపార్టీ, ఐక్య

1. రికార్‌గాట్ (1973) రూరల్ గెరిల్లాస్ ఇన్ అమెరికా(ఆంగ్లంలో) పే. 84.

సంఘటన, సాయుధ పోరాటంగా పేర్కొంది. విప్లవాన్ని కమ్యూనిస్టులు వొక్కరే, విస్తృత ప్రజాసామాన్యపు పాత్రలేకుండా వారి మద్దతు లేకుండా అసాధ్యమని గుర్తించిన ఫలితం

చీలికల సిద్ధాంతం, మైనారిటీ–మెజారిటీ

జాతీయ సమితినుండి అసమ్మతి తెల్పుతూ బయటకు వెళ్ళిపోయిన 32 మంది చేసిన ప్రకటనలోని, పార్టీ ఐక్యత పరస్పర ఆమోదంపై "ఒప్పందం" ప్రాతిపదికపై సాధ్యమనే అంశాన్ని స్పష్టం చేయుట జరిగిందని, తెనాలి కన్వెన్షన్ నివేదికలో హరికిషన్‌సింగ్ సూర్జిత్, మెజారిటీ దానిని ఆమోదించుట, అంటే, మైనారిటీకి వీటో, హక్కును యివ్వటమేనన్ వైఖరి చేబట్టిందని మెజారిటీపార్టీ సభ్యులను సమీకరించుటకై తాము పార్టీ కాంగ్రెసును జరుపుటకు నిర్ణయించామని తమ విధానాలను సమర్థించుకొన్నారు. భారత కమ్యూనిస్టుపార్టీలోని మెజారిటీవర్గం, మైనాటీవర్గం రెండూ వేరువేరు పార్టీ కాంగ్రెసులు జరుపుటకు నిర్ణయించారనుకొనుటకు, జూలై 1964లో జరిగిన ఐక్యతా సంభాషణలు రెండు వర్గాలు విడిపోవుటకే నిర్ణయించి మధ్యేమార్గవాదులను ఆకర్షించుటకు జరిపిన సంప్రదింపులు, విఫలమగుటకూడ దీనిని తెలియజేస్తుంది,

భారత కమ్యూనిస్టు ఉద్యమంలో చీలిక 1962లో ప్రారంభమై 1964లో అతివాదులు కమ్యూనిస్టుపార్టీ (మార్క్సిస్టు)గ యేర్పడుట పార్టీ చరిత్రలో పెద్దమలుపుగా చెప్పవచ్చును. కమ్యూనిస్టు ఉద్యమంలోని మితవాద శక్తులతో పూర్తిగ తెగతెంపులు చేసుకొనుట పార్టీ చీలిక అవసరం సమర్థనీయమని, మార్క్సిస్టు కమ్యూనిస్టులు చెప్పుకొని, సంస్కరణవాదానికి పార్లమెంటరీ విధానానికి సోషలిజంలోనికి శాంతియుత పరివర్తనపంథాకు వ్యతిరేకంగా "చీలిక"యని సమర్థించుకొన్నారు. అంతర్జాతీయ కమ్యూనిస్టు వుద్యమంక్రుచ్ఛేవ్ నాయకత్వాన్ని వదలి మావో నాయకత్వాన్ని చైనా కమ్యూనిస్టు రాజకీయవిధానాల వైపు మొగ్గుటను తెలియజేస్తుంది. తెనాలి కన్వెన్షన్‌లోనే చెప్పుకొన్నట్లు పెక్కువిషయాలలో అతివాదులలో యేకాభిప్రాయంలేదని కూడ స్పష్టం చేసారు. సైద్ధాంతిక బలహీనతల కారణంగా పార్టీ అంతర్గత పోరాటాన్ని సరియైన మార్క్సిస్టు సూత్రాల ప్రాతిపదికలపై నిర్దిష్టభారత పరిస్థితులకు అన్వయించలేకపోయారు. శాస్త్రీయ విశ్లేషణపై ఆధారపడకుండా, డాగ్మాటిక్, పిడిసూత్రాలను పదేపదే వల్లించే విధానంపై ఆధారపడే వైఖరి అవలంబించారు. భారతదేశ వాస్తవ పరిస్థితులను అధ్యయనం విశ్లేషించే శక్తులు చైనా కమ్యూనిస్టుపార్టీ, విప్లవ అనుభవాలను, పాఠాలను తెలంగాణా అనుభవాల తరువాత గూడ దిగుమతి

చేయు ప్రయత్నం కొనసాగించారు. పార్లమెంటరీ తదితర పోరాట రూపాలన్నిటిని అర్థికతత్వంగా విమర్శించారు. అన్నిపోరాట రూపాలలో పోరాటం సాగించాలని పేర్కొన్నా, పార్టీ ప్రజాసంఘాలు బహిరంగ రహస్య నిర్మాణాలపై నొక్కిచెప్పుట జరిగింది ఆర్థిక, పోరాటాలకు రాజకీయపోరాటాలకు సంబంధాన్ని పరిగణలోనికి తీసుకొనలేదు.

సెక్టేరియనిజం డాగ్మాటిజం నుండి బయటపడుటలో విఫలమైనందున, సమిష్టి పార్టీలోన మితవాద సంస్కరణవాదులు కాని వారినందరిని, మెజారిటీని మార్క్సిస్టు పార్టీలోనికి ఆకర్షించి సమీకరించుటలో విఫలులయ్యారు. అంతేగాక పార్టీలో అతి వాద శ్రేణులు కొన్ని జరిపే అంతర్గత సిద్ధాంత పోరాటంలో పార్టీ రాజకీయ విధానాలకు ఆచరణకు సెక్టేరియనిజం కారణంగా యేర్పడుతున్న అంతరాన్ని, సకాలంలో తగినరీతిలో పరిగణలోనికి తీసుకొని సైద్ధాంతిక అవగాహనను అభివృద్ధి చేయజాలక పోయారు. మితవాదంపై పోరాటం అన్నధోరణిలో 1950 దశకంలో అంతర్జాతీయ కమ్యూనిస్టు నాయకత్వం అతివాద సాహసికవాదాలపై యిచ్చిన అవగాహనలపై, భారతదేశ పరిస్థితులకు అన్వయించి వివరించుటలో వైఫల్యంకూడ స్పష్టం.

కార్మికవర్గ విప్లవ పార్టీలలో నిర్మాణ సమస్యలలో క్లిష్టపరిస్థితులు ఎదురై పార్టీ సంక్షోభంలో పడిపోయింది. నిర్మాణ సమస్యల సంక్షోభపరిస్థితుల కారణంగా, 1949-51లలో, 1950, 1960దశకాలలో స్వీయమానసికదృష్టిలో యీ సమస్యలను పరిష్కరించుటకు ప్రయత్నించినపుడు "చీలిక పరిస్థితులు యేర్పడుట" కమ్యూనిస్టు పార్టీ శ్రేణులన్నిటికి తెలిసిన విషయమే వాస్తవానికి చీలికలన్ని బూర్జువావర్గ ప్రభావజనితాలు, రాజకీయ పరిస్థితులలో వచ్చిన మార్పులతో అవి రూపొందుతవి. మౌలిక భేదాభిప్రాయాలేగాక తప్పుడు విధానాలు, పద్ధతులు ఆచరణ చీలికలకు కారణ భూతాలగుతవి. విప్లవ ప్రజా శక్తులు కూడ తప్పుడు విధానాలు పద్ధతులు ఆచరణల కారణంగా కొన్ని సమస్యలపై భేదాభిప్రాయాలను కలిగివుంటవి. దురభిప్రాయాలు, అనుమానాలు, స్వీయమానసిక సెక్టేరియన్ వైఖరులు చొరవకు అడ్డంకులగుతవి, ఐక్యతా ప్రయత్నాలను నీరుగార్చి, సంక్లిష్టం చేస్తవి. ఒక్కమాటలో తప్పుడువైఖరులు, చీలికల ఘటనలు మన విప్లవపంథాకు అత్యంత నష్టాన్ని కలుగజేసాయి.

విప్లవపార్టీల నిర్మాణపంథాల అవకతవకలతో అంతర్గత భేదాభిప్రాయాలు తీవ్రతరమయ్యాయి. ఎక్కువ చీలికలు నిర్మాణ సమస్యలను వికృతపరచి, స్వీయమానసిక దృష్టి అవలంభించినందువలన యేర్పడినవి. సైద్ధాంతిక, రాజకీయ సమర్థనలు ఎక్కువగా చీలికల తరువాతే రూపొందించబడినవి. ఈ విధమైన చర్యలు, ఘటనలు యొక్కవై ప్రతి నూతన ఛీలిక గంధగోళ పరిస్థితులు లేక సంక్షోభంలో యేర్పడి

కుటుంబ కలహంలో ఒక ప్రత్యేకవర్గం తెగేదాకలాగేతత్వం శిఖరాగ్రం చేరుటతో యేర్పడిన చీలికకు రెండు పంథాల చారిత్రిక సిద్ధాంత పోరాట ఫలితంగాతప్పనిసరిగా చీలిక యేర్పడినదనే వైఖరిని ప్రచారంలో పెట్టుట సహజమైంది. చీలినప్రతిగ్రూపు, మెన్షివిక్‌ల నుండి చీలిన బోల్షివిక్‌లవలె మార్క్సిజాన్ని, లెనినిజాన్ని పరిరక్షించుటకు విప్లవ ధ్యేయంతోనే వేరేపార్టీ పెట్టామని సమర్థించుకొనుటసాగించారు. అట్టి చీలికలకు సైద్ధాంతిక పునాదులున్నవనే నిరవధికంగా పార్టీలో కొనసాగుతున్న సైద్ధాంతిక పోరాటమే, రెండుపంథాల వైఖరుల పోరాటమని దాని ఫలితమే చీలికలు అనే సిద్ధాంతీకరణ చేయసాగారు.

ఈ అసంగత అశాస్త్రీయ అవగాహనలకు తోడ్పడిన నిర్మాణ సమస్యలకు సంబంధించిన మూడు ముఖ్యఅంశాలున్నవి. మొట్టమొదటి కేంద్రప్రధానాంశము, అందరకు తెలిసిన ప్రజాస్వామ్య కేంద్రీకరణసూత్రము, అదే ప్రతిసారి అతిక్రమించబడి అశాస్త్రీయ అపఖ్యాతికర చర్యలకు కారణభూతమైంది. ఆచరణలో ఆదేశాలు నిరంకుశ అధికార తత్వంగా కొనసాగి, అరాచక అంటువ్యాధిగా ప్రకోపించుట జరిగింది. మరో ప్రధాన ముఖ్యాంశం పిడివాద-సెక్టేరియనిజం, సైద్ధాంతిక అపరిపక్వత ముప్పేటగా కలిసి ఆచరణలో రెండుపంథాల సిద్ధాంత పోరాటాన్ని సరియైనమార్గాలలో కొనసాగుటకు అడ్డుగోడ అయింది, అంతర్గత పోరాటం సమన్వయ విశ్లేషణతో పరిష్కారమగుటకు ఆటంకంగా తయారైంది. దీని ఫలితంగా సమర్థించజాలని అపరిపక్వ చీలికలు తిరిగితిరిగి యేర్పడుటకు ఆస్కారమైంది. మరువరాని చివరి అంశం, చీలికలు నిరవధికంగా కొనసాగుట పార్టీలు చిన్నాభిన్నమగుట అన్నిటి ఫలితంగా, గణనీయంగా విప్లవపక్షాల నాయకత్వం గుణాత్మకంగా పతనమైంది. కొంతవరకు సజీవంగా పనిచేయజాలకుండావుంది. నాయకత్వంలోని కొన్నివర్గాలు. కార్మికవర్గేతర వైఖరులతో రోగగ్రస్థులయ్యారు, అధికార వ్యామోహానికి గురయ్యారు. పార్టీజీవితాన్ని యిదే కలుషితం చేసింది. పెక్కుశ్రేణుల నైతికబలాన్నిదిగజార్చింది, అనేక సందర్భాలలో చీలికలకు దారితీసింది.

కమ్యూనిస్టుపార్టీలు చిన్నవిప్లవ పక్షాలు ముఖ్యంగా బూర్జువా పెద్దపార్టీలతో పోల్చినపుడు యిది స్పష్టం. అయితే వారు తమ పొరపాట్లు బలహీనతల సమీక్షించుకొనుట ప్రధానకర్తవ్యం. వారు వారి తప్పులను, బలహీనతలను సరియైన సైద్ధాంతిక అవగాహనలతో పిడివాద వైఖరులను వదలి పురోగమించుటకు చొరవతో వారి కార్యక్రమాలను, పంథాలను నూతన అనుభవాలతో సమీక్ష, విశ్లేషణకావించుకొన్నప్పటికి పొరపాట్లు బలహీనతలను పూర్తిగ వదిలించుకొనజాలకపోయారు. ఈ పొరపాట్లను, బలహీనతలను గుర్తించుట వాటిని సరిదిద్దుకొను సమస్యలలో ఆత్మవిమర్శన ప్రధాన ప్రారంభవర్మ అగుతుంది.

"ఐక్యత–పోరాటం లేక చీలికలు-విభజన-నూతన ఐక్యత" అన్న మావో తాత్వికసిద్ధాంత వివరణ, ఆచరణ ప్రకారమైనప్పటికి నిరంతర చీలికలు విభజన, నూతనచీలికలకు భారత కమ్యూనిస్టు వుద్యమం నిలయమైనదిగాని నూతన ఐక్యత యేర్పడి వుద్యమం బలపడి పురోగమించలేదు. అన్ని కమ్యూనిస్టు వర్గాలు చీలికలు పేలికలైనవేగాని సిద్ధాంత ఐక్యతగాని, నిర్మాణ ఐక్యత గాని, కనీసం కార్మికవర్గ, రైతాంగ ఐక్యతగాని లేక ఐక్యకార్యాచరణ ఐక్యత గాని యేర్పడలేదు. పైగా కార్మికవర్గంలో రైతాంగంలో మధ్యతరగతి వర్గాలలో అనైక్యత ప్రబలిపోయింది. ఈ అనైక్యతను పాలకవర్గాలు పారిశ్రామికవర్గాలు తమ ప్రయోజనాలను పెంపొందించుకొనుటకు బడుగువర్గాలపై దాడులకు సమర్థవంతంగా వినియోగించుకొంటున్నవి ఈ ఫలితాల బట్టి భారత కమ్యూనిస్టు వుద్యమంలోని అన్నివర్గాలు స్వీయమానసిక, సెక్టేరియన్ పిడివాద ధోరణిలో కమ్యూనిస్టు వుద్యమానికి మొత్తంగా ఉపకారం కంటె, అపకారమే యెక్కువగా జేసాయి. ఈ విషయంలో కమ్యూనిస్టు వుద్యమంలోని "మితవాదులు" "నియోమితవాదులు" "అతివాదులు", "నియో అతివాదులు" అందరూ సమానంగానే బాధ్యత వహించవలసి వుంటుంది. భారత స్థానిక ఆర్థిక, రాజకీయ, సామాజిక పరిస్థితులను మార్క్సిస్టు-లెనినిస్టు శాస్త్రీయ దృక్పథంలో అధ్యయనంచేసి, అన్వయం చేసి, నిర్ధారణలు చేసి, ఆచరణలో అనుభవాలతో సరి చేసుకొను శాస్త్రీయపద్ధతులను విధానాలను అనుసరించక శాస్త్రీయ సోషలిస్టు సిద్ధాంతాన్ని "పిడిసూత్రాలుగ" చేసి ఆచరించుట వలన కలిగిన దుష్ఫలితాలనే నేడు మనం చరిస్తున్నాము. ఇది జాతీయంగాను, అంతర్జాతీయంగాను కమ్యూనిస్టు వుద్యమం మొత్తంగా అట్టి ఫలితాలకే గురైంది. ఈ పాఠాలను యిప్పటికైనా గమనించనిచో, చీకటే మిగులుతుంది. ఈ సందర్భంలో మరో ముఖ్యవిషయాన్ని పరిగణలోనికి తీసుకొనవలసి వుంటుంది. సైద్ధాంతిక నిర్మాణ సంబంధమైన భేదాభిప్రాయాలు వచ్చినప్పుడల్లా, వేరే "కుంపటి" రాజేసుకుంటూ పోయేతత్వాన్ని విడనాడాలి. నిర్మాణసమస్యలు అత్యంత సున్నితమైనవేగాక వాటికి పరిష్కారమార్గాల శాస్త్రీయ అన్వేషణప్రధాన వ్యూహం దృష్టిలో కనుగొనుట అత్యంత ముఖ్యం. చీలిపోయి వేరేకుంపటి వెలిగించుట ఆటవిక తెగల సంకుచిత మనస్తత్వం, విశాలవర్గ కమ్యూనిస్టు దృక్పథం కాజాలదు. వాటికి మౌలిక, శాస్త్రీయ కారణాలను అన్వేషించి పరిష్కరించుట శాస్త్రీయ సోషలిజమే కాని, మితవాద రాజీ విధానం కాదు.

## నిర్మాణవైఫల్యాలు

చీలికకుదారి తీసిన నిర్మాణ సంబంధమైన కొన్నివిషయాలు యిక్కడ పేర్కొనవలసివుంది. సమతూకం కలిగినపార్టీ "సంయుక్త సెక్రటేరియట్"ను 1961లో

అంతర్జాతీయ కమ్యూనిస్టు నాయకత్వపు ఆమోదముద్రతో యేర్పడిన వొప్పందం ఫలితంగా యేర్పడింది. అజయ్‌ఘోష్ మరణానంతరం పార్టీ జాతీయ సమావేశంలో సంక్షోభం యేర్పడి చీలికప్రమాదం యేర్పడుటతో దానిని అధిగమించుటకు పార్టీలోని వివిధవర్గాల నాయకుల మధ్య వొక వొప్పందం జరిగింది ఫలితంగా పార్టీ నిర్మాణ నిబంధనలకు సవరణలు ఆమోదించబడి డాంగే అధ్యక్షుడిగా అదే వర్గానికి చెందిన జడ్. ఎ అహమ్మద్, గోవిందసేనాయర్, యోగిందర్‌శర్మ అతివాద వర్గానికి చెందిన సుందరయ్య, జ్యోతిబసు, హరికిషన్‌సింగ్ సూర్జిత్‌లు తటస్థుల వర్గానికి చెందిన నంబూద్రిపాద్, భూపేష్‌గుప్తాలు గల శెక్రటేరియట్ యేర్పడింద జనరల్ శెక్రటరీగా నంబూద్రిపాద్, అతనేపార్టీ వాణిగా వ్యవహరించాలని అధ్యక్షుడు శెక్రటేరియట్ పనిలో కలుగజేసుకొనరాదని వొప్పందం జరిగింది. ఆ విధంగా అధ్యక్షుడు జాతీయ సమితికి వాగ్దానం కూడ చేసాడు. ఈ విధంగా యేర్పడిన మిశ్రమ శెక్రటేరియట్‌లో యేకగ్రీవామోదంలేనపుడు అధ్యక్షుడు శెక్రటరీని సంప్రదించుకొని వ్యవహరించాలని, యీ యిద్దరి మధ్య యేకాభిప్రాయం లేనపుడు, శెక్రటేరియట్ నిర్మాణంలోని మెజారిటి అభిప్రాయాన్ననుసరించి వ్యవహరించాలనే వొప్పందం జాతీయ సమితిలో ఆమోదించబడింది. కొన్ని మాసములు మిశ్రమ సెక్రటేరియట్ సైద్ధాంతిక, నిర్మాణసమస్యలను సమిష్టి అంతర్గత చర్చల ద్వారా ఐక్యతను పెంపొందించుతు, పురోగమించగలదనే ఆశను కలుగజేసింది. చైనా దురాక్రమణతో పార్టీలో యేర్పడిన సంక్షోభంతో యీ వొప్పందాలు నిలువజాలకపోయాయి మార్క్సిస్టు లెనినిస్టు నిర్మాణ ప్రధాన సూత్రమైన ప్రజాస్వామిక కేంద్రీకృత నాయకత్వంగా వుండవలసిన శెక్రటేరియట్ నిర్మాణంలో మితవాద అతివాద తటస్థత నాయకత్వాలన్నీ అవకాశ వాదాన్ని చేబట్టుటతో యేర్పడిన "అతుకుల బొంత" వొప్పందనాయకత్వం రాజకీయ సంక్షోభం యేర్పడిన క్లిష్ట పరిస్థితులలో కూలిపోయింది మార్క్సిస్టు లెనినిస్టు నిర్మాణసూత్రాలను పార్టీలోని అన్నివర్గాలు వదలివేసి "ముఠా వొప్పందాల ద్వారా బూర్జువా రాజకీయపార్టీలవలె ఆచరణ కార్యక్రమాలకు దిగిన వెంటనే రాజకీయ సంక్షోభం యేర్పడుటతో పార్టీ నాయకత్వం కూలిపోయింది. పార్టీలో సంక్షోభం క్లిష్ట పరిస్థులలో అత్యంత అవశ్యకమైన ప్రజాస్వామ్య కేంద్రీకృత సమిష్టి నాయకత్వం లేకుండా పోయింది. ఇదే పార్టీ రెండు సమభాగాలుగ చీలుటకు ప్రధాన కారణంగా చెప్పవచ్చు. అవకాశవాద యేర్పాట్లు యెప్పుడూ పార్టీ మొత్తం లక్ష్యాలు ప్రయోజనాలకంటె గ్రూపుల ప్రయోజనాల దృష్టిలోనే జరుగుతవి సాధారణ పరిస్థితులలో తాత్కాలికంగా కొంతకాలం సాగినా, రాజకీయ సంక్షోభ క్లిష్ట పరిస్థితులలో అవి భగ్నమై పార్టీకి తీరని చారిత్రిక నష్టాన్ని కలుగజేస్తాయి.

పార్టీ శెక్రటేరియట్ కేంద్రకార్యవర్గ సమావేశాలలో చర్చించిన విషయాలు పార్టీయేతర పత్రికలలో చోటు చేసుకొనుట, అవి కావాలని చేస్తున్న "లీకేజీలని", అవి పార్టీలో విచ్ఛిన్నతకు కారణభూతాలని, అగ్రనాయకత్వం కూడ యీ బాధ్యత నుండి తప్పుకొనజాలదని కంట్రోల్ కమిషన్ అభిప్రాయపడి తన నిస్సహాయతను స్పష్టం చేసింది.

"ప్రజాసమస్యలపై మెజారిటీ నిర్ణయాలను పాటించుట సాధ్యం అదే సైద్ధాంతిక, మౌలిక రాజకీయ సమస్యలకు వర్తించదనే "సూత్రీకరణచేసి పార్టీ నిర్మాణ సూత్రాలకు భిన్నంగా జాతీయసమితిలో గల అభిప్రాయ భేధాలను పార్టీ క్రింది వర్గాలకు ప్రధానంగా అగ్రనాయకత్వంతీసుకెళ్ళిన సందర్భాల కారణంగా యీ అంటు వ్యాధి ప్రబలి పార్టీ విచ్ఛిన్నతకు దారి తీసింది పార్టీ నిర్మాణ సూత్రాలననుసరించి పార్టీ పర్యవేక్షణలో జరుగవలసిన అంతర్గత చర్చలను సూత్రాలు వదలివేసి ప్రచారం గావించారు. పార్టీకూడ సకాలంలో మేల్కొని అంతర్గత సైద్ధాంతిక చర్చలను చేబట్టి పార్టీలో సైద్ధాంతిక స్థాయిని, చైతన్యాన్ని అభివృద్ధి చేయక అజ్ఞా పాలన చేసే శిక్షితులపైన సైనిక శ్రేణులను తయారుచేయుటలోనే యెక్కువ శ్రద్ధ తీసుకొన్నది కాని సైద్ధాంతిక సైనికులను చేయలేకపోయింది.

పార్టీలోని మెజారిటీ మైనారిటీ జాతీయ సమితిలో బయటా రెండు ప్రాక్షనులుగానే పనిచేసాయి. అసంఖ్యాక పార్టీ సభ్యులు సానుభూతిపరులుకు అతివాద, మితవాద శ్రేణుల నాయకత్వాల మధ్య యేర్పడుతున్న అఘాతాన్ని చూడజాలక పోయారు. పార్టీ మొత్తంగా బలహీనపడుట శిక్షణా రాహిత్యం నియమ నిబంధనలు క్రమశిక్షణారాహిత్యము తత్ఫలితంగా ప్రజాసంఘాలలో దైనందిన కార్యక్రమాలు- చేబట్టుటలో పూర్తి వైఫల్యత, ప్రజాబలాన్ని కోల్పోవుట జరిగింది. ప్రధమ ఎన్నికలలో 10 శాతం పైగా వోట్లు సంపాదించగలిగింది. ప్రజాబలాన్ని కోల్పోయి తదనంతరం జరిగిన పెక్కు ఎన్నికలలో 2.5 శాతాన్ని పొందగలుగుట దీనినే తెలియజేస్తుంది.

పార్టీ కాంగ్రెసు సన్నాహాలలో ప్రాక్షను విధానాలను అనుసరించువారికి వ్యతిరేకంగా జరిగే పోరాటం క్రింది స్థాయిలలో ప్రాక్షనులకు వ్యతిరేకంగా జరుగు పోరాటంపై ఆధారపడి వుంటుంది. ఇదే విపర్యంగాకూడా అనగా కాంగ్రెసు సన్నాహాలలో ప్రాక్షను వ్యతిరేక పోరాటం సమర్థవంతంగా శాస్త్రీయంగా జరిగినప్పుడే ప్రాక్షను విధానాలు క్రిందికి వ్యాపించకుండా వుంటాయి. సాధారణంగా ప్రాక్షను పోరాటాలు క్రిందినుండి పైకిగాక పైనుండే క్రిందికి వ్యాపించుట మనస్వానుభవము, పైవర్గాలలో ప్రాక్షను పోరాటాలు లేకుంటే, లేక పైవర్గాల మద్దతు క్రింది ప్రాక్షనులకు లభించకపోతే అవి వృద్ధి చెందవు.

పార్టీ పేపర్లను పార్టీ రాజకీయ విధానాలననుసరించి నడుంపబడుతవి అంటే మెజారిటీచే ఆమోదించబడిన విధానాలను ప్రచారంచేయవలసి వుంటుంది. మెజారిటీ అవగాహనకు కూడ భిన్నంగా మైనారిటి అభిప్రాయాలను కూడ పూర్తిగ త్రోసిపేయకుండా ఆమోదించబడిన తీర్మానంలోని రాజకీయాన్ని మాత్రమే పార్టీ పత్రికలో ప్రతిబింబించాలిగాని మెజారిటి ఫ్రాక్షన్ అభిప్రాయాలుకాదు. అదే విధంగా మైనారిటి పార్టీ పత్రికల విధానాలను సమీక్షించాలని మైనారిటి అభిప్రాయాలను పూర్తిగ త్రోసిబుచ్చకుండా పుండగలందులకు అవసరమైన మార్పులు చేయవలసి వుంటుందనుట అసంగతము ఆమోదించబడిన తీర్మానాల విధానాలను మాత్రమే ప్రతిబింబించాలనుట అర్థం చేసుకొనవచ్చు, అట్టి విధానాలను సమర్థవంతంగా అమలుచేయు పత్రికాయంత్రాంగాన్ని యేర్పాటు చేయాలి. ఆ యంత్రాంగం మెజారిటి ఫ్రాక్షన్ అభిప్రాయాలను ప్రచారం చేయరాదు మైనారిటీకూడ తనకు "వీటో" అధికారం కోరరాదు. పార్టీ ప్రయోజనాలనే ప్రధానంగా యెంచాలిగాని, మితవాద, అతివాద ఫ్రాక్షనుల యంత్రాంగంగా పత్రికలు కారాదు.

జాతీయసమితినిగాని మరేపార్టీ నిర్మాణాన్నిగాని, పార్టీ బలాన్ని, ప్రయోజనాలను పెంపొందించుటకు వినియోగించాలిగాని మెజారిటి మైనారిటీలు తమతమ ఫ్రాక్షనుల బలాలను ప్రయోజనాలకొరకు వినియోగించరాదు. పార్టీ కాంగ్రెసులో ఎన్నికైనవారు మెజారిటి మైనారిటీ తమ తమ స్థానాలను గుర్తించాలి. ఎన్నికైన మెజారిటి పార్టీలోని మైనార్టీ స్థానాన్ని మైనారిటి మెజారిటి స్థానాన్ని గుర్తించాలి, రెండూ ఎవరికీ తమ షరతులను డిక్టేటు చేయరాదు. జాతీయసమితి ఎవరి షరతులను అంగీకరించ రాదు, సమిష్టి నిర్ణయాలను మాత్రమే ఆమోదించాలి. దీనికి భిన్నంగా ఎవరు ప్రచర్తించినా మెజారిటి మైనారిటీ అనే భేదం లేకుండా పార్టీ విచ్ఛిన్నకారులే అగుతారు.

ఒక సంస్థ నాయకునిపై ఒక బాధ్యతగల వ్యక్తి వొక ఆరోపణచేసినపుడు ఆ సంస్థ దానిని పరిశీలించుటకు పూనుకొనినపుడు ఆ సమావేశంలో ఆ నాయకుడు పాల్గొనరాదనే విశ్వన్యాయ సాంప్రదాయక సూత్రాన్ని పాటించకపోవుట దానికి అభ్యంతరం తెలిపి, ఒక పక్షం వెళ్ళిపోయినా మిగతా సభ్యులు ఎట్టి అభ్యంతరాన్ని తెలుపకపోవుట సోచనీయమేగాక, ఫ్రాక్షన్‌చర్యగా స్పష్టం. మైనారిటి పక్షం అభ్యంతరం చెప్పి వెళ్ళిపోవుటతో మెజారిటీ పక్ష బాధ్యత మరింత యెక్కువగుతుందేకాని తలనొప్పిపోయిందని కార్యక్రమాలను కొనసాగించుట సమర్థనీయం కాదు.

అక్టోబరు మధ్యలో జరిగిన కేంద్ర శెక్రటేరియట్ సమావేశంలో సమతూకం చిన్నాభిన్నమైంది. శెక్రటేరియట్ చేసిన ప్రకటనదానిలోని చీలికను స్పష్టం చేసింది. మరునటిరోజు జనరల్ శెక్రటరీ చైర్మేన్‌లు పత్రికలకు భిన్నంగా వాఖ్యానించారు. పార్టీ శత్రువులు యీ అవకాశాన్ని, పూర్తిగ వినియోగించుకొని పార్టీ

పైదాడిని సాగించారు. సెక్రటేరియట్ ప్రకటన 12 గంటల తరువాత సెక్రటేరియట్ సభ్యులు ముగ్గురు కలసి సెక్రటరీ కలసి వారు కోరిన విధంగా సెక్రటేరియట్ ప్రకటనకు వివరణ యివ్వమని కోరారు. జనరల్ సెక్రటరీ దానిని తిరస్కరించారు. సెక్రటేరియట్ మరో సభ్యుడు వ్యాఖ్యలలోని భేదాభిప్రాయాలను ప్లీనం సమావేశం మాత్రమే పరిష్కరించగలదనగా ఆ ముగ్గురు తామొకప్రకటన చేయగలమని బెదరించారు. రెండు ఫ్రాక్షనులు వాస్తవంగా పని చేస్తున్నవి జనరల్ సెక్రటరీ మరో సభ్యుడు ఢిల్లీలోనె వుండగా వారిని సంప్రదించకుండా ఛైర్మెన్ తదితర ముగ్గురు సభ్యులు తమ ఫ్రాక్షన్ సభ్యులుతో సంప్రదించి చేయబడింది. జనరల్ సెక్రటరీ, మరో సభ్యునికి, తదితర ముగ్గురు సభ్యులతో జరిగిన చర్చ అంతా "లింక్ వీక్లీ" పత్రికలో వచ్చింది. తదితర ముగ్గురిలో వొకరిచే ఆ సమాచార మివ్వబడిందనుటకు తగిన అంతర్గత సాక్షాధారాలున్నవి.

పార్టీ కాంగ్రెసులో ఎన్నికైన సభ్యులు క్రమశిక్షణాచర్యలు పార్టీ కాన్ఫరెన్సులలో ఎన్నికైన కమిటీలను రద్దు చేస్తూ రాజకీయ పరిష్కారం చేయవలసిన వాటికి క్రమశిక్షణా చర్యల పరిష్కారం పార్టీ విచ్ఛిన్నానికే దారి తీసింది.

డాంగే లేఖల విషయంలో సిద్ధాంత భేదాభిప్రాయాలు అడ్డురావు. పార్టీ సెక్రటేరియట్ ఛైర్మెన్‌లు రెండు ప్రకటనలలో ఆర్కైవ్స్ షెల్ఫును కనీసం చూడనైనా చూడకుండా "ఫోర్జరీలని" వాటిని అతివాదుల "ట్రాట్స్కీవాదుల ప్రచారంగా చిత్రించారు. ప్రతిగా కేంద్రకార్యవర్గ సభ్యులు తొమ్మిదిమంది పార్టీ పరిశీలించనందుకు" నిరాశ చెందామని" ప్రకటించారు అట్టి పరిస్థితులలో సెక్రటేరియట్ కేంద్రకార్యవర్గ సమితిని జాతీయసమితిని పిలుచుట తప్ప మరోమార్గంలేదు. అది చేయక అతివాదుల నిందించుతు పత్రికాప్రకటనలు చేసారు.

పార్టీలో సంక్షోభం శిఖరాగ్రం చేరిన తరువాత ఏప్రిల్ 9, 1963న కేంద్ర కార్యవర్గ సమితి సమావేశమై ఎజండాలో "పార్టీ వ్యతిరేకచర్యలపై తీర్మానంప్రథమ అంశంగా డాంగే లేఖలపై చర్చ రెండవ అంశంగా పెట్టబడింది. అతివాదులు మొట్టమొదట డాంగే లేఖలపై చర్చ జరగాలని అట్టి సమయంలో అధ్యక్షస్థానంలో వుండరాదని పట్టుబట్టారు. అది డాంగే వర్గానికి ఆమోదయోగ్యం కాకపోగా, భూపేష్ గుప్తా రెండు విషయాలు ఒకే అంశంగా ఒకేసారి చేబట్టాలని ప్రతిపాదించారు. డాంగే వర్గం దానిని తిరస్కరించగా, తమపై క్రమశిక్షణాచర్య తీర్మానం తరువాత, తాము యితర చర్చలలో పాల్గొనే అవకాశముండదనే అభిప్రాయంతో బహుశా అతివాదులు ఆ సమావేశాన్ని బహిష్కరించి బయట కెళ్ళిపోయారు. చివరప్రయత్నంగా జ్యోతి బసు మీటింగు తాత్కాలికంగా వాయిదావేసి, సాధారణ వొప్పందానికి ప్రయత్నిం

చాలని ఆ విధంగా మాత్రమేపార్టీ ఐక్యత కాపాడబడుతుందని చేసి ప్రయత్నంకూడ విఫలమైంది. తదుపరి మితవాదులు మెజారిటీగల కేంద్ర కార్యవర్గ సమితి సభ్యులు సమావేశమై పార్టీలో విచ్ఛిన్నకరచర్యలపై తీర్మానాన్ని ఆమోదించి 7 గురు సభ్యులను బహిష్కరించుతు తీర్మానించి జాతీయసమితి ఆమోదానికి నివేదించారు. తీర్మానాన్ని వెంటనే పత్రికలకు విడుదల చేసారు. సాంప్రదాయకంగా జాతీయ సమితి ఆమోదించిన తరువాతనే క్రమశిక్షణా చర్యల తీర్మానాన్ని పత్రికలకు విడుదల చేస్తారు. చివరి విషయంగా లేఖలు డాంగేచే వ్రాయబడలేదని ఫోర్జరీ వుత్తరాలని చెప్పుటకు ప్రశ్నించజాలని సాక్ష్యాధారాలు కన్పించలేదు.

పర్యవసానంగా, అతివాదులు డాంగే గ్రూపు చర్యలను ఖండించమని పార్టీ శాఖలకు, సభ్యులకు, సానుభూతిపరులకు యిచ్చిన పిలుపు రాజకీయ సంస్కరణ వాదానికి కాంగ్రెసుతో సాధారణ ఐక్యసంఘటన పంథాకు వ్యతిరేకంగా యిచ్చిన పిలుపు మాత్రమేగాక, మరోపార్టీ నిర్మాణానికి యిచ్చిన పిలుపుగా స్పష్టం. అంతేగాక డాంగే అనుచరుల ఫ్రాక్షన్ విధానాలకు వ్యతిరేకంగా జరుగు పోరాటం, పార్టీ కాంగ్రెసు సన్నాహాలలో ఫ్రాక్షన్ విధానాలను అనుసరించువారికి వ్యతిరేకంగా జరుగు పోరాటంలో భాగమని అతివాద వర్గాలు స్పష్టంచేసారు. అతివాదులు తమలోను భేదాభిప్రాయాలున్నవని, నంబూద్రిపాద్ రాజకీయ సైద్ధాంతిక సమస్యలపై తన అభిప్రాయాలను సిద్ధాంత పత్రంలో-"రివిజనిజం అండ్ డాగ్మాటిజం ఇన్ కమ్యూనిస్టు పార్టీ ఆఫ్ ఇండియాలో" సమర్పించారని అయినా సంస్కరణ వాదాన్ని వ్యతిరేకించుటలో డాంగే లేఖలను పార్టీ చర్చించుటను వ్యతిరేకించుటలో తాము యేకాభిప్రాయాన్ని కలిగి యున్నామని ప్రకటించారు.

మరో చీలిక: చీలిక సిద్ధాంత ఫలితం

అతివాదులు సి పి ఐ. (యం)ని యేర్పాటు చేసిన తరువాత గూడ విభేదాలు, అంతర్గత పోరాటం యేదో వొకరూపంలో మరింత తీవ్రంగా కొనసాగింది. జాతీయ, అంతర్జాతీయ రాజకీయ పరిణామాలు 1964లో జరిగిన సి.పి.ఐ. (యం) ఏడవ మహాసభ ఆమోదించిన కార్యక్రమాన్ని దానికి నాయకత్వం యిచ్చిన వివరణలను జాగ్రత్తగా అధ్యయనం చేసినట్లయితే సి.పి.ఐ. (యం) పునాది నయారివిజం తప్పని మరేమీకాదని బహిర్గత మవుతుందని నాగిరెడ్డి 1968 ఆగస్టు 15న "బ్లిట్జ్" విలేఖరికి యిచ్చిన యింటర్వ్యూలో, "మీరెలా మోసగింపబడ్డారు" అన్న ప్రశ్నకు డాంగే వుత్తరాలనబడే వాటిచేత మేము ప్రక్కదారి పట్టించబడ్డాం. ఉత్తరాలు సృష్టించిన ఉద్వేగాలను నాయకత్వం రెచ్చగొట్టి వుపయోగించుకొన్నది, చీలికనుకొని వచ్చిన సిద్ధాంత సమస్యలు మరుగునపడ్డాయి. అని సమాధానం చెప్పారు.

"సి.పి.ఐ. (యం) నాయకత్వం, మనం పొందిన కఠోర అనుభవాలు మన కొక హెచ్చరికగా వుంటాయి. అతివాద, విప్లవకర వాగాడంబరం అన్నది సంస్కరణ (రివిజనిస్టు)వాద రాజకీయాలకు, ఆచరణకు సురక్షితమైన ముసుగుగా పని చేస్తుంది. "సి.పి.ఐ.(యం) స్థాపన సందర్భంగామనంవొక విచిత్రమైన పరిస్థితి ఎదుర్కొన్నాము నాయకత్వంలోని అత్యధిక భాగం రివిజనిస్టు లేక నయారివిజనిస్టు వైఖరిలో వున్నారు. రివిజనిస్టు వ్యతిరేక పోరాటంలోనికి వారు చొప్పించిన పెడమార్గం పట్టించేపద్ధతులు, కొత్తగా యేర్పాటు అయిన నిర్మాణాన్ని తప్పుదోవ పట్టించేందుకు వుద్దేశించబడ్డాయి. అంతేగాక, యీ పద్ధతులు తమ రివిజనిస్టు వ్యతిరేకతకు సూత్రబద్ధ ప్రాతిపదిక లేని వివిధ రకాల కెరీరిస్టు, రివిజనిస్టు అవకాశవాద శక్తులుకూడ సి పి ఐ. (యం) నిండాచేరి అందులో నాయకత్వ స్థానాలను హస్తగతం చేసుకోటానికి కూడా అనుకూల పరిస్థితులను కల్పించాయి.

"సి పి.ఐ (యం) నాయకత్వంలో అత్యధిక భాగం వారి అభిప్రాయాలలో స్పష్టంగానో లేక అస్పష్టంగానో "నయారివిజనిస్టులు" తమ అభిప్రాయాలను బయట పెట్టలేదు. చర్చల ఆధారంగా సమస్యలయెడల తమ స్వంత వైఖరిని స్వేచ్ఛగా నిర్ణయించుకునేందుకు పార్టీ శ్రేణులకు అవకాశం యివ్వలేదు. వారు కుయుక్తులకు పెడమార్గం పట్టించే ఎత్తుగడలకు తమ అభిప్రాయాలను దొడ్డి దోవన చొప్పించే పద్ధతులకు తలపడ్డారు.[1] ఈ విధంగా రివిజనిజం నుండి నిర్ణయాత్మకంగా తెగతెంపులు రివిజనిస్టులు, విప్లవ శక్తులుగా స్పష్టంగా జరుగవలసిన రాజకీయ సైద్ధాంతిక విభజన తాత్కాలికంగా నివారించబడిందని కమ్యూనిస్టు విప్లవకారుల అభిప్రాయం.

ఈ "చీలికల సిద్ధాంతం", నక్సల్బరీ శ్రీకాకుళం కమ్యూనిస్టు విప్లవకారుల సి.పి.ఐ. (యం) నుండి చీలిపోవుటకు మార్గదర్శికమైంది. భారతకమ్యూనిస్టు ఉద్యమంలోని కమ్యూనిస్టు విప్లవకారుల ప్రవంతిని నక్సల్బరీ కమ్యూనిస్టు విప్లవకారుల పర్వంలో ప్రత్యేకంగా అధ్యయనం చేయవలసిన అవసరముంది. భారత కమ్యూనిస్టు ఉద్యమ మహోన్నత గంగాప్రవాహంలో అది అదృశ్య సరస్వతిప్రవంతి.

---

1. భారత విప్లవోద్యమం రాజకీయ, నిర్మాణ ఉద్యమ సమీక్ష (1967-88) యు.సి.సి.ఆర్ ఐ. యం.యల్) మొదటి రెగ్యులర్ కేంద్ర కాన్ఫరెన్సు ఏప్రిల్ 1989 ఆమోదించినది, పే. 65-69

# (viii)

## చీలికలపై 90 దశకంలో వాదనలు ప్రతి వాదనలు

"భారత కమ్యూనిస్టు ఉద్యమంలో చీలిక బయటి జోక్యం ఫలితం కాదని అప్పటి ఐక్యభారత కమ్యూనిస్టుపార్టీలో దశాబ్దం సాగిన పార్టీ అంతరంగిక పోరాటం అంతిమ ఫలితం అని స్పష్టం"[1] అని సూర్జిత్, ఆగస్టు 1985లో వ్యాఖ్యానించారు. "చీలికల"పై సూర్జిత్ అవగాహనను, వాదనను ప్రశ్నించుతు ఇంద్రదేవ్‌సిన్హా ప్రధాన విషయంలో మాత్రమే గాక, అంతరంగిక పోరాటం జరిగిన కాలం విషయంలోగూడ కాలవ్యవధిని గురించి సి పి యం. నాయకులు సూర్జిత్ దశాబ్దమని "నంబూద్రిపాద్" 1947లో అధికారం బదలాయింపునకు ముందునాటినుండి కొనసాగుతూనే వున్నది" అని, రెండేళ్ళక్రితం "సూర్జిత్" అర్ధశతాబ్దం పాటు సాగిన పోరాటఫలితం పార్టీ చీలిక కాదేమో పార్టీ పురాతన పత్రాలను పరిశీలించి తెలుసుకొనమని. తమకు సూచించినట్లు సిన్హా పేర్కొన్నారు. కాలం విషయమై వివాదం అంత ప్రధానంగా కన్పించదు పైగా 1947-64లలో తీవ్రత ఆటు పోటులతో అంతరంగిక పోరాటం జరుగుతున్న విషయం అందరికి తెలిసినదే.

"అంతిమంగా సి.పి.ఐ. చీలికకు దారితీసిన దశాబ్ద కాలమన్నది వర్గసాంకర్య పంధా, దానిని వ్యతిరేకించే వర్గపోరాట పంధా మధ్యసాగిన పోరాటమే" అన్న సూర్జిత్ అవగాహనను, సిన్హా ప్రశ్నించుతూ, అదే వాస్తవమైతే చీలికను సృష్టించుటకు వారు ఎందుకు 10 నుంచి 20 సంవత్సరాలు ఆగారు? మరో విషయం, వారి యీ వాదన సైద్ధాంతికంగా గాని, వాస్తవాల నిరూపణల దృష్ట్యా కానీ సరైందికాదని కమ్యూనిస్టుపార్టీ 4వ మహాసభకు 1956లో సమర్పించిన నిర్మాణనివేదికలో పోరాటం రెండు పంధాల మధ్య కాదని అది మూడు పంధాలమధ్య అని దాని నిరూపణకు ఆ నివేదిక నుండి యిలా వుదహరించారు.

"నెలలపాటు సాగిన చర్చ అనంతరం 1956 జూన్‌లో కేంద్రకమిటి సమావేశం మెజారిటి నిర్ణయంతో రాజకీయ తీర్మానాన్ని ఆమోదించింది. ఆ తీర్మానంపై చర్చలలో మూడు ఖచ్చితమైన గ్రూపులు అవతరించాయి." నాలుగవ మహాసభలో అవతరించి, తిరిగి అయిదవ, ఆరవ మహాసభలలో వ్యక్తమైన మూడు ధోరణులు, పార్టీ చీలికదాకా, తర్వాత కొంతకాలం వరకు కొనసాగాయి. ఆరవ మహాసభలో 1961లో మూడు రాజకీయ తీర్మానాలు వచ్చాయి. ఒకటి కేంద్ర కమిటి మెజారిటి తీర్మానం, రెండు "అతివాదుల" తీర్మానం మూడు నంబూద్రిపాద్ తీర్మానం ఒకటి "అతివాదం" నుంచి కేంద్ర కమిటి మెజారిటి తీర్మానంపైదాడిచేస్తే,

మరొకటి "మితవాదం"వైపునుండి దాడి చేసింది, అయితే "అతివాద మితవాద" రెండు ధోరణులు మైనారిటీ ధోరణులే, 4వ మహాసభనుండి 6వ, మహాసభ వరకు యే మహాసభలోను ఆమోదం పొందలేకపోయాయి."

"ఆసక్తికరమైన అంశం, 1968లో సి. పి. యం. పొలిట్ బ్యూరోయే" అతివాద పొరపాటు"అని అంగీకరించినదానిని సరైన "వర్గపోరాటం" అని మరీ చెప్పుతున్నారు. తదనంతరం సిన్హా, సూర్జిత్ వక్రీకరణలను వరుసగా పేర్కొన్నారు. అవి అప్రస్తుతాలు, "పార్టీలో 1954-59ల మధ్య సాగిన అంతర్గత పోరాటం పరిశీలించితే "వర్గపోరాట పంథాకు, వర్గసాంకర్యపంథాకు మధ్య కాదన్న నిర్ధారణ అనివార్యంగా వస్తుంది. పైగా అది మూడుపంథాలమధ్య పోరాటం అటు "మితవాదులు" ఇటు "అతివాదులు" మాత్రమేగాక, యీ యిరువురి దాడికి గురయ్యే కేంద్ర కమిటి మెజారిటి "మధ్యేమార్గపంథా" అన్నదే మూడవ పంథా. అంతర్జాతీయ సైద్ధాంతిక పోరాటం 1960 దశకంలో అత్యంత తీవ్రస్థాయికి చేరుట, భారత-చైనా సరిహద్దు సంఘర్షణలు చెలరేగిన పరిస్థితులలో. భారతకమ్యూనిస్టుపార్టీలో తీవ్ర అంతర్గత పోరాటం చెలరేగి, పరిస్థితులు ఉద్రేకాలు అత్యున్నతస్థాయికి చేరుట, అజయ్‌ఘోష్ మరణంతో ఘర్షణలతో "కేంద్రకమిటి మెజారిటి మధ్యేమార్గం క్రమేణా బలహీనపడి మనజాలకపోయింది.

అంతర్జాతీయ సైద్ధాంతిక వివాదం ప్రజ్వలించుటకు ముందే స్వాతంత్ర్యానంతర దశలో కమ్యూనిస్టుపార్టీలో విభిన్న విచ్ఛికర "అతివాద", "మితవాద" "మధ్యేమార్గ" ధోరణులు వుద్భవించుట వాస్తవం అయితే, ఉమ్మడిగా ఆమోదించిన విధానాలను అమలుపరచాలన్న సాధారణవైఖరిని పార్టీలోని అన్ని దోరణులవారు తలచినందున, ఆభేదాలు తీవ్రమైన పరిణామాలకు దారి తీయలేదు అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో ఘర్షణలు భారత-చైనా సరిహద్దు సంఘర్షణలు, పరస్పర కలహాలు ఫలితంగా తీవ్రపరిస్థితి యేర్పడింది. ఇది అంతకు మునుపు వున్న సంఘర్షణల స్వభావాన్ని మార్చి తీవ్రాతి తీవ్రం చేసింది. పార్టీ ఐక్యతకే తీవ్ర ముప్పుగా పరిణమించింది.

భారత కమ్యూనిస్టుపార్టీ ప్రతినిధివర్గం, అజయ్‌ఘోష్ నాయకత్వంలో అక్టోబరు 1959లో చైనావెళ్ళి,చైనా నాయకులతో చర్చించింది. భారతప్రభుత్వం, నెహ్రూపట్ల మనపార్టీ అంచెనా అభిప్రాయాలు వివరించి, చైనా అభిప్రాయాలు పొరపాటు అని స్పష్టం చేసింది. భారతదేశం "విస్తరణవాదదేశం" కాదని భారతపాలక వర్గాల చైనా విశ్లేషణ తప్పని మన ప్రతినిధివర్గం తెలిపింది. చైనా నాయకత్వం, భారత కమ్యూనిస్టు "ప్రతినిధివర్గవాదనలను పరిగణించలేదు. అజయ్‌ఘోష్‌తో 1960లో అంతర్జాతీయ కమ్యూనిస్టుసమావేశంలో "జాతీయ బూర్జువావర్గంపట్ల" "ఐక్యత-

పోరాటం" ఎత్తుగడల ననుసరించి, చైనా పట్ల భారత ప్రభుత్వం పొరపాటుగ వ్యవహరించినపుడు అవసరమైన పో. టం జరపామని చైనాకామ్రేడ్స్ అజయ్‌తో వాదించారు. భారతదేశంలో బూర్జువావర్గ వ్యతిరేక పోరాటంలో భారత ప్రజానీకమే ప్రధానశక్తిగా వుంటుందనుట స్పష్టం. కాన, చైనా ఎత్తుగడలు, భారతబూర్జువా వర్గాన్ని ప్రజలనుండి వేరుపడునట్లు చేయుటకు ప్రజలను సమీకరించుటకు తోడ్పడు విధంగా వుండాలి. ఇందుకు చైనా అవలంభించిన విధానం వ్యతిరేకంగా వుండుటయే గాక తాము "ఐక్యత-పోరాటం" ఎత్తుగడలను అనుసరించుతున్నామనే వాదన నిర్వీర్యంగా వుంది.

భారత, చైనా కమ్యూనిస్టుపార్టీల నాయకత్వాల చర్చల ఫలితంగా ఈశాన్య రంగంలో, భారత సరిహద్దుగా మెక్‌మాహన్‌రేఖకు, సి. పి. ఐ. బహిరంగంగా తోడ్పాటు యివ్వవచ్చని చైనా నాయకులు అంగీకరించారు. దానికి తాము చట్టబద్ధంగా కట్టుబడి వుండాల్సిన అవసరంలేనప్పటికి, ఆ రేఖను దాటిరామని హామీనిచ్చారు. నవంబరు 11-15, 1959లలో జరుగనున్న మీరట్ జాతీయసమితి సమావేశంలో, బహిరంగంగా మెక్‌మాహన్‌రేఖకు తోడ్పాటు ప్రకటించుటకు పార్టీ సిద్ధంగా వుండగా పార్టీలోని వొంటెత్తు మితవాదులు కొంతమంది కేంద్ర కార్యవర్గానికి జాతీయసమితికి 1 నవంబరు 1959న సుదీర్ఘ లేఖ వ్రాసారు. ఆ లేఖలో మెక్‌మాహన్‌రేఖను ఆమోదించుట అంటే జాతీయ దురహంకారానికిలోనై భారతకమ్యూనిస్టుపార్టీ పాలక వర్గాన్ని వొక కమ్యూనిస్టు దేశానికి వ్యతిరేకంగా బలపరచుట, సోషలిస్టు దేశమైన చైనాదురాక్రమణ చేస్తుందని తలంచుట ప్రపంచ సోషలిస్టు శిబిరంనుండి వేరగుటగా వ్యాఖ్యానించి ఆ విధంగా పార్టీ ఐక్యతకాపాడబడుతుందాయని లేఖ ప్రశ్నించింది. పార్టీని చీలేదాక వెళ్ళగలరనే బెదరింపు లేఖలో గర్భితంగా వుంది. ఒక సోషలిస్టు దేశం దురాక్రమణ చేయజాలదన్న మితవాద అభిప్రాయానికి కట్టుబడిపోయారు. అంచేత చైనాను గాక భారతదేశాన్నే ఖండించాలన్నదే వారి వాదన. 'కమ్యూనిస్టులు దేశభక్తిని విడనాడి జాతీయవిధ్వంసవాదాన్ని చేపట్టాలని అంతర్జాతీయ కార్మికవర్గం ఆదేశిస్తుందని, నమ్మారు.

ప్రపంచకమ్యూనిస్టుపార్టీలు అత్యధికంగా చైనా వెనుక సమీకృత మౌతాయని సి పి. ఐ 'సంస్కరణవాద' నాయకత్వం అంతర్జాతీయ కమ్యూనిస్టు నాయకత్వం నుండి వేరుపడి పోతుందని అతివాదులు నమ్మారు. మావో వాదాన్ని తాము చేపట్టుట వలన పార్టీలో ఆధిక్యతం సంపాదించగలమని, మావోయిజం సహాయంతో "తమ విప్లవ పథంలో" పరుగులు తీయగలమని ఆశించారు. మెక్‌మోహన్‌రేఖకు దక్షిణంగా వున్నప్రాంతమంతా భారతదేశానికి చెందిందేనని ఆ ప్రాంతాలు భారత

దేశ భూభాగంగానే కొనసాగాలని నవంబరు 1959 మీరట్ సమావేశంలో జాతీయ సమితి ప్రకటించాక అతివాద వాంచెత్తు పోకడ నాయకులు కొందరు, అవిచ్ఛిన్నకర పంథాను అమలుపరచడం ప్రారంభించారు. ఉదాహరణకు జ్యోతిబసు మీరట్‌లోనే" మార్గాలు విడిపోయే చోటికి మనం వచ్చాము" అని ప్రకటించారు.

భారత కమ్యూనిస్టుపార్టీ ప్రతినిధివర్గం వియత్నాం వెళ్ళినపుడు, హరికృష్ణ కోనార్ ఎలాగో పెకింగు చేరుకొన్నారు. అక్కడ చర్చల తదనంతరం, స్వదేశానికి వచ్చాక సోవియట్-చైనా నాయకుల వాదనల ప్రాతిపదికలపై క్రింది పార్టీయూనిట్లకు నివేదిక సమర్పించారు. ఆ రెండు పార్టీల మధ్య భేదాభిప్రాయాలు, అప్పుడే రాజుకొంటున్నాయి. ఈ విషయంపై వచ్చిన అభియోగాలకు సమాధానమిస్తూ కోనార్ 1960 డిశెంబరులో జాతీయ సమితి బొంబాయి సమావేశంలో "బెంగాల్ రాష్ట్రకమిటి నిర్ణయించిన మేరకు సి. పి. సి వ్రాసిన లేఖపై నేను నివేదించాను అది పార్టీ పద్ధతికి అనుగుణంగా లేనప్పటికి, పరిస్థితినిబట్టి అలాచేయుట తప్పని నేను భావించుట లేదు పార్టీలోని ఒక భాగం చైనావ్యతిరేక ప్రచారం సాగిస్తున్నందున పార్టీ కామ్రేడ్లను విశ్వసించి వారికి చైనా లేఖను వివరించకపోవటం తప్పని భావించాను. (స్టెనోగ్రాఫ్ రూపంలోని మినిట్సు) మీరట్ జాతీయసమితి తీర్మానంలోని కొన్ని అంశాలతో పశ్చిమ బెంగాల్ రాష్ట్ర సమితిని విభేదించిందని కూడ కోనార్ జాతీయ సమితికి తెలిపారు. జాతీయసమితి చైనా లేఖలోని అంశాలను సోవియట్ లేఖ ఎలా ఖండించి వివరించిందో, ఆ విషయాలను కూడ యింతకుముందు చైనా లేఖ విషయాలను నివేదించిన యూనిట్లకు తిరిగి సోవియట్ సమాధానం వివరించమని, ప్రత్యేకించి కోనార్‌ను జాతీయసమితి ఆదేశించింది. కాని ఆ ఆదేశం అమలు జరుగలేదు.

చైనా భారత భూభాగంలోనికి చాలాదూరం చొరబడి వచ్చినపుడు కూడ వారు మార్గాలు విడిపోవాల్సిన సమయం వచ్చిందని భావించారు. చీలికకోసం చురుకుగా ప్రయత్నించసాగారు. సి.పి.ఐ. (యం) మధురై అగస్టు 1967 కేంద్రకమిటీ అతివాద పెడమార్గమా లేక అతివాద అవకాశవాదమా?" అన్న శీర్షికగల తీర్మానాన్ని ఆమోదించింది. "పశ్చిమ బెంగాల్ దుస్సాహసిక విధానం (నక్సల్బరీ విధానం) పెరుగుదలను అర్థం చేసుకొనాలంటే, 1962 నుంచీ చరిత్రను మనం వెతకాలి. "పాల్ఘాట్‌లో జరిగిన 4వ, పార్టీ మహాసభ 1956లో ప్రారంభమైన సైద్ధాంతిక విభేధాలు 1962లో భారత-చైనా సరిహద్దు వివాదంపైన ముఖ్యంగా 1962 అక్టోబరు నవంబరులలో జరిగిన జాతీయసమితి సమావేశంలో తీవ్రమైన మలుపు తీసుకొన్నాయి. ఈ సమావేశం చైనాను దురాక్రమణదారుగ ప్రకటించింది. "జాతీయ సమితి సమావేశం తర్వాత మెజారిటీ నిర్ణయంతో విభేధించిన మేము పార్టీలోపల పోరాటాన్ని కొనసాగించాలని నిర్ణయించాము. చివరకు రివిజనిస్టులనుండి విడిపోవు

టకు యీ పోరాటము మనలను నెట్టవచ్చునన్న అవగాహనతో పోరాటాన్ని కొనసాగించాలని నిర్ణయించాము అందుచేతనే రాష్ట్రాలలోను ప్రధాన జిల్లాలలోను రహస్య సంస్థలను నిర్మించుటకు కొన్ని చర్యలు తీసుకొన్నాము.[1]"

జాతీయసమితి నవంబరు 1962 తీర్మానం, చైనా దురాక్రమణదారుగా పేర్కొని, దేశ సమగ్రత కాపాడుటకై పిలుపునిచ్చుటను మార్క్సిజం, లెనినిజంకు ద్రోహంగాను మెజారిటి "సంస్కరణవాదంలో ఎంతో లోతుగా కూరుకు" పోయిందని, 1962 నవంబరు నుంచి రహస్య పోటీ కేంద్రాలను ఏర్పాటు చేయుటద్వారా చీలికకు సిద్ధాంతంగా వుండాలని నిర్ణయించుకొనుటను సూచించుచున్నది.

చైనా కమ్యూనిస్టు నాయకత్వం, అంతర్గత పార్టీ సూత్రాలను వుల్లంఘించుతున్నందున భారతకమ్యూనిస్టుపార్టీ ఫిబ్రవరి 1963లో జాతీయసమితి తీవ్రమైన ఆందోళనను వ్యక్తం చేస్తూ వొక తీర్మానాన్ని ఆమోదించింది. అందులో "మనపార్టీ మన నాయకత్వానికి వ్యతిరేకంగా చైనా పార్టీ పత్రికలు, వార్తా సంస్థలు, రేడియో నిందా ప్రచారాన్ని సాగిస్తున్నాయి." వారు "మన పార్టీ నాయకత్వాన్ని రివిజనిస్టు ముఠాగా మనలను "మార్క్సిస్టు లెనినిస్టులమని చెప్పుకొంటున్న వారిగా నిందించారు" పార్టీలోని ఒక భాగాన్ని "సమరశీలురని" మరోభాగం "జాతీయవాదులని, బూర్జువాయేజంట్లని నిత్యం నిందించుట ద్వారా మన పార్టీలో చీలికను ప్రోత్సహించారు. "పార్టీ నాయకత్వం" పార్టీ కామ్రేడ్స్‌ను అరెస్టు చేయించిందని, అత్యవసర పరిస్థితిని పాక్షిక ప్రయోజనాలకు వినియోగించుటను విచారిస్తున్నామని తీర్మానం పేర్కొంది. ఈ తీర్మానం చైనా పార్టీ నాయకత్వంపై యెట్టి ప్రభావం కలిగించక పోగా, 1963 మార్చి 9న పీపిల్సు డెయిలీలో "దర్పణం" శీర్షికతో అపఖ్యాతికరమైన సంపాదకీయం ప్రకటించారు. అది సి.పి.ఐ.ని "ముఠా"గా నిందిస్తూ, నిజమైన మార్క్సిస్టు-లెనినిస్టులు విజయం సాధిస్తారని జోస్యం చెప్పింది.

చైనా కమ్యూనిస్టుపార్టీ అమెరికా, బ్రెజిల్, ఇటలీ, బెల్జియం, ఆస్ట్రేలియా, ఇండియాలలోని కమ్యూనిస్టుపార్టీలలోని, పార్టీ వ్యతిరేక గ్రూపులను, అసమ్మతి వాదులు గ్రూపులుగ యేర్పడుటను బలపరుస్తున్నదని, సోవియట్ కమ్యూనిస్టుపార్టీ 1963 జూలై "బహిరంగలేఖ"లో పేర్కొన్నది.

ఇండోనేషియా కమ్యూనిస్టుపార్టీ కార్యదర్శి, డి.యన్. ఐదిత్ 1963 సెప్టెంబరులో భారతకమ్యునిస్టుపార్టీని చీల్చవలసిందిగా వొక ప్రసంగంలో పిలుపునిచ్చాడు. సాధ్యమైనన్ని యెక్కువ కమ్యూనిస్టుపార్టీలను చీల్చి మావొయిస్టుల నాయకత్వం

---

1. సి.పి.ఐ. (యం) ఆగస్టు 1967 మధురై కేంద్రకమిటి సమావేశంలో "అతివాద పెడ మార్గంపై" తీర్మానం ఆమోదించింది. పే. 18.

క్రింద నూతన కమ్యూనిస్టు ఇంటర్నేషనల్‌ను యేర్పాటు చేయుటకు పన్నిన కుట్రలోని భాగంగా ఐదిత్ పిలుపు నెంచవచ్చు. ఈ సందర్భంలో వియత్నాం, కమ్యూనిస్టుపార్టీ ప్రకటించిన వివరాలు యిలా వున్నవి.

"చైనా కమ్యూనిస్టుపార్టీలో 1960లో ఆధిపత్యంలో వున్న జాతీయదురహంకార ధోరణులు కలవారు, అంతర్జాతీయ కమ్యూనిస్టు వుద్యమంపై ఆధిపత్యం సంపాదించుటకు పథకం వేసారు. ఈ వుద్దేశ్యంతో 1963లో 25 అంశాల ప్రత్యామ్నాయ కార్యక్రమాన్ని, యురోపియన్, సోవియట్‌పార్టీకు వ్యతిరేకంగా, ఆసియా, కమ్యూనిస్టు పార్టీలను చైనా కమ్యూనిస్టు పార్టీ అజమాయిషీ, నాయకత్వంలోనికి తీసుకొని వచ్చుటకు కుట్రపన్నారు.[1]"

వియత్నాం కమ్యూనిస్టుపార్టీ తీవ్రంగా వ్యతిరేకించినందున అంతర్జాతీయ కమ్యూనిస్టు వుద్యమాన్ని చీల్చే పథకం వాస్తవరూపం దాల్చలేదు. అంచేత 1964 ఫిబ్రవరి 24న పీపిల్సు డెయిలీ సాధ్యమైనన్ని కమ్యూనిస్టు పార్టీలను చీల్చవలసిందిగా పిలుపునిచ్చింది. సంపాదకీయంలో అవకాశవాదమూ, సంస్కరణవాదమూ పెచ్చరిల్లుచున్నచోట శ్రామికవర్గ శ్రేణులలో చీలిక అనివార్యమౌతుంది. కమ్యూనిస్టు వుద్యమంలో ప్రతి చీలికకూ,కారణం మార్క్సిజం-లెనినిజంలను అవకాశవాద-రివిజనిజం వ్యతిరేకించుట మార్క్సిజం-లెనినిజంలకు ఇదిద్రోహం చేయటమే కాన ఐక్యతపోరాటం లేక చీలికలు,కొత్త ప్రాతిపదికపై కొత్త ఐక్యత-కార్మికవర్గ ఉద్యమం అభివృద్ధి గతితర్కం యిదే"నని వ్రాసింది.

పై వాస్తవాలను పరిశీలించితే చైనా కమ్యూనిస్టుపార్టీకి చెందిన అతివాద మావోయిస్టు నాయకత్వమే సి.పి.ఐ.లో చీలికకు తోడ్పడిందన్న అనివార్య నిర్ధారణకు రాకతప్పదు. అవసరమైతే మార్క్సిస్టు-లెనినిస్టు పార్టీలను చీల్చి అయినా సరే అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంపై తమ పెత్తనాన్ని నెలకొల్పుటకు, చైనా కమ్యూనిస్టుపార్టీ మావోయిస్టు నాయకత్వం తొందరపడింది.

బి.టి రణదివె, పొరపాటును అంగీకరించి నేరపూర్వక చర్యను చేయటంలో సి.పి.ఐ. నాయకులు, మావో చేతులలో పరికరంగా తయారయ్యారు. అని 1980 దశకంలో వ్యాఖ్యానించారు. చైనా పార్టీ మావోయిస్టు నాయకుల ప్రోత్సాహంతో కమ్యూనిస్టుపార్టీ (మార్క్సిస్టు) నాయకులు భారత కమ్యూనిస్టుపార్టీని చీల్చారని విమర్శించుట, వారు "చైనా యేజంట్లుగా" పనిచేసినారని సూచించుటలేదు, వారిని "చైనా అనుకూలురని" కూడ అనుటలేదు. మావోయిస్టులని లేక మావోయిస్టు అనుకూలురని మాత్రమే అగుతుందని సిన్హా స్పష్టం చేసారు. అంటే అదివారి సైద్ధాం

1. సోవియట్ కమ్యూనిస్టు నాయకులే నేటికాలంలో గొప్ప చీలిక వాదులు. పే. 10. 23)

తిక రాజకీయ అభిముఖాన్ని మాత్రమే సూచిస్తున్నది. పార్టీలోపలవారు చాలా కాలంగా బలమైన వాంచెత్తు పిడివాద ధోరణితో కూడిన సైద్ధాంతిక రాజకీయ అవగాహనను పెంపొందించుకొని వుండటంచేత వారు తేలికగా మావోయిజం అతివాద ఆకర్షణకు గురయ్యారు. మావోయిజం ప్రేరకంగా పనిచేసి వారిని చీలికదారులుగాను అతి తీవ్రవాదులుగ మార్చింది.

భారత కమ్యూనిస్టు ఉద్యమంలో వచ్చిన చీలిక చాలా దురదృష్టకరమైనదని సర్వత్రా అందరూ భావిస్తున్నారు. కమ్యూనిస్టు వుద్యమం బలంగాను సమైక్యంగాను వుంటే, తమకెంతో రక్షణ వుండేదని శ్రామికులు ఆవేదన చెందుతున్నారు. ఈ భావం కేవలం ప్రజాస్వామ్యంలోనే కాకుండా, అన్ని కమ్యూనిస్టు పార్టీలలోని కార్యకర్తలలో వారి హృదయాలలో చోటు చేసుకొని వుంది. అదే భావం మార్క్సిస్టు పార్టీ సభ్యులలోను కార్యకర్తలలోను వున్నట్లు తమ వుపన్యాసాలలో సుందరయ్య అంగీకరించారు. ఆ మేరకు వామపక్షాల బలం, ఐక్యత దెబ్బతిన్నదనుటలో సందేహం లేదని కూడ అన్నారు. అయితే చీలిక అనంతరం చరిత్రను పరిశీలించితే పార్టీ (మార్క్సిస్టు) అనుసరించిన పంథాయే సరియైనదని, రుజువైందని ఆయన చీలికను సమర్థించారు. సుందరయ్య తదితర మార్క్సిస్టు పార్టీ అగ్రనాయకులు 80, 90 దశకాలాలలో కూడ చీలికద్వారా భారతదేశంలో మార్క్సిజం, లెనినిజం రక్షింపబడిందని వాదించారు. అంతేగాక చీలిక అనివార్యం, అవసరము అనికూడ అన్నారు. కమ్యూనిస్టు పార్టీలో వచ్చిన చీలిక వొక చారిత్రిక అవసరంగా రెండు పార్టీలలోని అనేకమంది కార్యకర్తలు, సానుభూతిపరులు, అభిమానులు, అభ్యుదయవాదులు, సామాజిక చరిత్ర అధ్యయనవాదులు తలంచుటలేదు. అదొక విషాదకర చారిత్రిక పొరపాటుగా యెంచుతున్నారు. అది నిర్వహించిన చారిత్రిక విప్లవ కర్తవ్యం కానరాదు. పైగా కమ్యూనిస్టు ఉద్యమం మరెన్నో చీలికలకు గురియగుటకు "చీలికల సిద్ధాంతం" రూపొందుటకు బీజప్రాయ కారణమైంది. ఇది చారిత్రిక సత్యం.

దశాబ్దాల కొలది సైద్ధాంతిక, వ్యూహం, ఎత్తుగడలు, నిర్మాణపరమైన భేదాభిప్రాయాలు వుంటూ వచ్చాయి. అవి 1964లోనే అకస్మాత్తుగా వచ్చినవికావని అందరకూ తెలుసు పాల్ఘాట్ విజయవాడ పార్టి కాంగ్రెసులలో తీవ్ర భేదాభిప్రాయాలు, చీలికల బెదరింపులవరకు వచ్చి, వొప్పందాలతో కార్యక్రమాలు పార్టి కొనసాగించింది. అయినా కలసే 1962 ఎన్నికలలో పాల్గొన్నారు.

---

1. ఇంద్రదీప్‌సిన్హా (1985) భారత కమ్యూనిస్టుపార్టి 1964లో ఎందుకు చీలింది. పే. 50-51.

# సమీక్ష కొన్ని ముఖ్యాంశాలు

## [1]

దేశంలో 1962 ఎన్నికల కాలంలో కాంగ్రెసులో ప్రారంభమైన అంతర్గత సంఘర్షణలకు ఆనకట్టగా వుండే నెహ్రూ మరణానంతరం భేదాభిప్రాయాలు మరింత తీవ్రమైనాయి కాంగ్రెసులో నెహ్రూ పూర్తి విశ్వాసంపొందిన లాల్‌బహదూర్‌శాస్త్రి కాంగ్రెసులోని వివిధ ముఠాల మధ్య సమతూకాన్ని అగ్రనాయకత్వంలో రాష్ట్ర నాయకత్వాలలో గతంలో కొనసాగించినా ప్రధానిగా బలమైన వర్గం వైపు మొగ్గక తప్పలేదు, అదే కారణంగా బలహీన ముఠాలు చీలిక మార్గాలు అన్వేషించసాగాయి. రాష్ట్రాలలో బలమైన గ్రూపులు రాష్ట్ర ప్రభుత్వాల కాంగ్రెసుకు నాయకత్వం వహించుటతో వారే కేంద్రంపై అత్యధికప్రభావాన్ని ప్రసరించకలిగియున్నారు. అతుల్యఘోష్, సి. బి. గుప్తా, బిజుపట్నాయకులు నూతనంగా దేశరాజకీయాలలో అత్యంత ప్రముఖపాత్ర వహించుతున్నారు; అదేకాలంలో చీలికలు ముఠాలు యేర్పడుటకు కారణభూతులగుతున్నారు. తరతమ భేదాలతో అనేక రాష్ట్రాలలో యిదే పునరావృతమగుతున్నది. అదే విధంగా మితవాదనాయకులు మురార్జీదేశాయి, యస్. కె. పాటిల్‌లు తమ రాష్ట్రాలలోనేగాక కేంద్రంలోకూడ బలమైన స్థానాలనే కలిగియున్నారు. రెండు గ్రూపులు సంఘర్షణ పడుతున్నా ముఖ్యమంత్రులను బలపరస్తూనే వున్నారు కేంద్రలోనూ రాష్ట్ర ముఖ్యమంత్రులకు మద్దతునిస్తూ, వారి నుండి బలం పొందే ప్రయత్నాలు చేస్తున్నారు. ఒక విధంగా కేంద్ర, రాష్ట్ర నాయకత్వాలు పరస్పరాధారితులగుట ప్రారంభమైంది.

సంయుక్త సోషలిస్టుపార్టీ నాయకత్వంలో కూడ మితవాద, అతివాద నాయకత్వాల మధ్య ముఖ్యంగా కమ్యూనిస్టులతో సహకారం సమస్యపై సంఘర్షణలు తీవ్రంకాజొచ్చాయి. మాజీప్రజాసోషలిస్టులు కమ్యూనిస్టు, సోషలిస్టు వ్యతిరేకతను కొనసాగించగా, మాజీసోషలిస్టు నాయకులు యస్. యం. జోషి, మధులిమాయి, రాంమనోహరలోహియాలు కమ్యూనిస్టులతో పరిమిత సహకారాన్ని నెరపకోరుతున్నారు. కొందరు సంయుక్త సోషలిస్టులు కాంగ్రెసులో చేరుటతో ఆ పార్టి బలహీనపడింది.

అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ సహకారంతో 1951లో వొక తాత్కాలిక కార్యక్రమము రూపొందించినా 3, 4, 5 పార్టీ కాంగ్రెసులలోను చివరకు 1962లో 6వ, పార్టీకాంగ్రెసులో కూడ తీవ్ర భేదాభిప్రాయాలతో అంగీకృత కార్యక్రమాన్ని రూపొందించజాలక, చీలిపోయే పరిస్థితి యేర్పడగా, సౌహార్ధ ప్రతి

నిధుల సలహాపై వొక రాజకీయ తీర్మానాన్ని ఐక్యతా సూచనగా యిరువర్గాలు ఆమోదించినా, మౌలిక సైద్ధాంతిక భేదాభిప్రాయాలు మరింత తీవ్రం కాసాగాయి. అదే కాలంలో అంతర్జాతీయకమ్యూనిస్టు ఉద్యమంలో చెలరేగిన సైద్ధాంతిక బహిరంగ పోరాటం, సి. పి. ఐ. అంతర్గత సైద్ధాంతిక పోరాటానికి ఆజ్యం పోసినటైంది. దీనికి తోడు ఇండియా-చైనా సరిహద్దు యుద్ధ సమయంలో జాతీయ సమితి నవంబరు 2 న మెజారిటీ ఆమోదించిన తీర్మానానికి ప్రత్యామ్నాయంగా "పృధ్వీరాజ్" మరోచిత్తు తీర్మానం ప్రతిపాదించగా వీగి పోయింది, కాని అభిప్రాయభేదాలు మరింత తీవ్రమయ్యాయి.

పార్టీ జాతీయసమితి 1 నవంబరు 1962న, మెజారిటీ తీర్మానాన్ని అమోదించిన వెంటనే, మైనారిటీ అతివాదవర్గం, అట్టి అభిప్రాయాలనే కలిగియున్న మరి కొంతమంది సభ్యులు వేరుగ డిల్లీలో కలుసుకొని పార్టీ నిర్ణయాలకు భిన్నంగా రాజకీయ, నిర్మాణపంథాని నిర్ణయించుకొని అంతర్గత పోరాటానికి పార్టీలో యింకెట్టి అవకాశంలేదని నిర్ణయించారు. మార్గదర్శకత్వాన్ని యిచ్చుటకు కా. గోపాలన్, రామదాసులతో అఖిల భారత కేంద్రాన్ని యేర్పాటు చేసారు సి. పి. ఐ లో నవంబరు మొదటివారం నుండి యీ కేంద్రం పనిచేసింది. కా. సూర్జిత్, రామమూర్తి, సుందరయ్యలు అవసరమైన యంత్రాగాన్ని యేర్పాటు చేయుటకు ఆర్గనైజర్సుగా రాష్ట్రాలకు వెళ్ళారు. కొన్ని రాష్ట్రాలలో అనుబంధకేంద్రాలు పనిచేసాయి. బెంగాల్‌లో కా. ప్రమోద్‌దాస్‌గుప్తా బృందం రాష్ట్రకేంద్రంగా పని చేసింది. పంజాబ్, ఆంధ్ర ప్రదేశ్‌లలో పోటీకేంద్రాలు యేర్పడి పనిచేయసాగాయి. సి. పి. ఐ. పోటీకేంద్రాలు యేర్పడిన రాష్ట్రాలలో నూతన తాత్కాలిక ఆర్గనైజింగు కమిటీలను యేర్పాటు చేసింది. దీనికి ప్రతిగా అతివాదవర్గం పశ్చిమబెంగాల్ డెమొక్రటిక్ కన్వెన్షన్ జరిపి, రాజకీయ ఖైదీలను విడుదల చేయాలని, అన్ని జిల్లాలలో కన్వెన్షనులు జరపాలని తీర్మానించారు.

సి. పి. ఐ. జాతీయసమితి ఫిబ్రవరి తదుపరి జూలై 1963 సమావేశాలలో తీసుకొన్న నిర్ణయాలు పార్టీ చరిత్రను చీలికల మార్గం పట్టించాయి. కంట్రోలు కమిషన్‌కు కొన్ని ఫిర్యాదులు చేసి విచారించి క్రమశిక్షణాచర్యలు తీసుకొనవలసిందిగా కోరింది. జాతీయసమితి నిర్ణయాలు కమ్యూనిస్టుపార్టీలో యేర్పడిన సంక్షోభ పరిస్థితులకు ప్రతిబింబాలు.

## [2]

భారతకమ్యూనిస్టుపార్టీలో 1947 నుండి అంతర్గత సైద్ధాంతిక కుమ్ములాటలు సాగించుతున్న మితవాద, అతివాద గ్రూపులు రెండూ 1963 మధ్యకాలానికి సైద్ధాంతిక, రాజకీయ విధానాల చర్చలు, సమన్వయ ధోరణి విడనాడి, ఘాటి ఆరోపణ,

ప్రత్యారోపణలు, నిర్మాణచర్యలు, క్రమశిక్షణచర్యలు, విడిగా కన్వెన్షనుల మార్గాన్ని చేబట్టి రెండుపార్టీల నిర్మాణానికి నిర్ణయాలు చేసారు.

సి. పి. ఐ. జాతీయసమితి జూలై 1963లో కంట్రోల్‌కమిషన్‌కు పార్టీలో పోటీ కేంద్రంపనిచేయుట ఇరువర్గాల ఫిర్యాదులు, ప్రతిఫిర్యాదులు కాటూరు పార్టీ సభ్యుల సమావేశంలో కా. సుందరయ్యఉపన్యాసం, దానిపై రాజశేఖరరెడ్డి నివేదికలను విచారించి, తీసుకొనవలసిన క్రమశిక్షణాచర్యలను సూచించవలసినదిగా కోరింది. కమిషన్ నివేదికను ఏప్రిల్ 1964లో సమర్పించింది. కంట్రోలుకమిషను "పార్టీ పోటీకేంద్రం 1962 డిశెంబరు నుండి 1963 ఏప్రిల్ వరకు రహస్యంగా పనిచేసిందని" "వారి కార్యాచరణద్వారా జాతీయసమితి పార్టీ క్రమశిక్షణను పార్టీ అంతర్గత చర్చల సూత్రాలను ప్రాథమిక పర్యవేక్షణ సూత్రాలను అతిక్రమించారని మేము నమ్ముతున్నామని" నివేదించారు సంగ్రహంగా కొన్నిటిని ఇలా పేర్కొన్నారు "పార్టీ నిర్మాణసూత్రాలలోని 17 అధికరణాన్ని అతిక్రమించారు" జాతీయసమితి నిర్ణయాలను ధిక్కరించి వాటికి వ్యతిరేకంగా పనిచేసారు రెండుపార్టీ కాంగ్రెసుల మధ్య జాతీయసమితికి అన్నిరాజకీయ నిర్మాణ అధికారాలను కలిగియున్నది. హైదరాబాద్ జాతీయసమితి నిర్ణయాల అనంతరం మైనారిటీ మెజారిటీ ఆమోదించిన విధానానికి కట్టుబడి వుండాలనే తీర్మానాన్ని తదితర నిర్మాణ తీర్మానాలను వ్యతిరేకించారు. పార్టీ నిర్మాణ సూత్రాలలోని 31 అధికరణము, పార్టీ అంతర్గత చర్చలు జరుపువిధానాన్ని సూత్రాలను స్పష్టం చేసి యున్నవాటిని అతిక్రమించారు"అని నివేదిక పేర్కొన్నది.

సి.పి ఐ. జాతీయ సమితి 1964 ఏప్రిల్ సంక్షోభ సమావేశంలో కంట్రోల్ కమిషన్ నివేదిక, ఒండోరుల ఆరోపణలు ప్రత్యారోపణలు సెక్రటేరియట్ చిత్తు తీర్మానం కేంద్రకార్యవర్గపు చిత్తు తీర్మానం, క్రమశిక్షణా చర్యల సమస్యలు చర్చనీయాంశాలు. వాగ్వివాదాలు తీవ్రస్థాయికి చేరి, ఆరోపణలు ప్రత్యారోపణలతో మెజారిటీ మితవాదులదికాగా, అతివాదులు 32 మంది సమావేశాన్ని బహిష్కరించి వెళ్ళిపోయారు. ఆదేరోజున మానిఫెస్టోగా నెంచబడే పత్రికా ప్రకటన చేసారు. జాతీయ సమితి అన్నిటిని పరిశీలించి బహిష్కరించుట తగిన క్రమశిక్షణాచర్యగా తలచింది.

విజయవాడ పార్టీ కాంగ్రెసులో సౌహార్ద ప్రతినిధుల సలహాపై ఏప్రిల్ 1962లో యేర్పడిన బట్టిప్రోలు పంచాయతి "మిశ్రమ సెక్రటేరియట్" చాలవరకు సమతూకాన్ని కలిగివుంది. మితవాద, అతివాద, తటస్థవాద సభ్యులతో కలసి సమిష్టిగా జాతీయసమితికి, పార్టీకి ప్రాతినిధ్యం వహించుచున్నది. వాకవుటులు క్రమశిక్షణా చర్యలతో సెక్రటేరియట్ సమతూకం చిన్నాభిన్నమైంది. ఇది ప్రధానంగా అక్టోబరు మధ్యలో జరిగిన కేంద్ర సెక్రటేరియట్ సమావేశానంతరం జరిగింది.

పార్టీ సైద్ధాంతిక పోరాటాన్ని రాజకీయ సమస్యలుచేసి ఐక్యతను పెంపొందించుటకుమారుగ, క్రమశిక్షణాచర్యగాచేసి, విచ్ఛినాన్ని వేగపరచి, పార్టీలో సంక్షోభాన్ని తీసుకొచ్చింది. ఈ కాలంలోనే మరోవైపున పార్టీలోని అతివాద వర్గాలు పార్టీ ఐక్యతను పెంపొందించుటకై ప్రతిపాదనలు చేసారు. డాంగే లేఖల పరిశీలనకు యిరువర్గాల ఆమోదం పొందిన కమిటీ, సాంకేతిక నిపుణుల సహాయంతో చేయాలి. పార్టీ సభ్యత్వం స్క్రూటినీ జరగాలి, విజయవాడ కాంగ్రెసునాటి సభ్యత్వాన్ని పునరుద్ధరించాలి. ఇరువర్గాలు సమర్పించిన డాక్యుమెంట్ల పరిశీలనకు ఉభయుల ఆమోదం పొందిన కమిషనును యేర్పరచాలి. క్రమశిక్షణా చర్యలు వాయిదావేయాలి, తీసుకొన్న వాటిని రద్దుచేయాలి ఈ ప్రతిపాదనలు చేస్తూ అవి అంగీకరించుతారనే ఆశ లేదనే అభిప్రాయాన్ని వెలిబుచ్చారు.

సి పి ఐ లోని అతివాదులపై పార్టీ వ్యతిరేక కార్యకలాపాలను విచారించిన కంట్రోలు కమిషన్ సభ్యులలో 5గురిలో యిద్దరు జైలులో వుండగా, డాంగే గ్రూపు ముగ్గురు సమర్పించిన నివేదిక ఆధారంగా, యేకపక్షంగా క్రమశిక్షణాచర్యలు సమర్థనీయంకాదు, కనీసం వాయిదా వేయవలసింది. డాంగే లేఖలను జాతీయసమితి, సెక్రటేరియట్ దృష్టికి తెచ్చుట సరైనదే, ఆ వెంటనే పత్రికా ప్రకటనలకు దిగుట పార్టీ నిర్మాణ సూత్రాలను అతిక్రమించుట పార్టీకి తీవ్రనష్టాన్ని కలుగజేసిందని నంబూద్రిపాద్ అభిప్రాయాన్ని పార్టీకి లేఖలో తెలియపరచారు పార్టీ లేఖలను పరిశీలించకుండానే అవి ఫోర్జరీలని ప్రకటించుట, తొందరపాటు చర్య అయింది. ద్విజేంద్రనంది తాజారచన డాంగే లేఖలు ఫోర్జరీలు అగుటకు అవకాశంలేదని, డాంగేవే అయివుంటవని హేతుబద్ధంగా పరిశీలించి, తెలియజేసారు.

## (3)

ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమంలో బహిరంగ సిద్ధాంత చర్చలలో "వెలుగు" తోపాటు "వేడిమి" జనించుటతో వాస్తవిక పరిస్థితులు, అవసరరీత్యా సైద్ధాంతిక మధ్యేమార్గ శక్తులు వియత్నాం, ఆఫ్రికా, లాటిన్ అమెరికా కమ్యూనిస్టుపార్టీలలో ఆధిక్యత లోనికి వచ్చాయి. "ఈ దశకంలో ప్రధాన వలస సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాలు ఈ దేశాలలో జరుగుతుండుటచే సైద్ధాంతిక మధ్యేమార్గ శక్తులు బలాన్ని పొంది, అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంపై తమ ప్రభావాన్ని ప్రసరించగలిగినవి భారత కమ్యూనిస్టు ఉద్యమంలో అట్టి శక్తులున్నా అతివాద, మితవాద సైద్ధాంతిక తీవ్రశక్తుల మధ్య నలిగిపోయి, శక్తివంతమై అంతర్జాతీయ, దేశీయ కమ్యూనిస్టు ఉద్యమాలపై శక్తివంతమైన ప్రభావాన్ని కలిగించ జాలకపోయాయి. అయినా 1950 దశకంలో సి.పి.ఐ లోని మితవాద, అతివాద శక్తులు పరస్పర విశ్వాసం కొరవైనందున, అజయ్ ఘోష్ నాయకత్వం స్వీకరించుట జరిగింది సి.పి.ఐ.లో

కూడ క్రమేణా మధ్యేమార్గవాదుల సమీకరణ జరుగుటతో పార్టీ ఐక్యత కాపాడ బడింది భారత-చైనా సరిహద్దు యుద్ధం, అజయ్‌ఘోష్ అకాల మరణంతో, అతి వాదం, మితవాదాల మధ్యవున్న రాజీకార్యాచరణ వొప్పందాల యేర్పాటు భగ్నమై, ఇరువర్గాలలో వేర్పాటువాదులు బలపడుట, మధ్యేమార్గవాదం బలహీనపడుట జరి గింది.

ఇట్టి పరిస్థితులలో 4 జూలై 1964 న న్యూఢిల్లీలోని భూపేష్‌గుప్తా నివా సంలో రాజేశ్వరరావు, అధికారి, భూపేష్‌గుప్తా, జ్యోతిబసు, ప్రమోద్‌దాస్‌గుప్తా హరికిషన్‌సింగ్ సూర్జిత్‌ల మధ్య ఐక్యతా సంభాషణలు జరిగాయి. ఇదే మధ్యేమార్గ వాదులు పార్టీ ఐక్యతకై చేసిన చివరి ప్రయత్నం, సూత్రధారి ప్రధానంగా భూపేష్ గుప్తాగ చెప్పాలి "మన మధ్యమంలో తీవ్ర అభిప్రాయ భేదాలు వున్నందున పార్టీ కాంగ్రెసువరకు వొకవొప్పందానికి వచ్చుటకు సముఖులమే మీరు మరో పార్టీగ పని చేస్తున్నారు, ఒప్పందం రెండు పార్టీల మధ్య అగుతుంది. ఆమోదంలేని సమ స్యలపై మా విధానాన్ని మేము అనుసరించుతాము వొప్పందాల ద్వారా పనిచేయుట మాత్రమే మీ పంథా. సెక్రటేరియట్‌ను చైర్మెను పదవిని రద్దు చేయమంటున్నారు, దానిని జాతీయసమితి తిరస్కరించింది. మూడు షరతులు ఐక్యతకు నిధించింది. జాతీయసమితి అధికారాన్ని గుర్తించాలి. పోటీ కమిటీలను రద్దు చేయాలి పోటీ పత్రికలను ఆపివేయాలి. సూత్రప్రాయంగా వీటిని అంగీకరించితె మనం వొప్పందా నికి వచ్చుటకు ప్రయత్నించవచ్చును." అన్నారు. "ప్రజాకార్యక్రమాలు, పార్టీ పనులు తప్పనిసరిగా వొప్పందాల ప్రకారం జరగాలని మేము నిర్ణయించాము. ఈ ముఖ్యాంశాన్ని రాజేశ్వరరావుగారు గుర్తించారు. గ్రహించారు" అన్నారు జ్యోతిబసు ఇంకా మీకు జాతీయ సమితిలో మీకు మెజారిటి వుంది, మాకు పార్టీలో మెజారిటి వుందని" కూడ అన్నారు.

"ప్రధాన సమస్యలపై నిర్ణయాలు చేయవలసివున్నా, తీవ్రఅభిప్రాయభేదాలు వున్నట్టయితే వాయిదావేద్దామని" భూపేష్‌గుప్తా అన్నారు.

జ్యోతిబసు "నేటి పరిస్థితి మేము మిమ్ము నమ్మము. మీరు మమ్ము నమ్మరు. డాంగే లేఖలను పరిశీలించుటకు మీరు 7గురుగల కమిషన్‌ను నిర్ణయించారు. మా నుండి 3,4రను చేర్చుకొనుటను ఆమోదిస్తారాయని ప్రశ్నించగా మేము అంగీకరిం చమన్నారు." రాజేశ్వరరావు. మీ వైఖరిని అవలభించేవారు కమీషన్ ఉన్నారు. అదనంగా మరి కొందరు అంటె మీకు మెజారిటి" అగుతుంది,

"అధికారి మనమందరం వొకే పార్టీగ వుండుటకు యిక్కడ కూర్చున్నాము." ఒకే పార్టీ కాంగ్రెసుకై వున్నాము. జాతీయసమితి వుంది, అది పార్టీ సంస్థగా పని చేయాలి. మీరు మెజారిటీగ వుంటే యేమి చేసేవారు. చీలిక కన్పడుతున్నపుడు

యేదో వొకటి చేయాలి. మీరు దీనిని అంగీకరించితే మేము కొన్ని సదుపాయాలను కలిగించగలము. పార్టీ శ్రేయస్సే ప్రధానంగా నెంచితే పార్టీని చీల్చే అభిప్రాయం లేనిచో, కొన్ని రాయితీలను కలిగించ సంసిద్ధులమే" అని వివరించారు.

సూర్జిత్ "గతంలో ఎన్నో అభిప్రాయ భేదాలున్నా మెజారిటీ నిర్ణయాలు శిరసా వహించాం. ఇకముందు అలాజరుగదు. మౌలిక సూత్రాల సమస్యలపై మెజార్టీ మైనారిటీ అనే ప్రశ్నేలేదు." అన్నారు. "కొన్ని సమస్యలపై కొంతకాలం వరకు మీ అభిప్రాయాలు వెలిబుచ్చకుంటే మీకు వచ్చే నష్టమేమిటి?" అని జ్యోతిబసు ప్రశ్నించారు.

అధికారి "శెక్రటేరియట్ రద్దుచేయబడదు.పునర్నిర్మించవచ్చును. ఇ.యం.యస్. శెక్రటేరియట్‌లో మౌలికమార్పులు జరగాలన్నారు. మేము దానిని అంగీకరించం. పార్టీ కాంగ్రెసుకు సిద్ధాంత పత్రాలు తయారుగవున్నవి. శెక్రటేరియట్ నివేదికలు, తీర్మానాలు తయారుచేసి చర్చావేదికను నిర్వహించుతుంది. చైర్మెన్, జనరల్ శెక్రటరీ పదవులు రద్దుచేయబడవు. డాంగే కమిషన్‌కు మరొకరిని ప్రతిపాదించవచ్చు, జాతీయసమితి మరొకరిని అదనంగా వేస్తుంది అన్నారు.

ప్రమోద్‌దాస్‌గుప్తా మేము డాంగేను చైర్మెన్‌గా అంగీకరించితే పాత శెక్రటేరియట్‌ను మీరు పునరుద్ధరించుతారా, నంబూద్రిపాద్‌ను తిరిగి జనరల్ శెక్రటరీ చేయుటకు సంసిద్ధులేనా" అని ప్రశ్నించగా "లేదు" అని నేడు ఆ సమతూకం పునరుద్ధరించుటకుసంసిద్ధులంకాము. జాతీయసమితిలోవున్న మెజారిటీయే శెక్రటేరియట్‌లో కొనసాగాలి అని రాజేశ్వరరావు అన్నారు. జ్యోతిబసు సమతూకం యే విధంగా మారుతుంది? భూపేష్‌గుప్తాను ఎక్కడ లెక్క వేస్తున్నారు అని ప్రశ్నించగా రాజకీయంగా మావైపు, నిర్మాణరీత్యా చెప్పజాలము. అప్పుడప్పుడు మీవైపు వుంటారు. మేము రిస్కు తీసుకొనదలచలేదన్నారు." రాజేశ్వరరావు దానికి భూపేష్ గుప్తా నేను లేకుండా పాత శెక్రటేరియట్‌ను పునరుద్ధరించండి, అది జాతీయసమితికి పూర్తి మెజారిటీ నిస్తుంది అని ప్రతిపాదించారు. రాజేశ్వరరావు అలాకాదు. తటస్థు లున్నారు. వారి ప్రాతినిధ్యం పునర్నిర్మించబడిన శెక్రటేరియట్‌లో వుండాలి అన్నారు. జ్యోతిబసు దాని అర్థం, మా ప్రతిపాదనలు మీకు ఆమోదంకావు. ఎన్నికైన జాతీయసమితిని గుర్తించమంటారు. కానియేకగ్రీవంగా యెన్నికైన శెక్రటేరియట్‌ను మీరు ఆమోదించరు" అని అన్నారు. "అవును, అదే నేటిపరిస్థితి. పరస్పర విశ్వాసం లేదు. మా మెజారిటీ విషయమై గట్టిగా వుండదలచాము" అని రాజేశ్వరరావు అన్నారు. అధికారి సరళంచేస్తూ జాతీయసమితి తీర్మానాన్ని ఆమోదించితే, మీకు స్థానాన్ని కలిగించుట ఆలోచించగలం. నాలుగుసంవత్సరాల తరువాత మనం తిరిగి ఆలోచించవలసి వుంటుంది" అన్నారు. మితవాదులు, అతివాదులు యిరువురూ మధ్యే

మార్గవాదులను పూర్తిగ త్రోసిబుచ్చి పార్టీ ఐక్యతకుగాక చీలికకే ప్రాధాన్యతనిచ్చి తటస్థులను తమవైపుకు ఆకర్షించుటకు ఎత్తుగడగా సంప్రదింపులు జరిపినందున, విఫలులై రెండు నిర్మాణ పార్టీలుగ యేర్పడినవి.

# (4)

భారతకమ్యూనిస్టుపార్టీ జాతీయసమితిని బహిష్కరించి బయటకువచ్చి పార్టీ సభ్యులకు సానుభూతివరులకు ప్రజాస్వామ్యానికి విజ్ఞప్తి చేసిన 32 మంది అతివాద కమ్యూనిస్టులు, పార్టీలో కలుగజేసిన స్పందనను పరిశీలించి, భవిష్యత్తు కార్యక్రమాన్ని నిర్ణయించుటకు తెనాలిలో వొక లక్ష పార్టీ సభ్యులకు ప్రాతినిధ్యంవహించే 146 మంది జులై 7-11, 1964లో పార్టీ నిర్మాణచర్యలు చేబట్టుటకు కన్వెన్షన్ సమావేశం జరిపారు.

అతివాద కమ్యూనిస్టుల విజ్ఞప్తి ఆధారంగా పార్టీలో అంతర్గత చర్యలు కొన సాగించి, పార్టీ కమిటీలను, శాఖలను, పార్టీ సభ్యులను కలసి మా పంథాను వివరించారు. సి.పి.ఐ. అనుసరించుచున్న సంస్కరణవాద పంథాను మెజారిటి వ్యతిరేకించుతు పార్టీ ఐక్యతను కోరుతున్నారు. అతివాద కమ్యూనిస్టులలో సైద్ధాంతిక సమస్యలపై భేదాభిప్రాయాలున్నవి. సమావేశంలో సైద్ధాంతిక సమస్యలపై వొక నోటు అధ్యయనం కొరకు పంచబడింది. వివిధ వైఖరులు అందులో వివరించబడినవి. అంతర్జాతీయ సైద్ధాంతిక సమస్యలపై అవగాహనలను ముందే తెలియజేసారు. స్వతంత్ర కమ్యూనిస్టుపార్టీ, పూర్తి ప్రజాస్వామిక చర్చల అనంతరం అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమసమస్యలపై స్వతంత్ర నిర్ణయాలను చేస్తుంది. పార్టీ కాంగ్రెసు అనంతరం అంతర్జాతీయ సైద్ధాంతిక సమస్యలపై చర్చలు సాగించి నిర్ణయాలుచేస్తుంది నంబూద్రిపాద్ సూచన ననుసరించి, రాజకీయ, సైద్ధాంతిక అభిప్రాయాలపై ప్రభావం కలిగించే తక్షణ సమస్యలైన శాంతియుత పరివర్తన సహజీవన, సమస్యలను చిత్తు కార్యక్రమాలతోపాటు చర్చించి నిర్ణయిస్తుందని ప్రకటించారు.

అతివాద కమ్యూనిస్టుల తెనాలి కన్వెన్షన్ చిత్తు కార్యక్రమాన్ని, చిత్తు తీర్మానంపై నంబూద్రిపాద్ నోటును, మరో మూడు చిత్తులు డాంగే, భూపేష్‌గుప్తా, జోషీల నోటులు లేక సిద్ధాంత పత్రాలను సర్క్యులేటుచేసి, చర్చల కుపక్రమించింది. తక్షణ సమస్యయైన కార్యక్రమంపై చాలావరకు విస్తృత ఆమోదం కలిగివున్నారు. నంబూద్రిపాద్ కొన్ని విషయాలపై తన అనంగీకారాన్ని తెలియజేసారు. చిత్తు తీర్మానంలో జాతీయాంశము తక్కువగా అంచెనా వేయబడిందని నంబూద్రిపాద్ విమర్శన బూర్జువా జాతీయైక్యత మార్క్సిస్టు-లెనినిస్టు విమర్శనలేదని కుల, మత, ఆటవిక జాతులసమస్యలపై సరియైన అవగాహన యివ్వలేదని మరో విమర్శన. వర్గాల

ఐక్యతా సమస్యపైన నంబూద్రిపాద్ చిత్తుకార్యక్రమంతో విభేధించారు. అనేకమంది నంబూద్రిపాద్ వైఖరులను బలపరచారు. దేశ, విదేశగుత్త పెట్టుబడుదారుల మధ్య అభివృద్ధి చెందే వైరుధ్యం నంబూద్రిపాద్ అవగాహన, దేశంలో పెట్టుబడిదారి విధానం అభివృద్ధి అయిన కొలది, దేశీయ బూర్జువావర్గం ప్రభుత్వాధికారాన్ని తన అభివృద్ధికి వినియోగించకొలది విదేశసామ్రాజ్యవాదంతో దాని పోరాటం అభివృద్ధి చెందుతుంది. చిత్తు తీర్మానం యీ వైరుధ్యాన్ని తక్కువగా అంచెనా వేసిందని నంబూద్రిపాద్ అభిప్రాయం.

తీర్మానం చివరలో 32మందికి మద్దతుగా పార్టీ సభ్యులందరూ 7వ, పార్టీ కాంగ్రెసు జరుపుటకు సహాయ సానుభూతులందించవలసిందిగా కన్వెన్షన్ విజ్ఞప్తి చేసింది. పార్టీని పునర్నిర్మించుటకు సహాయపడండని కన్వెన్షన్ కోరింది. కన్వెన్షన్ కమ్యూనిస్టుపార్టీ 7వ, పార్టీ కాంగ్రెసు అక్టోబరు 1964లో కలకత్తాలో జరగాలని నిర్ణయించింది. అందుకుగాను 41మంది గల కేంద్ర ఆర్గనైజింగ్ కమిటీని కార్య నిర్వాహకవర్గ సమితిని, సెక్రటేరియట్‌ను, పార్టీ కాంగ్రెసుకు సన్నాహాలను ఏర్పాటులను చేయగలందులకు ఎన్నుకొంది.

# [5]

ప్రపంచకమ్యూనిస్టు ఉద్యమంలో ప్రధానంగా సోవియట్ సోషలిస్టు యూనియన్ రిపబ్లిక్స్, చైనా ప్రజారిపబ్లిక్‌ల మధ్య అంతర్గత సైద్ధాంతిక పోరాటంగా ప్రారంభమై తీవ్రతరమై సైనిక సరిహద్దు సంఘర్షణల వరకు వెళ్ళి, అనేకదేశాలలో కమ్యూనిస్టుపార్టీలు అంతర్గత పోరాటాలలో చీలి రెండు, మూడుగా యేర్పడి బల హీనపడి, చివరకు సోవియట్ యూనియన్ తూర్పుయూరపుదేశాలలో కమ్యూనిస్టు ఉద్యమాలకు చరమగీతం పాడబడింది. భారతకమ్యూనిస్టుపార్టీపై యీ ప్రభావం బలంగా పడి చీలికలై ఉద్యమం సంక్షోభంలో పడిపోయింది.

1. ఈ శతాబ్దపు మొదటి అర్ధభాగంలోని రష్యన్ కార్మికవర్గ నాయకత్వంలో చైనాలో వ్యవసాయ విప్లవ పంధాలను చరిత్ర సి. పి. ఐ. ముందుంచింది. ప్రధమంగా నగరాలను కార్మికవర్గ విప్లవకేంద్రాలుగ, చైనా రైతాంగ విప్లవ పోరాటాలను రష్యన్‌విప్లవపంధాకు అనుబంధంగా తలచింది. ద్వితీయంగా చైనా వ్యవసాయ విప్లవం ఆసియా, ఆఫ్రికా లాటిన్ అమెరికన్‌దేశాల వలస సామ్రాజ్యవాద వ్యతిరేక సాయుధరైతాంగ పోరాటాల పంధా పరిగణించవలసిన అంశంగా ప్రత్యక్షమైంది. ఈ రెండు పంధాలు ఆయాదేశాల ప్రత్యేక పరిస్థితులను పరిగణించకుండా స్వీయ మానసిక ధోరణులలో భారతకమ్యూనిస్టు ఉద్యమం ఆయాకాలాలలో ప్రక్కదారు పట్టించగా కలిగిన విషమ ఫలితాల అనుభవాలు దేశవాస్తవ పరిస్థితుల శాస్త్రీయ అధ్యయన వ్యూహరచన అవసరాలను సి. పి. ఐ. ముందువుంచాయి.

స్టాలినిజం నుండి మావో మేధో స్వాతంత్ర్యాన్ని చెన్ పోటా వొక్కి చెప్పాడు కొమిన్ ఫారం జనవరి 1950 వ్యాసం కార్మికవర్గం అన్ని తరగతుల రైతాంగం మధ్య ఐక్యత సహకారాన్ని పెంపొందించమని" అదే చైనా యితర వలస ఉద్య మాల అనుభవం"అని భారత కమ్యూనిస్టుపార్టీకి సూచనలు నిచ్చింది.

2. చైనాకమ్యూనిస్టుపార్టీ 29వ, జయంతికి సి. పి. ఐ. కమ్యూనిస్టు "పత్రి కలో సందేశమిస్తూ "వలస ప్రపంచంలోని కమ్యూనిస్టులు చైనా కమ్యూనిస్టుపార్టీని నమూనాగా చూస్తున్నవనీ ఆగస్టు 1950లో ప్రకటించింది. తదనంతరకాలంలో మన దైన వొకపంథా ఏ రూపొందించుకొనే ప్రయత్నం జరిగినా పార్టీలో రెండు పంథాల ఆలోచనలు సోవియట్ యూనియన్ చైనా రిపబ్లికుల పార్టీలను మార్క్సిజపు పోపు లుగ నెంచే ప్రభావాన్ని తక్కువగా అంచెనా వేయుట పొరపాటు.

సోవియట్ యూనియన్ 1951 నవంబరులో అకెడిమియా ఆఫ్ సైన్స్ నెస్ తృతీయ ప్రపంచంలో చైనా విప్లవపు అనంతప్రాముఖ్యతను గుర్తించుతునే ఒక్క చైనాలోనే, అది సాధ్యమని, ముఖ్యలక్షణం సాయుధపోరాటం సోషలిస్టు విప్లవాలన్ని టికి అది తప్పనిసరికాదని, అనుసరించవలసిన ఒక మూస నమూనాగా నెంచుట ప్రమాదకరం అన్నారు. చైనా విప్లవ ప్రాముఖ్యతను యూకోవ్ తగ్గించుట, బోల్షి విక్ విప్లవ విశ్వనమూనా ఆధిక్యతను సొబలీవ్ పునఃప్రతిష్ఠించుట జరిగింది. సొబ లీవ్ జనతా ప్రజాస్వామ్య విప్లవం రెండు ప్రత్యేకదశల విప్లవమని బూర్జువా ప్రజా స్వామ్య విప్లవానంతర సత్వర సోషలిస్టు విప్లవమని ప్రతిపాదించారు. తూర్పుయూరపు దేశాల విప్లవాలు రెండుదశలను దాటాయని, చైనా విప్లవం సోవియట్ "జనతా ప్రజా స్వామ్య విప్లవ సిద్ధాంతానికి ప్రతిబింబమని" అది ప్రథమదశను దాటి పురోగమించ నందున యూరపు దేశాల విప్లవాలకంటే వెనకబడిందని సైద్ధాంతిక వివరణ చేసారు.

భారతకమ్యూనిస్టుల చైనా చేసిన తీవ్రవిమర్శన పరోక్షంగా పార్టీ సైద్ధాంతిక అగ్రనాయకత్వం, అంతర్జాతీయ కమ్యూనిస్టు నాయకత్వంతో సలహా సంప్రదింపుల అనంతరం "సోవియట్ పంథా" "చైనాపంథా"లను విడనాడి "భారతీయ పంథాను రూపొందించారు. దానికి క్రమేణా మెరుగులుదిద్దే ప్రయత్నాలు నిరవధికంగా కొన సాగిస్తూనే వున్నారు.

3. భారతవిప్లవ పంథా సమస్యపై "చైనా మార్గమా" "రష్యామార్గమా" అనే సైద్ధాంతిక వివాదం సోవియట్-చైనా అంతర్జాతీయ కమ్యూనిస్టు అనగా రష్యా చైనాల సైద్ధాంతిక వివాదానికి వొక దశాబ్దానికి ముందే, యీ సైద్ధాంతిక పోరాటం ప్రారంభ మైంది. ఆ కారణంగానే ప్రపంచంలో మరేపార్టీలోను జరుగనంతటి తీవ్రసిద్ధాంత పోరాటం జరిగింది. రష్యా, చైనా రెండు పరిధాలను సమన్వయపరచి, "గ్రామీణ ప్రాంతాలలో సాయుధరైతాంగ గెరిల్లాపోరాటాలు" "నగరాలలో కార్మికవర్గం, యితర

అన్నివర్గాల సాయుధ తిరుగుబాటులు" సంలీనంపరచి "భారతవిప్లవపంథా"గా రూపొందించే ప్రయత్నం జరిగింది. కాని పార్టీలో "చైనాదృక్పథం" స్థిరపడి "చట్టబద్ధం" కాబడింది. అదివొకవర్గానికి మార్గదర్శికమైంది. ఫలితంగా పార్టీలో క్రమశిక్షణకరువై ముఠాతత్వం పెరిగి, "అతివాద వ్యతిరేకపోరాటం", "మితవాద వ్యతిరేక పోరాటం" అనే పేరుతో కేంద్ర నాయకత్వాన్ని రాష్ట్రాల నాయకత్వాలను నగ్నంగా ప్రాంతీయ నాయకత్వాలు వ్యతిరేకించుట జరిగింది.

పార్టీలో ముఠాతత్వం, వివాదాలు పెరిగి శాశ్వత దీర్ఘరోగంగా అయింది. పాలక బూర్జువారాజకీయ పార్టీ కుల, మత, ప్రాంతీయ తత్వాలకు లోనై ప్రాంతీయ పార్టీల ముఠాల నాయకత్వాల బలపడి, కేంద్రం బలహీనపడుటతో, రాష్ట్ర నాయకత్వాలపై ఆధారపడవలసిన పరిస్థితి ఏర్పడింది కమ్యూనిస్టుపార్టీ యిదే పరిస్థితి నెదుర్కొనవలసిన పరిస్థితి ఏర్పడింది. రాష్ట్రపార్టీశాఖలలో నివేదికలనుక్రమంగా జరిపే అలవాటుపోయినందున ఏమి జరుగుతున్నదో, కేంద్రానికి పూర్తిగ తెలియని పరిస్థితి ఏర్పడిందని, కేంద్రకమిటి నివేదికలో విచారాన్ని వెలిబుచ్చారు. అంతేగాక పార్టీ కాంగ్రెసు 1952, 1953, 1955, 1956 చివరకు 1961 నివేదికలో యీ విషయం స్పష్టంగా పేర్కొనబడింది.

4. సోవియట్ కమ్యూనిస్టుపార్టీ 20వ, కాంగ్రెసులో స్టాలిన్ ప్రభావాన్ని తొలగించుటకు చేసిన ప్రయత్నాలు, సి. పి. ఐ.లో సిద్ధాంత పోరాటం అనే పేరుతో సాగిన ముఠా కుమ్ములాటలతో పార్టీ నిర్మాణ ఉక్కుచట్రం కూలిపోయింది. దీనికి తోడు స్టాలిన్ వ్యతిరేకప్రచారం, హంగరీలో తిరుగుబాటు ఇమ్రీనాగివి రూపుమాపుట పెట్టుబడిదారి విధానాన్ని సోషలిజంలోని శాంతియుత పరివర్తన సిద్ధాంతచర్చలు సి. పి. ఐ.లో భేదాభిప్రాయాలను ముఠాతత్వాలను మరింత తీవ్రతరం చేసాయి. కేరళ ఎన్నికలలో కమ్యూనిస్టు విజయంతో యేర్పడిన ప్రభుత్వం, పార్టీలో కొన్ని వర్గాలలో మరిన్ని భ్రమలు ఏర్పడుటకు తోడ్పడింది.

కేరళ 1957 ఎన్నికలలో కమ్యూనిస్టుపార్టీ విజయం, పార్లమెంటరీ పోరాటవాదుల బలాన్ని యినుమడింపజేసింది. సోవియట్ 20వ, పార్టీ కాంగ్రెసు సిద్ధాంతానికి కేరళ విజయం ప్రత్యక్ష రుజువుగా నెంచబడి, 1956 ఏప్రిల్ పాల్ఘాట్ విధానాలనుండి వైదొలగి, 1958 ఏప్రిలో జరిగిన అమృతసర్ పార్టీ కాంగ్రెసు "సోషలిజంలోనికి శాంతియుత పరివర్తనను" రాజకీయ సైద్ధాంతిక విధానంగా ఆమోదించి, "కేరళమార్గం" అనుసరణీయంగా నెంచబడింది. పార్టీలోని అతివాదులను కేరళలో కమ్యునిస్టుపార్టీ ప్రభుత్వపాలన యిరకాటంలో పెట్టింది. అయితే కేంద్రప్రభుత్వం కేరళరాష్ట్రకమ్యూనిస్టు ప్రభుత్వాన్ని బర్తరఫ్‌చేయుట అతివాదులను పరోక్షంగా బలపరచింది,

5 టిబెట్‌లో తిరుగుబాటుతో సరిహద్దు సంఘర్షణలకు బీజాలుపడ్డాయి." ప్రపంచం, రెండు ప్రతిపక్ష శిబిరాల సిద్ధాంతం ప్రభావంలో మొదట్లో రష్యాచైనాలు ఒకే విధంగా ప్రకటనలు చేసాయి. ఏప్రిల్ 1959లో పశ్చిమ బెంగాల్‌లోని కలింపాంగ్‌ను టిబెట్ తిరుగుబాటుదారులు స్థావరంగా వుపయోగించుచున్నారనే రెండు చైనా ప్రకటనలను సోవియట్‌యూనియన్ రేడియో ప్రసారాలలో వ్యాఖ్యానించింది. నెహ్రూ బహిరంగంగా వాస్తవంకాదని తిరస్కరించారు. తదుపరి అట్టి చైనా ప్రకటనలను రష్యా తన ప్రసారాలలో పునరుద్ఘాటించుట జరుగలేదు టిబెట్‌లో తిరుగుబాటుకు ఆదేశంలోని ప్యూడలు అభివృద్ధి నిరోధకశక్తులు, సామ్రాజ్యవాదులు, జంగైషేక్ బాధ్యులని మాస్కో పేర్కొనసాగింది. భారత లోక్‌సభ సమాచారశాఖ ఏప్రిల్ చివరలో చైనా ప్రజారిపబ్లిక్ సరిహద్దు వివాదాంశాలపై చేబట్టిన వైఖరిని తీవ్రంగా విమర్శించుటతో చైనా కమ్యూనిస్టులు తమ భారత వ్యతిరేక ప్రచారాన్ని భారత ప్రభుత్వానికి విస్తరించి టిబెట్ తిరుగుబాటుకు, దలైలామా భారతదేశానికి వచ్చుటకు భారతదేశపాత్రకలదని ముమ్మరంగా చైనా ప్రచారం మొదలుపెట్టింది.

ఆగస్టు 28, 1962న లోక్‌సభలో ప్రధాని నెహ్రూ చైనా ప్రజారిపబ్లిక్ భారతదేశ సార్వభౌమాధికారాన్ని లడక్, ఈశాన్య సరిహద్దు ఏజన్సీ ప్రాంతాలలో అతిక్రమించిందని ప్రకటించారు, రెండురోజుల తరువాత కమ్యూనిస్టుపార్టీ జనరలు సెక్రటరీ అజయ్‌ఘోష్ సరిహద్దు నిర్ధేశించబడలేదని, వెంటనే సంభాషణలు ప్రారంభించాలని కోరారు. కమ్యూనిస్టుపార్టీ విమర్శనాదాడికి గురైంది. సరిహద్దుసమస్యపై భారత-చైనాల మధ్య వివాదం ఘర్షణలు మరింత తీవ్రం కాసాగాయి భారత-చైనా ప్రభుత్వాల వివిధ ప్రకటనలు కమ్యూనిస్టుపార్టీని క్లిష్టపరిస్థితులలోనికి త్రోసివేసి, ప్రజలకు దూరం చేసాయి. భారతకమ్యూనిస్టుపార్టీ సెప్టెంబరు చివరలో సోషలిస్టు చైనా ఎప్పుడూ దురాక్రమణ చేయదని తీర్మానం చేసింది, యీ తీర్మానం దేశంలో సంచలనాన్ని కలుగజేసింది. కొన్నిరాష్ట్రకమిటీలు యీ తీర్మానాన్ని వ్యతిరేకించాయి.

భారతకమ్యూనిస్టుల వైఖరి మార్పుచెందుతుండగా, సోవియట్ వైఖరి "తటస్థ విధానాన్నుండి" చైనా వైఖరిని "విమర్శించుటగా" మారింది. కృశ్చేవ్ లడక్ ఘటనలపై విచారాన్ని వెలిబుచ్చి, ప్రాణనష్టాన్ని యేవిధంగాను భర్తీ చేయలేదని "స్నేహసంభాషణలలో పరిష్కరించుకొనాలని విజ్ఞప్తిచేసారు. ఈ పరిణామాలన్నీ భారతకమ్యూనిస్టు పార్టీలోని "జాతీయవాదుల", "అంతర్జాతీయవాదుల వైఖరులు" శాశ్వతంగా చీలిపోయి భారత విప్లవ వ్యూహంపై కమ్యూనిస్టుపార్టీలో యేర్పడివున్న చీలికను అనుసరించే వుంది. అవే "మితవాద" "అతివాద" వైఖరులు అయినా, కేంద్రసెక్రటేరియట్‌లో యీ రెండు వైఖరులను వ్యతిరేకించుతు అజయ్ ఘోష్, నంబూద్రిపాద్‌లు దేశీయ, విదేశీయ విధానాలలో మధ్యేమార్గాన్ని అనుస

రించారు. సోవియట్, చైనా వివాదం 1960 నుండి విస్తరించినకొలది, అజయ్ మిత వాద, జాతీయవాద పంధాకు చేరువయ్యారు.

6 సోవియట్ రష్యా-చైనా ప్రజారిపబ్లిక్‌ల కమ్యూనిస్టుపార్టీలు 1960 దశ కంలో బహిరంగ సైద్ధాంతిక పోరాటానికి దిగి, ప్రపంచకమ్యూనిస్టుపార్టీలకు, నాయ కులకు తమపై విశ్వాసాన్ని పెంపొందించుకొనుటకై విజ్ఞప్తి చేసాయి. ఈ సిద్ధాంత వివాదం దురదృష్టకరంగా, నిర్మాణపోరాటంగా పరిణమించింది. భారతకమ్యూనిస్టు పార్టీ ఈ పోరాటంలో పూర్తిగ మునిగిపోయింది. భారత కమ్యూనిస్టుపార్టీ రాజకీయ విధానం, వ్యూహం, ఎత్తుగడలకు, ప్రపంచ సోషలిస్టు, పెట్టుబడిదారి విధానాల రెండు శిబిరాల సిద్ధాంతం కారణంగా మరింత ప్రాముఖ్యత వచ్చింది ప్రపంచ కమ్యూనిస్టు వుద్యమ సిద్ధాంతపోరాటానికి ప్రధానరంగం భారతదేశమైంది.

చైనా కమ్యూనిస్టుపార్టీ 1960 ఏప్రిల్‌లో "లెనినిజం చిరస్థాయి అగుగాక" అనే నాలుగువ్యాసాలతో బహిరంగ సైద్ధాంతిక పోరాటంసాగించింది. రణదివె న్యూయేజ్‌లో 24 యేప్రిల్ 1960లో వ్రాసిన వ్యాసంతో భారతదేశంలో యీ పోరాటం ప్రారంభమైంది. అదే పత్రికలో అజయ్‌ఘోష్ కృశ్చేవ్ భారత పర్యటన వ్యాసంలో రెండో దృక్పథం ప్రతిబింబించింది ఈ రెండు వ్యాసాలు చైనా, సోవియట్ రష్యాల సైద్ధాంతిక పోరాటాల ప్రతీకలు. ఈ విధంగా భారత కమ్యూనిస్టు వర్గాలలో గందర గోళం సృష్టించబడింది పార్టీ కార్యక్రమాలు ప్రక్కకుత్రోసివేయబడి, వొకేవొక కార్యక్రమం బహిరంగ సైద్ధాంతిక పోరాటం, ప్రధాన కార్యక్రమమైంది. ఆచర ణలో 1961 ఫిబ్రవరిలో జరుగబోయే పార్టి కాంగ్రెసు తమ తమ గ్రూపులను సమీకరించ ప్రారంభించారు. ఏ జిల్లాలో ఏ రాష్ట్రంలో యేగ్రూపు మెజారిటి నాయ కత్వంలో ఆ గ్రూపువారుమాత్రం కాంగ్రెసుకు ప్రతినిధులుగా ఎన్నుకోబడ్డారు పార్టీ చీలికకు ఆచరణలో బీజాలు వేయబడ్డాయి. ఈ విధంగా మితవాద, అతివాద వర్గాలు ప్రత్యర్థులుగా విజయవాడ పార్టీ కాంగ్రెసు కురుక్షేత్రంలో పోరాటానికి తయారయ్యారు.

ప్రపంచ ట్రేడుయూనియన్ జూన్ సమావేశం పెకింగులో జరిగినపుడు సోవియట్ యూనియన్, చైనా రిపబ్లిక్‌పార్టీల ప్రతినిధుల బహిరంగ సిద్ధాంత పోరాటం జరిగింది. భారతకమ్యూనిస్టుపార్టిలోని "మితవాద" "అతివాద" కమ్యూ నిస్టు వర్గాలలో వొకవర్గం సోవియట్ యూనియన్‌పార్టీ దృక్పదాన్ని, మరోవర్గం చైనా కమ్యూనిస్టు పార్టీ దృక్పధాన్ని తమవిగా భుజాన వేసుకొని ప్రతిపాదకుల కంటె మద్దతుదారులు తీవ్రపోరాటాలు చేయుటయేగాక, తమ స్వదేశాలకు అవే వైఖరులను మోసుకొనివెళ్ళి పార్టీలో అంతర్గత సైద్ధాంతిక పోరాటం పేరుతో పెడ మార్గాలలో చీలికల పంధాలను ఇరువర్గాలు చేబట్టాయి. సైద్ధాంతిక పోరాటాన్ని

ఆచరణలో గ్రూపులు, ముఠాలు కట్టుటగా మార్చివేసి, చీలిక మార్గాన్ని చేబట్టారు.

ఈ పూర్వరంగంలో మితవాదవర్గం" సి. పి. ఐ. లోని అతివాదవర్గంపైదాడిని తీవ్రతరం చేసి, వొత్తిడి చేయసాగింది. అతివాదవర్గం అంతర్జాతీయంగా సోవియట్ కమ్యూనిస్టుపార్టీ రాజకీయ సైద్ధాంతిక విధానాలను ఎదుర్కొంటున్న చైనా కమ్యూనిస్టుపార్టీ సైద్ధాంతిక, రాజకీయ విధానాల సారూప్యత, సాన్నిహిత్యము కలిగి వున్నదని మితవాదవర్గం తలచింది. సి. పి. ఐ కార్యవర్గం సెప్టెంబరు 1961లో సమావేశమై యీ సిద్ధాంతరీత్యా తేల్చవలసివచ్చినపుడు ఊగిసలాడే అవకాశవాద మెజారిటీ నాయకత్వంలోని వర్గాలు మితవాదంవైపు మొగ్గి సోవియట్ కమ్యూనిస్టు పార్టీని బలపరచాయి. అదేవిధంగా భారతదేశం యెడల సోవియట్ రాజకీయ విధానాన్ని శాంతియుత అహింసా మార్గంలో సోషలిజంలోనికి పరివర్తన మార్గాన్ని సృజనాత్మకంగా మార్క్సిస్టు విధానమార్గంలో బలపరచారు. ఆ విధంగానే తీర్మానించారు. అది అమృతసర్ కాంగ్రెసులోపార్టీ భారతప్రభుత్వంపై కావించిన విశ్లేషణ, సుముఖ అంశాలను అనుసరించే యీ తీర్మానం వుంది. కేంద్రకార్యవర్గం ఆమోదించిన యీ తీర్మానం అతివాదవర్గనాయకత్వాలను ముఖ్యంగా పశ్చిమబెంగాల్, పంజాబ్, ఆంధ్ర ప్రదేశ్‌లలో కోపోద్రేకాలను రేకెత్తించింది. కొంతమంది బహిరంగంగా చైనా విధానాలను బలపరస్తూ, భారతప్రజలకు దూరమయ్యారు. అక్టోబరు 21న పశ్చిమబెంగాల్ పార్టీ, కేంద్రకార్యవర్గ తీర్మానాన్ని ఖండించుతూ దాని చర్య "వినాశనకరము, తప్పుడుది" అని చైనా కమ్యూనిస్టుపార్టీ అభిప్రాయాలను తెలుసుకొనకుండా చేసినదని విమర్శించి. తీర్మానించింది. అదే విధంగా పంజాబ్‌లోను తీర్మానించారు.

విజయవాడ 6వ పార్టీ కాంగ్రెసులో మూడు ముసాయిదా కార్యక్రమాలు మూడు రాజకీయతీర్మానాలు చర్చల నిమిత్తం ప్రతిపాదించబడినవి. పార్టీ కాంగ్రెసులో తీవ్రచర్చల అనంతరం అన్ని ముసాయిదాలు త్రోసివేయబడినవి. పార్టీలో సంక్షోభం యేర్పడి పార్టీ చీలిపోయేదశకురాగా చివరకు రాజీగా, ఆమోదించబడిన అజయ్‌ఘోష్ రాజకీయ నివేదిక ఆధారంగా రూపొందించబడిన తీర్మానం ఆమోదించబడుట జరిగింది. అది పార్టీలో ఐక్యత రూపొందించక అతివాదులు, మితవాదులు, మధ్యేమార్గవాదులు తమతమ అవగాహనలకు అనుకూలంగా వ్యాఖ్యానించి, వివరించుటకు వీలుగవుంది, ఆచరణలో నిర్వీర్యమైంది.

7. సోవియట్ కమ్యూనిస్టుపార్టీ 22వ,కాంగ్రెసుకు అజయ్‌ఘోష్‌నాయకత్వంలో సి. పి. ఐ. లోని మితవాద, అతివాద, మధ్యేమార్గవాదుల సంయుక్త ప్రతినిధి వర్గం హాజరైంది. సి. పి. యస్. యు. తన సైద్ధాంతిక రాజకీయ విధానాలను బలపరచుకొనుటతోపాటు చైనా చైనా సైద్ధాంతిక రాజకీయ విధానాలను అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో వ్యాప్తినరికట్టుటకు చైనాపై పరోక్షంగా దాడిచేయుటకు

చైనా విధానాలను పూర్తిగ మద్దతునిస్తున్న అల్బేనియాపై నేరుగా దాడిచేసింది. సాంప్రదాయంగా సి. పి. యస్. యు. ప్రభావంలో అంతంత మాత్రంగా వున్న కమ్యూనిస్టుపార్టీల విశ్వాసం దెబ్బతిన్నది. భారతకమ్యూనిస్టుపార్టీపై దీని ప్రభావం అత్యధికంగా పడింది. అభిప్రాయభేదాలను యీ విధంగా పరిష్కరించనెంచుట మార్క్సిస్టు విధానవ్యతిరేకమని చౌయెన్‌లై వాదించి, నిరసనగా నిష్క్రమించాడు. సహజంగానే సి. పి. యస్. యుని సాంప్రదాయంగా బలపరచే వివిధదేశాల కమ్యూనిస్టుపార్టీలలో కొంతగందరగోళాన్ని మరికొంత పునరాలోచనను కలుగజేసింది. అజయ్ ఆల్బేనియా, చైనా దృక్పదాల యెడల సానుభూతియేమాత్రం లేనప్పటికి,తదనంతర అజయ్‌ఘోష్ ఉపన్యాసాలలో కొంతపునరాలోచనకన్పడుతున్నది. పార్టీ కార్యదర్శిగా అతని ప్రధానలక్ష్యం పార్టీ నిర్మాణ ఐక్యతను కాపాడి విచ్ఛిన్నతకు చోటివ్వకుండుట జనరల్ ఎన్నికలముందు పార్టీలో ఎట్టి సంక్షోభం లేకుండా పార్టీని కాపాడుటగా వుంది. అంచేత సోవియట్‌పార్టి కాంగ్రెసులో అల్బేనియాపై దాడిలో యేమాత్రం పాల్గొనలేదు. ఇదే విధానాన్ని కమ్యూనిస్టుపాలన లేని దేశాలలోని కమ్యూనిస్టుపార్టీలు అవలంభించాయి. గతంలో యివి అన్నీ సిద్ధాంతపోరాటంలో సోవియట్ యూనియన్‌పార్టీని బలపరచే అజయ్‌దృష్టిలో సోవియట్‌పార్టి కాంగ్రెసు మరోసారి స్టాలిన్‌ను తెగనాడుట అత్యంత ఘోరము. కృచ్ఛేవ్ 1956 నుండి స్టాలిన్‌ను తెగనాడుట ప్రపంచకమ్యూనిస్టు ఉద్యమాన్ని బలహీన పరచింది. ఈ అవగాహనే భారత కమ్యూనిస్టుపార్టి ప్రతినిధివర్గం తన అసమ్మతిన తెలియజేయునట్లు చేసిందని అజయ్ ఘోష్ 10 డిశెంబరు న్యూయేజ్ కమ్యూనిస్టు వారపత్రికలో వ్రాసారు. అప్పటికే కమ్యూనిస్టుపార్టీలోని "మితవాద" అతివాద" వర్గాల మధ్య సంబంధాలు విపత్కర పరిస్థితులకులోనైనవి విషమపరీక్షగా భారత-చైనా సరిహద్దు వివాదం తీవ్రపరిస్థితికి చేరే ఘటనలు జరిగాయి. సోవియట్-చైనా కమ్యూనిస్టుపార్టీల విధానాలు 1961 అంతటా భారతనెహ్రూ ప్రభుత్వం యెడల వ్యవహరించవలసిన పద్దతులు భిన్న విస్తృత మార్గాలలో నడచాయి.

అదే కాలంలో కొత్తగా సరిహద్దుల అతిక్రమణతో పెకింగు,న్యూఢిల్లీ రాయబారులు పరస్పరం నోటులు అందజేసుకొన్నారు, వాతావరణంకలుషితం కాజొచ్చింది. నెహ్రూ లోక్‌సభలో నవంబరు 21న సమస్యలను ప్రజల ముందుంచారు. ఫలితంగా దేశ, విదేశ సమాచార సంస్థలు వార్తలలో ప్రజారిపబ్లిక్ చైనాచర్యలను గర్హించాయి. నెహ్రూ లోక్‌సభలో చైనాచర్యలను బట్టబయలు చేయుట, అజయ్‌ఘోష్ నవంబరు 21న చొరవతో సరిహద్దుఘటనలపై "ఆశ్చర్యాన్ని సంతాపాన్ని వెలిబుచ్చుట చైనా కమ్యూనిస్టు అధికారవర్గాలకు కోపోద్రేకాలు కలుగజేసింది. సి. పి. ఐ. నాయకుడు అజయ్‌ఘోష్ చైనా చర్యలు ఉద్రేకాలను రెచ్చగొట్టి, భారత-చైనా సంబంధాలను

కలుషితం చేసేవిగా వున్నవని, అట్టి చర్యలకు భరతవాక్యం చెప్పాలని అవి తిరిగి జరుగకుండా తగినకట్టుబాట్లు చేయాలనికోరాడు. జెన్‌మిన్ జిపావో "నెహ్రూనుఅజయ్ అనుసరించాడు.... తొందరపడి చైనాను ఖండించుతు ప్రకటించాడు. సత్యాన్ని తెలుసుకొనుటకు ప్రయత్నించక ఘటనలలోని తప్పు వొప్పులను చూడలేదు" అని కోపంతో అజయ్‌ఘోష్‌పై దాడి చేసింది.

భారతకమ్యూనిస్టుపార్టీ కార్యదర్శి అజయ్‌పై యీ దాడి,పార్టీలో "మితవాద" "అతివాద" ప్రత్యర్థి రెండుగ్రూపుల మధ్య వివాదం పెరుగుటకు చైనా చర్య తోడ్పడింది. పశ్చిమబెంగాల్‌పార్టి తీర్మానంప్రకారం అజయ్‌ఘోష్ చైనా వ్యతిరేక ప్రకటన "పార్టీలోని ఒక భాగం యొక్క అభిప్రాయం మాత్రమేనని తెలుస్తున్నదని" యుగోస్లావియా వార్తా సంసస్థ నివేదికలు తెలియజేస్తున్నవి సి. పి. ఐ. 1961 చివరకు వొకదశశిఖరాగ్రభాగానికి చేరు చేరుకొన్నది. పార్టిలోని "మితవాదవర్గం" బహిరంగంగా చైనాకమ్యూనిస్టుపార్టిని విమర్శించుట, తిరిగి బహిరంగంగా విమర్శించబడుట ఆల్బేనియా చైనా వైఖరికి వ్యతిరేకంగా సోవియట్ అవగాహనలను బలపరచుట, అయినా సోవియట్ దాడి పద్ధతులకు విచారాన్ని వ్యక్తం చేసి, స్టాలిన్‌పై నూతన దాడులుచేయుట చీలికలకు ఎరవై క్రుశ్చేవ్ తిరిగి ఎదురుదాడి చేయుటకు దారి తీసింది.

ఇట్టి పరిస్థితులలో జనరల్ సెక్రటరీ అజయ్‌కుమార్‌ఘోష్ 13 జనవరి 1962న మరణించారు. జాతీయ, అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో మధ్యేమార్గవాదిగా వేర్పాటువాద శక్తులను నరశీకృతంచేస్తూ ఐక్యతా తటస్థవాదుల ప్రయత్నాలకు బలాన్ని చేకూర్చుతున్న సమన్వయశక్తి బలహీనపడింది. భారతకమ్యూనిస్టు ఉద్యమంలో "మితవాద" అతివాద శక్తుల మధ్య సమన్వయ శక్తిగా వుండి వివిధ భేదాభిప్రాయాలు గలవారితో హృదయపూర్వకంగా మాట్లాడి చర్చించగలవ్యక్తి లేని లోటు సంక్షోభంలోవున్న సి.పి.ఐ కి స్పష్టంగా కన్పించుతున్నది. పార్టీ బలంగావున్న పశ్చిమబెంగాల్, కేరళ, పంజాబ్‌లలో అతివాదవర్గానికి బలహీనంగావున్న రాష్ట్రాలలో మితవాద వర్గానిదిపైచేయిగా వుంది. ఆంధ్రప్రదేశ్‌లో దాదాపు 50:50 ప్రారంభంలో వున్నట్లున్నది.

సి.పి.ఐ ఏప్రిల్ చివరకు పార్టీలోని "మితవాద" "అతివాద" వర్గాలుపోటీని వాయిదావేసింది. కారణం నాయకత్వం యెట్టి నిర్ణయం చేయజాలకపోయింది. మాజీ కేరళ ముఖ్యమంత్రి నంబూద్రిపాద్ అతివాదులయెడల కొంత సుముఖంగా వున్నందున, అతివాదులను సంతృప్తిపరచుటకు జనరల్ సెక్రటరీగాను, అధికారాలు నిర్వచించని అధ్యక్షపదవిని సృష్టించి మితవాదవర్గ నాయకుడైన డాంగేకు అధ్యక్షునిగా పార్టీ పదవీ బాధ్యతలు అప్పగించే రాజీ వొప్పందాన్ని మితవాద, అతివాద వర్గాలు

చేసుకొన్నవి. డాంగేని అధ్యక్షస్థానానికి అంగీకరించిన అతివాద వర్గానికి కార్యదర్శి వర్గంలో లేక కేంద్ర సెక్రటేరియట్‌లో ఆధిక్యత ప్రాతినిధ్యాన్నిచ్చి, దైనందిన కార్యకలాపాలను నడిపే బాధ్యతల నిచ్చారు. క్లుప్తంగా భిన్నవర్గాలు లేక గ్రూపుల మధ్య కేంద్రంలో అనిశ్చిత సమతూకం, పార్టీలోని నాటిపరిస్థితిని ప్రతిబింబించే విధంగా జాతీయసమితి ప్రమేయం అంటే నిర్మాణసూత్రాల ప్రకారం ఎన్నికలు లేకుండా జరిగిన "రాజీవొప్పందం" యేర్పాటు ఇది యే మార్క్సిస్టు-లెనినిస్టు సూత్రాలననుసరించి జరిగిందో చెప్పజాలము బూర్జువాపార్టీలు యిట్టి విధానాలు అవలంభించుట సర్వసాధారణము ప్రాప్తకాలజ్ఞత పరాకాష్ఠయిది. దీనినే పార్టీ చరిత్ర రుజువుచేసింది.

8. సరిహద్దు ప్రాంతాలైన లడక్, నీఫాలపై చైనాసైన్యాలదాడి, సరిహద్దుల అతిక్రమణలు 20 అక్టోబరులో ప్రారంభమైంది. కమ్యూనిస్టుపార్టీ స్తంభించిపోయింది చైనాని నిర్మొహమాటంగా ఖండించకుండా జాతీయ ప్రభుత్వాన్ని పూర్తిగ బలపరచకుండా, అతికష్టంతో సమీకరించుకొన్నబలాన్నంతా కోల్పోయే పరిస్థితి యేర్పడింది. కొన్ని రాష్ట్రకమిటీలు బహిరంగంగా చైనా దురాక్రమణను ఖండించనారంభించాయి. పార్టీ నవంబరు 1న ప్రకటనచేయువరకు పార్టీ యెట్టిచర్య తీసుకొనలేదు.

అదేకాలంతో అక్టోబరు 22న, క్యూబాలో సోవియట్ మిసలీల సంక్షోభం ప్రారంభమైంది. భారత-చైనా సరిహద్దు వివాదంలో మొట్టమొదటసారిగా అక్టోబరు 25న ప్రవదా సంపాదకీయంలో చైనాను బలపరచింది, మక్‌మోహన్‌రేఖ న్యాయబద్ధను ప్రశ్నించింది. చైనా కాల్పుల విరమణను బలపరచింది. రష్యా క్యూబా మిసలీలలు ప్రపంచ అణుయుద్ధాన్ని పొలిమేరలకు వచ్చినట్లుగా ఊహాగానాలు. వచ్చుటతో రష్యా ప్రపంచ కమ్యూనిస్టు ఐక్యతకు ప్రాధాన్యతనిచ్చి, చైనామద్దతును ఆశించుతు దీనికి వొడిగట్టినట్లు కన్పడుతున్నది. క్యూబా మిసలీల సమస్యపై రష్యా వెనుకడుగు వేయుటను చైనా నిర్దాక్షిణ్యంగా అమెరికా యెడల సంతృప్తిపరచే విధానం" అవలంభించిందని తీవ్రంగా తెగనాడింది. ఇండియా విషయమై తమను సంతృప్తిపరచే విధానం చాలదని స్పష్టంచేసింది. చైనా పత్రిక అక్టోబరు 22న, నేడు నెహ్రూ అభివృద్ధి నిరోధకులకు సామ్రాజ్యవాదులకు ఏజంటుగా పనిచేస్తున్నాడని" నిందించింది. సోవియట్ యూనియన్ ప్రవదా నవంబరు 5న సంపాదకీయంలో సరిహద్దు వివాదంలో చైనాకు మద్దతు దశనుండి తటస్థ విధానాన్ని అవలంభించింది.

సి.పి.ఐ కాలంలో సోవియట్ యూనియన్, చైనాలు బహిరంగంగా యిచ్చిన సలహాలనుత్రోసిబుచ్చి అంతర్గతంగా పార్టీలోని అతివాదవర్గాల అభిప్రాయాలనుకూడ త్రోసిబుచ్చి, డాంగే నాయకత్వంలో చైనాను ఖండించుతు, నెహ్రూ వెనుక ఐక్య

మవ్వాలని పిలుపునిచ్చింది. వ్యాపార ప్రాతిపధికపై యేదేశాన్నుండైనా ఆయుధాలు కొనవచ్చని ప్రకటించింది. సాధారణంగా సి.పి.ఐ. బలపరచే బ్రిటిష్ కమ్యూనిస్టుని పార్టీ దీనిని వ్యతిరేకించింది. ఇటాలియన్ కమ్యూనిస్టుపార్టీ తాము సి.పి.ఐ వైఖరిని అర్ధం చేసుకోలేకుండా వున్నామని విమర్శించింది.

సరిహద్దు యుద్ధ పరిస్థితి కొంత మెరుగుఅగుటతో సి.పి.ఐ. అగ్రనాయకుడు డాంగే ఇంటా బయట తన స్థానాన్ని పదిలపరచుకొనుటకు త్వరితంగా రాజకీయ, నిర్మాణచర్యలు చేపట్టాడు. ప్రపంచకమ్యూనిస్టుపార్టీలన్నిటికి భారత కమ్యూనిస్టుపార్టి వైఖరిని వివరిస్తూ చైనాపై వొత్తిడి చేయవలసినదిగా విజ్ఞప్తి చేస్తూ సుదీర్ఘలేఖను వ్రాస్తూ వివరించుటకు విదేశాలకు పార్టి ప్రతినిధి వర్గాన్ని డాంగేనాయకత్వంలో జాతీయసమితి నిర్ణయంప్రకారం వెళ్ళింది. డాంగే నాయకత్వంలో ప్రతినిధివర్గం అక్ష్యం పార్టీ చైర్మెన్‌గా తన స్థానాన్ని నూతన నాయకత్వాన్ని పదిలపరచుకొనుట కృచ్చేవ్‌తో సంభాషణలలో కమ్యూనిస్టుపార్టీ తన నాయకత్వంలో తీసుకొన్న చర్య లన్నిటిని సమర్ధించుకొని సరియైనవిగా వివరించి సుముఖ స్పందనను పొందుటగా వుంది ఈ విషయంలో డాంగే విజయం సాధించలేకపోయాడని వార్తాసంస్థలు పేర్కొన్నవి. జాతీయసమితి తీర్మానం, అనవసరంగా సరిహద్దు అతిక్రమణను నిర్మొఖమాటంగా పేర్కొనుటను గర్హించినట్లు, నెహ్రూను బలపరచుటలో తగిన పరిమితులు లేకుండా విమర్శించినట్లు వార్తలు వచ్చాయి. పార్టీ నాయకత్వాన్ని తన చేతులలోనికి తీసుకొని డాంగే తన విధానానికి వ్యతిరేకంగావున్న రాష్ట్రపార్టీనాయ కత్వాలను లొంగదీయుటో, రద్దుచేసి నూతన ఆర్గనైజింగు కమిటీలను వేయుటో, లేక పునర్మించుటోచేసి తననాయకత్వాన్ని స్థిరపరచుకొన్నాడు. అతివాద వర్గాల పెక్కురు జైళ్ళలో వుండుటను డాంగే తన ప్రయోజనాలకు వినియోగించుకొన్నాడు ఇదే ప్రజాస్వామ్య కేంద్రీకరణ, ఆచరణ విధానమైతే మౌలికంగా అధ్యయనం చేయవలసి వుంటుంది. గ్రూపుల తాత్కాలిక ప్రలోభాలకు లోనై పార్టి నిర్మాణా నికి, భవిష్యత్తుకు శాశ్వతహాని జరిగిందనుట చారిత్రిక వాస్తవం. ఇతర మార్గాలు ఆలోచించి వుండవలసింది. నాలుగు దశాబ్దాల తరువాతనైనా చారిత్రిక తప్పిదాన్ని ఆత్మవిమర్శనను చారిత్రిక దృక్పధంతో, నిజాయితీతో, చేసుకొనవలసిన అవసరం వుంది. సైద్ధాంతిక పోరాటంలో భాగంగా అట్టి నిర్మాణ చర్యలు అవసరమయ్యాయని సమర్ధించుకొనుట గతితార్కిక, చారిత్రికభౌతికవాదం, మార్క్సిజం-లెనినిజం కాజాలదు.

పార్టీలో మితవాదుల యీ అతివాద నిర్మాణ చర్యలు సహజంగానే అతివాద వర్గాల ప్రతిచర్యలకు దారితీసింది గ్రూపులుగ చీలియున్నపార్టి యిప్పుడు రెండు పార్టీలుగ చీలుటకు ప్రాధమిక చర్య ప్రతిచర్యగా నెంచుటకు అవకాశముంది.

డిశెంబరు 1962, జనవరి-ఫిబ్రవరి 1963లలో కమ్యూనిస్టు చైనా బహిరంగంగా నిజమైన మార్క్సిస్టు-లెనినిస్టులు సోవియట్ ననుసరించే పార్టీలలో తిరుగుబాటులు కావించాలని పిలుపునిస్తూ ముఖ్యంగా సి.పి.ఐ.లో చీలికను ప్రోత్సహించింది.

విదేశాలకు వెళ్ళివచ్చిన ప్రతినిధివర్గ నాయకుడు డాంగే పార్టీ కార్యవర్గానికి నివేదిక సమర్పించాడు. పార్టీ కార్యవర్గం డాంగే విదేశాలనుండి తెచ్చిన సలహాలకు సుముఖంగా స్పందించినట్లు కన్పించింది. 12 జనవరి 1963లో కార్యవర్గం ఆమోదించిన తీర్మానం ఆ సలహాలను కొంతవరకు ప్రతిబింబించినట్లు చెప్పుకొనవచ్చు. భారత ప్రభుత్వం సంప్రదింపులకై చేబట్టిన వైఖరిని కొంతవరకు బలపరచుట కొనసాగిస్తూనే, వొడంబడిక జరుగుటకు బాధ్యత పెకింగుపైనే వుంచుతు, శాంతియుత పరిష్కారముపై నొక్కి చెప్పుతు, సామ్రాజ్యవాదశక్తుల ఎత్తుల ప్రమాదాన్ని స్పష్టం చేయుట జరిగింది.

9. సి. పి. ఐ. తన ప్రభావంలోనే వుండాలని సి. పి. యస్ యు ప్రయత్నం చేస్తున్నది. అతివాదవర్గం తిరుగుబాటు చేస్తే రాష్ట్రస్థాయి నాయకత్వాలు అటువైపు పోగలవనే అభిప్రాయానికి సి. పి. యస్. యు. వచ్చి 1963లోనే చీలితేనే మంచిదనే నిర్ణయానికి వచ్చినట్లున్నది. సి. పి. యస్. యు. అసమ్మతివాదులతో తేల్చుకొనమని సి. పి ఐ. కి సలహాయిచ్చినట్లు తెలుస్తున్నది. ఈ సందర్భంలో, విజయవాడ పార్టీ కాంగ్రెసులో సుశ్లోవ్ మైనారిటీ బలాన్నిచూసి ఆశ్చర్యపోయి "మీ పార్టీలో చైనా ప్రభావం చాలా యెక్కువగానే వుందని" అన్నట్లు చెప్పబడింది. చీలిక భూతాన్ని సి. పి. ఐ. చూడకముందే సి పి. యస్. యు. నాయకత్వం చీలిక దుమారాన్ని లేవనెత్తింది. విజయవాడలో చీలికను నివారించుటకు సి. పి. యస్. యు. నాయకత్వం ప్రయత్నించింది. అదే విధంగా 1964లో చీలిక రాకపోతే తదుపరి జరుగుపార్టీ కాంగ్రెసులో మొత్తంపార్టీ అతివాదంవైపు పయనించే అవకాశం వుందని 1964లో రష్యా అంచెనాగా వుందని పరిశీలకుల అభిప్రాయంగా వుంది. అదే అవగాహనకు సి. పి. ఐ. కూడ వచ్చింది. మరోవైపు చైనా, ఇండోనేషియా కమ్యూనిస్టు పార్టీల నాయకత్వాలు అట్టి అవగాహనకు వచ్చి చీలికను ప్రోత్సహించాయి. అజయ్ ఘోష్ మరణం మధ్యేమార్గవాదులు బలహీనపడుటతో పార్టీని చీల్చాలనే మితవాద, అతివాద వర్గాల ఆశలు వాస్తవాలయ్యాయి. భారతకమ్యూనిస్టుపార్టీ చీలికకు ఎరగా అగుటకు సి. పి. ఐ.లోని అతివాదులు, మితవాదులు ప్రత్యక్షంగాను, పరోక్షంగా సి. పి. సి; సి. పి. యస్ యు లు సమాన బాధ్యులుగ నెంచాలి.

# (6)

1. భారతకమ్యూనిస్టు పార్టీలో 1960 దశకంలో చీలిక యేర్పడి, సి. పి. ఐ. సి. పి. ఐ (యం) అను రెండు పార్టీలుగా రూపొంది ముప్పయి యేళ్ళుగడచిన తరు

వాత 90 దశకంలో చీలికపై జరిగిన వాదనలు ప్రతివాదనలు విచారాన్ని కలిగిసాయి.

"భారతకమ్యూనిస్టు ఉద్యమంలో చీలిక బయటివారి జోక్యం ఫలితంకాదని, దశాబ్దంపాటు పార్టీలో జరిగిన అంతర్గత పోరాట ఫలితమని" ఆగస్టు 1985లో సూర్జిత్ అన్నారు. సూర్జిత్ "దశాబ్దంపాటు, "1947 అధికారం బదలాయింపునాటి నుండి" అని నంబూద్రిపాద్ రెండేళ్ళక్రితం "అర్థశతాబ్దంపాటు" సాగిన అంతర్గత పోరాటాల ఫలితమని సూర్జిత్ అనుటలోని పోరాటకాలంలోని భిన్నత్వాలను ఇంద్ర దీప్ సిన్హా పేర్కొన్నా, కాలాలను వివిధంగా పేర్కొనుటను పట్టించుకొననవసరం లేదు. అంతర్గతపోరాటం దీర్ఘకాలం సాగిందనుటలో భిన్నాభిప్రాయం లేదు. అదే వాస్తవమైతే చీలికను తీసుకొనివచ్చుట 10 నుండి 20 సంవత్సరాలు ఎందుకు ఆగారని సిన్హా ప్రశ్నించినదానికి ఎవరూ సమాధానం చెప్పకపోయినా పార్టీ ఐక్యతను కాపాడలనే వైఖరిని "మితవాద" "అతివాద" హద్దులు అవలంబించి "భట్టిప్రోలు పంచాయతీ" రాజీలకు యిరువురూ అవకాశవాదులై ఆమోదించారు. అంతర్గత సైద్ధాంతిక పోరాటం రెండు పంథాల మధ్యకాదని, అది ఈమూడు పంథాల మధ్యయని 4వ, పార్టీ కాంగ్రెసు నివేదిక స్పష్టం చేసింది.

ఆసక్తికరమైన అంశం 1968లో సి పి. ఐ (యం) పొలిట్ బ్యూరోయే "అతివాదపు పొరపాటు"అని అంగీకరించినదానిని, సరైన "వర్గపోరాటం"అనినొక్కి చెప్పుతున్నారు, అయితే సిన్హా సూర్జిత్‌లు వక్రీకరణలను వరుసగా పేర్కొన్నారు. పార్టీలో 1954-59ల మధ్య సాగిన అంతర్గత పోరాటం, వర్గపోరాట పంథాకు, వర్గ సామరస్యపంథాకు మధ్యకాదని స్పష్టం. పైగా అది మూడు పంథాల మధ్య పోరాటం. అటు "మితవాదులు" యిటు "అతివాదు"ల మధ్యనేగాక, యిరువురి దాడికి గురి అగుతున్న కేంద్రకమిటి మెజారిటి "మధ్యేమార్గపంథా" అన్నదే మూడవపంథా. అంతర్జాతీయ సైద్ధాంతిక పోరాటం 1960 దశకంలో అతి తీవ్రస్థాయికి చేరుట, సరిహద్దు సంఘర్షణలతో ఉద్రేకాలు అత్యున్నత స్థాయికి చేరుట, అజయ్‌ఘోష్ మరణంతో కేంద్రకమిటి మెజారిటి "మధ్యేమార్గం" బలహీనపడి మనజాలకపోయింది.

ఇంద్రదీప్ సిన్హా ఉదహరింపు ప్రకారం, బి. టి. రణదివె పొరపాటును ఆమోదించి "నేరపూరక చర్యను చేయుటలో సి. పి. ఐ. నాయకులు మావోచేతులలో పరికరంగా తయారయ్యారని" అని తాజాగా వ్యాఖ్యానించారు. చైనా పార్టీ మావోయిస్టుల ప్రోద్బలంతో కమ్యూనిస్టుపార్టీ (మావోయిస్టు) నాయకులు, భారత కమ్యూనిస్టుపార్టీని చీల్చారని విమర్శించుట వారు "చైనా యేజంట్లుగా" పనిచేసారని సూచించుట లేదు. వారిని "చైనా అనుకూలురని"కూడ అనుటకాదు. మావోయిస్టులని లేక మావోయిస్టు అనుకూలురని మాత్రమే అగుతుందని సిన్హా 1985లో వివరించారు. అంటే వారి సైద్ధాంతిక అభిముఖాన్ని మాత్రమే సూచిస్తున్నది.

దీర్ఘకాలంగా పార్టీలోపల మితవాద సంస్కరణవాద దృక్కోణం నుండి వొకవర్గం అతివాద వొంటెత్తు, పిడివాద కోణాన్నుండి మరోవర్గం పార్టీలో అంతర్గత సైద్ధాంతిక పోరాటాన్ని ఉద్రేక పూర్వకంగా తీవ్రస్థాయిలో జరిపియున్నందున తేలికగా కృశ్చేవిజానికి, మావోయిజానికి ఆకర్షితులై యిరువర్గాలు మితవాద చీలికదారులు, అతివాద చీలికదారులుగ అయ్యారు. ఇసువురూ చీలికతో పార్టీలను మార్క్సిజం-లెనినిజం మార్గం పట్టించి బలమైన విప్లవపార్టీలుగ నిర్మించుతున్నామనేచెప్పుతూ పార్టీని చీల్చేమార్గంలో పయనించి చీల్చి, కార్మిక, కర్షక, విద్యార్థి, యువజన, మధ్యతరగతి ఉద్యోగవర్గాల అనైక్యతను, వామపక్ష అనైక్యతతోపాటు పెంచి, పోషించారు. ఇది చారిత్రిక వాస్తవం.

భారతకమ్యూనిస్టు ఉద్యమంలో వచ్చిన 1964-65 చీలిక చాలా దురదృష్టకరమైనదని సర్వత్రా అందరూ భావిస్తున్నారు. ఆ చీలిక భారతదేశంలో కమ్యూనిజాన్ని ఉద్ధరించుటకనేవారు, అది చారిత్రిక అవసరమనేవారు దాని ఫలితంగా కార్మిక కర్షక, వ్యవసాయకూలి, విద్యార్థి, యువజన, మధ్యతరగతివర్గాలలో ప్రబలిపోయిన అనైక్యత, మొద్దుబారి వారి పోరాట పటిమ చరిత్ర మనముందుంచినపుడు, కనజాలక పోవుట ప్రజలలో విశ్వాసాన్ని పొందజాలక పోవుటలో విచారం తప్ప ఆశ్చర్యం లేదు.

## (7)

1. భారత కమ్యూనిస్టుపార్టీ చీలిన అనంతరం బొంబాయి, కలకత్తాలలో జరిగిన మితవాద, అతివాద 7వ, కాంగ్రెసులు రెండూ జాతీయ, అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమాలలో చెలరేగిన అంతర్గత సైద్ధాంతిక చర్చల నేపధ్యంలో దేశ, విదేశాలలో అత్యంత ఆశక్తిని కలిగించాయి. భారత కమ్యూనిస్టు రాజకీయాలలో వొక నూతనశకం అరంభమైంది.

భారతకమ్యూనిస్టుపార్టి 7వ కాంగ్రెసుబొంబాయిలో 13నుండి 23, డిశెంబరు 1964లోను విడిపోయిన అతివాదుల 7వ, కాంగ్రెసును కలకత్తాలో నవంబరు 1964 ప్రారంభంలోను జరిగాయి. వివిధ రాజకీయ, ఆర్థిక, పార్టి నిర్మాణ సమస్యలపై సమర్పింపబడిన తీర్మానాలు. చర్చించబడి ఆమోదించబడినవి.

పార్టీ కాంగ్రెసులు రెండూ చర్చించి, నిర్ణయాలు గైకొన్న స్వాతంత్ర్యసమస్య భారత రాజ్యాంగం-ప్రభుత్వ వర్గ నైజము, విదేశాంగవిధానం, పెట్టుబడిదారి విధాన మార్గంలో ఆర్థికాభివృద్ధి, సంక్షోభం, జాతీయ ప్రజాస్వామ్యం-జనతా ప్రజాస్వామ్యం పెట్టుబడిదారేతర ఆర్థికాభివృద్ధి, సోషలిజంలోని శాంతియుత పరివర్తన, వ్యవసాయ సమస్య, మితవాద, అతివాద సంస్కరణ వాదాలను అధ్యయనం చేద్దాము.

2. యుద్ధానంతరం వలసలలో సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాలు ప్రారంభించుటతో బ్రిటిష్ ప్రభుత్వం యింకేమాత్రం పాలనకొనసాగించలేమని, కాంగ్రెసు నాయకత్వంకూడ సామ్రాజ్యవాద వ్యతిరేఖ పోరాటాన్ని చేబట్టిన అది సామాన్య విప్లవ తిరుగుబాటుగా పరిణామమొంది, జాతీయ శక్తులపై తమకుగల గుత్తనాయకత్వం తమ చేతులనుండి జారిపోతుందని ఆందోళన, భయాలకులోనగుట జరిగింది. అందుకే సామ్రాజ్యవాదం, జాతీయ కాంగ్రెసులు రాజీ సంప్రదింపులతో యిచ్చిన స్వాతంత్ర్యాన్ని పుచ్చుకొన్నారు. ఇదే విధానాన్ని ముస్లింలీగు అనుసరించి, తమ లక్ష్యమైన పాకిస్తాన్ యివ్వగా పుచ్చుకొంది. ఫలితంగా దేశవిభజన జరిగింది. ఈ ఉపఖండం ఐక్యసామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటభరతవాక్యం చెప్పబడింది. ఇదే సి.పి.ఐ. (యం) 7వ, కాంగ్రెసు తీర్మానంలో తెలిపింది. అంతేగాక "వలస విధాన అంతం, సోషలిజంలోని పరివర్తనయుగం"గా పేర్కొన్నది. "జాతీయ పునర్జీవన మార్గాలను సామ్రాజ్యవాదం యింకేమాత్రం అడ్డుకొని, చరిత్రగతిని, పురోగమనాన్ని ఆపజాలదని" స్పష్టం చేసింది. భారత విప్లవ రెండవదశ, ఫ్యూడలు, అర్ధ ఫ్యూడలు వ్యవస్థను రద్దుచేసి, భూపంపకంచేయాలి? బడా బూర్జువావర్గము బ్రిటిష్ పెట్టుబడి దోపిడికొనసాగించుటకు వొప్పుకొని సామ్రాజ్యవాదంతో రాజీపడి, బ్రిటీష్ కామన్‌వెల్తులో కొనసాగుటకుకూడా ఆమోదించింది.

నంబూద్రిపాద్ రాజకీయ స్వాతంత్ర్య అవగాహనాక్రమాన్ని ఐక్యకమ్యూనిస్టు పార్టీలో 1947-51లలో జరిగినచర్చలతో ప్రారంభించిన ఫలితంగా1951కార్యక్రమం రూపొందుట, తదనంతర అనుభవాలతో 1954-55లలో తిరిగి చర్చలు ప్రారంభమగుట అభిప్రాయ భేదాలు వలన ఆ కర్తవ్యం పూర్తికాకుండానే, రెండు కమ్యూనిస్టు పార్టీలు యేర్పడుట, అవి రెండు కార్యక్రమాలను రూపొందించుకొన్నవన్నారు. అంతేగాక" గత 18 సంవత్సరాల అనుభవం, 1947–51లలో ఆధిక్యత వహించిన రెండు వైఖరులు సరియైనవికావని స్పష్టం చేసింది" అన్నదానిని వివరించారు. ఇంకా స్వాతంత్ర్య పోరాటం కాలంలోవలెనె భారత బూర్జువా వర్గం ద్వంద నైజాన్ని ప్రదర్శించిందని సామ్రాజ్యవాదం ఫ్యూడలిజంలతో ప్రజలకు బూర్జువావర్గానికి మధ్య వైరుధ్యాలు పెరిగినా, ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ రూపొందుటతో నూతన అవకాశాలు వుద్భవించినా తన బలాన్ని పెంపొందించుకొనుటకు పరిస్థితులు అనుకూలంగా వున్నా సామ్రాజ్యవాదం, ఫ్యూడలిజంలపై నిర్ణయాత్మక పోరాటాన్ని జరిపి నిర్మూలించక, రాజ్యాంగంపై తనకుగల ఆధిక్యతను ప్రజలపైదాడి చేయుటకు, మరోవైపు ఫ్యూడలు, సామ్రాజ్యవాద శక్తులతో రాజీపడుటకుగాను ద్వందవిధానాన్ని పాలకవర్గం అనుసరించిందని, ప్రోగ్రాంవివరణ పత్రంలో వివరించారు.

సి.పి.ఐ. కాంగ్రెసు ఆమోదించిన కార్యక్రమం "ఆగస్టు 15, 1947 భారత ప్రజల చరిత్రలో నూతనయుగాన్ని భారతరాజకీయ స్వాతంత్ర్యయుగాన్ని పేర్కొన్నది. "భారత స్వాతంత్ర్య విజయం మన ప్రజలకేకాక మానవజాతికే చారిత్రిక సంఘటన" అన్నది. ఒక్కమాటలో ఫాశిస్టు వ్యతిరేక ప్రపంచయుద్ధంలో సోషలిజం విజయం, తూర్పుయూరపులో సోషలిస్టు శక్తుల పురోగమనం, అనేక వలసదేశాలలో స్వాతంత్ర్యపోరాటాల విజయాల నేపధ్యంలో భారత జాతీయోద్యమ పోరాట వెల్లువను గాంచిన బ్రిటిష్ సామ్రాజ్యవాదం గోడపైగల "భరతవాక్యాన్ని" చూసి, వ్యూహాత్మక తిరోగమనం, రాజీకివచ్చి అధికారాన్ని బదలీ చేసిందని కార్యక్రమం వివరించింది. కాంగ్రెసు ముస్లిం లీగులు ప్రజాస్వామ్య పరిష్కారానికి రాలేకపోయినందున చొరవసామ్రాజ్యవాదపు చేతులలోనికి పోయి దేశ విభజన జరిగింది. బ్రిటిష్ కుటిలరాజనీతి విజయాన్ని పొందింది.

సామ్రాజ్యవాద ఎత్తులలో భాగంగా సంస్థానాధీశులను పావులుగా వుపయోగించుకొని తమ ప్రయోజనాలను అధిక్యతను కొనసాగించాలనే వారి ప్రయత్నాలను 500ల సంస్థానాలను భారతయూనియన్‌లో విలీనం చేయుటద్వారా జాతీయ ప్రభుత్వం బ్రిటిష్‌పునాది ఆలోచనలను వమ్ము చేసింది. భారత స్వతంత్ర రిపబ్లిక్ రాజ్యాంగాన్ని రూపొందించింది. సి.పి.ఐ. కార్యక్రమం, సామ్రాజ్యవాద, ఫ్యూడలు వ్యతిరేక కర్తవ్యాలను పరిపూర్తి చేసేనూతన విప్లవ దశకు కలపిరందని విజ్ఞప్తి చేసింది. సి.పి.ఐ. కార్యక్రమం భారత ప్రభుత్వవర్గ పొందికను "జాతీయ బూర్జువా వర్గం మొత్తంగా పాలనాధికారాన్ని కలిగివుందని, పెట్టుబడిదారి విధానంలో ఆర్థికాభివృద్ధిని పెంపొందించుచున్నదని ప్రభుత్వంలో బడాబూర్జువావర్గం గణనీయమైన ప్రభావాన్ని కలిగివుందని" వివరించింది.

సంగ్రహంగా రెండు దశాబ్దాల అనుభవం నంబూద్రిపాద్ చెప్పినట్లు, "కమ్యూనిస్టు ఉద్యమంలో 1947-51లలో అధిక్యత వహించిన రెండు వైఖరులలో యేదీ సరియైనదికాదని స్పష్టం చేసింది." అంటే ఆగస్టు 15 1947న యేర్పడిన ప్రభుత్వం "వ్యూహాత్మక ప్రజల ఆయుధమని, పురోగమన సాధనమనుట" పూర్తిగ తప్పని అదే విధంగా పార్టీ 2వ, కాంగ్రెసు "లొంగిపోయిన ప్రభుత్వం" అనికూడ తప్పని చరిత్ర నేర్పిన పాఠము. రెండు వైఖరులు ప్రభుత్వవర్గం పొందికను నైజాన్ని అశ్రద్ధ చేసాయి. నూతన పాలకవర్గం లభించిన స్వాతంత్ర్యాన్ని "వ్యూహాత్మక ఆయుధంగా" బలమైన విదేశీశక్తులు, దేశీయ ఫ్యూడలు సంస్థానాధీశులు, పాక్షికంగా భూస్వామ్య శక్తులకు వ్యతిరేకంగాను, పెల్లుబుకుతున్న విప్లవ పోరాటశక్తులకు వ్యతిరేకంగాను వుపయోగించుట చారిత్రిక సత్యం. పాలకవర్గాలకు ఆగస్టు స్వాతంత్ర్యం వ్యూహాత్మక ఆయుధమగుట, ప్రజోద్యమాల బలహీనత,

వైఫల్యం కారణంగా వ్యూహాత్మక ప్రజల ఆయుధం కాజాలకపోవుట చారిత్రిక పత్యాలు.

సి.పి.ఐ. సి.పి.ఐ(యం)లు రెండు కమ్యూనిస్టుపార్టీలు స్వాతంత్ర్యసమస్యపై వెలిబుచ్చిన అభిప్రాయాలలో సారూప్యతయే యెక్కువగా వుంది. భేదం ప్రధానంగా ప్రభుత్వంలో ఎవరు నాయకత్వం వహించుతున్నారు, అనే విషయంలో సి.పి.ఐ. జాతీయ బూర్జువావర్గం మొత్తంగా అని, సి.పి.ఐ (యం)బడాబూర్జువావర్గం అనుటలో కన్పడుతున్నది. సి.పి.ఐ. జాతీయ బూర్జువావర్గం మొత్తంగా నాయకత్వం వహించుచున్నదంటూ బడాబూర్జువావర్గం గణనీయమైన ప్రభావాన్ని కలిగియున్నదని పేర్కొన్నది. ఆగస్టు 15 స్వాతంత్ర్యంవచ్చినట్లు సి.పి.ఐ. హృదయపూర్వకంగా విశ్వసించుతుండగా, సి.పి.ఐ. (యం) అస్పష్టంగానైనా కొంతవరకు ఆమోదించి నట్లు కన్పడుతున్నది. ప్రభుత్వంలో నాయకత్వం వహించే వర్గ విషయంలో మాత్రమే భేదమనే విషయం స్పష్టం.

3. బూర్జువా భూస్వామ్యవర్గాలు, బడాబూర్జువావర్గనాయకత్వంలో యేర్పరచుకొన్న వర్గపాలనయే నేటి భారతప్రభుత్వము. పెట్టుబడిదారి విధానాభివృద్ధికి విదేశ పెట్టుబడితో మరింతగా పొత్తును కలిగివుంది. ఈ వర్గప్రాతిపదికయే జాతిజీవనంలో ప్రభుత్వపాత్రను నిర్ణయిస్తుందని సి.పి.ఐ. (యం) నవంబరు 1964లో ఆమోదించిన కార్యక్రమం స్పష్టం చేసింది.

ప్రాంతీయ భాషలు పార్లమెంటు, ప్రభుత్వాలలో, నిర్ణయాత్మకపాలనలో సమాన, సముచిత స్థానాన్ని పొందకముందే, ఆంగ్లభాషా స్థానంలో హిందీని ప్రవేశపెట్టు ప్రయత్నాలు హిందీయేతరప్రాంతాలలో ముమ్మరంగా జరుగుతున్నవి. ఇది రాష్ట్రాలు నిర్వీర్యులుగ కేంద్రంపై ఆధారపడునట్లుచేసి, అభివృద్ధిని కుంటుపరస్తుంది ఈ పరిస్థితులలో సహజంగానే కేంద్రప్రభుత్వం రాష్ట్రప్రభుత్వాలమధ్య వైరుధ్యాలు తీవ్రమగుతున్నవి. ఈ వైరుధ్యాలకు బడాబూర్జువా వర్గానికి వివిధ రాష్ట్రాలలోని ప్రాంతీయ బూర్జువావర్గాలకు ప్రజాసామాన్యమంతటికీ మధ్యగల వైరుధ్యాలే అంతర్గత మౌలిక పునాది. పెట్టుబడిదారి విధానంలో అసమానాభివృద్ధి కారణంగా యీ వైరుధ్యాలు నిరవధికంగా పెరుగుతూ, తీవ్రమై వివిధకేంద్ర వ్యతిరేక ఉద్యమాలకు అన్మనిస్తాయి.

"భారతప్రభుత్వం రాజ్యాంగం భారత సమాజంలోని సామ్రాజ్యవాద, ఫ్యూడలు వ్యతిరేక విప్లవ ప్రజాస్వామ్య ప్రభుత్వంగా 1947లో యేర్పడలేదని విదేశ గుత్త పెట్టుబడిదారి వర్గాలకు ప్రతిపక్ష దేశీయ బూర్జువా, ఫ్యూడలు వర్గాలు రాజీ

పడుటద్వారా యేర్పడింది. సి.పి.ఐ.(యం) కార్యక్రమం దీనినే స్పష్టంచేస్తూ, వలస బ్రిటిష్ సామ్రాజ్యవాదులుకాని, అధికారం చేబట్టిన భారత బూర్జువావర్గంకాని, పెట్టుబడిదారి విధానాభివృద్ధికి ఆటంకంగా వుండే ఫ్యూడలు సెమిఫ్యూడలు వర్గాలపై చావు దెబ్బకొట్టలేదు. సామ్రాజ్యవాదం ఫ్యూడలు శక్తులతో గల రాజీ పరిమితులలోనే బూర్జువావర్గం, అందుండి పెట్టుబడిదారివర్గాలు అభివృద్ధిచెందాయి. అనేకమంది దేశీయ పారిశ్రామికవేత్తలు, వ్యాపారులు విదేశీ, దేశీయ గుత్తవర్గాలకు, బడాద్రవ్యపెట్టుబడి వర్గాలకు వ్యతిరేకంగా వున్నారంటూనే మితవాద పార్టీకార్యక్రమము "దేశ, విదేశ గుత్తవర్గాలకు, బడా బూర్జువావర్గం నాయకత్వం వహించుచున్నదని నిర్ధారణ చేయుటలో వెనుకాడింది. రాజ్యాంగంలోని ప్రాథమిక హక్కుల వేదికను ఆధార ఆయుధంగా ప్రజలు తమ పోరాటంలో వినియోగించవచ్చుని"అంటున్నదని నంబూద్రిపాద్ తీవ్రంగా విమర్శించారు. భారతవిప్లవమౌలికకర్తవ్యాలనుసంపూర్తిచేయుటకు బూర్జువా భూస్వామ్య ప్రభుత్వాన్ని తొలగించి జనతా ప్రజాస్వామ్య ప్రభుత్వాన్ని యేర్పరచాలని తమ కార్యక్రమం స్పష్టం చేసిందని నంబూద్రిపాద్రిపాద్ వివరించారు.

సి. పి. ఐ. 7వ, బొంబాయి కాంగ్రెసు ఆమోదించిన కార్యక్రమము ప్రభుత్వ వర్గపొందిక యిలావున్నది. జాతీయ బూర్జువావర్గ మొత్తపు పాలనాయంత్రాంగమే, భారత ప్రభుత్వనిర్మాణం వర్గపొందికగా వుంది. అది పెట్టుబడిదారి విధానాన్ని దాని వుత్పత్తి, పంపక, అర్థిక. ద్రవ్యమార్గక, తదితర విధానాలన్నిటిని 'బలపరస్తుంది. ప్రభుత్వాధికారాన్ని రూపొందించుట అమలుచేయుటలలో బడాబూర్జువావర్గం గణనీయమైన ఆధిక్యతను కలిగి వుంది. జాతీయబూర్జువావర్గం భూస్వాములతో రాజీపడి, వారికి మంత్రివర్గాలలో స్థానాలను కల్పించుతుంది. ఫలితంగా రాష్ట్రాలలో వ్యవసాయ సంస్కరణ చట్టాలు చేయుట, అమలు వెనుకాడుటయేగాక, భూస్వాములకు అనేక రాయితీలనిస్తూ చట్టాల లక్ష్యాలను నీరుగార్చుతున్నారు, రైతుల ప్రయోజనాలు దెబ్బతింటున్నవి.

భారతరిపబ్లిక్ రాజ్యాంగ చట్టం పార్లమెంటరీ ప్రజాస్వామ్యాన్ని వయోజన హక్కుతో ప్రజలకిచ్చింది. ఆదేశసూత్రాలు, ప్రాథమిక హక్కులు పొందుపరచబడినవి. పరిమితులున్నా రాజ్యాంగ చట్టం వేదికగా, పోరాట ఆయుధంగా ప్రజాస్వామ్య విస్తరణ, రక్షణలకు వినియోగపడుతుంది.

నేడు భారతదేశంలో ప్రభుత్వాధికారం వివిధ బూర్జువావర్గాల సంకీర్ణం చేతిలో వుంది. జాతీయప్రజాస్వామ్య విప్లవ శత్రువైన గుత్తపెట్టుబడిదారి వర్గము అధికారంలోవున్న వర్గాలలో ప్రముఖపాత్ర వహించుతున్నది. నేటి విప్లవదశలో కార్మిక వర్గానికి గుత్తేతర జాతీయ బూర్జువావర్గం వూగిసలాడే మిత్రుడు, అధికారంలో భాగస్వామి. భారతదేశపు యీ ప్రత్యేకతను సి. పి. ఐ. కార్యక్రమము వివరించింది.

4. నంబూద్రిపాద్ సి. పి. ఐ. (యం) సి. పి. ఐ. ల కార్యక్రమాలపై వ్యాఖ్యానించుతు, సి. పి ఐ. కార్యక్రమము "జాతీయ ప్రజాస్వామ్య లక్ష్యంతో రూపొందించిన కార్యక్రమం, కార్మికవర్గపు వూగిసలాడే అనిశ్చిత మిత్రుడుగా బూర్జువావర్గాన్ని చూడక, స్థిరమైన మిత్రుడుగా కార్మికవర్గం అధికారాన్ని పంచుకొనుటయేగాక దేశభక్తవర్గాలన్నిటితో యేర్పరచే ఐక్యసంఘటనలో జాతీయ బూర్జువా వర్గంతో నాయకత్వంలో పాలుపంచుకొంటుందనే అవగాహనను" కార్యక్రమం యిచ్చిందన్నారు.

సి. పి. ఐ (యం) కార్యక్రమప్రత్యేకతలను నంబూద్రిపాద్ యిలా పేర్కొన్నారు. మొదటిది, ప్రపంచ పెట్టుబడిదారి విధానం వేగంగా శిధిలమవుతున్న దశలో సాధారణ పెట్టుబడిదారి విధానసంక్షోభం మూడవదశలో ప్రవేశించిన తరువాత భారత బూర్జువావర్గం పెట్టుబడిదారి పంధాలో అభివృద్ధి మార్గాన్ని చేబట్టింది. రెండవ అంశం, భారీపారిశ్రామిక సాంకేతిక పునాది లేకుండానే పెట్టుబడి పెట్టుటకు కూడ వలనసామ్రాజ్యాలు లేనపుడు, దోపిడి కొరకు తాము సంపాదించిన అధికారాన్ని ప్రభుత్వయంత్రాంగాన్ని పెట్టుబడిదారి విధానాభివృద్ధికి బూర్జువావర్గం వినియోగించుకొనజాలనపుడు శ్రామికులశ్రమఫలితాలను దోచుకొనుటకు రాజ్యాంగ యంత్రాన్ని వినియోగించుతుంది. మూడవ అంశం, భారతసమాజం పెట్టుబడిదారి పంధాలోనే అభివృద్ధి చెందుతున్నప్పటికి, తనలోనే పెట్టుబడిదారి పూర్వ సమాజఅంశాలు పెక్కింటిని కలిగి వుంది. పెట్టుబడిదారి పూర్వవ్యూడలు సమాజపు శిధిలాల నుండి, అభివృద్ధిచెందిన దేశాల పెట్టుబడిదారి సమాజం అభివృద్ధి చెందింది. భారతదేశంలో పెట్టుబడిదారి విధానం వ్యూడలు సమాజంపై నుండి రుద్ధబడింది. ఒక శతాబ్దం సాగిన బ్రిటిష్ వలన సామ్రాజ్యవాదం కాని, 1947లో అధికారాన్ని చేజిక్కించుకున్న భారతబూర్జువావర్గం కాని వ్యూడలు, పెట్టుబడిదారి పూర్వసమాజంపై చావుదెబ్బకొట్టలేదు పెట్టుబడిదారి విధాన సమాజాభివృద్ధికి, తదనంతరం, సమాజం సోషలిజం వైపు పురోగమించుటకు అవసరమైన యీ ముఖ్య కర్తవ్యం పూర్తి చేయలేదు. అంచేత కుల, మత, తెగల సమాజం గుత్తపెట్టుబడివర్గాల, ఒక ప్రత్యేక సమ్మిశ్రిత ఆధిక్యతను కలిగి వుంది.

సి. పి. ఐ కార్యక్రమం బ్రిటిష్పాలనకాలంలో జరిగిన పారిశ్రామికాభివృద్ధిని యిలా పేర్కొన్నది. "భారత ఆర్థికవ్యవస్థ పరాధీన, వలసనైజాన్ని కలిగి వెనుకబడి యున్నది. ఇతరవలస దేశాలతో పోల్చితే పెట్టుబడిదారి విధానం పేర్కొనతగిన విధంగానే అభివృద్ధిచెందింది. పారిశ్రామిక బూర్జువావర్గం పుట్టి, పెరిగి రెండవ ప్రపంచయుద్ధానంతరానికి పెట్టుబడి, పారిశ్రామికోత్పత్తి కేంద్రీకరించబడి, బ్యాంకింగు అభివృద్ధి చెందింది. భారతబూర్జువావర్గాలనుండి బలమైన గుత్తపెట్టుబడిదారి వర్గాలు ఆవిర్భవించాయి.

భారతదేశ స్వతంత్ర పారిశ్రామికాభివృద్ధి మౌలిక భారీ పరిశ్రమలప్రాణం. సామ్రాజ్యవాద ప్రయోజనాలకు వ్యతిరేకమైన నైజాన్ని సహజంగానే కలిగి వుంది, పెట్టుబడిని సమీకరించుట అంతర్గత మార్కెట్టు విస్తరణలో భూసంస్కరణలలో బూర్జువావర్గప్రాణప్రదమైన ప్రయోజనాలు యిమిడివుండుట స్పష్టం. అయినా స్వాతంత్ర్యానంతరకాలంలో జాతీయ బూర్జువావర్గం, జాతీయపోరాట కాలంలో స్పష్టం చేయబడిన విధానాన్ని అనుసరించుటలో వూగిసలాట" "రాజీవిధానాలను" అవలంభించుట గూడ స్పష్టంగా చూడగలము. పారిశ్రామిక విధాన తీర్మానాన్ని 1948లో చేయుట 1949లో రిజర్వుబ్యాంకును జాతీయం చేయుట, వైమానిక సర్వీసులను, ఇంపీరియల్ బ్యాంకును 1953లో జాతీయం చేయుటతో పాటు జీవితభీమాని బంగారుగనులను జాతీయం చేయుట ద్వారా ప్రణాళికలకు వనరులను సమీకరించుట, సామ్రాజ్యవాదులకు రుచించలేదనుట స్పష్టం, దేశీయ కొత్తపెట్టుబడిదారి వర్గాలకు కంఠకప్రాయమైంది. ఈ విధంగా ప్రభుత్వపారిశ్రామిక రంగం భారతదేశ స్వతంత్ర ఆర్థిక పారిశ్రామికాభివృద్ధికి ప్రధాన ఉపకరణమైంది. అదేకాలంలో దేశ, విదేశ గుత్తపెట్టుబడి వర్గాల ఆధిక్యతను బలహీన పరచప్రయత్నించింది.

భారతప్రభుత్వం, విదేశసామ్రాజ్యవాదుల ప్రత్యేకంగా అమెరికాపెట్టుబడుల "సహాయాన్ని" అర్థించసాగింది. ప్రధానంగా ప్రభుత్వరంగంలో భారీ పరిశ్రమలను కోరసాగింది. మన ప్రయోజనాలకు భిన్నంగా ప్రభుత్వం అనేక వొడంబడికలు చేసుకొన్నది. అంతేగాక విదేశపెట్టుబడిని ఆహ్వానించసాగింది. అందుకు అవసరమైన గ్యారంటీల నివ్వసాగింది. వీటి ఫలితంగా జాతీయ ఆర్థికాభివృద్ధి మన ప్రయోజనాకు వ్యతిరేకంగా సాగింది. సామ్రాజ్యవాద గుత్తపెట్టుబడిదారులు మన భారీ పరిశ్రమలకు "మొండిచెయ్యి" సహాయం చూపగా మరో మార్గం లేక సోవియట్‌యూనియన్ యితర సోషలిస్టు దేశాల సహాయాన్ని అర్థించింది. ఇనుము, ఉక్కు తదితర భారీ పరిశ్రమలకు సోవియట్ యూనియన్ యితర సోషలిస్టు దేశాలు పెట్టుబడిని, సాంకేతిక పరిజ్ఞానాన్ని సహాయంగా లభించుటతో పారిశ్రామికాభివృద్ధికి అవకాశం యేర్పడింది. భారతపంచవర్షప్రణాళికలు విఫ్నమైతే, భారతదేశం ముడిసరకులు సప్లయి చేయు దేశంగా, పారిశ్రామిక వస్తువులను కొనుగోలు చేయు ఆర్థిక వలస దేశంగా సామ్రాజ్యవాదం దోపిడి కొనసాగించనెంచింది. అది పాక్షికంగా విఫలమైంది. భారతదేశం వొక స్వతంత్ర ఆర్థికాభివృద్ధికి ప్రయత్నం చేయుదేశంగా మనుగడ సాగించనెంచింది. పై అవగాహనతోపాటు సి. పి ఐ. కార్యక్రమం, ప్రభుత్వం సోషలిస్టు నమూనా ఆర్థికవిధానాన్ని అనుసరించుతున్నామని చాటుకొంటున్న మౌలికంగా పెట్టుబడిదారి విధానాన్ని అభివృద్ధి చేస్తున్నదని విమర్శించింది.

జాతీయ బూర్జువావర్గంలో వర్గవిభజన అభివృద్ధి చెందునపుడు వైరుధ్యాలు అంతర్గతంగా తీవ్రతరమగుట సహజం, ఇది ప్రధానంగా గుత్తపెట్టుబడి వర్గాలు యేర్పడుటగా ప్రస్ఫుటమగుతున్నది. దేశపు ఆర్థిక, రాజకీయ జీవితంపై వారికి గల ఆధిక్యత కారణంగా విస్తృత జాతీయ బూర్జువావర్గాలలో ప్రజలలో నష్టదాయకమగుటతో సంఘర్షణలు ఎక్కువగుతున్నవి. భారత స్వతంత్ర ఆర్థికాభివృద్ధికి ఆటంకంగా తయారైనవి. రాజకీయ రంగంలో మితవాద అభివృద్ధి నిరోధకశక్తుల అభివృద్ధికి తోడ్పడుతున్నవన్నది సి. పి. ఐ. 7వ, పార్టీ కాంగ్రెసు యిచ్చిన అవగాహనగా వుంది.

పెట్టుబడిదారి పంథాలో అభివృద్ధి కొనసాగుటలోని వైరుధ్యాలను వివరించుతు మొహితుసేన్ వివాదాంశాలపై యిలా వ్యాఖ్యానించారు. ప్రథమంగా స్వాతంత్ర్యానంతరకాలంలో భారతప్రభుత్వం బలపడిందా? యని ప్రశ్నించి, సి. పి. ఐ. కార్యక్రమం విస్పష్టంగా అవుననే సమాధానం యిచ్చిందన్నారు. భారతదేశాన్ని అర్ధవలస ఆర్థిక పరిమితులలోనే వుంచాలనే సామ్రాజ్యవాదుల ప్లానులు వమ్ము చేయబడి, మనదేశం స్వతంత్ర పారిశ్రామికాభివృద్ధి పంథాలో పురోగమించిందని కార్యక్రమం స్పష్టం చేసిందన్నారు.

సి. పి. ఐ. (యం) కార్యక్రమం "భారత ఆర్థికవిధానం ప్రధానంగా సామ్రాజ్యవాదాలపై ఆధారపడుటయేగాక, యీ పరాధీనత రోజురోజుకు పెరిగిపోతున్నదనే నిర్ణయానికి వచ్చింది. అంటే 17 సంవత్సరాల తరువాత కూడ భారతదేశం ఆర్థికంగా పరాధీనమై, పూర్తిగా అర్ధవలసదేశంగా మారేమార్గంలో పయనిస్తుదని"చెప్పుతున్నది.

5. భారతకమ్యూనిస్టుపార్టీ 7వ, కాంగ్రెసు ఆమోదించిన తీర్మానం "భారత ప్రభుత్వం శాంతి, సామ్రాజ్యవాద వ్యతిరేక, అలీన విధానాలు మౌలికాంశాలుగ విదేశాంగ విధానాన్ని అనుసరించుచున్నది. ఇది జాతీయబూర్జువావర్గ ప్రయోజనాలకు, భారత ఆర్థికాభివృద్ధికి భారతప్రజాసామాన్య అభిప్రాయాలకు అనుగుణంగా వున్నది. ఈ విధానం అప్పుడప్పుడు రాజీలకు లోనగుతు, గాడి తప్పుతున్నా మొత్తం మీద సాధారణపంథా నైజాన్ని కలిగి ప్రధానంగా అనుసరించబడుతున్నది.

ప్రారంభసంవత్సరాలలో భారత విదేశాంగ విధానం గత పరాధీన వారసత్వ ఫలితంగా బ్రిటిష్‌ప్రభుత్వప్రభావాలకు లోనై "ఆటు-పోటు"లకు గురియైనా గణనీయంగా మారి, ప్రధానంగా శాంతి, అలీన, సామ్రాజ్యవాద వ్యతిరేక మౌలికపంథాను విడనాడకుండా కొనసాగించింది. స్వాతంత్ర్యానంతరం 1949లోనే చైనా ప్రజా రిపబ్లిక్‌ను గుర్తించాలని, కొరియాలోని సంఘర్షణలను అంతంచేయుటకు స్టాలిన్, ట్రూమన్‌లు చొరవను ప్రదర్శించాలని ఆందోళన కావించింది. నూతన ఆర్థిక విధానాన్ని చేబట్టిన రోజులలోనే నూతనవిదేశాంగవిధానం కూడ రూపొందింది. భాండుంగ సమా

వేశంలో భారతదేశం, చైనాతో కలసి "పంచశీల" విదేశాంగ విధానసూత్రాలను రూపొందించి శాంతి, తటస్థ, అలీన విధానాది విధానాలను అనుసరించుట, వలసదేశాలలోని సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాలన్నిటిని బలపరచే విధానంతో పాటు పంచ వర్ష ప్రణాళికల రచన, పబ్లిక్, ప్రభుత్వరంగాలలో భారిపరిశ్రముల నిర్మాణ విధానాన్ని చేబట్టింది. కాంగ్రెసు ప్రభుత్వ యీ విదేశాంగ విధానాన్ని సి. పి. ఐ. ప్రారంభం నుండి బలపరుస్తూనే వచ్చింది. అదే విధానాన్ని సి. పి. ఐ. 7 పార్టీ కాంగ్రెసు పునరుద్ఘాటించింది.

సి. పి. ఐ (యం) 7వ, కలకత్తా పార్టీ కాంగ్రెసు భారతప్రభుత్వ విదేశాంగ విధానంపై అవలంభించిన వైఖరి యిలా వున్నది. "భారతప్రభుత్వవిదేశాంగ విధానం సహజంగా బూర్జువావర్గ ద్వంద నైజాన్ని అనగా సామ్రాజ్యవాద వ్యతిరేకతను, దానితో రాజీ, పొత్తు విధానాన్ని ప్రతిబింబించుచున్నది. సామ్రాజ్యవాద దేశాలలోని గుత్త పెట్టుబడి వర్గాలకువలెకాక, భారతబూర్జువావర్గ ఆర్థికాభివృద్ధికి ప్రపంచశాంతి అవసరం, అంచేతప్రపంచయుద్ధానికి వ్యతిరేకి. యుద్ధ పక్షం శాంతి పక్షంగా విడిపోయిన ప్రపంచంలో సామ్రాజ్యవాద పక్షం అమెరికా నాయకత్వంలో దురాక్రమణ కూటములను యేర్పరచుట ద్వారా ఆదేశాలలో పరోక్ష ఆధిపత్యం కొరకు ప్రయత్నాలు సాగుతున్నపుడు తటస్థత లేక అలీనవిధానం, నూతనంగా పొందిన స్వాతంత్ర్యాన్ని పరిరక్షించుకొనుటకు తన వర్గ ప్రయోజనాలను కాపాడుకొనుటకుగాను అవలంభించింది. ఈ విధాన్ని అమలుచేయుటకు సామ్రాజ్యవాద, సోషలిస్టు పక్షాల మధ్య గల వైరుధ్యాలను అమెరికా, బ్రిటిష్‌సామ్రాజ్యవాదాల మధ్య గల వైరుధ్యాలను వినియోగించుకొను ప్రయత్నాల ఫలితమే" భారతప్రభుత్వ విదేశాంగ విధానమని పార్టీ కాంగ్రెసు తీర్మానం తెల్పుతున్నది.

భారతప్రభుత్వం అల్జీరియా తాత్కాలిక ప్రభుత్వాన్ని గుర్తించుటలో వెనుకాడుట అనేక యితర సందర్భాలలో వలనసామ్రాజ్యవాద వ్యతిరేకతను చేబట్టకపోవుటతో, బెల్‌గ్రేడులో 1961లో జరిగిన ఆఫ్రో-ఏసియన్ అలీన దేశాల సమావేశంలో సామ్రాజ్యవాద వ్యతిరేకవైఖరిని ప్రదర్శించుటలో వూగిసలాటను ప్రదర్శించుట, తిరిగి కేయిరో సమావేశంలో మలేషియాను గుర్తించుటలో వెనుకాడుట భారతదేశ వైఖరిని స్పష్టం చేస్తున్నవి. అమెరికా వియట్నాంపై జరిపే విమానసైనికదళాలకు భారతదేశంలో విమానాశ్రయాలలో సౌకర్యాలను కలుగజేయుటయేగాక, యీ దశలో ఐక్యరాజ్యసమితిలో భారతప్రతినిధి సామ్రాజ్యవాద దురాక్రమణ చర్యలనే బలపరచారు. ఈ అవగాహనతో సి. పి. ఐ. (యం) భారతప్రభుత్వ విదేశాంగ విధానాన్ని మొత్తంగా బలపరచుటను నిరాకరించింది.

# [8]

## జాతీయ ప్రజాస్వామ్యం జనతాప్రజాస్వామ్యం

1. జాతీయ ప్రజాస్వామ్యం, జనతా ప్రజాస్వామ్యం, తత్సంబంధ పెట్టుబడి దారేతర ఆర్థికాభివృద్ధి పంథాలయెడల చీలిపోయిన రెండు కమ్యూనిస్టుపార్టీలు సి. పి. ఐ., సి, పి ఐ (యం) 7వ, పార్టీ కాంగ్రెసు బొంబాయి, కలకత్తాలలో ఆమోదించబడిన పత్రాలు తెలిపే అవగాహనలు, వైఖరులను సంగ్రహంగా చూద్దాము.

సి. పి. ఐ. 7వ, పార్టీ కాంగ్రెసు పెట్టుబడిదారి సంక్షోభంలేని నిజమైన సోషలిస్టు సమాజనిర్మాణం మార్క్సిస్టు-లెనినిస్టు శాస్త్రీయ విశ్వసత్యాలను భారత పరిస్థితులకు అన్వయించే విశ్వాసాన్ని పార్టీ కలిగియున్నదని ప్రకటించింది. సోషలిజపు మౌలిక విధానాలుగ ప్రధాన ఉత్పత్తి సాధనాలను సమాజపరంలో వినియోగించి ఉత్పత్తి, పంపకం, మారకం కార్మికవర్గనాయకత్వంలో యేర్పడిన కార్మిక, కర్షక, మధ్యతరగతి జాతీయబూర్జువావర్గంతో సహా అన్నివర్గాల ప్రభుత్వం చేబట్టుతుందని యిదే కమ్యూనిస్టుపార్టీ ఆర్థిక, రాజకీయ లక్ష్యంగా ప్రకటించింది. ఈ ప్రత్యామ్నాయపంథా నేటి పెట్టుబడిదారి పంథాను తిరుగకొట్టి, దానిని వెంటనే రద్దు చేయక, విదేశగుత్తపెట్టుబడిదారివర్గ ఆధిపత్యాన్ని ఆర్థికవిధానంలో పూర్తిగ తొలగించి, స్వతంత్ర ప్రభుత్వ ప్రజారంగాలలో స్వశక్తిపై ఆధారపడిన జాతీయపారిశ్రామిక, ఆర్థిక విధానాలను ప్రజాస్వామ్యపద్ధతులలో రూపొందించి విస్తరించి, బలోపేతం చేస్తుంది. పారిశ్రామిక, ద్రవ్య, బ్యాంకింగు వ్యాపార భారత గుత్తపెట్టుబడి వర్గాల కూటములను విచ్ఛిన్నం చేసి, తిరిగి తలెత్తే అవకాశం లేకుండా చేయుట భూస్వాముల, ప్యూడలు అవశేషాలను రూపుమాపే వ్యవసాయ సంస్కరణలు చేసి, వడ్డీ వ్యాపారుల దోపిడీని అరికట్టుట, అభివృద్ధికార్యక్రమాలు చేబట్టుట సి. పి. ఐ. కార్యక్రమంలో వివరించింది.

ఈ కార్యక్రమాన్ని వాస్తవం చేయు శక్తివంతమైన ఆయుధం జాతీయప్రజాస్వామ్య సంఘటన నిర్మాణాన్ని పార్టీ చేబట్టుతుందని తీర్మానించింది. ఈ సంఘటన అన్ని దేశభక్త వర్గాలను కార్మిక, కర్షక, ధనికరైతువర్గంతో సహా, వ్యవసాయ కార్మికులను, మేధావివర్గాలను గుత్తపెట్టుబడి దారేతర బూర్జువావర్గాలన్నిటిని ఐక్యపరుస్తుంది. దీనికి కార్మిక, కర్షక ఐక్యతపునాది, యిరుసుగా వుంటుందని స్పష్టం చేసింది.

జాతీయప్రజాస్వామ్య సంఘటన మితవాద అభివృద్ధినిరోధక శక్తులపై కేంద్రీకరించి జరిపే ఆర్థిక, రాజకీయ పోరాటాల క్రమంలోనే యేర్పడుతుంది. కార్మిక

కర్షక, వ్యవసాయకూలీల, మధ్యతరగతి ఉద్యోగుల సంయుక్త ప్రజా పోరాటాల ద్వారా కమ్యూనిస్టుపార్టీ తదితర అతివాద సోషలిస్టు పార్టీల ప్రజాసామాన్యాన్ని, జాతీయ ప్రజాస్వామ్య సంఘటనలో కాంగ్రెసును అనుసరించే ప్రజాసామాన్యంతో పాటు అందరినీ సమీకరిస్తుంది.

సి. పి. ఐ. 1964 కార్యక్రమాన్ని వివరించుతు మొహిత్ సేన్, సంక్లిష్ట పరిస్థితులలో ప్రత్యామ్నాయ ప్రభుత్వాన్ని జాతీయ ప్రజాస్వామ్య సంఘటనా ప్రభుత్వంగా, పెట్టుబడిదారేతర పంథాను అనుసరించుతుందని అన్నారు. అంచేత, గుత్తేతర బూర్జువావర్గం, భారతదేశంలో దాని రాజకీయ ప్రతినిధులు ముఖ్యంగా నెహ్రూ, ప్రజలలో అత్యధిక అనుచరులను, ప్రజాబలాన్ని కలిగి వున్నారు. ఈ వర్గమంతా సామ్రాజ్యవాద, ఫ్యూడలు వ్యతిరేక ప్రజాస్వామ్య విప్లవంలో అభిలాష కలిగి వున్నారు. ఈ శక్తులన్నిటిని ఐక్యపరచి, ప్రజాస్వామ్య విప్లవాన్ని, దాని కర్తవ్యాలను పరిపూర్తి చేయవలసి వుంటుంది. గుత్తేతర జాతీయబూర్జువావర్గం రాజీమార్గం అవలంభించుతు, స్వతంత్ర పెట్టుబడిదారి భారతాన్ని రూపొందించు లక్ష్యంతోనేవుంది గాని జాతీయ ప్రజాసామ్య, పెట్టుబడిదారేతర భారతాన్ని నిర్మించుటకు కాదు. అందేతనే సి. పి. ఐ గుత్తేతర జాతీయ బూర్జువావర్గం యెడల, ఐక్యత పోరాటం అనే ద్వంద విధానాన్ని అనుసరించనిర్ణయించింది.

ఈ విప్లవాన్ని కొనసాగించుటకు జాతీయ ప్రజాస్వామ్యసంఘటనను నిర్మించవలసిన అవసరాన్ని, తదితర అంశాలతోపాటు పార్టీ కార్యక్రమం వివరించింది. కార్మిక, కర్షక ఐక్యతాయిరుసుపై ఆధారపడి రైతాంగమంతా ధనిక రైతునుండి వ్యవసాయ కూలి వరకు యీ సంఘటనలో భాగస్వాములు. ఈ సంఘటనలో నగరమధ్యతరగతి వర్గాలు కూడ ముఖ్యపాత్రధారులు. పోరాటాలక్రమంలో గుత్తపెట్టుబడి వర్గాల నుండి జాతీయ బూర్జువవర్గం వేరుపడి జాతీయ ప్రజాస్వామ్య సంఘటనలో భాగస్వామి అవుతుంది. ఈ కారణంగా, సంఘటన బలాన్ని, విస్తృతిని, స్థిరత్వాన్ని పొందుతుంది. కార్మికవర్గం గుత్తేతర బూర్జువావర్గాలతో అధికారాన్ని కూడ పంచుకొనుట నూతన దృక్పథము. భారతదేశ పరిస్థితులలో జాతీయ ప్రజాస్వామ్య దృక్పథంలో నూతనాంశము. ప్రమాద భరితమే అయినా అధిగమించరానిది కాదు. నిత్య జాగరూకతను, ప్రతీఘాతక విప్లవశక్తులను చూచుటలో యేమరుపాటును, మితవాద క్షుల యెడల అప్రమత్తత, చాల అవసరం. జాతీయప్రజాస్వామ్యంలో నూతనాంశం జనతా ప్రజాస్వామ్యంలో నాలుగు వర్గాల సంఘటనలో చైనాలోవలె కార్మికవర్గమే నాయకత్వం వహించాలనే దృక్పథానికి భిన్నమైనది, తూర్పుయూరపులో జనతా ప్రజాస్వామ్యంలో ప్రధమదశగా ఐక్యకమ్యూనిస్టుపార్టీ గతంలో ఆమోదించిన దానికి కూడ భిన్నమైనది. భారత ప్రత్యేక పరిస్థితులను లోతుగ పరిశీలించిన పిదప నూత

యుగంలో జాతీయ ప్రజాస్వామ్య విప్లవం పార్టీ నాయకత్వంలో, గుత్తేతర బూర్జు వర్గపు నేటి భవిష్యత్తులో పాత్రను పార్టీ పునః పరిశీలించి యీనూతన అవగాహనవా వచ్చిందని తీర్మానం వివరించింది.

సి. పి. ఐ (యం) 7వ, కలకత్తా పార్టీ కాంగ్రెసు రాజకీయ తీర్మానంలో యీ అంశంపై వెలువరించిన అవగాహనలు యిలా వున్నవి.

"స్వాతంత్ర్యానంతరం వెనుకబడిన వర్ధమాన దేశాలు జాతీయప్రజాస్వామ్య ప్రభుత్వాలను యేర్పరచుటకు విస్తృత నూతనావకాశాలు వుద్భవించాయి. అభివృద్ధి చెందుతున్న కార్మికవర్గం క్రమేణా తన నాయకత్వాన్ని ప్రభుత్వంలో యేర్పరచుకొని పెట్టుబడిదారి విధాన అభివృద్ధి దశను దాటవేసి, సోషలిస్టు వ్యవస్థను నెలకొల్పు అవకాశాలు యేర్పడినవి." ఈ అవగాహన అతివాద వక్రీకరణను ప్రతిబింబించుచున్నందున, 1980 దశకంలో ఉత్పత్తిశక్తుల అభివృద్ధి, తద్వారా ఉత్పత్తి పెరుగుదలకు అత్యధిక ప్రాధాన్యనిస్తూ "బాగా ముందుకు దుముకుట" "పెరటిప్లాస్టు పర్నేసుల" విధానాలను "సమిష్టి పెద్దక్షేత్రాల" విధానాలను విడనాడి "అదుపులో పెట్టుబడిదారి విధానాలలో వుత్పత్తులను పెంచే నూతన ఆర్థిక సంస్కరణలు చేబట్టుట జరిగిన నేపథ్యంలో జాతీయప్రజాస్వామ్యం,జనతాప్రజాస్వామ్యం మధ్యయేమైనా దశలుగలవేమోనని శాస్త్రీయంగా ఆలోచించవలసిన వాస్తవిక వర్తమాన పరిస్థితులను బట్టి నూతన ఆలోచనలను కాలం పరిణామాలు తెచ్చాయి.

సి. పి. ఐ (యం) కాంగ్రెసు పెట్టుబడి విధానాభివృద్ధి దశను దాటవేసి, పెట్టుబడిదారేతర పంధాలో ఆర్థికాభివృద్ధిగావించి, సోషలిజంలోనికి పరివర్తనమార్గాన్ని సుగమం చేయు మార్గాలకు తలుపులు మూసివేయబడినవనే వైఖరి చేబట్టింది. అంచేత పెట్టుబడిదారేతరమార్గంలో అభివృద్ధి, జాతీయప్రజాస్వామ్య ప్రభుత్వ లక్ష్యం వాస్తవ పరిస్థితులను ప్రతిబింబించదు. సామ్రాజ్యవాదం గుత్తపెట్టుబడి, వ్యవసాయంలో ఫ్యూడలిజాన్ని పెకలించివేయుట విదేశసామ్రాజ్యవాద పెట్టుబడితో గుత్తసంబంధాలు ఫ్యూడలు వర్గాలతో మరోవైపు సంబంధాలు కలిగిన బూర్జువావర్గాలు భాగస్వాములైన ప్రభుత్వాన్ని కూలద్రోయకుండా చేయగలుగుట అసాధ్యమనేది సి. పి. ఐ. (యం) కాంగ్రెసు విశ్లేషణ. సోషలిజంధ్యేయంగా సి. పి. ఐ (యం) కార్మికవర్గ సైద్ధాంతిక, రాజకీయ పరిపక్వతను నిర్మాణ బలాన్ని పరిగణించి సామ్రాజ్యవాద ఫ్యూడలు వ్యతిరేక అన్నిశక్తులను కార్మికవర్గనాయకత్వంలో జనతా ప్రజాస్వామ్య సంఘటన, ప్రభుత్వం నిర్మించుట నేటి కర్తవ్యంగా చేబట్టింది. అట్టి ప్రభుత్వమే సామ్రాజ్యవాద, ఫ్యూడలు వ్యతిరేకవిప్లవ కర్తవ్యాలను లక్ష్యాలను పరిపూర్తిచేసి. సత్వరం సోషలిజంకు మార్గాన్ని సుగమం చేస్తుందని కార్యక్రమం స్పష్టం చేసింది.

జాతీయ ప్రజాస్వామ్య సంఘటన, ప్రభుత్వంలో బూర్జువావర్గం, కార్మిక,

కర్షక, నగర, గ్రామీణబడుగువర్గాల నాయకత్వంలో భాగస్వాములుగ సి. పి. ఐ. కార్యక్రమం వివరించింది. ఈ నాయకత్వ భాగస్వామ్యాన్ని నంబూద్రిపాద్ తీవ్రంగా విమర్శించించి, సామ్రాజ్యవాద, భూస్వాములు గుత్తపెట్టుబడిదారి వ్యతిరేక పోరాటంలో సంయుక్తంగా, పాల్గొన్నవర్గాలన్నీ రాజ్యాధికారంలో భాగస్వాములనుట వారి దృక్ప ధంలోనే వుందన్నారు. వారి అవగాహన, ప్రజాస్వామ్య విప్లవంలో కార్మికవర్గం నాయకత్వం పాత్ర వహించాలని మార్క్సిజం-లెనినిజంలు స్పష్టం చేసిన దానిని తిర స్కరించుటయే అగుతుందని నంబూద్రిపాద్ విమర్శించారు. సి పి. ఐ. సంయుక్త నాయకత్వం అని స్పష్టం చేసివుంది. అంతేగాక, కార్మిక-బూర్జువావర్గాల రెండు దృక్ప ధాల మధ్య జరిగే పోరాటఫలితం విప్లవదశ సోషలిస్టు మార్గంలో పురోగమనాన్ని నిర్దేశించుతుంది, కాన కార్మికవర్గం బూర్జువావర్గం సంయుక్తంగా నాయకత్వం వహించే ప్రభుత్వం సోషలిస్టు పంథాలో పురోగమనాన్ని సాగించజాలదని నంబూద్రిపాద్, సి. పి. ఐ(యం)ల అవగాహనగా వుంది.

మూడు దశాబ్దాల కాలంలో సి పి. ఐ. జాతీయ ప్రజాస్వామ్య సంఘటనను గాని సి. పి ఐ (యం) జనతా ప్రజాస్వామ్య సంఘటనను గాని పార్లమెంటరీ లేక పార్లమెంటేతర ప్రజాపోరాటాలనుగాని, అఖిలభారత స్థాయిలో ఐక్యసంఘటనను యేర్పరచజాలకపోవుట ఆత్మవిమర్శన అవసరాన్ని సూచించుతున్నది. రెండు దృక్ప దాలవారులు ఐక్యసంఘటనకు కార్మిక కర్షక ఐక్యత "పునాది" "ఇరుసు" అని చెప్పు తున్నారు. పైగా యిది ప్రజాపోరాటాల ద్వారానే యేర్పడుతుందని సిద్ధాంతీకరించారు సంఘటన నిర్మాణాన్ని, కార్మిక, కర్షక ఐక్యతలను ప్రచార నినాదాలుగా చేసారు, ఆచరణ వినాదం చేయలేదు వైఫల్యానికి యిదే ప్రధాన కారణము. ఒక్కమాటలో చెప్పాలంటే అఖిలభారత ఆర్థిక, రాజకీయ పోరాటాలకు చోదకశక్తులు కావలసిన కార్మికవర్గం, రైతాంగం, మధ్యతరగతుల వివిధ వృత్తులవారు అఖిల భారత స్థాయిలో పోరాటాలను ఐక్యంగా సాగించగల స్థితిలో లేరు. కారణం కార్మికవర్గఐక్యత, రైతాంగ ఐక్యత నిర్మించుటలో వామపక్షపార్టీలు ముఖ్యంగా సి. పి. ఐ., సి. పి. ఐ (యం)లు పూర్తిగ విఫలులు అయ్యారు. అఖిల భారత ట్రేడు యూనియనుల సమ న్వయ కమిటి 1980 దశకంలోనే యేర్పడినా అప్పుడప్పుడు నామమాత్రంగా 'మేజు వాణి" పోరాటాలు కొన్ని చేసినా బలమైన శక్తిగా యీనాటికి అభివృద్ధి చెందలేదు. వామపక్ష పార్టీలు రెండు ప్రధానకమ్యూనిస్టు పార్టీలు నిజాయితిగా ఉద్యమనిర్మాణం ఐక్యతా కృషి నామమాత్రంగానైనా జరుగటలేదని రెండు దశాబ్దాల చరిత్ర స్పష్టం చేస్తుంది.

ఈ వాస్తవికతను గుర్తించుట మాత్రమే చాలదు సి. పి. ఐ, సి. పి. ఐ. (యం)లు కార్మికవర్గ ఐక్యతకు దారి తీసే కనీస ప్రాథమిక చర్యలను పైనుండి క్రింది వరకు చేపట్టవలసిన ఆవశ్యకతను ప్రత్యేకంగా చెప్పవలసిన అవసరంలేదు

2. పెట్టుబడిదారేతర ఆర్థికాభివృద్ధి పంథాపై కొంత వివేచనా అవుసరముంది ఈ పంథాను మొట్టమొదట ప్రస్తావించింది మార్క్స్, ఏజెంల్స్లు. దానిని సృజనాత్మకంగా విస్తృత పరచింది లెనిన్. సోషలిజానికి పరిపక్వం చెందని దేశాలు "కప్ప దాటుగ" పెట్టుబడిదారి విధానాన్ని దాటి లేక అధిగమించి పురోగమించే ఆర్థికాభివృద్ధి పంథాగా పెట్టుబడిదారేతర పంథాన్ని వివరించాడు. పెట్టుబడిదారి విధానమూకాదు, సోషలిస్టు విధానమూ కాదు మధ్యే మార్గం లేక తృతీయ పంథాగా చెప్పారు తృతీయ ప్రపంచంలో పెట్టుబడిదారివిధాన పూర్వ ఆర్థికదశ అంటే ఫ్యూడలు-సెమిఫ్యూడలు ఉత్పత్తి సంబంధాలు ఆధిక్యతలో వున్న దేశాలలో రాజకీయంగా పెట్టుబడిదారి విధానాన్ని సామ్రాజ్యవాదాన్ని త్రోసిపుచ్చబడి విప్లవ ప్రజాస్వామ్యశక్తులు అధికారంలో వున్న సిరియా, ఈజిప్టు, అల్జీరియా, టాంజానియాలలో సోషలిస్టు ప్రపంచపు మద్దతుతో పెట్టుబడిదారేతర విధానంలో ఆర్థికాభివృద్ధి పంథా చేపట్టబడింది విప్లవప్రజాస్వామ్య నియంతృత్వంలో శాంతియుతంగా సోషలిజంలోనికి పరివర్తనావకాశాలను గుర్తించుతూనే, పెటీబూర్జువా వర్గాల సహజ వూగిసలాటలను ఎదుర్కొని పోరాడుటలో ఏమరుపాటు తగదని నొక్కిచెప్పుట జరిగింది.

మన దేశంలో శతాబ్దం క్రిందటనే బూర్జువా, కార్మిక వర్గాలు యేర్పడుట ప్రారంభమై, వర్గపోరాటం దీర్ఘకాలంగా సాగుతూనేవుండుట, పెట్టుబడిదారి విధానాభివృద్ధి మధ్యస్థస్థాయికి స్వాతంత్ర్యానికి పూర్వమే జరిగింది. గత 50 సంవత్సరాలుగ పెట్టుబడిదారి విధానాభివృద్ధి జరుగవలసినంత జరుగక పోయినా గణనీయంగానే జరిగి మధ్యస్థస్థాయినుండి పురోగమించింది. ఆర్థికస్వాతంత్ర్యం వైపు కుంటినడక సాగించింది. కాని గమ్యం చేరలేదు, కమ్యూనిస్టులు తమ లక్ష్యమైన సోషలిజంకై పురోగమించుటకు, సామ్రాజ్యవాద, ఫ్యూడలు వ్యతిరేక విప్లవ మార్గంలోనే ప్రజాస్వామ్య విప్లవ కర్తవ్యాలను పరిపూర్తి చేయగలరు. అయితే సామ్రాజ్యవాదం, పెట్టుబడిదారి విధానానికి అంటిపెట్టుకొని వున్నంతవరకు ఆర్థిక స్వాతంత్ర్యంగాని మౌలికవ్యవసాయ సంస్కరణల విజయాన్ని పొందలేము. విప్లవకార్యక్రమాన్ని అమలుచేయుటకు పెట్టుబడిదారి, సామ్రాజ్యవాద వ్యతిరేక దృక్పధం అవసరము.

ఇతర మాజీవలస దేశాలు అభివృద్ధి చెందని కారణంగా విప్లవ ప్రజాస్వామ్య పరివర్తనకు కార్మికవర్గంనాయకత్వం వహించుదశకు ఎదగనందున,విప్లవప్రజాస్వామ్య నియంతృత్వం, బూర్జువావర్గ నియంతృత్వంగా సాధారణంగా పరిణామమొందు అవకాశాలెక్కువ. భారత పరిస్థితులు మరింత పరిపక్వతకు చేరినందున కార్మిక, కర్షక, పెటీ బూర్జువావర్గాల నియంతృత్వంగా రూపొందు అవకాశాలెక్కువ. వివిధ వర్గాల అట్టి కూటమికి కార్మికవర్గ నాయకత్వపాత్ర విప్లవ ప్రజాస్వామ్య నియంతృత్వానికి తనదైన పొకప్రత్యేకనైజం, రూపాన్ని యిచ్చే చారిత్రిక అవకాశం అవసరం వుంది.

పెట్టుబడిదారేతర పంథాతో ముడిపడిన ముఖ్యసమస్య పెటీబూర్జువావర్గపు విప్లవ పాత్ర, [illegible] పై కమ్యూనిస్టుల శ్రేణులలో భిన్నాభిప్రాయాలున్న

బెంగాలులో సి. పి. ఐ. (యం); సి. పి. ఐ; యితర అతివాదపార్టీల సంఘటన, సంఘటనా ప్రభుత్వం ట్రేడు యూనియనులలో, వుద్యమాలలో, రాజకీయ పోరాటాలలో విప్లవకరపాత్ర వహించుటలో విఫలమైందని సత్యరాయ్ అభిప్రాయం. ఈ సమన్వ తృతీయ ప్రపంచ వుద్యమాల సదస్సు సందర్భంలో పరిశీలించబడి, జాతీయ విముక్తి వుద్యమం ప్రధానంగా సామ్రాజ్యవాద వ్యతిరేక వుద్యమమే అయినా, ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ నిర్ణయాత్మకపాత్ర వహించుచున్నందున పెట్టుబడిదారి విధాన వ్యతిరేక వుద్యమంగా విస్తరించుచున్నదని వివరించారు. ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ అంతరించిన నేటి పరిస్థితులలో పెటీబూర్జువావర్గ విప్లవకరపాత్ర ప్రధానంగా అతివాద వామపక్షశక్తుల బలంపై ఆధారపడి వుంటుందనేది స్పష్టం. పెటీ బూర్జువా వర్గం మరింత వూగిసలాటలకు లోనగుటయే గాక, ఫాశిస్టుశక్తుల కొమ్ముకాయుట చరిత్రలో జరిగింది

విప్లవ ప్రజాస్వామ్యం క్రమేణా శాస్త్రీయ సోషలిజంవైపు మొగ్గితే పరిణామ క్రమంగా నేరుగా సోషలిస్టు నిర్మాణ మొదటి దశగా రూపొందుతుంది, లేక పెట్టుబడివారి రేతర విధాన దృక్పధాన్ని చేబట్టితే విప్లవ మార్గంలో సోషలిస్టు పరివర్తన జరుగుతుంది. ఈ విధంగా సమన్వ క్లిష్టత, పెటీ బూర్జువావర్గవూగిసలాట నైజము సుస్పష్టం. అది విప్లవ కార్యాచరణను చేబట్టే అవకాశం, బలాన్ని కలిగి వుంది, కమ్యూనిస్టులు సరియైన లెనినిస్టు ఎత్తుగడలను అవలంభించి వాస్తవ ఆచరణ యోగ్యం చేయవలసి వుంటుంది.

ఫ్యూడలు వలసలు, వెనుకబడిన దేశాలలో పెట్టుబడిదారేతర మార్గంలో కార్మికవర్గం అధికారాన్ని స్వీకరించిన అనంతరం ఆర్థిక పారిశ్రామికాభివృద్ధిని కావించి, ప్రజల జీవితాన్ని మెరుగుపరచు అవకాశాలున్న వన్న లెనిన్ సిద్ధాంతాన్ని నేడు మితవాదులు వక్రీకరించి, విప్లవసారాన్ని వడపోసి తొలగించి, పెట్టుబడిదారి మార్గాభివృద్ధిదశను "కప్పదాటుగ" అధిగమించి, పెట్టుబడిదారి పూర్వ సమాజాన్ని సోషలిజం, కమ్యూనిజంల వైపు పురోగమించునట్లు,కొన్ని పరిస్థితులలో చేయవచ్చుని అదే పెట్టుబడిదారేతర ఆర్థికాభివృద్ధి పంధా అంటున్నారు పెట్టుబడిదారుల ప్రవేటు రంగం ప్రభుత్వ పెట్టుబడి రంగంలో ఆర్థికాభివృద్ధి కావించబడుతుందని ఉత్పత్తి అనేక ప్రభుత్వ నియమ, నిబంధనలకు గురిచేయబడుతుందని అంటున్నారు. బూర్జువా భూస్వామ్య ప్రభుత్వం నిబంధనలను యెంతవరకు అమలు చేయగలుగుతుందో అందరకు తెలిసిన విషయమేనని నంబూద్రిపాద్ తీవ్రంగా విమర్శించారు.

అంతేగాక, భారత బూర్జువావర్గం లాభాలకు దీర్ఘకాలం వేచి వుండవలసివచ్చే "భారీపరిశ్రమలలో పెట్టుబడి పెట్టుటకు సుముఖంగా లేనందున ప్రవేటు పెట్టుబడిదారుల ప్రయోజనాల కోసమే ప్రభుత్వ పారిశ్రామికరంగం వుద్దేశించబడిందని ప్రభుత్వరంగం నిర్వహించే సామ్రాజ్యవాద వ్యతిరేకపాత్రను అతిగా చిత్రించుచు, అద్ది

ప్రవేటురంగానికి చేసే పూరకం పాత్రను సి పి ఐ. కప్పిపుచ్చుట, నిజాయితీ రహిత చర్యయని" సి. పి. ఐ (యం)లోని వర్గాలు తీవ్రంగానే విమర్శించాయి. కొరియా యుద్ధంలో ఇండోనేషియా, వియత్నాంలలో శాంతిప్రయత్నాలలో భారత చేబట్టిన స్వతంత్ర విదేశాంగ విధానం, పాకిస్తాన్‌తో రెండు యుద్ధాలలో ఆయుధాల కొరకు సామ్రాజ్యవాదులకు అర్రులు చాచే దుస్థితిని, తప్పించి స్వతంత్ర విధానాన్ని కొనసాగించగలశక్తిని యిచ్చింది, ప్రభుత్వరంగ పరిశ్రములు ముఖ్యంగా భారీ పరిశ్రమలేవని వేరుగ చెప్పనవసరం లేదు. ఈ రోజున శాస్త్ర,సాంకేతికరంగాలలో అణుశక్తి వినియోగంలో ప్రపంచంలో నాలుగవలేక ఐదవశక్తిగ వుండగలుగుట ఆరోజున ఆ భారీపరిశ్రమలను ప్రభుత్వరంగంలో స్థాపించుటవలననే గుర్తించాలి.

స్వాతంత్ర్యానంతరం పెట్టుబడిదారి విధానం బాగా అభివృద్ధి చెందిందని,గుత్త పెట్టుబడిదారి వర్గాలు గణనీయంగా అభివృద్ధి చెందాయని, సి. పి. ఐ యీ వాస్తవిక తనే" ప్రవేటు రంగంలో ప్రవేటు పెట్టుబడిదారి విధానాన్ని,ప్రభుత్వరంగంలో ప్రభుత్వ పెట్టుబడిదారి విధానాన్ని కాంగ్రెసు ప్రభుత్వం అభివృద్ధి చేసిందని వొప్పుకొనక తప్పలేదు ఈ పరిస్థితులలో "పెట్టుబడిదారి విధానాభివృద్ధిని "కప్పదాటుగ" అధిగమించుట అనేప్రశ్నయేఉదయించదని నంబూద్రిపాద్ తీవ్రంగా విమర్శించారు.

3. భారతకమ్యూనిస్టుఉద్యమం రూపొందించిన కొన్ని సూత్రీకరణలను పరిశీలించుదాము.

రెండవ ప్రపంచయుద్ధానంతరం చైనా, వియత్నాం కొరియాలలోని రాజ్యాంగ యంత్రాంగాన్ని "జనతా ప్రజాస్వామ్యం" అనే పేరుతో పిలువబడుతున్న దానిని ప్రపంచంలోని కొన్ని కమ్యూనిస్టుపార్టీలు మనదేశంలోని కమ్యూనిస్టుపార్టీలోని అతివాద వర్గం, ఆ విధానాన్ని ప్రవచించప్రారంభించాయి. మనదేశంలో పెట్టుబడిదారి విధానం గణనీయంగా అభివృద్ధి చెందినందున జనతాప్రజాస్వామ్య విప్లవ పంధా అనుసరణీయమని, పురోగమనానికి బడాబూర్జువావర్గం అడ్డుగావుందని, బూర్జువావర్గ నాయకత్వాన్ని తొలగించి, కార్మికవర్గం నాయకత్వాన్ని చేబట్టగలిగినంతటి శక్తికలివుందనే వైఖరిని చేబట్టింది.

అతివాదులు, సి. పి ఐ(యం) చేబట్టిన వైఖరి, ప్రధమంగా మనదేశం ఆర్థికంగా సామ్రాజ్యవాదంపై ఆధారపడివుందని మరచి పెట్టుబడిదారి విధాన ఆర్థిక,పారిశ్రామిక అభివృద్ధిని అతిగా అంచెనావేసి, ఆర్థికస్వాతంత్ర్యానికి ప్రధానశత్రువైన సామ్రాజ్యవాదంపై పోరాటాన్ని కేంద్రీకరించాలనే అవగాహనలేమిని ప్రదర్శించారు. అంతేగాక ప్రధానశత్రువుగా దేశంలోని బూర్జువావర్గంగా నిర్ధారణ చేసారు. జాతీయ బూర్జువావర్గపు సామ్రాజ్యవాద వ్యతిరేకతను పరిగణలోనికి తీసుకొనుటలో విఫలులు అయ్యారు. అంతేగాక, కార్మిక వర్గ రాజకీయ పరిపక్వతను అతిగా అంచెనావేసారు. కార్మిక, కర్షక, పెటీబూర్జువాశక్తులలో అత్యధికులు జాతీయబూర్జువావర్గ ప్రభావంలో

వున్న వాస్తవాస్తవాన్ని స్వీయమానసిక ధోరణిలో త్రోసిబుచ్చారు. ఈ అవగాహన అన్నిటి ఫలితంగా ఆచరణ సాధ్యం కాని కార్మికవర్గ నాయకత్వం మౌలికాంశంగా వున్న "జనతా ప్రజాస్వామ్య విప్లవం" అనే వ్యూహాన్ని చేబట్టారు.

దేశంలోని మితవాద అభివృద్ధి నిరోధకులకు గుత్తపెట్టుబడి దారివర్గం సామాజిక పునాదిగా వుంది. గుత్తేతర బూర్జువావర్గం ఆవిధంగా కాక, ప్రజాస్వామ్యవిప్లవం లోని అసంపూర్తి కర్తవ్యాల పూర్తిచేయు సమస్యపై సామ్రాజ్యవాద వ్యతిరేకవైఖరి చేబట్టుతుంది. అయినా గుత్తేతర పెట్టుబడిదారి వర్గం నిరంతరం విప్లవ శక్తిగా తలంచుట పొరపాటు. గుత్తేతర బూర్జువావర్గంలో మధ్యతరగతి, కొన్నిగుత్తబూర్జువా వర్గాలు రూపొందగలవని మరువరాదు. అది దోపిడివర్గాలలో భాగస్వామి అయ్యేఅవకాశముంది, పైగా వూగిసలాట ఆ వర్గపు నైజము.

జాతీయ ప్రజాస్వామ్య విప్లవంలో కార్మిక, కర్షక నాయకత్వం మౌలికమైనదనే అవగాహనకు భిన్నమైనది. కార్మిక, బూర్జువావర్గాల సంయుక్త నాయకత్వపు వైఖరి, కార్మిక, కర్షక వర్గాలు చోదకశక్తి, యినుసు వంటివి అనే వైఖరి రెండూ పరస్పర వైరుధ్యాంశాలు నాయకత్వంలో బూర్జువావర్గాన్ని భాగస్వాములుగ నెంచితే వారికి గల ఆధిక్యతాస్థానాన్నిబట్టి, రైతాంగ వుద్యమానికి పరిమితులు విధించుట, మౌలిక కర్తవ్యాల వైఫల్యము తథ్యం. వారి దృష్టిలో "సంయుక్త విప్లవ నియంతృత్వం కార్మికవర్గం, రైతాంగంలోని అన్నివర్గాలు,నగర పెటీబూర్జువావర్గాలు. గుత్తేతర బూర్జువావర్గాలు కలసి జాతీయప్రజాస్వామ్య ప్రభుత్వం యేర్పడుతుంది. కార్మిక కర్షక దోపిడి చేయని పెటీబూర్జువావర్గాలు, జాతీయ బూర్జువావర్గం సమానస్థాయిలో వుంటవి.

సంక్షిప్తంగా పాలకవర్గాలలోని అత్యంత అభివృద్ధి నిరోధకశక్తులపై దాడిని, కేంద్రీకరించుటలో వివాదంలేదు. అనుసరించే విధానం పాలకపార్టీలోని అభ్యుదయకరశక్తులు కొంతబలపడినా, ప్రధానంగా వామపక్షశక్తులు మరింత బలపడుట, అభివృద్ధి నిరోధకులు పూర్తిగ వోటమిపొందిన లక్ష్యం నెరవేరినట్లే అగుతుంది.

# (9)

1. మావో 1963లో అంతర్జాతీయ కమ్యూనిస్టు ఐక్యత అన్వ్యాసంలో "ఐక్యత-పోరాటం లేక చీలికలు-విభజన-నూతన ప్రాతిపదికపై-నూతన ఐక్యత-అంతర్జాతీయ కార్మికోద్యమాభివృద్ధికి తాత్వికసూత్రంగా వివరించారు. జాతీయంగా. అంతర్జాతీయంగా, నిజమైన ఐక్యత మార్క్సిజ, లెనినిజం ప్రాతిపదికపైనే సాధ్యం

2 అంతర్జాతీయంగా యేవొక్క దేశంలోనైనా కమ్యూనిస్టు ఉద్యమంలోని ప్రతి చీలిక అవకాశవాదం, సంస్కరణవాదం ప్రబలినందుననే అనివార్యమైంది. మార్క్సిజం-లెనినిజంకు మితవాద, అతివాద అవకాశవాదాలు త్రోసిబుచ్చి

"ప్రపంచకార్మికులారా ఏకంకండి" అనేనినాదానికి ద్రోహం చేయుటవలన చీలిక అనివార్యమగుతుంది. మార్క్సిజానికి, లెనినిజానికి, ఆచరణలో కార్మికవర్గ ఐక్యత ప్రాతిపదికకు ద్రోహంచేసే ప్రతి వ్యక్తి చీలికవాది. ఈ చీలికతత్వం, అతివాదంపై సైద్ధాంతిక పోరాటం అన్నపేరుతో మితవాద అవకాశవాదంకాని, మితవాదంపై సైద్ధాంతిక పోరాటం అన్నపేరుతో అతివాద అవకాశవాదంకాని, పార్టీ అంతర్గత సైద్ధాంతిక పోరాట పరిమితులను మౌలికసూత్రాలను దాటి నిందా, అపనిందల స్థాయిలకు దిగజారిన ఫలితంగా చీలిక అనివార్యమై కార్మికవర్గపార్టీ,ఐక్యతా విచ్ఛిన్నతతో విభజన మరోపార్టీగా యేర్పడుట సాధ్యమగుతుంది. అవకాశవాద పంథాను కొనసాగించుతు కార్మికవర్గ విప్లవపార్టీని అవకాశవాద పార్టీగా మార్చే ప్రతివ్యక్తి వొక చీలిక వాదే అనే వివరణ లభించింది

3 కృశ్చేవ్ నాయకత్వంలో సోవియట్ కమ్యూనిస్టుపార్టీ సంస్కరణవాదాన్ని అవకాశవాదాన్నిచేబట్టి కార్మికవర్గ విప్లవం, కార్మికవర్గ నియంతృత్వాలకు వ్యతిరేకంగా శాంతియుత పరివర్తన "శాంతి, సహజీవనం" శాంతియుతపరిణామం, "ప్రజలంది ప్రభుత్వం" ప్రజాసామాన్యమంతటిపార్టీ అనే సంస్కరణవాద నినాదాలనిచ్చింది. మార్క్సిజం లెనినిజాన్ని కార్మికవర్గ అంతర్జాతీయతను త్రోసిపుచ్చి చీలికలను ప్రమాదాన్ని తెచ్చింది.

4. చైనా కమ్యూనిస్టుపార్టీ "మితవాద వ్యతిరేక తప్పులు సరిదిద్దు ఉద్యమంతో ప్రారంభమైన అంతర్గత సైద్ధాంతిక పోరాటాన్ని మావో వర్గ పోరాటం కీలకమైనది వొకసారి దానిని అర్థం చేసుకొంటే అన్ని సమస్యలు పరిష్కరించవచ్చు" అని ప్రబోధించగా "శాంతిపథంలో సోషలిజం నిర్మాణం" అనేపార్టీ విధానాన్ని ప్రక్కదారి పట్టించింది. ఆచరణలో "సోషలిజంలో వర్గ పోరాటం" విధానం వెయ్యి పుష్పాలు వికసించనీ, వంద ఆలోచనా విధానాలు పోటీపడనీయండి" అనే విధానాన్ని తోసివేసి పార్టీ అతివాద పథంలోపడి "కాపిటలిస్టు మార్గవాదుల" "బూర్జువా కేంద్రాల"బొంబార్డు చేయండి అనే తీవ్ర అతివాద రూపాన్ని లిన్‌పియావో,జియాంగ్ క్వింగ్ తదితరుల "నలుగురగ్యాంగ్" ముఠానాయకత్వంలో "సాంస్కృతికవిప్లవం", "రెడ్‌గార్డుల" ఉగ్రఅతివాద వుద్యమంగా చైనాలో రాజకీయ సంక్షోభాన్ని తెచ్చింది. అంతర్జాతీయంగా అనేక కమ్యూనిస్టుపార్టీలలో చీలికలకు కారణమైంది. భారత కమ్యూనిస్టుపార్టీలోని అతివాద అదేమార్గంలో కొంతకాలం పయనించారు. ఫలితం సి.పి ఐ.లో చీలిక, వొక చీలిక సిద్ధాంతం అంతర్జాతీయంగా రూపొందుట జరిగింది. ప్రధమ 1964 చీలిక, తర్వాత యేర్పడిన 1967 మరో చీలికగూడ యీ చీలిక సిద్ధాంత ఫలితం యిందుకు యీ కథనాల చరిత్రే సాక్ష్యం.

అశాస్త్రీయ అవగాహనలకు, చీలికలకు తోడ్పడిన మూడు నిర్మాణ సమస్యలు వున్నవి. ఒకటి, కేంద్ర ప్రధానాంశమైన ప్రజాస్వామ్య కేంద్రీకరణసూత్రము,

అనేకసార్లు అతిక్రమణకు, అశాస్త్రీయ, అపఖ్యాతి చర్యలకు వక్రీకరణలకు గురైంది ఆచరణలో ఆదేశాత్మక, నిరంకుశ అధికారతత్వంగాసాగి అరాచక అంటువ్యాధిగా ప్రకోపించింది. మరోఅంశం, పిడివాదం, సెక్టేరియనేజం సైద్ధాంతిక అపరిపక్వత ముప్పేటగాకలసి ఆచరణలో రెండు పంథాల సిద్ధాంత పోరాటాన్ని వక్రీకరణకుగురి చేసాయి. సైద్ధాంతిక అంతర్గత పోరాటం విశ్లేషణ, సమన్వయంతో పరిష్కారమగు టకు మారుగ చీలిక మరో చీలికకు ఆస్కారమైంది. చివరి అంశం చీలికలు నిరవ ధికంగా సాగుట కార్మికవర్గేతర వైఖరులు బూర్జువావర్గ ప్రభావాలకు అధికార వ్యామోహానికిగురై, నాయకత్వాలు కొన్ని పతనమయ్యాయి.

ఐక్యత-పోరాటం-చీలికలు-నూతన ఐక్యత అన్న చీలికల సిద్ధాంత తాత్విక వివరణ ఆచరణలో నిరంతర చీలికలు యేర్పడినవిగాని నూతన ఐక్యత ఉద్యమం బలపడి పురోగమించుట జరుగలేదు. అన్నికమ్యూనిస్టుపార్టీలు చీలికలు, పేలికలు అయినవి కాని సిద్ధాంత ఐక్యత, నిర్మాణ ఐక్యత, కనీసం కార్మికవర్గ. రైతాంగ ఐక్యతగాని లేక ఐక్యకార్యాచరణ ప్రజాసంఘాలు తమ కనీస కోర్కెలపై అఖిల భారతఐక్యపోరాటాన్ని జరుపజాలనివి అయ్యాయి. పాలకవర్గాలు యీ అనైక్యతను వారి వర్గ ప్రయోజనాలకు దశాబ్దాలుగ వినియోగించుకొంటున్నవి.

జాతీయసమితిగాని మరే పార్టీ నిర్మాణంగానిమెజారిటీ మైనారిటీలు సైద్ధాంతిక భేధాభిప్రాయాలు కారణంగా యేర్పడివున్నపుడు పార్టీ ప్రచార సాధనాలను సమా వేశాలలో ఆమోదించబడిన అంశాలకే వినియోగించాలిగాని, మెజారిటీ అభిప్రాయా లను ప్రచారంచేయుట ఆ వర్గానికి మాత్రమే బలాన్నిచేకూర్చుతుంది కాని పార్టీ మొత్తంప్రయోజనాలకు బలాన్ని చేకూర్చదు. పైగా యిదిపార్టీలోని మైనారిటీ,మెజారి టీలు రెండుకరుకుగట్టిన రెండు గ్రూపులుగ యేర్పడుటకు మాత్రమే తోడ్పడుతుంది.

భారతదేశంలోవివిధ కమ్యూనిస్టు శ్రేణులు గత దశాబ్దంలో చీలికల సిద్ధాం తం అమలు చేయబడుట, అకారణంగా భారతకమ్యూనిస్టు ఉధ్యమం బలహీనపడుట మనముందు ప్రత్యక్షంగా వుంది. నూతన సహస్రాబ్ది ప్రారంభంలోనైనా పునరేకీ కరణకు ప్రాధమిక చర్యలు చేబట్టుతారని కనీసం ఒకరినొకరు వెన్నుపోటులకు గురి చేసుకొనరని ఆశిద్దాము.

5. ప్రపంచ కమ్యూనిస్టుపార్టీల 1957 విజ్ఞప్తిని, 1960 ప్రకటన రూపొం దించిన పార్టీల మధ్యసంబంధాలను మార్గదర్శక సూత్రాలను త్రోసిబుచ్చి, అగ్ర రాజ్యతత్వాన్ని సోదరపార్టీల యెడల సి.పి.యస్.యు., సి.పి.సిలు తరతమ భేధా లతో ప్రదర్శించాయి ఆల్బేనియా, యుగోస్లోవియా, ఇండోనేషియా, వియత్నాం ల యెడల అగ్రదేశాల పార్టీలు సోదరసౌహార్ధపార్టీల సార్వభౌమాధికారాన్ని దెబ్బ తీసారు, ఆ పార్టీల అంతరంగిక విషయాలలో కలుగజేసుకొన్నారు. పరోక్షంగానో, ప్రత్యక్షంగానో సౌహార్ధ పార్టీలలో చీలికలకు కారణభూతులుకూడ అయ్యారు.